ఓమ్

# యోగదర్శనము

అను

## పాతంజల యోగసూత్రములు

శ్రీ పతంజలి మహర్షి ప్రణీతము

('భాష్యార్థ ప్రకాశిక' అను ఆంధ్ర వివరణ సహితము)


వివరణకర్త:

'విద్యాప్రవీణ' శ్రీ తి.కం. తిరువేంగడాచార్యులుగారు





ప్రకాశకులు:

శ్రీ వ్యాసాశ్రమము,

వ్యాసాశ్రమం-పోస్టు, మార్గము- ఏర్పేడు,

చిత్తూరు జిల్లా (ఆం.ప్ర.)

2002

ప్రథమ ముద్రణ - 1946 -వ సం॥ 1000 ప్రతులు
ద్వితీయ ముద్రణము - 1976 -వ సం॥ 1000 ప్రతులు
తృతీయ ముద్రణము - 1991 -వ సం॥ 1000 ప్రతులు
చతుర్థ ముద్రణము - 2002 -వ సం॥ 1000 ప్రతులు

**వెల:**



**ప్రకాశకులు:**

**శ్రీ వ్యాసాశ్రమమువారు**

**ప్రతులకు:**

మేనేజరు: శ్రీ వ్యాసాశ్రమము

వ్యాసాశ్రమం - పోస్టు, మార్గము - ఏర్పేడు, పిన్. 517 621

**ముద్రణము:**

శ్రీపారాశర్య ప్రెస్, శ్రీవ్యాసాశ్రమం



మహర్షి సద్గురు శ్రీమలయాళస్వాములవారు

ఓమ్

# పీఠిక

యద్భావనాదవాప్యేయం ప్రత్యక్చితి రనామయా ।
క్లేశకర్మాద్యసంస్పృష్టం తమీశం కంచనా భజే ॥ 1

ఏ పరమేశుని భావించుటచే నాశరహితమగు ప్రత్యగాత్మ జ్ఞానము పొడముచున్నదో అట్టి క్లేశము, కర్మము మొదలగు వాటిని స్పృశించని అవాఙ్మానస గోచరుడగు ఈశుని సేవించుచున్నాను.

శ్రీమత్పతఞ్జలే స్తస్య, పదద్వంద్వమనిందితమ్ ।
వందే యేన మనఃకాయవాచాం శుద్ధిరకార్యసౌ ॥ 2

ఎవడు దేని చేత (యోగదర్శనము, వైద్యశాస్త్రము, వ్యాకరణ మహా భాష్యము - వీటిచే) మనస్సును, శరీరమును, వాక్కును శుద్ధపరచెనో అట్టి పతంజలి మహర్షి యొక్క శుభమును గలుగ జేయునట్టి పవిత్రములగు రెండు పాదములకు నమస్కరించుచున్నాను.

పవిత్రాత్ములగు సోదరీ సోదరులారా! ఈ యుపాధి శ్రీ తిరుపతి పాండవక్షేత్ర గోగర్భతీర్థమున తపమొనర్చెడు కాలములో శ్రీభగవద్గీతయు, శ్రీ పాతంజల యోగశాస్త్రమున్ను, ముఖ్యముగా పఠన, మననాదులు చేయడమైనది. అప్పటినుండి పై రెండు గ్రంథములకు పదవిభాగ, ప్రతిపదార్థము లుండిన, లోకమున కెంతో మేలు కలుగునని తలంచడమైనది. సర్వేశ్వరునియొక్కయు పరమమహర్షులయొక్కయు కరుణవలన శ్రీభగవద్గీతకు పదవిభాగ, ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషార్థములు వ్రాయడ మైనది. తెనుగున పదవిభాగముతోడి భగవద్గీత లేనందుచే సామాన్యవిద్య గలిగిన పరమభక్తులకున్ను, ముముక్షువులకున్ను, పదములయొక్క సంధులు తెలియుట ప్రయాస మగుటచే స్వచ్ఛముగా నుచ్చరించుటకున్ను, పదములయొక్క అర్థమును భావన చేయుటకున్ను ప్రయాసముగా నుండెను.

శ్రీపాతంజల యోగశాస్త్రమో! మఱింత కఠినమైనది. దీనికి పదవిభాగము గాని, ప్రతిపదార్థముగాని, యాంధ్రభాషలో లేనందుచే ముముక్షువులు సూత్రార్థమును, అవగాహనము చేసికొనుటకు మిక్కిలి ప్రయాసముగా నుంటున్నదని తలంచి కొందఱి పండితుల నడుగగా ఇది సామాన్యమైన పని కాదనియు, విద్య యొకటి మాత్రము చాలదనియు, మంచి యోగనిష్ఠ యున్ను, విద్యయున్ను గలవారికే సాధ్యపడుననియు, అంతే గాక దీనియొక్క భాష్యమున్ను, ఇతరవ్యాఖ్యానములున్ను, వృత్తులున్ను, చూడవలసి యుండు టచే తమకు సాధ్యము కాదనియు; మఱికొందఱు కొన్నివేఱు కారణములు చెప్పి తప్పించుకొనిరి. ఇట్లుండగా శ్రీవ్యాసాశ్రమ సంస్కృత పాఠశాలా ప్రధానోపాధ్యాయులును, విద్యాప్రవీణులును నగు శ్రీమాన్ తిరుక్కాం డ్యూరు తిరువెంగడాచార్యుల వారికి తెలుపగా నిండు భక్తి శ్రద్ధలతో నీ మహ త్కార్యము నంగీకరించి అదే పనిలోనే మనస్సును వినియోగపరచి, తొలిపలు కులలో చెప్పిన భాష్య వ్యాఖ్యాన వృత్తులను తెప్పించి శుద్ధముగా వ్రాసియిచ్చిరి.

వర్తమానయుగములోగల జనులను నాల్గు భాగములుగ చేయవచ్చును. వారిలో నధికజనులు సాంసారిక విషయములో మాత్రము మగ్నులై యుండువా రగుటచే, పారమార్థిక విషయములో శ్రద్ధ గలవారు కారు. మఱల రెండవ తరగతివారు కొద్దిమంది మాత్రమే పండితులు గలరు. వారిలోను నివృత్తిమార్గ పరులైనవారు అరుదు. ఇక మిగిలి యుండు నిఱుతెగలలో గలవారు ఆంగ్లేయ విద్యయందు ఆసక్తి గలిగినవారైనను, కొందరు మాత్రము జిజ్ఞాసాపరులై యున్నారు. కాని సంస్కృత మనిననో, మొదటినుండి యభ్యాసము లేనందున సంస్కృత శ్లోకములుగాని, సూత్ర వాక్యములు గాని వారికి తల నొప్పిగా నుండును. అంతేగాక సంస్కృతము మృతభాషయని గూడ పలుక సాహసించువారు గూడ గలరు. అమృతము నిచ్చు ఈ దేవభాష యెట్లు మృతభాషయని చెప్ప సాహసించిరో దురూహముగా నుంటున్నది. అయితే పాశ్చాత్య భాషాపరిచయముచే నట్లు చెప్పియుందురు. నాలుగవ తరగతిలో చేరినవారు సామాన్యముగా కొద్ది సంస్కృతమును, మాతృభాషను చదివి

యుండువారు వీరిలో చాలామంది మంచి వైరాగ్యమున్ను, బ్రహ్మ జిజ్ఞాసయు, చాలమట్టుకు శమదమాది గుణములు గలిగి యుండువారు. ఈ యుభయులకున్ను ఈ పాతంజలయోగశాస్త్ర సూత్రములకు, పదవిభాగ ప్రతిపదార్థములు, చక్కగా తెలియక పోవుటచే సూత్రార్థమును ధారణ చేయుటకున్ను, పదములయొక్క సంధులు విభజించి పఠించుటకున్ను సాధ్యము కాకపోవుటచే వారి హృదయము పరితపించుచున్నది. అట్టి తాపమును శమింపజేయు నుద్దేశము, ఈగ్రంథమును ఈలాగున వ్రాయించుటకు కారణమైనది.

ఆంధ్రభాషలో ఓ.వై. దొరస్వామి అయ్యంగారు వ్రాసిన పాతంజల యోగశాస్త్రమున్ను, శ్రీవివేకానందస్వాములు రాజయోగమను గ్రంథము యొక్క అంతిమభాగమున చేర్చియుండు పాతంజల యోగశాస్త్రము మాత్రమే కనబడుచున్నవి. వానిలోను మూలసూత్రమునకు తాత్పర్యము మాత్రము ఉండుటచే, సూత్రార్థమును మననము చేయుటకున్ను ప్రయాసముగా నుంటున్నది. హిందీభాషయందు ఉదాసీన స్వామి బాలరామ యతీంద్రులు వ్రాసిన ''పాతంజల దర్శనప్రకాశ''మను గ్రంథమునకున్ను, పదవిభాగము చేసియుండలేదు. ఈకొరతను పూర్తి చేయవలయునను తలంపుతోనే, మూలసూత్రములకు పదవిభాగము, ప్రతిపదార్థమును, తాత్పర్యమును వ్రాయించుటకున్ను, తొలిపలుకులలో నిరూపించిన వ్యాఖ్యానములు వివరణములు చూచుటకున్ను కారణమైనది.

ఈ పాతంజల యోగశాస్త్రమునకు ప్రప్రథమమున భాష్యము రచించిన వారు శ్రీ వ్యాసభగవానులు. శ్రీ వేదవ్యాసులే దీనికి భాష్యము చేయుటవలననే యీ శాస్త్రముయొక్క మహిమాతిశయము గోచర మగును. ఏలన? సాక్షాన్నారాయణాంశ సంభూతులును, నాల్గువేదము లను విభజించినవారును, బ్రహ్మసూత్రములను నిర్మించినవారును, పంచమ వేదమను ప్రసిద్ధినొందియుండు శ్రీమహాభారతమును వ్రాసినవారును, అష్టాదశ మహాపురాణములకు కర్తయునగు, శ్రీబాదరాయణ మునీంద్రునకు

నీ యోగశాస్త్రమందు ఎంత విశ్వాసము గలిగి యుండిన మాత్రమున భాష్యము వ్రాయగలరు? ఈ భాష్యము ననుసరించియే వాచస్పతిమిశ్ర, విజ్ఞానభిక్షు మొదలైన తొలిపలుకులో నిరూపించిన వారందరు వ్యాఖ్యానమును, వివరణమును వ్రాసియున్నారు.

మొదటి సూత్రమందు ''అథ యోగానుశాసనమ్'' అను దానిలో అథశబ్దమునకు అర్థము నిరూపింపబడుచున్నది.

**ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా ।**
**కంఠం భిత్త్వా వినిర్యాతౌ తేన మాంగళికావుభౌ ॥** 3

ఓంకారమున్ను, అథ శబ్దమున్ను పూర్వము బ్రహ్మయొక్క కంఠమును భేదించికొని వెలువడెను. కాన రెండును మంగళము గలవి. ఓంకారము నుచ్చరించిన యెంత పుణ్యమో అథ శబ్దమున్ను అట్టి పావనమైనదే, దురితమును దూర మొనర్చునదే.

ఇక సూత్రశబ్దమునకు అర్థము నిరూపింపబడుచున్నది.

**స్వల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతో ముఖమ్ ।**
**అస్తోభమనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః ॥** 4

కొద్ది యక్షరములతో కూడినదియు, సంశయము గలుగ నిదియు, సారవమైనదియు, సర్వతో వ్యాపకమైనదియు, స్తోభ మనెడు దోషము లేనిదియు, నిరంకుశ మైనదియు సూత్రమని సూత్రార్థ మెఱింగినవారు తెలిసికొనిరి. ఇది సూక్ష్మమైన వటబీజమునందు వటవృక్షమణగి యుండు నట్లుండును. ఆ బీజము వృక్షమగునపుడు ఎంత మహత్పరిణామము పొందునో యీ సూత్రవాక్యములోను అంత యర్థ మిమిడియున్నది. ఇక వ్యాఖ్యానలక్షణము తెలుపబడుచున్నది.

**పదచ్ఛేదః పదార్థోక్తి ర్విగ్రహో వాక్యయోజనా ।**
**ఆక్షేపస్య సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణమ్ ॥**

పదచ్ఛేదము, పదముల యర్థము చెప్పుట, విగ్రహము, వాక్యార్థము చెప్పుట, ఆక్షేపమునకు సమాధానమునని వ్యాఖ్యానము ఐదులక్షణములు గలది. ఇక ద్విరుక్తి దోషము లేని స్థాన నిరూపణ చేయబడుచున్నది.

**విస్మయే చ విషాదే చ దైన్యే చైవావధారణే।**
**తథా ప్రసాదనే హర్షే వాక్యమేకం ద్విరుచ్యతే ॥** 5

ఆశ్చర్యమునందును, వ్యసనమందును, దీనభావమునందును, అవధారణ యందును నాలాగున నాశీర్వాదమందును, సంతోషమందును నొకవాక్యము రెట్టించి చెప్పబడునని నిరూపించడమైనది. భాష్యలక్షణము తెలుపబడుచున్నది.

**సూత్రార్థో వర్ణ్యతే యత్ర పదైస్సూత్రానుసారిభిః।**
**స్వపదాని చ వర్ణ్యన్తే భాష్యం భాష్యవిదో విదుః ॥** 6

సూత్రముల ననుసరించిన పదములచే నెచ్చట సూత్రార్థము వర్ణింపబడుచున్నదో మఱియు స్వపదములు వివరింపబడుచున్నవో అద్దానిని భాష్యజ్ఞులు భాష్యమందురు.

సూత్రమునకు మరియొక యర్థము నిరూపింప బడుచున్నది.

**సంజ్ఞా చ పరిభాషా చ విధిర్నియమ ఏవ చ।**
**అతిదేశోఽధికారశ్చ షడ్విధం సూత్రలక్షణమ్ ॥**

సంజ్ఞ, పరిభాష, విధానము, నియమము, అతిదేశము, అధికారము - ఇవి ఆరును సూత్రలక్షణములు.

ఇక యోగమునకున్ను, జ్ఞానమునకున్ను గల సంబంధ మెటువంటిదో, దానినికూడ కొంచెము తెలిసికొనిన మంచిది. కపిల వ్యాస సనకాది ఋషులందరున్ను గొప్ప సిద్ధియు, జ్ఞానసిద్ధియు గలవారలే యని చరిత్రము నిరూపించుచున్నది. ఆలాగున శ్రీశంకరాచార్యులు పరమాద్వైత జ్ఞానమునే లక్ష్యముగా చేసికొన్నవారైనను యోగశక్తివలననే మండనమిశ్రుని గృహములో

ప్రవేశించుటయు పరకాయ ప్రవేశము చేయుటయు, నంత్యకాల మాసన్నమైనపుడు మాతృదేవతా సమీపమునకు ఆకాశమార్గముగా వెళ్లుటయు జరిగినది. ఇక శ్రీకృష్ణభగవానులు అర్జునునికొఱకు విశ్వరూప దర్శన మిచ్చుటయు, గోవర్ధన పర్వత మెత్తుటయు మొదలుగాగల మహిమలన్నియు యోగమువలననే గలిగెను. శ్రీభగవద్గీత అంతిమ శ్లోకమందు **''యత్ర యోగేశ్వరః కృష్ణో''** యని నిరూపించుటకున్ను, అనగా ఏపక్షమునందు యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడు గలడో యనియున్ను, **''యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయత స్స్వయమ్''** అనగా ఈయోగ శాస్త్రమును యోగేశ్వరు డగు శ్రీకృష్ణునివలన స్వయముగా చెప్పబడిన దానిని వింటిననియు, మరియు భగవద్గీత ప్రత్యధ్యాయాంతమున **''భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే''** యని యుండుటచేతను, శ్రీకృష్ణార్జునసంవాద రూపముగాను, ఉపనిషత్సారముగాను, బ్రహ్మవిద్యగాను, యోగశాస్త్రముగాను నుండుననే శ్రీభగవద్గీతలని నిరూపించడమైనది.

బ్రహ్మవిద్య, యోగశాస్త్రము - అను నీ రెండు పదములు నొకదానికొకటి సంబంధించి యుండుటచే బ్రహ్మవిద్యకు యోగముగూడ అంగమనియే తెలియబడుచున్నది. జ్ఞానము నొకదీపముగాను, యోగము నాదీపమును సంరక్షించెడు సెమ్మెగాను నిరూపించవచ్చును. గ్లాసు, దీపమునకు గాలి మొదలగు నేబాధలు గలుగ నీయక సంరక్షించు చందంబున నింద్రియనిరోధ పరమగు యోగముండిన మాత్రమే జ్ఞానము సుస్థిరముగా నిలుచును. సర్వేంద్రియములయొక్క నిగ్రహమున్ను, ఏకాగ్రతయు, నిర్మలతయు యోగమువలననే గలుగునని శ్రీపతంజలి మహర్షి అభిప్రాయ పడుచున్నారు. కావుననే యోగపాదమందు రెండవసూత్రమున **''యోగశ్చిత్తవృత్తి నిరోధః''** యని సూత్రించుటకు కారణమైనది. మరియు **''ఉభాభ్యామేవ పక్షాభ్యామాకాశే పక్షిణాం గతిః''** ఆకాశమున రెండు పక్షములు గల పక్షి యేలాగున సుఖముగా సంచరించునో యాలాగున

మోక్షమందు విహరించెడు బ్రహ్మనిష్ఠునకు నాత్మజ్ఞాన మనెడు ఒక పక్షము, యోగమనెడు మరియొక పక్షమున్ను ఉండిన మాత్రమే సుఖముగా నిరాటంకముగా విహరింప గలుగును. ఆలాగున

**తపో విద్యా చ విప్రస్య నిశ్శ్రేయసకరం పరమ్ ।**
**తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే ॥** 8

తపస్సున్ను, విద్యయున్ను విప్రునకు మిక్కిలి శ్రేయస్సును కలుగజేయునవి. తపస్సువలన విద్యారూపమగు కిల్బిషము లన్నియు నశించును. బ్రహ్మవిద్యవలన నమృతత్వమును (మోక్షమును) పొందును.

ఇక గీతయందు శ్రీకృష్ణభగవానుడు యోగమును ఎంత అవలంబించి యున్నారో అది గ్రహించదగినది. అష్టమాధ్యాయమున అన్త్యకాలములో ఏప్రకారము యోగధారణ గలిగియుండిన బ్రహ్మప్రాప్తి గలుగునో అని నిరూపించిన దానిని చూడుడు.

**అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।**
**పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥** 9

ఓయర్జునా! అభ్యాసమనెడు యోగముతో గూడుకొనినదియు, అన్యాయత్తము కానిదియును అయిన చిత్తముచేత పరమ పురుషుని ధ్యానము చేయుచు దేహమును విడిచిన నరు డంత్యకాలమున పరమాత్మను పొందుచున్నాడు.

**ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।**
**భ్రువోర్మ ధ్యే ప్రాణమావేశ్య సమ్య క్స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥**

ఎవడంత్యకాలమున నిశ్చలమైన మనస్సుతోడను, భక్తితోను, యోగ బలముతోడను కూడుకొనిన వాడగుచు కనుబొమ్మలయొక్క మధ్యమునందు ప్రాణవాయువునుంచి అప్రమత్తు డగుచు ఆ పరమ పురుషుని స్మరించునో, ఆ మనుజుడు, ప్రకాశాత్మకుడును సర్వోత్తముడును అగు పరమపురుషుని

పొందుచున్నాడు.

**సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥** 11

సకలేంద్రియములను చక్కగా నియమించి మనస్సును హృదయమునందు నిరోధించి ప్రాణమును మూర్ధస్థానమునందు నుంచి యోగధారణను స్థిరముగా జేయువాడగుచు దేహమును వీడుచున్నాడో అట్టివాడు ఉత్కృష్టమగు మోక్షమును పొందుచున్నాడు.

ఇక ఆరవఅధ్యాయ మంతయు ధారణాధ్యానసమాధియగు యోగమును గురించియే ఉపదేశించుచున్నది.

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్ ॥** 12

**తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః ।**
**ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే ॥** 13

పరిశుద్ధమగు ప్రదేశమునందు మిక్కిలి ఎత్తుగా నుండనిదియు, ఆలాగున మిక్కిలి నిమ్నముగా నుండనిదియు; వస్త్రము, కృష్ణాజినము, దర్భాసనము అనునవి ఒక దానిమీద, మీద గలదియును, అయిన తన ఆస్తరణమును(ఆసనమును) వేసుకొని దానియందు గూర్చుండి మనస్సును శబ్దాదివిషయములనుండి మరలించి నిశ్చలమైన దానినిగా జేసి చిత్తముయొక్కయు, ఇంద్రియములయొక్కయు వ్యాపారమును మాని ఆత్మశుద్ధికొఱకు యోగధ్యానమును జేయవలసినది.

**ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।**
**అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥** గీ.6.45

పట్టుదలతో ప్రయత్నించుచున్న యోగనిష్ఠుడు పాపరాహిత్యము గలవాడై అనేకజన్మముల యందభ్యసించుటవలన, బొందదగిన యోగసిద్ధిని

(ఆత్మజ్ఞానము) పొందినవా డగుచున్నాడు. పిమ్మట సర్వోత్తమమగు మోక్షమును పొందుచున్నాడు. ఈఅధ్యాయ మంతయు చూచిన యోగమహిమను తెలిసికొనవచ్చును. యోగము ఆత్మసాక్షాత్కార జ్ఞానమునకు నెంతగ సహాయపడుచున్నదో గ్రహించదగినది.

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి ॥ గీ.4.38.**

ఈ లోకమున జ్ఞానముతో సమాన మగునదియు, పవిత్రమైనదియు మఱియొకటి లేదు గదా, అట్టి జ్ఞానమున కాలక్రమమున లెస్సగా యోగసిద్ధిని పొందినవాడు తనయందు తనంతటనే పొందుచున్నాడు.

**సన్న్యాసస్తు మహాబాహో! దుఃఖమాప్తుమయోగతః ।**
**యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి ॥ గీ.5.6.**

సర్వకర్మఫల త్యాగమగు సన్న్యాసము, లేక సర్వేన్ద్రియముల నిగ్రహము, లేక అవిద్యాత్యాగము, యోగధారణధ్యాన సమాధి అనెడు అభ్యాసము లేని వానిచే పొందుటకు కష్టము. యమ నియమాద్యష్టాంగ యోగనిష్ఠగల ముని (మననశీలుడు) బ్రహ్మపదమును శీఘ్రముగ పొందుచున్నాడు. ఇక విస్తరింపబూనిన గ్రంథము పెరుగునని నిలుపడమైనది.

**శ్రీయోగవాసిష్ఠము:-**

**ద్వౌ క్రమౌ చిత్తనాశస్య యోగో జ్ఞానం చ రాఘవ ।**
**యోగో వృత్తినిరోధో హి జ్ఞానం సమ్యగవేక్షణమ్ ॥ 17**

ఓ శ్రీరామా! చిత్తముయొక్క లయముకొరకు రెండు మార్గములు గలవు. ఒకటి యోగము, రెండవది జ్ఞానము. యోగముచే సర్వవృత్తులు నిరోధింపబడును. జ్ఞానముచే సమ్యగ్జ్ఞానము సిద్ధించును. గీతలోను పంచ మాధ్యాయమున శ్రీకృష్ణభగవానుడుగూడ ఈ తత్త్వమునే ఉపదేశించెను.

**సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః ।**

ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విన్దతే ఫలమ్ ॥ 18

పిల్లవారి స్వభావము గలవారు సాంఖ్యమును (జ్ఞానము)వేరుగాను యోగమును వేరుగాను జెప్పుదురు. జ్ఞానులు అట్లు చెప్పరు. యోగ మందైనను జ్ఞాన మందైనను నొకదానియందు చక్కని యనుష్ఠానము గలిగియుండిరేని యుభయులుగూడ ఆత్మజ్ఞాన ఫలమును నొకేవిధముగ పొందుదురు.

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।
ఏకం సాఙ్ఖ్యఞ్చ యోగఞ్చ యః పశ్యతి స పశ్యతి ॥ 19

తా॥ జ్ఞాననిష్ఠులగు సాంఖ్యులచే ఏ మోక్షము బొందబడుచున్నదో అట్టిమోక్షమే యోగనిష్ఠ కలవారిచేత గూడ పొందబడుచున్నది. కావున ఏ పురుషుడు సాంఖ్యము, యోగము రెండును నొక ఫలమునకే కారణము లగుచున్నవని తెలిసికొనుచున్నాడో అట్టివాడే పరమార్థమును చక్కగా తెలిసికొన్నవాడగును. అట్టివాడు నిజముగ, శాస్త్రసత్యమును తెలిసి కొనదగిన దివ్యదృష్టి గలవాడు.

అట్లుగుచో నొకమార్గమే చాలదా! రెండు మార్గము లేల యుండవలయును అనిన, సమాధానమును వాసిష్ఠమున శ్రీవసిష్ఠమునియే తెలుపుచున్నారు:-

అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిద్జ్ఞాననిశ్చయః ।
ప్రకారౌ ద్వౌ పురా దేవో జగాద పరమేశ్వరః ॥ 20

ఒకానొకనికి యోగ మసాధ్యముగ నుండును. మఱియొకనికి జ్ఞానము సాధ్యముగాక పోవచ్చును. కావున పరమేశ్వరుడు పూర్వమే రెండుమార్గముల నుపదేశించిరి. ఈ రెండు మార్గములు తెలిసినవాడు సులభముగ మోక్షమును పొందగల్గును.

దహ్యన్తే ధ్మాయమానానాం ధాతూనాం హి యథా మలాః ।
తథేన్ద్రియాణాం దహ్యన్తే దోషాః ప్రాణస్య నిగ్రహాత్ ॥ 21

నిప్పులో స్ఫుటముజేసిన పాషాణాది విషధాతువులు విషము నశించి దివ్యౌషధము లెట్లగునో, లోహాదులలో గల త్రుప్పు కొలిమిలో పెట్టి ఊదుటచే ఎట్లు నశించుచున్నదో, ఎట్టి లోహమైనను కొలిమిలో పెట్టి ఊదుటచే నెట్లు కరుగుచున్నదో, ఆలాగున ప్రాణసంయమ యోగముచే జీవుని పాపము లన్నియు నశించుచున్నవి. కర్మలన్నియు భస్మము లగుచున్నవి.

**ఆత్మజ్ఞానేన ముక్తిస్స్యాత్తచ్చ యోగాదృతే న హి ।**
**యోగాగ్నిర్దహతి క్షిప్ర మశేషం పాపపంజరమ్ ॥**
**ప్రసన్నం జాయతే జ్ఞానం జ్ఞానాన్నిర్వాణమృచ్ఛతి॥** 22

యోగముచే జ్ఞాన ముత్పన్న మగుచున్నది. అట్టి జ్ఞానము యోగమును వృద్ధిపొందించుచున్నది. యోగాగ్ని త్వరలోనే పాపపంజరమును దహింప జేయుచున్నది. అందుచే హృదయము శుద్ధమగును. అట్టి కారణముచే ఆత్మజ్ఞాన ముదయించును. దానివలన నిర్వాణమును (మోక్షమును) సాధకుడు పొందుచున్నాడు.

**ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశమ్ ।**
**జితేన్ద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః ॥** 23

ఇంద్రియములయొక్క జయముకొరకు అహర్నిశము యోగ మనుష్ఠించ వలయును. ఇన్ద్రియములను జయించినవాడే ప్రజలను తన స్వాధీనములో నుంచుటకు శక్తుడగును. ఇది రాజుల విషయమై మనువు ఉపదేశించినది. తన యిన్ద్రియములను స్వాధీనములో నుంచు శక్తిగలవాడు ప్రజలను గూడ స్వాధీనములో నుంచ శక్తుడగును. తన యిన్ద్రియములను ఎంతకెంతకు స్వాధీనపరచ శక్తి గలిగియుండునో భూలోకములో గల జనులనుగూడ అంతకంతకు స్వాధీనము చేయుశక్తి గలుగును.

**అయమాత్మా స్వయంజ్యోతి ర్మహానందమయశ్శివః ।**
**అయోగినః పరోక్షస్స్యాదపరోక్షశ్చ యోగినః ॥** 24

ఈ ఆత్మ స్వయంజ్యోతి స్స్వరూపమైనది. యోగము లేనివానికి

పరోక్షముగను (అప్రత్యక్షము), యోగనిష్ఠ గలవానికి అపరోక్షముగను (ప్రత్యక్షము) నుంటున్నది.

**ఇన్ద్రియాణాం ప్రసంగేషు దోషమృచ్ఛత్యసంశయమ్ ।**
**సన్నియమ్య తు తాన్యేవ తతస్సిద్ధిం నియచ్ఛతి ॥ 25**

ఇన్ద్రియములు విషయములలో సంచరించుటచే దోషమును పొందు చున్నవి. ఈవిషయమున్నై సంశయుము లేదు. అట్టి ఇంద్రియువములను స్వాధీనములో నుంచుట వలన జ్ఞానసిద్ధిని సాధకుడు పొందుచున్నాడు.

**యది శైలసమం పాపం విస్తీర్ణం యోజనాన్ బహూన్ ।**
**భిద్యతే ధ్యానయోగేన నాన్యో భేదః కథఞ్చన ॥ 26**

మహాపర్వతమువలె అనేక యోజనముల విస్తీర్ణమై యుండు పాపము లన్నిటిని ధ్యానయోగము ధ్వంస మొనర్పగలుగును. ఇట్టి యోగము తప్ప పాపసంఘమును నశింపజేయుటలో వేరొక ఉపాయము లేదు.

**యథాఽయం కమఠోఽఙ్గాని సంకోచయతి సర్వశః ।**
**విషయేభ్యస్తథా ఖాని సంకోచయే ద్యోగతత్పరః ॥ 27**

ఏలాగున కూర్మము (తాబేలు) తన అవయవములను లోపలికి ముడుచుకొనుచున్నదో ఆలాగున యోగమందాసక్తి గల వాడెల్లప్పుడు విషయములనుండి ఇంద్రియములను లోనికి ముడుచుకొనవలయును.

**కర్పూరమనలే యద్వత్సైన్ధవం సలిలే యథా ।**
**తథా సన్ధీయమానం చ మనస్తత్త్వే విలీయతే ॥ 28**

కర్పూర మేలాగున అగ్నిలో జ్యోతిరూపముగా మారుచుండునో, ఉప్పుగడ్డ యేలాగున జలములో నైక్యమగునో ఆలాగున యోగపరుని మనస్సు పరమాత్మయందు లయము నొందును.

**సమాధిస్సమతావస్థా జీవాత్మ పరమాత్మనోః । 29**

సమాధి యనగా జీవాత్మపరమాత్మలయొక్క సమావస్థ యగును. (ఐక్యమగును)

**ఇప్పుడు బ్రహ్మనిష్ఠ చేయు స్థలముయొక్క విశేషము తెలుపబడు చున్నది.**

**నిమిషం నిమిషార్ధం వా యత్ర తిష్ఠన్తి యోగినః ।**
**తత్రైవ సర్వశ్రేయాంసి తత్తీర్థం తత్తపోవనమ్ ॥** 30

ఏస్థలములో యోగు లగువారు యోగనిష్ఠాపరులై ఒకనిమిషముగాని అర్ధ నిమిషముగాని యుందురో అచ్చట సర్వ శ్రేయస్సులు గలుగుచున్నవి. అది తీర్థ ప్రదేశముగాను, తపోవనముగాను మారుచుండును.

ఇక యోగసాధనలవలన పాపము నశించి జీవుడెటుల పవిత్రుడగు చుండునో దానిని వినుడు.

**యథైకం చ సువర్ణాది మిళితం రజతాదినా ॥**
**అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽప్యహంయుతః ॥** 31

**యథైవ హి సువర్ణాది క్షారాదే శ్శోధితం శుభమ్ ।**
**పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతేః ॥** 32

ఏలాగున సువర్ణము, రాగి, ఇత్తళి మొదలగు లోహములతో కలిసి పోయిన స్వల్పవెలగల దగుచున్నదో, ఆలాగున ఈజీవుడు గూడ స్వయముగ జ్ఞానస్వరూపుడయ్యు అవిద్యతో కలియుటచే జీవసంజ్ఞ గలవాడగుచున్నాడు. అట్టి తెల్లబంగారము స్పుటమువేయుట వలన ఏలాగున మలినలోహము నశించి మంచి బంగార మగుచున్నదో ఆలాగున ఈ మలినజీవుడుగూడ ధారణధ్యాన సమాధి యోగములచే సర్వమాలిన్య రహితుడై శివస్వరూపు డగుచున్నాడు. కొందరు పూర్వజన్మ కర్మము నశించదని అనాదియని చెప్పుదురు. ఈవిషయమై యోగవాసిష్ఠమున జెప్పినది గాంచుడు.

**తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా ।**
**నశ్యతి క్రియయా పుత్ర! పురుషస్య తథా మలమ్ ।**

**నశ్యత్యేవ న సందేహః తస్మాదుద్యమవాన్భవ ॥** 33

బియ్యము పుట్టుకతో తవుడున్ను పొట్టున్నుగూడియే ఏర్పడుచున్నది. అనాదిగ పొట్టుతోగూడ వడ్లు ఏర్పడినను దంచుటచే పొట్టుతవుడుగూడ నెటుల తొలిగిపోవుచున్నదో, ఉమక ఊడిపోయిన వడ్లు, బియ్యమై మరల యెట్లు మొల కెత్తదో, అలాగున పుట్టుకతోగూడ రాగి చిలుముగలిగి ఏర్పడినను మూలికా రసాయనాదులచే స్ఫుటముచే ఏలాగున చిలుము నశించి బంగారమగునో, అట్టి స్వర్ణము మరల ఏ కాలమందును చిలుము గలదిగా కుండునో - అలాగున అనాదిగ జీవునకు గలిగిన మాయయు, అష్టాంగ యోగముచే తప్పక నశించి బ్రహ్మత్వము నొందగల్గును. దీనియందు సందేహము లేదు. అందుచే నెల్లప్పుడు ప్రయత్నపరుడవై యుండుమని వసిష్ఠులు ఉద్బోధించిరి. ఓహో! ఎటువంటిబోధము? ఇట్టిబోధకులు లేనందుచేతనే మనుజులు పవిత్రులుగాక పోవుచున్నారు.

**అవిద్యాం శ్లేష్మయా శ్లేష్మః క్షాళయన్నేవ తిష్ఠతి ।**
**మలం మలేనాపహర న్యుక్తిజ్ఞో రజకో యథా ॥** 34

యుక్తిగల చాకలివాడు ఏలాగున వస్త్రములోగల మాలిన్యమును భూమి లోగల చవుడులో ఉడుకబెట్టి శుద్ధపరచుచున్నాడో అలాగున అవిద్యను విద్యచేతను, తపస్సు చేతను, ధారణా ధ్యానసమాధులనెడు యోగములచేతను అజ్ఞానములో నుండు జీవుని శుద్ధపరచవలయును. ఆహా! ఎంత ధైర్యము నుపదేశించిరి.

**అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసా ద్వినిర్మలమ్ ।**
**కృత్వాఽజ్ఞానం స్వయం నశ్యేత్ జలం కతకరేణువత్ ॥** 35

అజ్ఞానకలుషమైన జీవాత్మను అభ్యాసమనెడు జ్ఞానముచే నిర్మలముగ నొనర్చవలయును. ఎటులన పంకిలజలము చిల్లగింజయొక్క గంధమువలన శుద్ధపడి ఆగంధమున్ను బురదతో కలిసి అడుగంటి పోవుచుండునో అలాగున శ్రవణజ్ఞానము విజ్ఞానమును గలుగజేసి తొలగిపోవును.

ఇదియు ఆత్మశుద్ధికొరకెంతో ధైర్యము నుపదేశించినది.

ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా ।
హరత్యవిద్యావిక్షేపారోగానివ రసాయనమ్ ॥ 36

శ్రేష్ఠమగు రసాయన సేవచే రోగమెటుల శమించునో ఆలాగున నిరంతరము బ్రహ్మానుసంధానపరమగు నిష్ఠవలన జీవునియొక్క మల, విక్షేప, అవిద్యాదులు నశించి శుద్ధాత్ముడగును.

జ్ఞాననిష్ఠో విరక్తోఽపి ధర్మజ్ఞోఽపి జితేంద్రియః ।
వినా యోగేన దేవోఽపి న మోక్షం లభతే ప్రియే! ॥ 37

~~ఈ~~శ్వరుడు జ్ఞానతంత్రమున ~~ఈ~~ శ్లోకమును పార్వతికి ఉపదేశించెను. శ్రవణజ్ఞాననిష్ఠుడైనను, విరక్తుడైనను, ధర్మజ్ఞుడైనను, జితేంద్రియుడైనను, కట్టకడకు దేవుడైనను యోగసాధన వినా ఓ పార్వతీ! మోక్షము లభించదు.

గురుప్రసాదాల్లభతే యోగమష్టాంగసంయుతమ్ ।
శివప్రసాదాల్లభతే యోగసిద్ధిం చ శాశ్వతీమ్ ॥ 38

గురుప్రసాదము వలననే యమాద్యష్టాంగ యోగము సిద్ధించును. శివప్రసాదమువలననే శాశ్వతమగు యోగసిద్ధి(జ్ఞానసిద్ధి) గలుగును. ఇందువలన శ్రీ సద్గురునియందును, సర్వేశ్వరునియందును భక్తిగల ఉత్తమ శిష్యులకే పై పేర్కొన్న శ్రీగురు శ్రీశివుల యనుగ్రహము గలుగును. అట్టివారికే జ్ఞానము సిద్ధించు ననునది మరువకూడదు. ఇక ఇట్టి యోగము నెవరనుష్ఠించవచ్చునో ఆ విషయమై తెలిపెద.

బ్రాహ్మణక్షత్రియవిశాం స్త్రీశూద్రాణాం చ పావనమ్ ।
శాన్తయే కర్మణామన్యద్యోగాన్నాస్తి విముక్తయే ॥ 39

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, స్త్రీ, శూద్రులకు కర్మశాంతియగు మోక్షమునకు యోగముకంటే పరిశుద్ధమైనది వేరే లేదు అని యోగచింతామణి.

రోగము గలవారికే ఔషధ మేర్పడినట్లు పాపము గలవారికే పాపవిమో

చనపరమగు జ్ఞానమేర్పడినదని తెల్పువారు తగ్గిపోవుటయే మనదేశము ఇంత పతన మొందుటకు కారణమైనది, గీతలో శ్రీకృష్ణభగవానుడున్ను చెప్పినది జూడుడు: -

**యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 4-37**

ఏప్రకారము చక్కగా రగులుచుండెడు అగ్నిహోత్రుడు హోమ ద్రవ్యములను భస్మము చేయుచున్నాడో, ఆ ప్రకారముగానే జ్ఞానమనెడు నగ్ని సమస్త కర్మములను భస్మము చేయుచున్నది.

**అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః ॥ 9-30**

మిగుల దురాచారములు గలవాడైనను పాపసంకల్పములు మాని భక్తితో సర్వేశ్వరుని సేవించిన యెడల అట్టివాడు చక్కని నమ్మకము గలవాడు గనుక సాధువు శ్రేష్ఠుడనియే తలంచవలెను.

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।**
**కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 9-31**

తా॥ పైన జెప్పిన అనన్యభక్తి స్వభావము గలవాడు అతి త్వరగా ధర్మాత్ముడగుచున్నాడు. శాశ్వతమైన పరమశాంతిని (చిత్తోపరతిని) పొందుచున్నాడు. ఓ అర్జునా! భక్తిగలవాడు చెడడు అని సభలో భేరి వాయించి రెండు చేతులు పైకెత్తుకొని ప్రతిజ్ఞ చేసి చెప్పుము.

**మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥**

ఓ అర్జునా! పాపజన్మము గలవారెవరైతే గలరో అట్టివారున్ను, స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులున్ను, మొదలగు వారందరున్ను నన్ను శరణు బొంది ధ్యానము చేసిన యెడల వారు సర్వోత్తమమగు మోక్షమును

బొందుదురు.

ఇక నీ యోగనిష్ఠయందు ప్రమాదము గలుగనీయక చూడవలెనని ఋషులు కరుణతో నుపదేశించు చున్నారు.

**న ప్రమాదోఽత్ర కర్తవ్యో విదుషా మోక్షమిచ్ఛతా ।**
**ప్రమాదే జృంభతే మాయా సూర్యాపాయే తమో యథా ॥ 44**

మోక్షమందిచ్ఛ గల విద్వాంసుడు ఎచ్చోటను ఎప్పుడును ఏవిధమునను ప్రమాదమును పొందగూడదు. ప్రమాదమందు మాయ విజృంభించును (మాయలో పడిపోవును). ఎట్లన సూర్యు డస్తమించగా చీకటి ఎట్లు లోకమును ఆవరించునో మాయయు ఆలాగున సాధకుని మోహపరచును. ఇక యోగనిష్ఠచే గలుగు ఫలమును జెప్పుచున్నారు.

**కృతార్థౌ పితరౌ తేన ధన్యో దేశః కులం చ తత్ ।**
**జాయతే యోగవాన్యత్ర దత్తమక్షయ్యతాం వ్రజేత్ ॥ 45**

**దృష్టః సంభాషిత స్స్పృష్టః పుంప్రకృత్యో ర్వివేకవాన్ ।**
**భవకోటిశతాపాతం పునాతి వృజినం నృణామ్ ॥ 46**

అట్టి యోగనిష్ఠుని తల్లిదండ్రులు కృతార్థు లయ్యెదరు. ఆ దేశమును కులమును ధన్య మగుచున్నది. యోగి యేకులమున ఎచ్చట పుట్టుచున్నాడో ఆ కులమున్ను కొఱత లేనిదై అక్షయ మగుచున్నది. అట్టి యోగనిష్ఠునిచేత చూడబడినను, జెప్పబడినను, తాకబడినను వారు పాపవిముక్తు లగుదురు. ప్రకృతిపురుష వివేకజ్ఞానము గలవాడు అనేకకోటి జననమరణములలో బడినట్టి పాపకర్మము గల పురుషుని గూడ పావనునిగా జేయుచున్నాడు.

ఓం లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు.

ఓమ్ తత్ సత్.

ఇట్లు మీ చరాచర సుఖాభిలాషి

శ్రీమలయాళస్వామి.



# తొలిపలుకు

అఖిలమానవులకును పుత్రదారాది సుఖములు సయితము దుఃఖములుగా పర్యవసన్నము లగుటవలనను, రోగాది బాధలు గడువ శక్యముగాక యుండుట వలనను ఆత్యంతికదుఃఖనివృత్తి లేక యనశ్వరసుఖము లభింపవలయునని యభిలాష పొడమును. అట్టి తరి **'తరతి శోకమాత్మవిత్' 'తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి' 'నాన్యః పన్థా విద్యతేఽయనాయ'** మొదలగు శ్రుతులవలనను స్మృతీతిహాస పురాణముల వలనను నాత్మజ్ఞానమే యందులకు సాధనమని యెఱింగియు ననాదిసిద్ధమగు దేహాత్మభ్రమ వెన్నంటి యుండుటచే దేహమాత్మ గాదనియు నదివేఱనియు నితర ప్రమాణములచే నెఱుంగుచుండియు నాత్మ సాక్షాత్కృతము కానందున భ్రమవిరహితుడు గాజాలక శరీరము పరితపించును.

అట్టితరి నిదిధ్యాసన మాత్మసాక్షాత్కారమున కెంతయు నుపయుక్త మగును. కావుననే **"ఆత్మావాఽరే! ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః"** యని శ్రుతియు, నీయర్థముననే

**శ్రోతవ్యః శ్రుతివాక్యేభ్యో మంతవ్యశ్చోపపత్తిభిః ।**
**మత్వా చ సతతం ధ్యేయ ఏతే దర్శనహేతవః ॥**

యని స్మృతియు వేదవాక్యముల మూలమున నాత్మ స్వరూపమును విని యుక్త్యుపపత్తులచే మననము చేసిన యాత్మను నిరంతరము ధ్యానించుచున్న నాత్మ సాక్షాత్కారము గలుగునని తెలుపుచున్నవి. అట్టి యాత్మ సాక్షాత్కారమునకు సాధనములను నిరూపించుటకు యోగశాస్త్ర మెంతయు నుపకరించును. ఆత్మసాక్షాత్కారము సయితము సంప్రజ్ఞాత సమాధి యనియు, నదియు హేయమైనది యనియు, నాత్మకు స్వరూప మాత్రస్థితి రూపమగు నసంప్రజ్ఞాత సమాధియే కైవల్యమని నిరూపించిన

యీపాతంజలదర్శన మెంతయు నుత్తమోత్తమ దర్శనమై యున్నది.

**''సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః''** యను భగవద్గీతా వాక్యమువలన కపిలుని సాంఖ్యశాస్త్రమును పతంజలి యోగశాస్త్రము నొక్కదర్శనమే గాని వేరుగావు. సాంఖ్యశాస్త్రమున పంచవింశతి తత్త్వములు వివరింపబడియెను. యోగశాస్త్రమున నన్నో యా తత్త్వముల నెరుంగు నుపాయము దెలుపబడినది.

యాజ్ఞవల్క్యస్మృతియందు :-

**''హిరణ్యగర్భో యోగస్య వక్తా నాన్యః పురాతనః''** అనగా యోగ శాస్త్రమునకు హిరణ్యగర్భుడే తొట్టతొలుతటి ప్రవర్తకుడు కాని యంతకన్నముం దెవ్వరును యోగమును ప్రవర్తింపజేసి యుండలేదని చెప్పబడెను. ఇందు హిరణ్యగర్భు డనగా కపిల మహర్షియే. కావుననే:-

**విద్యాసహాయవంత మాదిత్యస్థం సమాహితమ్ ।**
**కపిలం ప్రాహురాచార్యాః సాంఖ్యనిశ్చితనిశ్చితాః ॥**

**హిరణ్యగర్భో భగవానేషశ్ఛందసి సంస్తుతః॥**

అని చెప్పబడెను. అనగా విద్యాసహాయుడై యాదిత్యునియందు సమాహితుడై యున్న వానిని కపిలమహర్షి యని సాంఖ్యతత్త్వవేత్తలగు నాచార్యులు నుడువుదురు. ఈ కపిలుడే హిరణ్యగర్భుడని వేదములయందు స్తుతింపబడియెను అని భావము.

కపిలుని సాంఖ్యము ననుసరించి యీ పతంజలి మహర్షి సూత్రీక రించెను. కావుననే తొలుతటి సూత్రమును '' అనుశాసనం'' అనిరి. అనుశాస మనగా శిష్టస్యశాసనం అనుశాసనం-అను వ్యుత్పత్తిచే నింతకు మున్నుపదేశింపబడియున్న విషయమునే తదనుగుణముగా శాసించుట యనియర్థము. కాగా నీశాస్త్రము సాంఖ్య యోగానుగుణముగా నుండును.

ఈ పాతంజల యోగసూత్రమునకు వ్యాసభగవానుడు భాష్యమును,

భోజదేవుడు'రాజమార్తాండము'ను వృత్తిని, నాగోజీభట్టు 'భాష్యచ్ఛాయ' యను వృత్తిని, విజ్ఞానభిక్షువు'వ్యాసభాష్య వార్తికము'ను శ్రీధరానంద యతి 'మణిప్రభ'ను, నారాయణతీర్థులు 'యోగసిద్ధాంత చంద్రికను, 'సూత్రార్థబోధిని' యను వ్యాఖ్యను, హరిప్రసాదపండితుడు 'యోగసూత్ర వైదికవృత్తి'ని, అనంత పండితుడు 'పదచంద్రిక'ను, శ్రీసదాశివేంద్రసరస్వతి 'యోగసుధాకరము'ను మొదలగు వివరణములను వ్రాసియున్నారు.

ఈపతంజలి వ్యాకరణ మహాభాష్యకారు డగునా? కాదా? యను విషయమునను, భాష్యకారుడగు వ్యాసుడు వేదాంత సూత్రకారు డగునా? కాదా? యను విషయమునను ననంతములగు వాదోపవాదము లున్నవి.

కాని భర్తృహరి వాక్యపదీయమునందు

**కాయవాగ్బుద్ధి విషయా యే మలాస్సమవస్థితాః ।**
**చికిత్సాలక్షణాధ్యాత్మ శాస్త్రైస్తేషాం విశుద్ధయః ॥**

అనగా శరీరమలమును, వాఙ్మలమును, బుద్ధిమాలిన్యమును, క్రమముగా చికిత్సాశాస్త్రము, శబ్దలక్షణ (వ్యాకరణ) శాస్త్రమును, యోగశాస్త్రము ననువానిచే నివారింపవలయు నని పై మూడు శాస్త్రములను రచించిన పతంజలిని మనమున నుంచికొని చెప్పియుండుట వలనను మఱియు.

**యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్య చ వైద్యకేన ।**
**యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలి రానతోఽస్మి॥**

అను శ్లోకము వృద్ధపరంపరానుగతముగా వచ్చుచుండుటచే మహాభాష్యకారుడగు పతంజలియే యోగసూత్రకారుడని విశ్వసింప వలసియున్నది.

బ్రహ్మసూత్రములలో **''ఏతేన యోగః ప్రత్యుక్తః''** (అ.2,పా.1, సూ-3) అనుసూత్రముచే శ్రీవేదవ్యాసభగవానుడు యోగమును నిరాకరించి

మఱల నాయోగసూత్రములకు భాష్యము నొనర్చుట యసంగతముగా దోచును గాని విచారించినచో వ్యాసభగవానుడు యోగశాస్త్రమును నిరాకరించు తాత్పర్యమున నా సూత్రమును రచించి యుండలేదు. కేవలము ప్రధానమునకు స్వాతంత్ర్యమును సత్త్వమును మాత్రము నిరాకరించెనేగాని యింకొకటి కాదు.

కాన శ్రీ వేదవ్యాస భగవానుడే దీనికి భాష్యము వ్రాసియుండె ననుటలో నసంగత మేమియు లేదు.

ఇదివరలో నాంధ్రమున కొంతవఱకు భోజదేవవృత్తి ననుసరించి యీ యోగసూత్రములకు ఓ.వై. దొరస్వామయ్యగారు వివరణ వ్రాసి యున్నారు. అయినను ఆ వివరణము పూర్ణజ్ఞానమును గలిగింపజాలదు, ''ఋషేర్హృదయం ఋషిరేవ వేత్తి'' యను న్యాయమున పతంజలిమహర్షి హృదయమును వ్యాసమహర్షి యెఱింగిన విధమున, నెంతగా శాస్త్రానుభవము గలవారికిని గోచరింపదను కారణముననుు, భాష్యకర్తయగు శ్రీవ్యాసభగవానుని యందలి గౌరవమువలనను వ్యాసభాష్యము నాధారముగా నుంచుకొని ఈ సూత్రములను వివరించితిని. వ్యాసభగవానుని భాష్యము సయితము గంభీరమై యనేక శాస్త్రవిషయ పరామర్శకమై యుండుటవలన ద్వాదశదర్శన కాననపంచాననుడగు వాచస్పతిమిశ్రుని 'తత్త్వవైశారదీ' వ్యాఖ్య ననుస రించియు, విజ్ఞానభిక్షుని 'యోగవార్తికము' ననుసరించియు పలుచోటుల విశేషాంశములను జేర్చితిని. కొన్ని యెడల భోజదేవుని వృత్తినిగూడ

విషయము జటిలముగా నున్నచోట పునరుక్తిని పాటింపక మఱల మఱల వివరించితిని. కొన్ని యెడల సంధులు గలుపకుండిననే యర్థము సులభముగా నగునని చాలాచోట్ల విసంధికముగనే యుంచితిని.

యోగదర్శన ప్రవేశాభిలాషులెల్లరు నీ నా గ్రంథము నామూలాగ్రముగ పఠించి నా యీ శ్రమను సార్థక మొనర్తురు గాక.

మఱియు బహునిరోధములవలన ఈగ్రంథమున నచట నచట దొరలిన తప్పులను పాఠకులు సూచించినచో విధేయతతోడ మరుసటి ముద్రణమున సవరించు కొనగలనని విన్నవించుచున్నాను.

శ్రీవ్యాసాశ్రమస్థాపకులును, భగవద్గీతాది బహుళ వేదాంత గ్రంథములను సర్వజనులకును సులభ గ్రాహ్యములగు విధమున పదవిభాగ ప్రతిపదార్థ విశేషార్థసహితముగ వ్రాసి జ్ఞానామృతమును నందఱికిని పంచియిచ్చుచున్న శ్రీసద్గురు మలయాళస్వాములవారు మహర్షి సంఘములో గణింప తగినవారై యున్నారు. శ్రీవారు సర్వజనులకును తప్పక యెరుగదగి యుండియు, పదవిభాగ ప్రతిపదార్థాదులు లేక దుర్బోధముగ నున్న యీ పాతంజల యోగదర్శనము నందలి యుత్తమ విషయముల నందఱకును దేటతెల్లముగ జేయు తలంపుతో నన్నీ పవిత్రకార్యమున నియోగించి, నన్నును, దేశసేవయు, సమాన సోదర సేవయు జేయు భాగ్యము గలవానినిగా నొనర్చినందులకు వారికి నెంతయు కృతజ్ఞుడను.

మఱియొక సంగతి యేమన ఈ పవిత్రగ్రంథమును ముద్రించునపుడు ప్రూఫువగైరాలను సరిచూచి సహాయమొసంగిన శ్రీ శివచరణంగారు( సాహిత్య శిరోమణి-సాహిత్యసుధాకర) భగవద్భాగవత కృపకు పాత్రు లగుదురు గాత!

ఇట్లు

బుధజన విధేయుడు,

విద్యాప్రవీణ తి.కం. తిరువేంగడాచార్యులు.

తృతీయ ముద్రణము:-

శ్రీగురుశ్శరణమ్

## ప్రాక్కథనము

పరిశుద్ధాత్మస్వరూపులగు ప్రియమైన ఆత్మసోదరీ సోదరులారా!

శ్రీమద్భగవద్గీత, కఠోపనిషత్తు, పాతంజల యోగసూత్రములు- ఈమూడు గ్రంథములు శ్రీగురుదేవులకు (మహర్షి సద్గురు శ్రీమలయాళ స్వాములవారికి) మిక్కిలి ప్రియతమములైన గ్రంథములు. ఏలన, శ్రీవారి సాధనదశలో, తపఃకాలములో ఈమూటినే యెక్కువ మననము చేసిరి. వారి తపస్సిద్ధికి ఈమూడును మిక్కిలి ఉపకరించినవి. అందు భగవద్గీత సాధకుల యొక్క సంస్కారము ననుసరించి కర్మ, భక్తి, యోగ, జ్ఞానములను ప్రతిపాదించునదై, మానవుని పూర్ణత్వమును పొందించు వివిధధర్మ సంపుటి యగుచో, కఠోపనిషత్తు మానవుని లక్ష్యార్థమగు ఆత్మస్వరూపమును స్పష్టముగ వర్ణించుచు, శ్రేయఃప్రేయో మార్గముల విభజించి, సాధకులకు మోక్షసాధనమగు శ్రేయోమార్గమే అనుసరణీయమని ప్రేయోమార్గ నిరసన పూర్వకముగ ప్రతిపాదించుచున్నది. కఠోపనిషత్తునందే విశేషించి ఆత్మ తత్త్వము సోదాహరణముగ వర్ణింపబడినది. లక్ష్యవస్తుస్వరూప ప్రతిపాదకము కఠోపనిషత్తు.

ఇక పాతంజల యోగసూత్రములో ఇది ఒక సాధనగ్రంథము. ఏ సాధకుడేని మున్ముందు తన మనస్సును నిశ్చలముగ, నిర్మలముగ, ఏకాగ్రముగ నొనర్చుటకై యత్నించవలసి యుండును. అట్టి చిత్తనిరోధమే యోగమని యోగసూత్రములు నిర్వచించినవి. కాన మనోనిరోధమునకు ఆవశ్యకములైన అష్టాంగ యోగములను ఈ గ్రంథము ముఖ్యముగా ప్రతిపాదించుచున్నది. నేతి, ధౌతి మొదలుగా గల కఠినములగు హఠయోగ ప్రక్రియలను గాక సాధకుడు సరళముగ ముఖ్యముగ ననుష్ఠింప దగిన యమనియమాసన ప్రాణాయామాది సులభోపాయములను ఈ 'పాతంజల యోగసూత్రములు'

బోధించుచున్నవి. చిత్తచాంచల్యమును పోగొట్టుకొనుటకే యౌగిక సాధనలు తప్పక అనుష్ఠింపదగినవి. ఈచిత్త నిరోధముచేతనే అనేకసిద్ధులు సంభవించును. కాని అవి అన్నియు వ్యుత్థానదశలో సిద్ధులుగా దోచినను, సమాధికాలమున ప్రతిబంధకములేనని వాటిని నిరసించి, మనోవాసన లన్నియు నశించగా స్వరూపావస్థానమే కైవల్యము లేక మోక్షమని యోగసూత్రములు నిర్ణయించినవి.

ఈ విధముగ ఆధ్యాత్మిక పథనివిష్టులగు సాధకులకు పైమూడు గ్రంథములు అత్యంతసహకారులు, కనుకనే నిత్యపఠనీయములు. శ్రీగురు దేవులు తమ సాధనావస్థలో ఈ మూటిని బాగుగా చింతించి, మననము చేసి, తదర్థమును భావనచేసి, ఆత్మసాక్షాత్కారమును బడయ గలిగిరి. అందుననే ఈమూడును సాధకులకు ముఖ్యపఠనీయములను దృష్టితో విశేషించి శ్రీ వ్యాసాశ్రమ భక్తులకు, సాధకులకు, సాధువులకు, గృహస్థులకు, సన్న్యాసుల కును ఈ గ్రంథత్రయము నిత్యపఠనీయమని, అనుదిన మననీయమని శాసించిరి. శ్రీ గురుదేవుల తత్త్వప్రబోధ యంతయు ఈమ్మూడు గ్రంథములపైననే ఆధారపడియుండును. అభ్యాసమునకు యోగసూత్ర ములు, అనుష్ఠానమునకు భగవద్గీత, స్వరూప తత్త్వజ్ఞానమునకు కఠోపనిషత్తు- ఈవిధముగ నీ మూడు గ్రంథములు సాధక లోకమునకు ఉపకరించునవి గాన నివి నిత్యానుసంధేయములని శ్రీవారి ఆశయము.

తదాశయముతోనే శ్రీవారు గోగర్భమున తపస్సు చేయుకాలముననే యీమూడు గ్రంథములను సామాన్య సాధకులకు సయితము బోధపడు లాగున పదవిభాగ, ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషార్థములతో ప్రకటించిన బాగుండునని సంకల్పించిరి. సంకల్ప సిద్ధులగుటచే తరువాత శ్రీవారి ఆ శుద్ధసంకల్పము సిద్ధించినది. పైమూడు గ్రంథములు గూడ శ్రీవ్యాసాశ్ర మము తరపున సరళశైలిలో, అల్పవిద్య గలవారికి సయితము అర్థమగు భాషలో వ్రాయబడి ముద్రింపబడినవి.

ఆమూటిలో ఈ'పాతంజల యోగసూత్రములు' ఒకటి. దీనినే 'యోగదర్శన' మందురు. ప్రస్తుత మిది పదవిభాగ, ప్రతిపదార్థ, తాత్పర్య

ములతోనే గాక, అనేక సంస్కృత వ్యాఖ్యానములను పరిశీలించి, విశేషించి వ్యాసభాష్యము నాధారముగా జేసికొని 'భాష్యార్థప్రకాశిక' అను తెలుగు వివరణముతో ప్రకాశితమైనది. 'విద్యాప్రవీణ' శ్రీ తి.కం. తిరువేంగడాచార్యులుగారు (ఆశ్రమ పాఠశాలా ప్రధానోపాధ్యాయులు) శ్రీగురుదేవుల సత్ప్రేరణచే మిక్కిలి శ్రమించి, శ్రద్ధతో దీనిని రచించిరి. ఇయ్యది సంస్కృత భాషా పరిచయములేని శ్రద్ధావంతులగు ముముక్షువులకు, సాధన ప్రియులగు సాధకులకు మిక్కిలి ఉపకరించగలదని, వారి సాధనమార్గమునకు దోహదకారి కాగలదని, దీనిచే శ్రీ గురుదేవుల ఆశయము సిద్ధించగలదని విశ్వాసము.

1946-వ సం॥ న ప్రథమ ముద్రణము జరిగినది. అది దుర్భిక్షసమయ మగుటచే, కాగితములు లభింపని కరువుకాల మగుటచే నానారకములైన కాగితములలో ముద్రింపబడినది. కాని వస్తు(విషయ) మహత్త్వముచే గ్రంథము పాఠక లోకముచే విశేషించి ఆదరింపబడినది. ఆ ప్రతులు పూర్తి అయికూడ చాల కాలమాయెను. కాని యీనాటికి తిరిగి పునర్ముద్రణావకాశము లభించి, యీ ఉత్తమ గ్రంథమును పాఠకుల కందించగలుగుచున్నందులకు మిక్కిలి సంతోషము, కర్తవ్య నిర్వహణముచే సంతృప్తి, ఈ గురుప్రియ కార్యాచరణద్వారా యత్కించిత్తు గురుసేవ చేయగలిగితిమన్న ఆనందము గలుగుచున్నది. చిరకాలమునకు దుర్లభమగు ఈ గ్రంథరాజము పునః లభ్యమగుచున్నందులకు ముముక్షువు లగు పాఠకులు ఆనందించి పూర్వరీతిగనే సమాదరించగలరని విశ్వాసము, మఱియు ద్విగుణీకృత ఉత్కంఠతో దీనిని పఠించి, అనుష్ఠించి, క్షిప్త, మూఢ, విక్షిప్తాది చిత్తవృత్తులను నిరోధించి చిత్తస్థైర్యమును సంపాదించుకొని స్వస్వరూపావస్థాన మగు కైవల్యమును, తత్సుఖమును అనుభవించెదరు గాక!

**సత్త్వపురుషయో శ్శుద్ధిసామ్యే కైవల్యమ్**
**యోగవిచ్ఛిన్న హృద్గ్రన్థి ర్యోగ సంశుద్ధ సత్త్వవాన్।**
**సద్గురు శ్శుద్ధసఙ్కల్పో యోగశక్తిం దదాతు నః॥**

॥ఓమ్ జయ్ గురుదేవ్॥

**-విమలానన్దస్వామి**

ఓం తత్సత్ ఓమ్

## మలిపలుకులు

యోగాభ్యాసవిహీనశ్చే త్కథం జ్ఞానమవాప్నుయాత్ ।
జ్ఞానాభావే కథం మోక్ష స్తస్మాద్యోగం సమభ్యసేత్ ॥

పాతంజలం మహాశాస్త్రం యోగాభ్యాసే సుసాధనమ్ ।
తస్మాత్తత్తు సమభ్యస్య జ్ఞానే యత్నం కురుష్వ భోః ॥

అసంగానంద ఆచార్యో లోకానుగ్రహ కాంక్షయా ।
శాస్త్రస్యాస్యాంధ్రభాషయా మనువాదకారయత్॥

పరిశుద్ధాత్మస్వరూపులగు ప్రియాత్మ బంధువులారా!

''యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువమ్'' యోగము లేని జ్ఞానము మోక్షదాయక మెట్లగును? కానేరదు. ఇది నిశ్చయము అని పెద్దలందురు. కావున ముముక్షువు కొద్దిగనో, గొప్పగనో యోగమునుకూడ సాధించవలసి యుండును. అట్లైనచో దృఢజ్ఞాన సంపన్నుడై కైవల్యమును కరతలామలక మొనరించుకొన గలుగును.

యోగమనగా సమాధియని యర్థము. ''యుజ సమాధౌ'' అనెడి ధాతువువలన యోగశబ్దమునకు సమాధియను నర్థము లభించును. ఇది ద్వివిధము. సంప్రజ్ఞాతసమాధి, అసంప్రజ్ఞాత సమాధి అని దీనిని బేర్కొందురు. ఈ సమాధి చిత్తధర్మము, చిత్తము త్రిగుణాత్మకము. కనుక నీ చిత్తము పంచావస్థలు కలిగి యుండును. 1. క్షిప్తము2. మూఢము 3. విక్షిప్తము 4. ఏకాగ్రము 5. నిరుద్ధము అని వానినందురు.

ఇందులో 1. రజోగుణాధిక్యముచేత శబ్దాది విషయములయందు మిగుల చలించుచుండు చిత్తము క్షిప్తమగును.

2. తమోగుణ విశేషమువలన నిద్రాలస్యాది వృత్తులు ప్రచురముగా గలిగియుండు చిత్తము మూఢమగును.

3. రజస్తమస్సు లీషత్తు గాను, సత్త్వము కించిదధికముగాను గలిగియుండు చిత్తము విక్షిప్తమగును. దీనియందు అప్పుడప్పుడు ధ్యానము సంభవించుచుండును. కనుకనే క్షిప్తముకంటె విశిష్టమై విక్షిప్త మనబరగునని తాత్పర్యము.

4. రజస్తమో మాలిన్యములను బాగుగా దిరస్కరించి శుద్ధసత్త్వసంపన్నమైన చిత్తమేకాగ్ర మగును. దీనియందు సంప్రజ్ఞాత సమాధి సంభవించును.

5. ప్రశాంతించిన సమస్తవృత్తులు కలదియై సంస్కారము మాత్రము శేషించియుండు చిత్తము నిరుద్ధ మగును. ఈ చిత్తమున అసంప్రజ్ఞాత సమాధి సముత్పన్న మగును. ఈవిధముగా మొదటి మూడు భూమికల నతిక్రమించి, మిగిలిన రెండింటితో గూడిన చిత్తమునకు సమాధి ద్వయము ధర్మమగునని గ్రహించవలయును. చిత్తవృత్తి నిరోధము ఆ ద్వివిధ సమాధులకు సాధారణలక్షణ మనియును నెఱుంగవలయును. అందుచేత సమాధి ద్వయము యోగశబ్దమున కర్థమగునని సిద్ధించినది.

ఈసమాధులు సిద్ధించుటకు అభ్యాసవైరాగ్యములు, ఈశ్వర ప్రణిధానము, యమనియమాద్యష్టాంగములు మొదలైనవి సాధనములుగా యోగశాస్త్రమున నిరూపింపబడినవి.

ఈ యోగశాస్త్రకర్త శ్రీపతంజలి మహర్షి. సాంఖ్య శాస్త్రకర్త శ్రీ కపిలమహర్షి. ఈయననే హిరణ్యగర్భుడనియు నందురు. సాంఖ్య శాస్త్రమున పంచవింశతి (25) తత్త్వములు బోధింపబడినవి. ఆ తత్త్వముల నెఱుంగుటకు సదుపాయముల నీ యోగశాస్త్ర ముపదేశించు చున్నది. కావున నీ యోగశాస్త్రము సాంఖ్య శాస్త్రానుసారియైనది. ''అథ యోగానుశాసనమ్'' అనెడి యోగశాస్త్ర ప్రథమ సూత్ర మీయర్థమునే వ్యక్తీకరించుచున్నది.

ఇచట నీ విశేషము కలదు. అనగా శ్రీ కపిలమహర్షి ప్రకృతి పురుషుల నంగీకరించెనే గాని ఈశ్వరు నంగీకరించి యుండలేదు. కనుకనే ఈమహర్షి

మతమును నిరీశ్వరసాంఖ్యమని యందురు. శ్రీపతంజలి మహర్షి **''ఈశ్వరప్రణిధానాద్వా''** ఈశ్వర ప్రణిధానమువలన సమాధి లాభమా సన్నతమ మగును. **''క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః''** అవిద్యాది క్లేశములచేత, మిశ్రామిశ్ర రూప కర్మలచేత, జాత్యా యుర్భోగాది ఫలములచేత సంస్కారముచేత స్పృశింపబడని విశిష్టపురుషు డైన ఈశ్వరు డున్నాడని యంగీకరించెను. కాబట్టి ఈ మహర్షి మతమును సేశ్వర సాంఖ్య మనియు నందురు.

ఈయోగశాస్త్రము సూత్రాత్మకము. నాలుగు పాదములు కలది. 1.యోగ(సమాధి) పాదము, 2.సాధనపాధము, 3.విభూతిపాదము, 4.కైవల్యపాదము అని యీపాదముల నామములు. ప్రథమపాదమున యోగమును (సమాధిని), ద్వితీయపాదమున ఆయోగమునకు సాధనములను, తృతీయపాదమున యోగసాధనల ననుష్ఠించుటలో శ్రద్ధ కలిగించుటకు విభూతులను, చతుర్థమున యోగము అనగా సమాధి వలన గలిగెడి కైవల్యమును నిరూపించిరి. ప్రాసంగికముగా సిద్ధ చిత్తాదులును తెలుపబడినవి.

ఈ యోగశాస్త్ర రచయిత యగు శ్రీపతంజలి మహర్షి మహానుభావుడు. త్రికరణశుద్ధికి సయితము సముచితములగు నుపాయ ముల నుపదేశించిన మహోపదేష్ట. కనుకనే సర్వలోకోపకారియు గాగలిగెను. ఈ మహర్షిపుంగవుడు యోగశాస్త్రముచే చిత్తశుద్ధికి, పద (వ్యాకరణ) శాస్త్రముచే వాక్శుద్ధికి, వైద్యశాస్త్రముచే శరీరశుద్ధికిని బహూత్తమోపాయముల ప్రబోధించెను.''యోగేన చిత్తస్య'' అనెడి యార్యోక్తి యీయర్థమునే చెప్పుచున్నది. ఈమహనీయుని యోగ శాస్త్రమునకు శ్రీ వ్యాసమహర్షి భాష్యకారు డగుచు, ఇది మహో త్కృష్టశాస్త్రము అని దీని గొప్పతనమును చాటియున్నారు. మఱియు దీనికి సంస్కృతవ్యాఖ్యానములు, భాషాంతరీ కరణములు పెక్కులు గలవు. 1945 లో సాహిత్య విద్యా ప్రవీణులగు శ్రీమాన్ తి.కం. తిరువేంగడా

చార్యులవారు 'భాష్యార్థప్రకాశిక' అనెడి పేరుతో ఆంధ్రభాషానువాద మొనర్చిరి. 'తొలిపలుకు' కూడ వ్రాసిరి, ఈగ్రంథమునకు పూజ్యపాదులు, ప్రాతఃస్మరణీయులును నగు శ్రీశ్రీ శ్రీమహర్షి మలయాళ సద్గురు దేవులు పీఠిక వ్రాసియున్నారు. మఱియు వేదాన్తాలంకార, వేదాంత శిరోమణులగు శ్రీమాన్ కొంపెల్ల దక్షిణామూర్తి శాస్త్రుల వారు 'శ్రీపతంజలిమహర్షి జీవిత చరితము'ను వ్రాసియున్నారు. ఇది ప్రథమ ముద్రణ ప్రసంగము.

పూజ్యశ్రీ విమలానంద స్వాములవారు 1972లో ఈ గ్రంథము యొక్క ద్వితీయ ముద్రణమునకు సంస్కరణ మొనర్చి, ప్రాక్కథనమును విరచించి యున్నారు. కాబట్టి మలిపలుకు ఇంతకంటె అధికముగా వ్రాయవలసిన అవసరము లేదు. అయినను ఈ విషయమును గ్రహించుట యావశ్యకమై యున్నది. అనగా చరాచర సుఖాభిలాషులగు శ్రీశ్రీశ్రీ మలయాళ సద్గురు స్వాములవారు సర్వముముక్షు జనోపయోగార్థమై యీపాతంజల యోగశాస్త్రమును వ్యాసభాష్యాను సారముగా నాంధ్రీకరింప జేసిరి. అచ్చు వేయించిరి. యోగవాసిష్ఠాది మహాగ్రంథములను సయితము తెలుగున ననువదింపజేసిరి. ముద్రణ చేయించిరి. మఱియు శ్రీవారు లోకోపకారకములగు కార్యముల నెన్నిటినో జేసిరి. ఉదారచరితులు వసుధైకకుటుంబకులు గదా! అస్తు,

ముముక్షువు లీగ్రంథమును పఠించి, గ్రహించి, చిత్తభూమికలైన క్షిప్త, మూఢ, విక్షిప్తముల దూరీకరించి, ఏకాగ్ర, నిరోధముల సంపాదించి, విచారణచేత దృఢాపరోక్ష బ్రహ్మాత్మైక్య విజ్ఞానసంపన్నులై, జీవన్ముక్తిని బొంది, బ్రహ్మానందముతో విరాజిల్లుదురు గాక!

ఓం లోకాస్సమస్తా స్సుఖినో భవంతు

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

ఓం తత్సత్. ఓమ్.

-విద్యానన్దస్వామి.

# చతుర్థ ముద్రణ నివేదన

ఈనాడు యోగదార్శనిక ప్రాముఖ్యాన్ని ప్రపంచమంతా గుర్తించింది. మానవ సమాజం సకల విధాలా సమున్నతిని పొందాలంటె యోగసాధన అత్యవసరమని అందరూ గుర్తించారు.

భారతావనిలో షడ్దర్శనాలలో ఒకటిగా ప్రసిద్ధి చెందిన యోగదర్శనానికి మన ప్రాచీనులు ఎంతో ప్రాముఖ్యం ఇచ్చి వున్నారు.

మనకు లభించిన యోగశాస్త్రములలో పతంజలి మహర్షి రచించిన యోగదర్శనం అగ్రగణ్యమై ఉన్నది. దీనికి అనేక భాష్యాలు ప్రాచీన కాలంలోనె రచించబడ్డాయి. కాని తెలుగులో సమగ్రమైన వివరణ 1946 వరకు వెలువడలేదు.

శుష్కవేదాంత తమోభాస్కరులు, యోగవాసిష్ఠాది బహుగ్రంథ ప్రకాశకులు, శ్రీవ్యాసాశ్రమ స్థాపకులు మహర్షి సద్గురు శ్రీమలయాళ స్వాములవారు, పతంజలి యోగసూత్రాలకు పదవిభాగ, ప్రతిపదార్థ తాత్పర్య, విశేషార్థాలతో కూడిన "భాష్యార్థ ప్రకాశిక" అను వివరణను విద్యాప్రవీణ తిరు కం. తిరువేంగడాచార్యుల వారిచే వ్రాయించి 1946 లో మొదటిసారిగా శ్రీవ్యాసాశ్రమం తరపున ప్రచురింపజేశారు. 1976 లోను, 1991లోను ఇది ద్వితీయ తృతీయ ముద్రణలందుకొన్నది. ఇటీవల దుర్లభంగా ఉండిన ఈ గ్రంథాన్ని ఇపుడు చతుర్థ ముద్రణగా ప్రకటించడం జరిగింది. ఈ గ్రంథములో యోగదర్శనానికి సంబంధించిన పలు విషయములు ఇందలి పలువురి పీఠికలలో విస్తారంగా నిర్దేశించబడి వున్నాయి. 2001 మార్చిలో జరిగిన శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సందర్భంగా పదివేల పుటలకు విస్తరించిన శ్రీమలయాళ సద్గురు గ్రంథావళిని 20 సంపుటాలుగా ప్రకటించడమైనది.

మరియు బహుకాలము నుండి దుర్లభంగా నుండిన శంకరానందీయము, పాతంజల యోగదర్శనం, గురుగీత, తత్త్వాను సంధానం,

ఆత్మపురాణం మున్నగు గ్రంథాలనుగూడ ముద్రించి ప్రకటించడానికి నిర్ణయం జరిగింది. ఈ గ్రంథాలన్నీ వెలువడనున్నాయి.

పాఠకులు ఎప్పటియట్లే శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న గ్రంథాలపట్ల ఆదరణ చూపి భగవత్కారుణకు శ్రీసద్గురు కృపకు పాత్రులై ఆధ్యాత్మిక విద్యావ్యాప్తికి తోడ్పడగలరని ఆశిస్తున్నాము.

శ్రీవ్యాసాశ్రమము ప్రకాశకులు
25-5-2001



ఓమ్

# శ్రీపతంజలి మహర్షి జీవిత చరిత్రము

ధర్మార్థకామ మోక్షములను చతుర్విధ పురుషార్థములలో నంతిమ పురుషార్థమే ప్రాణులకు ముఖ్యలక్ష్యము, ''న స పునరావర్తతే'' ఇతి శ్రుతేః. పామరులు సైతమట్లు సేయుట పుణ్యమా? పురుషార్థమా? యనుట జూడ నదియే జీవితమునకు ముఖ్యలక్ష్య మనుట నిస్సంశయము. ఆత్మజ్ఞానమే తల్లాభమున కైకైకసాధన మని ''తమేవ విదిత్వాఽతిమృత్యు మేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ'' అను ప్రమాణరాజ ముపదేశించు టయే కాక వేరొండు మార్గము లేదని నొక్కి-వక్కాణించుచున్నది. దయా మూర్తులనేకు లాయా కాలముల యందవతరించి పైజెప్పిన తురీయ పురుషార్థముయొక్క సర్వాతిశాయిత్వమును తత్సాధనమునుపలువిధ ముల వెల్లడించి చనిరి. ఆదిశేషుడీభువనమున శ్రీ'పతంజలి' యను పేర నావిర్భ వించి త్రివిధ సంతాపతప్తు లగు జీవుల నుద్ధరింప బూని కాయిక వాచిక మానసముల నిర్మాలిన్యమునకై వైద్య వ్యాకరణ యోగ శాస్త్రములను బ్రవర్తింపజేసెను. అందుల కీక్రింది

**యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్య చ వైద్యకేన ।**
**యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజం ప్రాంజలి రానతోఽస్మి ॥**

అను విద్వద్వదనముల విరాజిల్లు పద్యమొక యాధారము.

### -:ముని ప్రవర పతంజలి కృతి:-

యోగసూత్రములు, మహాభాష్యము, చరక (ప్రతిసంస్కృతం), పరమార్థసారమను గ్రంథచతుష్టయము మాత్రమే మనకిపుడు లభ్యమైనదని విద్వాంసుల విశ్వాసము. మహాభాష్యకర్త యగు పతంజలికన్న వేరొక పతంజలి యోగసూత్రమును రచించెననియు, పరమార్థసార మర్వాచీన మనియు గూడ వేరొక కొందరి యాశయము. తత్త్వనిర్ణయ మెల్లవేళల నవికంప్యము. ప్రమాణము లర్థానిని దెలియ సాధనములు, ప్రమాణమని యంగీకరించు దానిలో నర్ధజరతీ న్యాయము తగదు.

## -: రామభద్రదీక్షితకృత పతంజలి చరితము: -

ఈ కావ్యమెనిమిది సర్గములతో నలరారుచున్నది. అందొక్కొక్క శ్లోకమును మిక్కిలి రసవంతమై కాళిదాసాది మహాకవుల రచనా మాధుర్య మున కావంతయు దీసిపోక బుధజనుల మనముల నానందతరంగముల నోలలాడించు చున్నది.

అందలి కథాసారము:- శేషశయనుం డొకానొక సమయమున భరింపరాని భారమగుటచే నాదిశేషుడు చలించ నంత నారాయణుండు యోగనిద్రనుండి మేల్కాంచుటయు, నాదిశేషుని సందియమును బాపుటకై నిశ్వాసగతిని నిరోధించి తాను యోగమున నటరాజ నటనమును జూచుటయుం జెప్పెను. కన్నులపండువుగ చెప్పిన దంతయు విని శేషుం డద్దానిని జూడ నాతని యనుజ్ఞ వేడెను. అందుల కాతడు పాణిని చంద్రచూడునికై తపమాచరించి తదనుగ్రహ మున నాతని డమరుశబ్ద మూలమున వ్యాకరణ శాస్త్రమూలములగు సూత్రములను రచించు టయు, నా సూత్రములకు బిమ్మట కాత్యాయనుడు పరమేశ్వరాను గ్రహముననే వార్తికములను వ్రాయుటయు జెప్పి యా తరుణేందుమౌళి విద్వజ్జన దుర్గ్రాహములగు నావార్తికములకు భాష్యమును వ్రాయ నాదిశేషు నాజ్ఞాపించు ననియు నక్కాలమున శేషునికోర్కె లీడేరుననియు దెలియంజెప్పెను. శేషుండును చిరకాలమున కాయదృష్టమాసన్న మగుట గోణిక యను మునికన్య పుత్రార్థినియై తపమాచరించుచు నొకనాడు సహస్రకిరణునికై తానర్ఘ్య మంజలి నిడి -

**ప్రాజ్ఞ మర్పయ సుతం మమ భాస్వన్నంతరిక్ష మభిసంధి జుషోఽస్యాః।**
**పన్నగాధిపతి రర్కనియుక్తః ప్రావిశజ్జనితు మంజలి గర్భమ్ ॥**

అనుచు వేడునంత నంజలిం బ్రవేశించి యామెయు నర్ఘ్యము నాదిత్యునకు విడువ నంత తాపసాకృతియై గన్పట్టె, అందున గదా! పతంజలియనుపే రాతనికి యన్వర్థ మాయెను. అంత గొంత కాలమున కాపతంజలి ముని జనోచితము లగు ఫలమూలపర్ణములను సైత మాశింపక పూర్వజన్మ వాసనోయన మారుతమాత్ర భక్షుండై చంద్రచూడుని కరుణా ఘటనార్థమగు దారుణ తపమాచరింప నాదిదేవుండును కైలాస గౌరవృషవాహనుండై గౌరీ సహితముగ నావిర్భవించెను.

పతంజలియు నాతని నృత్యమును జూచు భాగ్యముతో భాష్యరచనా చాతుర్యమును తన్మూలమున వడసెను. పిమ్మట నటరాజ నృత్యమును చూచువేడ్క చిదంబరమున కేగి నటనమును జూచి పరమా నందమును బొందెను. అంత నాతని భాష్యరచనా రసాయనమును గ్రోల విద్వత్సహస్రంబు లాతని సేవను జేయజొచ్చిరి. గురుశిష్యుల నడుమ నొక తెర నిల్పి అద్దానిం దొలగించి జూచువానికి శుభంబు లేదు అని శాసించి తాను సహస్రవదనుండై ప్రవచనము నుపక్రమించెను.

ఇట్లుండ నొకనా డావిద్వచ్ఛిష్యులు ఇందరి సందియముల నేకకాలమున బాపుట కీతం డెన్ని వదనముల విరాజిల్లు చుండునో? యని సందియమంది తెరను వైదొలగించుటయు నాక్షణమ శిష్యగణమెల్ల ముక్కంటి నిటలాక్షి లక్షితుడగు రతీపతికి సదృశగాత్రులైరి. ఆహా! ఎట్టివారికిని గురువచనా తిక్రమణ మనర్థమే గద? ఫణిపతియు నిట్లగుట కాశ్చర్యము నొందుచుండ నొక శిష్యుడేతెంచి జలమోచనమునకు దానేగ సహపాఠు లీయపరాధమున నిట్లగుటకు జింతయు భీతియు నొంది మునిప్రవరుని రక్షింపుమని బ్రణమిల్లి వేడికొనిరి. మునిప్రవరుడును భాష్యపాఠమున కుత్తరశాంతి లేకయే బహిర్గతు డగుటకు కోపించి రాక్షసుడవు గమ్ము అని శపించెను. ప్రణమిల్లి పలువిధముల వేడ బ్రసన్నుడై 'పచ్' ధాతువునకు నిష్ఠాప్రత్యయమున 'పక్వ'మని రూపము జెప్పువాని కీ శాస్త్రమును జెప్పిన శాపము దీరుననెను.

ఈరాక్షసుడొక వటము నాశ్రయించి పై ప్రశ్నము నడుగుచు దప్పుసెప్పువారలనెల్ల దిగమ్రింగుచునుండె. ఒకనాడుజ్జయినీ సమీపమున నుండి చంద్రగుప్తుడను విప్రుడొక డేతెంచి పక్వం అని రూపమును జెప్పి నిద్రాహారములను వీడి రక్షోమూలమున రెండుమాసము లహోరాత్రము లీఫణి భాష్యమును జదివెను. నిజపురమునకు మరలి మధ్యేమార్గమున రెండు మాసములు నిద్రాహారములు లేకుండుట నలసి సింధునదీ తీరము శ్రమాపహోర్హములగు మందమారుతము లీన నిర్మలనీరముల గ్రోలి యాతటమందొక వృక్షమూలమును జేరి నిద్రించెను.

చంద్రగుప్తుడు నిద్ర మేల్కాంచి క్షుధార్తుడై యుండదురీయవర్ణ సంభవ

యగు నొకపడుచు, పీయూషపాత్ర హస్త యగు నాదిమోహిని యన నొప్పుచు, నవనీత పాత్రము నొక దానిం దెచ్చి యావిప్రుని ముందిడి ''బుధేంద్ర! ఫలోదక దర్భాజినబర్హిషములచే నేజేయు సేవకు తపోధను లనేకులు మిక్కిలి ముదమంది పతంజలి శిష్యుడగు రాక్షసుని మూలమున నాభాష్య మును జదివి విప్రుడొకడిట కే తెంచును. అతడు స్వయముగ బతంజలియే. పామ్మాతనికై వేచి బూజింపుము. ఆతడు బెండ్లియాడి నిన్నున్నత శ్రేయమున నొనగూర్చును అని పలికిరి. అమ్మహనీయుడవు నీవై యుండనోపుదేని నవనీత మారగింపు'' మనెను. చంద్రగుప్తుడును ముందుగ ద్రివర్ణకన్యకలం బెండ్లియాడి పిమ్మట నీమెను బెండ్లియాడుదు నని యట్లే చేసెను.

చంద్రగుప్తుడు కాలక్రమమున ఆనల్పవర భార్యలయందును గ్రమమున వరరుచి, విక్రమార్క, భట్టి, భర్తృహరి యను నలువుర సుతు లను బడసెను. విక్రమార్కుడు దక్క దక్కిన మువ్వురును ఇతర శాస్త్ర ముల యందేగాక ముఖ్యముగ వ్యాకరణ శాస్త్రమున బ్రధాన గ్రంథకర్త లగుట నా చంద్రగుప్తు డాదిశేషుని యవతారమై యుండుటయు దన్మూలముననే వ్యాకరణ శాస్త్రము వ్యాప్తిచెందె ననుటయు నిస్సంశయము.

యోగసూత్రములు వీటిని రచించిన పతంజలి మహాభాష్యకర్త యగు పతంజలికన్న భిన్నుడని కొందరు సందియ మొందుదురే గాని వేరని వెలువరచుట వార లొక్కరే యను నంతటి సులభము మాత్రము గాదు. ఏది ఎట్లున్నను, కాకదంత పరిశీలనమువలె గాక నీ పరిశీలన నిర్ణయములు సత్ప్రయోజనములైననే ముదావహము. ముక్తి మానవజీవితమునకు ముఖ్య లక్ష్యమని గదా ముఖబంధముననే వెలువరించితిని. తత్స్వరూపసాధనముల నాయాశాస్త్రకర్తలు తాము నమ్మినరీతుల జ్ఞానమే సాధనమని కొందరు, కర్మమే యని మరికొందరు, రెండును అని వేరొక కొందరు, (అందాముఖ్య లక్ష్యమును జేరనీయోగమొక శుద్ధమార్గము) వేరువేర వర్ణించుచు తత్స్వరూపమును సైతము అట్లే యానందమని గొందరందురు. దుఃఖము లేశమైన నందు లేదందురు. కొందరు పాషాణాదితుల్యముగ చైతన్యము లేకుండుట యని గూడజెప్పుదురు. వేదాన్తములు ముక్తిని తత్సాధనములను వర్ణింప నావిర్భవించినవి. పురాణముల కన్న నవి యెక్కుడు ప్రమాణములు కావుననే శ్రీమచ్ఛంకరభగవత్పాదులు తమ

సిద్ధాన్తములను బలపరచుటకు వేదాన్తముల నుదాహరించుటయే కాక తద్విరుద్ధములగు స్మృతులను ప్రమాణములను నిరాకరింతురు. భగవత్పాదులే కాదు మరెవ్వరైనను అపౌరుషేయులని నమ్మిన వేదములకన్న పౌరుషేయములగు స్మృతులు ప్రమాణము లనజాలరు. అట్లనుట చెల్లదు. ఆ వేదాన్తము లద్వైతమునే పరమ తాత్పర్యమున వర్ణించునని యద్వైతులును, ద్వైతమునే వర్ణించునని ద్వైతులును, తమతమ మతానుగుణముగ వాదోపవాదముల సల్పుచు నావేదాన్తార్థములను సంగ్రహించి సూత్రించిన వ్యాసునిసైత మద్వైతి యనియు, ద్వైతియనియు, జెప్పుదురు.

అద్వైతజ్ఞాన మనునది.

**"నాయమాత్మా ప్రవచనేన లభ్యః న మేధయా న బహుధా శ్రుతేన,**
**యమేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వృణుతే తనూం స్వాం".**

**"ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా."**

యను శ్రుతి స్మృత్యాదులు బహుజన్మసముపార్జిత పుణ్యసంపద గలుగ నీశ్వర ప్రసాదముననే సిద్ధించు ననుటయే కాక.

**గౌతమస్యమునేః శాపాద్దధీచిమునిశాపతః।**
**పూర్వజన్మకృతాత్పాపదయమర్థో న రోచతే ॥**

**మహాపాపవతాం నృణాం పరమాద్వైతవేదనే।**
**ప్రద్వేషో జాయతే సాక్షాద్వేదజన్యే శివే ఽపి చ ॥**

అను సూతసంహిత ద్వేషోదయమును సైతము చాటుచున్నది.

ద్వైతాద్వైతవాదులు తమతమ యభిమతమే వ్యాసుని తాత్పర్య మనుటను విశ్వసించుటకన్న నుభయవాదులకును మధ్యస్థులన దగు కపిల కణాద గౌతమ జైమిన్యాది తంత్రమూలమున నాతని తాత్పర్యము నిర్ణయించుట సులభసాధ్యమేకాక దృఢతర విశ్వాసార్హము, ప్రమాణ తరమునై యొప్పును. **"విప్రతిపత్తౌ సాక్షినిమిత్తా సత్యవ్యవస్థా"** అనిగదా పెద్దల నానుడి. పై తంత్రములు తమతమ మతముల నిరూపించుటకై పరమత నిరాకరణము జేయునెడ నద్వైతమే వ్యాసుని తాత్పర్యమని నిర్ణయించి యనువదించుట మన కిప్పట్టున

మిక్కిలి యుూత. వ్యాసమహర్షి తన వేదాన్త సూత్రణ సందర్భమున **''రచనానుపపత్తే శ్చ నానుమానం''** అని సాంఖ్యమును నిరాకరించిన యట్లే కపిలాదులును తమ పోకడలయం దీవ్యాసుని యాశయమును నిరాకరించి రనుటకును, తన్మూలమున కృష్ణద్వైపాయనుని తాత్పర్య మద్వైతమని నిర్ణయించుట కును, నే బేర్కొను క్రింది తార్కాణములు ముఖ్యాధారములు. సాంఖ్యసూత్రమున బంచమాధ్యాయము పరమత నిరాకరణకై వెలు వడెను.

అందు:-**''నావిద్యాశక్తియోగో నిస్సంగస్య'' ''తద్యోగే తత్సిద్ధా వన్యోన్యాశ్రయత్వం'', '' విద్యాతోఽన్యత్వే బ్రహ్మ బాధప్రసంగః'', ''అబాధే నైష్ఫల్యం,'' విద్యాబాధ్యత్వే జగతోప్యేవం''** అను సూత్రములచే నద్వైతవాదుల సిద్ధాన్తములను ఖండించెను. ఇంతియగాక **''నానిర్వచనీయస్య తదభావాత్''** అని వారల యనిర్వచనీయ ఖ్యాతిని నిరాకరించుచు దా స్వయముగ నిజమత మున సదసద్ఖ్యాతిని నిర్ణయించు కొనెను.**''నానాత్మనాపి ప్రత్యక్షబాధాత్''** అను జీవనానాత్వ మును వాక్రుచ్చుచు **'నాత్మవిద్యా నోభయం జగదుపాదాన కారణం నిస్సంగత్వాత్''** అని యద్వైతుల జగత్కారణతా వాదములను దుత్తు నియలజేసి **''నైకస్యానంద చిద్రూపత్వే ద్వయోర్భేదాత్, దుఃఖనివృత్తేః గౌణః, విముక్తి ప్రశంసా మందానాం''** అని ముక్తిస్వరూపము దుఃఖనివృత్తియేకాని సుఖలేశము సైతమందు లేదని త్రోసిపుచ్చెను. షష్ఠాధ్యాయమునగూడ నీముక్తి స్వరూపమునే వర్ణించుచు

**''యథా దుఃఖాత్క్లేశః పురుషస్య న తథాసుఖాదభిలాషః ।**
**సుఖలాభాభావాద పురుషార్థమితిచేన్న ద్వైవిధ్యాత్ ॥''**

అని నిజమత పరిశుద్ధికై యద్వైతుల నూతగ నిడి యడుగుల నిడ బ్రాకులాడెను. ప్రథమాధ్యాయమున **''నావిద్యాతోప్యవస్తునా బంధా భావాత్, వస్తుత్వే సిద్ధాన్తహానిః విజయతే యద్వైతాపత్తిశ్చ''** అను సూత్రములు పైజెప్పిన పంచమాధ్యాయ వాదములకు దోడు నీడలై యుండును.

ఈ సాంఖ్యులమతమున దుఃఖనివృత్తి మాత్రమే మోక్షమనుట దెలియమి, బ్రహ్మవిద్యచే సంపాద్యమాన సుఖవిశేషము వారల మోక్షమని కొందరందురు. అది చింత్యము. ఇట వ్యాసశబ్దము లేకుండుటచే నీయద్వైత

మతమని తాత్పర్యము కాదన్న **'నీక్షతేర్నా శబ్దః'** మను వ్యాస సూత్రమున సైతము కపిలప్రత్యభిజ్ఞ లేదనుటకు తన్మత నిరాకరణ తత్పరులగు ద్వైత విశిష్టాద్వైత వాదు లేమని బదులిడ సాహసింతురు! పైన జూపిన ప్రకరణమున వ్యాసశబ్దము లేకున్నను **''అత ఏవచోపమా సూర్యకాదివత్ ఆభాస ఏవ చ''** అను వ్యాసోపజ్ఞమై యతని తాత్పర్య మనదగు నౌపాధికభేదమే కపిలసూత్రమున బేర్కొనబడిన దనుట సమంజసము, ఇట్లే **''నాత్మావిద్యా నోభయం''** అను సూత్రమునగూడ గపిలుడు **''జన్మాద్యస్య యతః'', ''ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తానుపరోధాత్''** అని వ్యాససూత్రమున గోచరమగు జగజ్జన్మాది హేతుత్వమే నిరాకరించె ననవలెను.

ఇట్టి యద్వైతవాద మొకటి యుండునని తలచి కపిలుడు నిరాకరించె ననుటయు **''వస్తుత్వే సిద్ధాన్తహానిః''**అనుచు సిద్ధాన్తము నొకదానిని దూషించు కపిలుని పలుకుల కెంతయో యుక్తిదూరము. పురాణప్రసిద్ధ మన్న నద్వైతము సకలపురాణ సమ్మత మగుటయే గాక, గౌతమాది సూత్రకారుల మతమును నిరాకరించు ప్రకరణమున పురాణాదిసిద్ధ నిరాకరణమును గల్పింప నది కపిలునికి లేక కల్పకులకు యజ్ఞత్వమును సమకూర్చును. ఇంతియకాక, భావిశంకర భాష్యము నూహించి నిరాకరించెనన్న వ్యాసతాత్పర్యమునకై బద్ధకంకణులై యత్నించు వారిలో మిన్నయని శంకరుని మతమును ఖండింప నదియే వ్యాసుని తాత్పర్యమై యొప్పును. ఆశ్మరథ్య, కాశకృత్స్నాదు లనేకు లక్కాలమున వేదాన్తముల నేకదేశవాదులుండిరి. ప్రధానమల్ల నిబర్హణ న్యాయమున గపిలుడు వేదాన్త ప్రవర్తకుడగు వ్యాసుని మతమునే నిరాకరింపవలెను. కాని ఏకదేశుల మతము కాదు. ఇత్తరి వ్యాసుడు సైతము ''ఈక్షతేర్నా శబ్దం రచనానుపపత్తేశ్చ నానుమానం'' అనుచు సాంఖ్యైకదేశులగు సనందనాదుల మతములనే నిరాకరించె ననుటనెల్ల భాష్యకర్త లైకకంఠ్యులై ఎదిరి పోరాడుదురు. అట్లయ్యును వ్యాసమతమని నిరాకృతమైన కపిలాచార్యుని మతమం దేక మగును. లేక అప్రతిష్ఠిత మగును. రెండును సంభావ్యములు కావు. కణాదగౌతమాదులు వ్యాసుని తమ సూత్రముల యందెచ్చటను భేదవాదిగ నెంచకుండుటయు నత డద్వైతి యనుటకు మఱియొక యూత.

ఇంతయేల? అనిరుద్ధు డాకపిలసూత్రములను వినుచు ''ఏక ఆత్మేతి వేదాన్తినః'' అని మొదలిడి

''నిత్యః సర్వత్ర గోహ్యాత్మా కూటస్థో దోషవర్జితః।
ఏకస్సభిద్యతే భ్రాన్త్యా మాయయా న స్వభావతః॥''

అను సూతసంహితా వచనోపష్టంభకముగ నద్వైతము వేదాన్త్యభిమత మనెను. **''నానిర్వచనీయస్య''** అను సూత్రముచు వేదాంతమత నిరాకరణ పర మనెను. ఇట్లే యితరుల సూత్రములుగూడ వ్యాసుని తాత్పర్య నిర్ణయమున మిక్కిలి చేయూత నిచ్చును. గ్రంథవిస్తరమునకు భీతిల్లి వాటి నిందు బొందుబరుపక ప్రకృతము ననుసరింతును.

ఈ వ్యాసుని తాత్పర్యమగు నద్వైతమునకే కొద్ది మార్పుల మూలముననో యోగమత మనబర్గెను. పరమార్థమును జూడ నదియు నీ యద్వైతమును జేరుటకొక శుద్ధమార్గమై యుండనోపునని నా దృఢమైన తలంపు. సేశ్వరసాంఖ్యమే యోగమని పెద్దల యాశయము. కావున నీ యోగమార్గాభివృద్ధి సాంఖ్యమార్గవ్యాప్తికి బిమ్మటనే యైయుండనోపును.

ఈ పతంజలి యోగమార్గమున నాలుగు పాదములు. ఆదిమమును సమాధి పాదమందురు. యోగపాదమనియు నందురు. **''అథ యోగానుశాసనం''** అను ప్రతిజ్ఞాముఖముననే **''తాం యోగ మితి మనయన్తే స్థిరామింద్రియధారణాం''** అని వేదాన్త సిద్ధమగు యోగమును దాననుసరించి శాసింతుననెను. ప్రతిజ్ఞాతార్థమగు యోగమును జదువరుల సౌకర్యమునకై ముందుగ **''యోగశ్చిత్తవృత్తినిరోధః''** అని గుర్తించి, యోగచిత్తవృత్తులను గ్రమముగ విశదీకరింప నెంచి యోగవేళలయందు ద్రష్టస్వరూపుడై యుండునని చెప్పి, చిత్త వృత్తుల స్వరూపము దెలియక తన్నిరోధ మశక్యమని తలచి వృత్తుల విశదీకరించి, తన్నిరోధ మభ్యాస వైరాగ్యసాధ్యమనెను. వృత్త్యుద్భవములు లేక చిత్తము స్వరూపనిష్ఠ మగుట స్థితి యనబడును. అట్టి స్థితియందు మనమును నిలుపుట యభ్యాస మనబడును. ఇహలౌకిక పారలౌకిక సుఖములు పరిణామ నిరసము లగుట దెలిసి తద్వశ్యుడు గాకుండుట వైరాగ్య మనబడును.

ఈ యభ్యాస వైరాగ్యములు చిత్తవృత్తి నిరోధోపాయము లనుచు గ్రమముగ సంప్రజ్ఞాత యసంప్రజ్ఞాత మను భేదముచే నా యోగము రెండు విధములనెను. ఈ యంశమును గదా శంకర భగవత్పాదులు సగుణనిర్గుణో

పాసనములని పలుమారులాధికారిక దమున వెల్లడించిరి. ఆ యోగమునకు సుగమోపాయమును వెల్లడింప ''నీశ్వర ప్రణిధానాద్వా'' అని సూత్రించుచు బతంజలి, ప్రధానము పురుషుడుదక్క వేఱుగ నీశ్వరుడే లేడను సాంఖ్యులకన్న నుత్తమశ్రేణియం దొక్క సోపానము నధిష్ఠించెను. ఇంతియకాక నిహలోకమున మనుజులెల్ల సంపదలనొందియు నుదర్కశ్రేయము నొందుటకు తామే గుణసంపత్తి లేక సాధారణముగ మానవశబ్దమునకే యనర్హు లగుదురో (Cultural Unity) అట్టి గుణ సంపద్రత్నమును **''మైత్రీకరుణా ముదితోపేక్షాణాం సుఖ దుఃఖ పుణ్యాపుణ్య విషయాణాం భావనాతః చిత్తప్రసాదనం''** అనుచు నీ యోగసూత్రమున గ్రుచ్చుట నెల్లప్రాణులును ముఖ్యముగ గమనింపదగినది (దీనిని పరికర్మ యందురు). ఉపాయపరం పరను చిత్తవృత్తి నిరోధమునకై యుపదేశించి సబీజపూర్వకముగ నిర్బీజసమాధిని వెల్లడించుటతో నీ పాదము ముగిసెను.

## ద్వితీయపాదము

''**తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియాయోగః**'' అని వ్యుత్థిత చిత్తునికి సైతము యోగసాత్మ్యమునకై క్రియాయోగమును జూపుటతో నీ పాద ముదయించెను. ప్రణవాది జపము, చాంద్రాయణాది తపము, ఫల నిరపేక్షముగ దాజేయు నెల్లకర్మల నీశ్వరార్పణము జేయుట క్రియా యోగ మనబడును. ఈ క్రియాయోగము అవిద్యాస్మితారాగ ద్వేషాభినివేశములను క్లేశములను తమ కార్యకరణా సమర్థములుగ జేయును. అవిద్యను బతంజలి **''అనిత్యా శుచిదుఃఖానాత్మసు నిత్యశుచి సుఖాత్మ ఖ్యాతిరవిద్యా''** యని గుర్తించెను. దీనినే **'పరత్రపరావభాస'** మనియును సకలసంసార నిదాన మనియును భగవత్పాదులు నుడివిరి. ఇట్లే క్లేశాన్తరములను సైతము నిర్దేశించి వాని కీయవిద్యా మూలత్వమును జెప్పెను. ''**ద్రష్టాదృశిమాత్రః శుద్ధోఽపి ప్రత్యయానుపశ్యః**'' అని సూత్రించుటచే బుద్ధిసాన్నిధ్యముననే పురుషునికి ద్రష్టృత్వముగాని యథార్థమున గాదనుటయు నతనికి సమ్మత మనియే మనమూహింపనగును. ఇంతియగాక **'కృతార్థం ప్రతినష్టమపి తదనష్టమన్య సాధారణత్వాత్'** అనుటచే బురుషు లనేకులని యతని యాశయము. ఈ యనేకత్వము కల్పితమా? యకల్పితమా? యని వ్యాసుడు తన సూత్రములను విమర్శించి నిర్ణయించెను.

అష్టాంగముల నాదిమమగు యమమహింసాది భేదమున నైదు విధములు. తత్ప్రతిపక్షులైన హింసాదులును నైదన బరగును. యోగి ప్రతిపక్ష భావనచే నహింసా ప్రతిష్ఠ నొందిన నతని సాన్నిధ్యబలమున సహజవైరులు సైతము వైరత్యాగము నొందుదురు. దీనిని గద మహాత్ముడు బద్ధకంకణుడై యుపదేశించును. యుక్తకాలములేక ఏదియు సిద్ధినొందదు. కావుననే నైయాయికులు కాలేశ్వరాదృష్టాదులు సాధారణ కారణము లనిరి. అక్కాల మిప్పట్టిన గూడుట భద్రతా సంఘములు సైతమాసంస్కృతిని గోరుచుండిరి. ఆహా! మనపూర్వుల విజ్ఞాన వైశారద్య మద్దానిని శతాబ్దములకు పూర్వమే కనుగొని యుపదేశించిరి. సత్యాదులను గూడ విశదీకరించి చెప్పి యందలి సుఖము నభ్యసించువాని సుఖమున **''సంతోషాదనుత్తమః సుఖలాభః''** అనుచు వైషయి కానందము శతాంశమైన గాదనెను. ఇట్లే క్రమమున ఆసన ప్రాణాయామ ప్రత్యాహారముల స్వరూపమును, తదభ్యాస ఫలములను విశదముగ నీ పాదమున వెల్లడించెను. ఈ సూత్రానువాదకులును ఆయా స్థలముల నాయా యంశముల దేటదెల్ల మొనర్చిరి. కాన చదువరు లటనుండియే వాని నెఱుగనగును.

## తృతీయపాదము

పూర్వపాదమం దవశిష్టమగు ధారణాద్యంగత్రయమునకు స్వరూపమును నిరూపించి సంయమమని పేరిడెను. ఈయంగత్రయము సైతము సంప్రజ్ఞాతమునకు బహిరంగమే యనెను. ఈ సంయమ విషయమును బరిశుద్ధిజేసి తెలుపగోరి నిరోధ సమాధి ఏకాగ్రతా పరిణామములను వర్ణించెను. ఆ పరిణామత్రయమున సంయమము నభ్యసింప నుదయించు సిద్ధులను బేర్కొని పిమ్మట పరికర్మ నిష్పన్నములగు సిద్ధులను అట్లే బాహ్యసిద్ధులను జెప్పి యాంతరసిద్ధులను సైతము విశేషముగ నాదేశించి వానినెల్ల నేకమూలికా ప్రయోగమున వ్యుత్థితునకు సిద్ధులయ్యును, సమాధికిమాత్ర మంతరాయము లనెను. క్రమమున భూతేంద్రియ మనోజయములను జెప్పి పూర్వపూర్వ భూమికలను ధరించి యుత్తరములను జేరుటలో **''తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యం''** అనుచు కైవల్యమే పరమావధి యనెను. సమాధి ప్రతిష్ఠ నొందుటకై **''స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణం పున రనిష్ట ప్రసంగాత్''**

అనుచు దేవతలు విషయముల యందాశలు జూప నందు సంగముగాని స్మయముగాని చేయకునికి తరుపాయ మనెను. అంతిమభూమిక యం దుదయ మొందు వివేక జ్ఞానము సాధకుని యగాధ సంసారబంధమునుండి తరింప జేయును గాన నది తారక మనబడును. సత్త్వమునకు సర్వకర్తృత్వాభి మానము నశించుటయు బురుషునికి భోగ్యము లేకుండుటయు శుద్ధి యనబడును. **''సత్త్వ పురుషయోః శుద్ధిసామ్యే కైవల్యం''** దానినే కైవల్య మందు రనుచు నీపాదము ముగిసెను.

## చతుర్థపాదము

కైవల్యనిరూపణకై దీని నుపక్రమించెను. పూర్వపాదమందలి పరిశిష్టాంశములను సైతము **''జన్మౌషధిమంత్రతపః సమాధిజాస్సిద్ధయః''** అని సిద్ధిహేతువులను దెలిపెను. **'భోగేనత్వితరే క్షపయిత్వా సంపద్యతే'** అని వేదాన్తులవలెనే ప్రారబ్ధ మనుభవైకనాశ్యమని యోగులు సైతమందురు గాననే యోగి తన ప్రాభవమున ననేక శరీరములను సృజించునో వానికి **'నిర్మాణచిత్తాన్యస్మితామాత్రాత్'** అనుచు నాకాయములందలి చిత్తములకు మూలకారణమగు నస్మితామాత్రముననే పరిణతిని దెలిపెను. సిద్ధిజన్మాది పంచకమూలము గాన దన్మూలమగు చిత్తముగూడ నైదు విధములు. యోగుల చిత్తమువలెనే కర్మలును విలక్షణము లనెను. ఫలమును దెలుపు నవసరమున

> **''పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతి ప్రసవః**
> **కైవల్యం స్వరూపప్రతిష్ఠా వా చితిశక్తే రితి''**

అనుట జూడ యోగులుగూడ సాంఖ్యులవలెనే పురుషుడు చిన్మాత్రుడే కాని యానంద రూపుడు గాడనియును ప్రధానమునకుగాని పురుషునికిగాని మోక్ష మనియును తలంతురని సులభముగ దెలియ నగును.

నాకర్తవ్యము నందిట సహృదయులగు చదువరులకు బరమార్థ సారమును బరిచితిజేయుట మాత్రమే యవశిష్టమై యున్నది. దాన నాకర్తవ్యమును, జదువరుల జిజ్ఞాసయుం దీరును.

## : పరమార్థసారము :

దీనిని పతంజలికర్తృకము కాదని కొందరందురు. అంతియకాక అర్వాచీన మందురు. దీనికి రాఘవానందుడు వివరణ మను టీకను రచించెను. సూర్యనారాయణ శుక్లకృతమగు టీకయు వేరొండు కలదు. ఇది యర్వాచీనము. గ్రంథాన్తమున

**'వేదాన్త శాస్త్రమఖిలం విలోక్యజగదాధారః ।**
**ఆర్యా పంచాశత్యా బబంధ పరమార్థ సారమిదం ॥'**

పై వ్యాఖ్యలు రెండును **'జగదాధారః'** అవశేషుడని చెప్పుచున్నవి. ఈగ్రంథారంభమున ఇష్టబంధు వియోగములను దుఃఖాంబుధిమగ్నమగు జగమును జూచి దయాళుడగు శిష్యుడొకానొకడు సాంజలియై

**''త్వం సాంగవేదవేత్తా భేత్తా సంశయ గణస్య ఋత వక్తా ।**
**సంసారార్ణవతరణ ప్రశ్నం పృచ్ఛామ్యహం భగవన్॥''**

అనుచు నీ క్రింది సందియముల నడిగెను.

**దీర్ఘేఽస్మిన్సంసారే సంసరతః కస్య కేన సంబంధః ।**
**కర్మ శుభాశుభఫలదమనుభవతి గతాగతై రిహ కః ॥**

**కర్మ గుణజాలబద్ధో జీవః సంసరతి కోశకార ఇవ ।**
**మోహాంధకారగహనాత్తస్య కథం బంధనాన్మోక్షః ॥**

**గుణపురుషవిభాగజ్ఞే ధర్మాధర్మౌ న బంధకౌ భవతః ।**
**ఇతి గదితపూర్వవాక్యైః ప్రకృతిం పురుషం చ మే బ్రూహి ॥**

పతంజలియును విద్వాంసులకు సైతమతిగహనమగు నంశము నీవడిగితివి. సావధానుండవై యాలకింపుము చెప్పెదనని **'కస్య కేన సంబంధః'** అను ప్రశ్నమును -

**మాయామయోఽప్యచేతా గుణకరణగణః కరోతి కర్మాణి ।**
**తదధిష్ఠాతా దేహీ సచేతనోఽపి న కరోతి కించిదపి ॥**

అని యచేతనమగు కార్యకరణ సంఘాతమే కర్తగాని సచేతనుడగు దేహి

గాడని నిర్మూలించెను. చేతనా సాన్నిధ్యమున నచేతనమునకు గర్మ సంభవించుట నయస్కాంతముచే నిరూపించెను.

**''కర్మ శుభాశుభమనుభవతి కః''** అను ప్రశ్నమును అచేతన మయ్యును చైతన్యతాదాత్మ్యము నొందుటచే ప్రకాశితమై యంతఃకరణమే నిజముగ నహం కారమున కాస్పదమై **'పురుషోఽహం'** దుఃఖీ అహం, సుఖీ అహం' అను భావనల బొందుచున్నదనెను. ఆత్మ విమల మయ్యును తత్సార్శ్వమున నుండి తా చేయునట్లెంచును. బుద్ధ్యుపాధి మూలముననే సర్వవ్యాప్త మయ్యును దేహమునుండి దేహాన్తరమును, లోకమునుండి లోకాన్తరమును జేరు చుండును. అదృశ్యమగు నాత్మకు దృశ్యత్వము బుద్ధ్యుపాధి మూలముననే-

**రాహురదృశ్యోఽపి యథా శశిబింబస్థః ప్రకాశతే జగతి ।**
**సర్వగతోఽపి తథాఽఽత్మా బుద్ధిస్థో దృశ్యతామేతి ॥**

సంభవించు ననెను. **'నాయమేకాన్తేనా విషయః అస్మత్ప్రత్యయ విషయత్వాత్'** అని భగవత్పాదు లీయంశమును అధ్యాసభాష్యమున జెప్పిరి **'ద్రష్టాదృశిమాత్రః ప్రత్యయానుపశ్యః'** అను యోగసూత్రమును పరమార్థ సారమునకు సరిపోల్చ నగును. ఇట్లు సంసార మౌపాధికమన-

**ధర్మాధర్మౌ సుఖదుఃఖకల్పనా స్వర్గనరకవాసశ్చ ।**
**ఉత్పత్తినిధనవర్ణాశ్రమా న సంతీహ పరమార్థే ॥**

ధర్మాధర్మ సుఖదుఃఖ స్వర్గనరకాదులుకాని, జన్మమరణ వర్ణాశ్రమాదులుగాని, పరమార్థముగ నాత్మకు లేవు. అట్లయ్యును మృగతృష్ణ యందుదకము, శుక్తియందు రజతము, రజ్జువునందు సర్పమునువలె సకల జగమును భ్రాన్తివిలసితము.

'కర్మగుణజాలబద్ధః జీవః సంసరతి కోశకారఇవ' అను ప్రశ్నము.

**యద్వద్దినకర ఏకో విభాతి సలిలాశయేషు సర్వేషు ।**
**తద్వత్సకలోపాధిష్వవస్థితో భాతి పరమాత్మా॥**

లోకమున సుఖాది వైచిత్ర్యానుభవ మున్నది. గౌతమాది తంత్రముల యందును సైతము నానాత్వమే యాత్మకు నిరూపింపబడెను. కాని పతంజలి

ఇట నానాత్వమౌపాధిక మగుటను, నానా జలాశయముల నెట్లొక్కడే దినకరుడు భాసించునో యట్లు పరమాత్మయు నొక్కడే భిన్నోపాధుల భాసించునని సదృష్టాన్తముగ దృఢపరచెను. భిన్నభిన్నమగు నాయాయుపాధి శిష్టబ్రహ్మమే ద్రవ్యము. కనుకనే మహాభాష్యమున బతంజలి ''**ద్రవ్యం నిత్యం**'' అనెను. ఇట కైయటుడును -

**తత్తదాకారం తత్తద్వ్యంగ్యజాతిరూపం వా**
**అసత్యముపాధిమాశ్రిత్య తదవచ్ఛిన్నం బ్రహ్మైవ ద్రవ్యం.**

అని వివరించెను. అందున మృదాదు లనిత్యము లగుటచే, ద్రవ్య నిత్యత్వమును పతంజలి సెప్పుట యుక్తము కాదనువాదము వీడిపోవును. మృదాదులాకారమే కాన నవి బ్రహ్మమునందే పర్యవసానము నొందును. ''**వాచారంభణం వికారో నామధేయం మృత్తి కేత్యేవ సత్యం, యథా స్వయంజ్యోతిరాత్మావివస్వానపోభిన్నా బహుధైకోऽనుగచ్ఛన్, ఉపాధినా క్రియతే, భేదరూపః దేవః క్షేత్రే ష్వేవమజోऽయమాత్మా**'' అని వేదశిఖలు వేనోళ్ల జాటుచున్నవి.

**''యథాభిన్న జలేష్వేకః ఆదిత్యో భాసతే పృథక్।**
**ఏక ఆత్మా శరీరేషు భిన్నవద్భాసతే తథా॥''** అని స్మృతి.

పైజెప్పిన ప్రమాణముల మూలమున బరమాత్మయే జీవుడుగాన దేహాదులయందాత్మబుద్ధియే సంసారబంధ కారణము. దానినే అవిద్య యందురు. శ్రీభగవత్పాదులు '**తమేతమేవం లక్షణమధ్యా సమవిద్యే పండితా మన్యంతే**' అని శారీరక భాష్యమున దెలిసిరి. ఇట బతంజలియు,

**ఏతత్తదంధకారం యదనాత్మన్యాత్మతా భ్రాన్త్యా।**
**న విదంతి వాసుదేవం సర్వాత్మానం నరా మూఢాః. ॥**

అనుటయే కాక, '**అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచి సుఖాత్మ ఖ్యాతిరవిద్యా**' అని యోగమార్గము సూత్రించెను. అవిద్యకగుణములు, తలమాలిన్యాదులు గగనమునువలె, పురుషుని మలినము చేయజాలవు. ఈ యంశమును బతంజలి పరమార్థసారమున,

**జలధరధూమోద్గతిభి ర్మలినీక్రియతే యథా న గగనతలమ్**
**తద్వ**

అనియును, యోగసూత్రమున, **''క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేష-ఈశ్వరః''** అనియు నుడివెను.

**'గుణపురుషవిభాగజ్ఞే....'** అను ప్రశ్నమును 'గుణములే నిజముగ భోగార్థము కర్మలను జేయును' నేను కర్తను కాను అని తెలివినొందిన వానిని కర్మలు బంధింపనేర వనెను.

**-: ఆత్మపరుల కభేదము :-**

**ఏకస్మాత్ క్షేత్రజ్ఞా ద్బహవః క్షేత్రజ్ఞజాతయో జాతాః।**
**లోహగతాదివ దహనాత్సమంతతో విస్ఫులింగగణాః॥**

అని చెప్పుచు ప్రాసంగికముగ ''ఏవమేతస్మాదాత్మనః సర్వే ఆత్మానోవ్యుచ్చరన్తి'' అను శ్రుతిశిరమును మనమున నిడి కాబోలు జీవుల కుదయమును సూచించెను. అది ఏకదేశివాదుల యాశయము. ఇట్లు కొద్ది భేదము లుండుటచేతనే ''ఏతేన యోగః ప్రత్యుక్తః'' అని వ్యాసుడు సూక్ష్మముగ బతంజలిని నిరాకరించెను. ఇంతియ కాక పతంజలి -

**తే గుణసంగమదోషాద్బద్ధా ఇవ ధాన్యజాతయః స్వతుషైః।**
**జన్మ లభన్తే తావద్యావన్న జ్ఞానవహ్నినా దగ్ధాః॥**

అని స్వతస్సిద్ధముగ జీవునకు బంధమోక్షములు రెండును లేవనెను. **''విముక్తశ్చ విముచ్యతే''** అను కఠోపనిషత్తు గూడ నీయంశమునే దెలుపు చున్నది. గౌడపాదులుగూడ దమ కారికలయం దిద్దానిని విపులముగ విశదీకరించిరి. ఇంతియకాక పలుతావులందు బతంజలి గౌడపాదులు సెప్పు వివర్తవాదమునే వెల్లడించుటయు నీగ్రంథమప్పటి కాలమునకు జెందునని న్నిర్ణయించును. ఆ వాదములయందలి పోకడలు రచనలయందలి పదగుంభనలు పై యాశయమునకు దోడు, ఇట్లు బంధమావిద్యక మని తన్నాశము విద్యచే సమకూరు ననెను. అదియు-

**ఏవం ద్వైతవికల్పాం భ్రమస్వరూపాం మాయామ్।**
**ఉత్సృజ్య సకలనిష్కల మద్వైతం భావయే ద్బ్రహ్మ॥**

అనుచు నద్వితీయబ్రహ్మ భావనాసాధ్య మనెను. అట్టి వివేక ఖ్యాత్యుదయమునకే కద కృపాసముద్రుడు యోగమార్గమును జూపెను. ఆమార్గమున సైతము వివేకఖ్యాతి సంయమసాధ్య మనుటయు నీరెండు గ్రంథము లేక కర్తృకము లనుటను బలపరచును. ఇట్లు భావించుటచే బుద్ధ్యాదులు లీనముగా దాను మాత్రము

**విగతోపాధిః స్ఫటికః స్వప్రభయా భాతి నిర్మలో యద్వత్।**
**చిద్రూపః స్వప్రభయా తథా విభాతీహ నిరుపాధిః.॥**

అనుచు విగతోపాధియగు స్ఫటికము రీతి చిద్రూపుడై వెలుగు ననెను. ఈ గ్రంథము నందెచ్చటను ఆనందమాత్మకు జెప్పమి యోగమున దా నమ్మిన చిద్రూపత్వమునే పరమార్థసారమున బతంజలి తెలిపెనని తెలియనగును. ఇంతియకాక

**యద్యత్సిద్ధాన్తాగమతర్కేషు బ్రువన్తి రాగాంధాః।**
**అనుమోదామస్త త్తత్తేషాం సర్వాత్మవాదధియా॥**

అనుచు **'పరస్పరం విరుధ్యన్తే, తైరయం నవిరుధ్యతే'** అను గౌడపాదులవలెనే పతంజలియు రాగాదులు లేక సర్వాత్మ భావనయం దుత్తముడై బలికెను. (ఈ శ్లోకవ్యాఖ్యాత చరకము పతంజలి కృత మనెను.)

ప్రకృతమగు ప్రకృతిపురుష స్వరూపమును నిర్ణయించి యజ్ఞానగ్రంథి వీడగా జీవుడు నిజరూపమును జెందుననెను. ఆ చెందుటయు దేశాన్తర గమనము కాదు.

**మోక్షస్య నైవ కించిద్ధామాస్తి న చాపి గమన మన్యత్ర।**
**అజ్ఞానమయ గ్రంథేః భేదోయస్తం విదుర్మోక్షమ్॥**

అని ప్రకృతమగు గుణపురుషజ్ఞ విషయక ప్రశ్నమును జెట్టునుండి కాలుజాఱ నిష్టముండియు లేకయు గ్రింద గూలు చాయను, గుణపురుషజ్ఞుడు కోరియు గోరకయు గేవలుడై చెల్లును అని బదులిడెను.

ఉపసంహారమున నీ క్రింది శ్లోకము లున్నవి.

**పరమార్థ మార్గసాధనమారభ్యాప్రాప్యయోగమపి నామ।**
**సురలోక భోగభోగీముదితమనా మోదతే సుచిరమ్॥**

విషయేషు సార్వభౌమః సర్వజనైః పూజ్యతే యథా రాజా
భువనేషు సర్వదేవైర్యోగ భ్రష్టస్తథా పూజ్యః ॥

మహతా కాలేన మహాన్ మానుష్యం ప్రాప్య యోగమభ్యస్య ।
ఏం పదం ।

పరమార్థమన బ్రహ్మము తత్సంబంధమార్గోపాయ ముపాసనము, అదియే పరమార్థమార్గము. దాని నభ్యసింప నారంభించియు గృతకృత్యుడు కాజాలడేని యోగభ్రష్టుడు దేవలోకమున బూజితుడై పిమ్మట మానవ జన్మనొంది తద్యోగము నందు ననెను.

ఇట్టి మహోపకారములగు సూత్రానువాదములను లోకమున కందజేసి ''శ్రీ శ్రీ శ్రీ మలయాళ స్వామిజీ'' జీవకోటికి మహోపకార మును జేయుచుండి రనుట స్వభావోక్తి కాని యతిశయోక్తి గాదు. ఈ పీఠికను వ్రాయు సదవకాశమును నాకొసంగి నందులకు వారియెడ నేనెంతయు ధన్యుడను. పై జెప్పిన యుపపత్తులకుదోడు యోగసూత్ర వ్యాకర్తయగు భోజుడు.

శబ్దానామనుశాసనం విదధతా పాతంజలే కుర్వతా
వృత్తిం రాజమృగాంకనామకమపి వ్యాతన్వతా వైద్యకే ।
వాక్చేతో వపుషాం మలః ఫణిభృతాం భర్త్రేవ యేనోద్ధృతః
తస్య శ్రీరణరంగమల్లనృపతేర్వాచో జయన్త్యుజ్జ్వలాః ॥

అనుచు ''యోగేన చిత్తస్య పదేన వాచాం'' అని ముందు చెప్పిన పద్య ప్రామాణ్యమునే దృఢపరచెను.

నాచిత్తమునకు దోచిన వాదముల నిందు బొందుపరచితిని. గుణ గ్రహణ పారీణులగు చదువరులు తప్పులను ద్రోసిపుచ్చి గుణములనే గ్రహింతురుగాక యని పలుమారు లర్థించు -

వేదాన్త ప్రధానాధ్యాపకులు,
శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాల,
తిరుపతి.

బుధజన విధేయుడు
కొంపెల్ల. దక్షిణామూర్తి



ఓమ్

# పాతంజల యోగదర్శనము

## విషయానుక్రమణిక

### 1. యోగపాదము

19. విదేహులకును బ్రకృతిలయులకును గలుగు ప్రత్యయమును నిరూపించుట.
20. అసంప్రజ్ఞాతసమాధికి శ్రద్ధాద్యుపాయములను దెలుపుట
21. తీవ్రసంవేగులకు త్వరితముగ సమాధిసిద్ధి యబ్బుట
22. అతీవ్రవైరాగ్యములోని, తరతమభావములు.
23. ఈశ్వరప్రణిధానమువలన సమాధి యబ్బుననుట
24. ఈశ్వరలక్షణము, ఈశ్వరసాధనము.
25. ఈశ్వరుని నిరతిశయసర్వజ్ఞత్వము.
26. ఈశ్వరుడు గురువులకును గురు (పరమగురు) వనుట
27. ప్రణవ మీశ్వరవాచక మనుట.
28. ఈశ్వర ప్రణిధానము.
29 ఈశ్వర ప్రణిధానమున కాత్మసాక్షాత్కారమును విఘ్ననిరాసమును ఫలముగా నిరూపించుట.
30 విఘ్నముల నామములను, తత్కార్యములను నిరూపించుట.
31 ఉపవిఘ్నములను నిరూపించుట.
32 విక్షేపములను నివారించుట కేకతత్త్వాభ్యాసమును బోధించుట.
33 చిత్తస్థైర్యసాధనములగు మైత్ర్యాదులను నిరూపించుట.
34 చిత్తస్థైర్యసాధనముగా ప్రాణాయామము నుపదేశించుట.
35 విషయవత్ప్రవృత్తి వలనను సయితము చిత్తశుద్ధి గలుగు ననుట.
36 జ్యోతిష్మత్ప్రవృత్తి చి త్తస్థైర్య సాధన మనుట.
37 వీతరాగులగువారి చిత్తమున సంయమ మొనర్చినను చిత్తస్థైర్య మబ్బుననుట.
38 స్వప్ననిద్రాజ్ఞానాలంబన మయ్యును చిత్తము స్థిరమగు ననుట.
39 ఏదేని యొకయిష్టవస్తువును ధ్యానించినను చిత్తము స్థిరమగు ననుట.
40 పైజెప్పిన చిత్తవశీకారమునకు ఫలమును దెలుపుట.
41 త్రివిధమగు సంప్రజ్ఞాతసమాధిని నిరూపించుట.
42 సవితర్క-సంప్రజ్ఞాతసమాధి నిరూపణము.
43 నిర్వితర్క-సంప్రజ్ఞాత సమాధినిరూపణము



## ౨. సాధనపాదము

40. బాహ్యశౌచమునకు ఫలము.
41. ఆంతరశౌచసిద్ధికి సూచన.
42. సంతోషమునకు ఫలము.
43. తపమునకు ఫలము.
44. స్వాధ్యాయమునకు ఫలము.
45. ఈశ్వరప్రణిధానమునకు ఫలము.
46. ఆసనమునకు లక్షణమును, తద్విశేషములును
47. ఆసనమునకు సాధనములు.
48. ఆసనసిద్ధికి ఫలము
49 ప్రాణాయామ లక్షణము.
50. త్రివిధ ప్రాణాయామములు.
51. చతుర్థప్రాణాయామము.
52. ప్రాణాయామమువలన నావరణమగు నజ్ఞానము నశించుట.
53. ప్రాణాయామమువలన మనస్సునకు ధారణాయోగ్యత్వము.
54. ప్రత్యాహారలక్షణము.
55. ప్రత్యాహారమునకు ప్రయోజనము.



## 3. విభూతిపాదము

1. తృతీయపాదపు టారంభమును సమర్థించుటయు, ధారణాలక్షణము ను
2. ధ్యానలక్షణము.
3. సమాధిలక్షణము.
4. సంయమమునకు సంకేతము.
5. సంయమాభ్యాసమునకు ఫలము.
6. సంయమమునకు వినియోగము.
7. సంయమము సంప్రజ్ఞాతసమాధి కంతరంగమని తెలుపుట.
8. అసంప్రజ్ఞాతసమాధిలో సంయమము
   సయితము బహిరంగ మనుట.
9. నిరోధపరిణామమునకు లక్షణము.

10. నిరోధపరిణామమునకు ఫలమును నిరూపించుట.
11. సమాధిపరిణామనిరూపణము.
12. ఏకాగ్రతాపరిణామనిరూపణము.
13. ధర్మ, లక్షణావస్థాపరిణామములను నిరూపించుట.
14. పరిణామాశ్రయమగు ధర్మిని నిరూపించుట.
15. ఒకధర్మికి ననేకపరిణామములు గలుగుటకు కారణము.
16. పరిణామత్రయసంయమము వలన
భూతభవిష్యజ్జ్ఞానము గలుగుట.
17. సర్వభూతరుతజ్ఞానమును గలిగించు సంయమము.
18. పూర్వజన్మజ్ఞానకారణమగు సంయమమును
ఆవట్య జైగీషవ్య సంవాదమును.
19. పరచిత్తజ్ఞానమును గలిగించుసంయమము.
20. పరచిత్తజ్ఞానము సాలంబనము కాదనుట.
21. అంతర్ధానమును గల్గించుసంయమము.
22. మరణజ్ఞానసాధనమగు సంయమమును, అరిష్టములును.
23. మైత్ర్యాదిబలములను గలిగించు సంయమములు.
24. ఏనుగు మొదలగువాని యంతబలము గల్గించు సంయమములు.
25. సూక్ష్మములును, వ్యవహితములును, విప్రకృష్టములు నగు
వస్తువులను దర్శింపజేయు సంయమము.
26. భువనజ్ఞానజనకమగు సంయమము.
27. తారావ్యూహజ్ఞానోపాయము.
28. నక్షత్రాదిగమనము నెరుంగుట కుపాయము.
29. శరీరసన్నివేశము నెరుంగు నుపాయము.
30. ఆకలిదప్పులు తీరు నుపాయము.
31. స్థిరత్వము గలిగించు సాధనము.
32. సిద్ధులను దర్శించుటకు సాధనము.
33. సర్వజ్ఞత్వమునకు గారణమగు ప్రాతిభజ్ఞానమును నిరూపించుట.
34. చిత్తజ్ఞానమునకు సాధనమగు సంయమము.

35. పురుషజ్ఞానముకొరకు స్వార్థసంయమమును నిరూపించుట.
36. స్వార్థసంయమమువలన గలుగు నారుసిద్ధులు.
37. ఆ సిద్ధులు సయితము ఆత్మసాక్షాత్కారమునకు విఘ్నములే యనుట
38. పరకాయప్రవేశమునకు దగిన సంయమము.
39. ఉదాన (ప్రాణవృత్తి) జయమున గలుగు సిద్ధులు.
40. సమాన (ప్రాణవృత్తి) జయమువలన గలుగు సిద్ధి.
41. దివ్యమగు శ్రోత్రేంద్రియము గలుగుటకు దగిన సంయమము.
42. ఆకాశగమనము గలుగుటకు సాధనము.
43. పరకాయప్రవేశమునకు సాధనమగు మహా విదేహధారణ.
44. భూతజయమునకు దగిన సంయమము.
45. భూతజయమువలన నణిమాదిసిద్ధులును కాయ సంపదయు తద్ధర్మానభిఘాతము గలుగు ననుట.
46. కాయసంపదను నిరూపించుట.
47. ఇంద్రియజయమునకు దగిన సంయమము.
48. ఇంద్రియజయమువలన గలుగు ప్రయోజనము.
49. ప్రకృతిపురుషవివేకమునకు సర్వజ్ఞత్వాదులు ఫలముగా నిరూపించుట.
50. వివేకఖ్యాతి, పరవైరాగ్యమును గలిగించు కైవల్యమును గలిగించు ననుట.
51. యోగసమయమున, నింద్రాదులాదరముతో ప్రార్థించినను, భోగములందు సంగమును, గర్వమును వహింపరా దనుట.
52. వివేకజ్ఞానమున గలిగించు సంయమము.
53. వివేకజ్ఞానమున కవాంతరప్రయోజనములు.
54. వివేకజ్ఞానమునకు లక్షణము, దాని ముఖ్యప్రయోజనమును.
55. వివేకజ్ఞానమువలన కైవల్యము గలుగు ననుట.

# ౪. కైవల్యపాదము

1. చతుర్థపాదమును ప్రారంభించుట కుపపత్తియు, నైదువిధములగు సిద్ధులును.
2. సిద్ధునకు గలుగు జన్మాంతరపరిణామము.
3. ప్రకృత్యాపూరణము స్వాభావిక మైనదని నిరూపించుట.
4. యోగికి ననేకశరీరములలో ననేకచిత్తములతో వ్యవహరించుశక్తి.
5. నిర్మిత చిత్తముల కన్నిటికిని ముఖ్య చిత్తమొక్కటియేప్రేరకముగా నుండు ననుట.
6. మోక్షము నొందుట క్షమగు చిత్తమును నిరూపించుట.
7. కర్మవిభాగమును అందును యోగులకుండు కర్మను,సామాన్యుల కుండు కర్మలను విభజించుట.
8. యోగి భిన్నులచిత్తము వాసనాసహితముగనే యుండుననుట.
9. పూర్వపూర్వతమ జన్మవాసనలలో నేవి యేవి యెట్లెట్లభివ్యక్త మగునను విచారము.
10. సంసార నిత్యతయు వాసనల నిత్యతయు పూర్వోత్తర జన్మసిద్ధాంతమును గూర్చిన విచారము.
11. వాసనలను నివర్తింపజేయుట కుపాయము.
12. భూతభవిష్యద్వస్తువులు సయితము వర్తమాన కాలమున నుండి తీఱినవను సత్కార్యవాదమును సమర్థించుట.
13. నిఖిలప్రపంచమును గుణస్వరూపమే యనుట.
14. అనేకముల కేకపరిణామము గలుగుట యుక్తమని సమర్థించుట.
15. విజ్ఞానవాదమును దృష్టిసృష్టివాదమును నిరూపించి ఖండించుట.
16. చిత్తమునకన్న భిన్నమగు వస్తువుండి తీఱవలయునని నిరూపణ.
17. సిద్ధాంతమున నొకవస్తు వొకవేళ తెలియబడియు మఱియొకవేళ తెలియబడకుండుటను సమర్థించుచు జిత్తమునకు పరిణామిత్వమును నిరూపించుట.
18. పురుషుడు పరిణామము లేకుండుట.

19. చిత్తమునకు స్వప్రకాశత్వమును ఖండించుట.

20. స్వప్రకాశత్వము నంగీకరించుచో వారి మతములోననే వైరుధ్యమును జూపుట.

21. చిత్తము స్వగ్రాహ్యము గాకున్నను, స్వోత్తరచిత్తగ్రాహ్యమగునను విషయమును ఖండించుట.

22. పురుషునకు జ్ఞాతృత్వమౌపాధికమే యని తెలుపుట.

23. చిత్తమునకు సర్వార్థత్వమును,చిత్తభిన్నుడగు నాత్మను నెరింగించుట.

24. చిత్తము పరార్థమని నిరూపించుట.

25. వివేకవంతుడాత్మభావభావనా నివృత్తిమూలమున యోగమున కధికారి యగునని తెలుపుట.

26. వివేకవంతుని చిత్తముండు విధము.

27. వివేకవంతునకును నడుమ నడుమ చిత్తమున వ్యుత్థాన సంస్కారము లుద్బుద్ధము లగుచుండుట.

28. అట్టి వ్యుత్థానసంస్కారములను నివారించుట కుపాయము.

29. ధర్మమేఘసమాధి లక్షణము.

30. ధర్మమేఘసమాధికి ఫలము.

31. ధర్మమేఘసమాధినిష్ఠుని చిత్తముండు రీతి.

32. పరిణామక్రమము ముగియుట.

33. క్రమము నెఱుంగుటకు సాధనము.

34. ద్వివిధములగు కైవల్యలక్షణములు



# విషయసూచిక







శ్రీహయగ్రీవాయ నమః

# పాతంజల యోగదర్శనము

## ౧. యోగ(సమాధి) పాదము

యస్త్వక్త్వారూపమాద్యం ప్రభవతి జగతోఽనేకధాఽనుగ్రహాయ
ప్రక్షీణక్లేశరాశి ర్విషమవిషధరోఽనేకవక్త్రస్సుభోగీ ।
సర్వజ్ఞాన ప్రసూతిర్భుజగపరికరః ప్రీతయే యస్య నిత్యం
దేవోఽహీశస్స వోఽవ్యాత్సితవిమలతనుర్యోగదో యోగయుక్తః ॥

క్లేశకర్మాదులు లేనివాడై, విషమ విషధరుడై, సహస్రముఖుడై, దివ్య భుజగ శరీరధారియై, సకలజన జ్ఞానప్రదుడై, భుజగపరివారముచే నిత్య సంతుష్టుడై, శుద్ధస్వచ్ఛదేహుడై, సకలభుజంగము చక్రవర్తి యయ్యు నే దేవుడు లోకానుగ్రహార్థము తన తొలుతటి రూపమును దిగ విడిచి, బలరామాద్యనేక రూపములతోడ నవతరించుచు పతంజలి మహర్షి రూపమున నవతరించి యోగనిష్ఠుడై యోగశాస్త్రమును బ్రవర్తింపజేసెనో యా యాదిశేషుడు యోగశాస్త్రమును బఠించు మీకు నిస్సందేహముగను భ్రమరహితముగను దనభావము బోధిత మగునట్లనుగ్రహించును గాక!

శ్రీపతంజలి సన్మౌనిం వ్యాసం తత్త్వవిదాం వరమ్ ।
యోగసూత్రకృతం భాష్యప్రణేతారం చ సంస్తుమః ॥

తత్త్వవేత్తయు, యోగసూత్రకారుడు నగు పతంజలి మహర్షిని అట్టివాడగు యోగసూత్ర భాష్యప్రణేత యగు వ్యాసభగవానుని స్తుతింతము.

**సూ॥ అథ యోగానుశాసనమ్॥** **1**

పదవిభాగము॥ అథ, యోగానుశాసనమ్.

అర్థము॥ యోగానుశాసనం, యోగ=యోగముయొక్క, అనుశాసనం= శాస్త్రము, అథ=ఆరంభింపబడుచున్నది.

ఇచట ''అథ'' శబ్దమధికారార్థకము. అధికార మనగా నారంభము. ''అనుశాసనం'' అనగా ''శిష్టస్య శాసనం'' అను వ్యుత్పత్తిచే నింతకు ముందే హిరణ్యగర్భరూపుడగు కపిలమహర్షిచే నిబంధింపబడిన యోగము ననుసరించి తన్నిరూపితములగు పంచవింశతి తత్త్వములను గనుగొను నుపాయము నెరింగించును కాన నీ పాతంజల యోగదర్శనము యోగ విషయమున నను శాసన మయ్యెను. అట్టి యోగానుశాసన మింక ప్రారంభింపబడుచున్నది.

**''మంగళానంతరారంభ ప్రశ్న కార్త్స్న్యేష్వథో అథ''** యను నిఘంటువు ననుసరించి ''అథో'' యను శబ్దమునకువలె ''అథ'' శబ్దమునకు సయితము 1. మంగళము, 2. అనంతరము, 3. ఆరంభము, 4. ప్రశ్నము, 5. సర్వము అను నైదర్థము లుండగా నిచ్చట మాత్రము ప్రారంభ రూపార్థమే గ్రహింపబడినది.

**''అథాతో ధర్మజిజ్ఞాసా'' ''అథాతో బ్రహ్మజిజ్ఞాసా''** మొదలగు పూర్వోత్తర మీమాంసా సూత్రములయం దథశబ్దమున కానంతర్యము నర్థముగ జెప్పిన విధమున నిచట సయిత మథశబ్దమునకు శిష్య ప్రశ్నానంతరము లేక తపశ్చరణానంతరము లేక రాసాయనా ద్యుపయోగానంతరము లేక తత్త్వజ్ఞానానంతరమునను మొదలగు నర్థములు జెప్పనక్కరలేదు. యోగశాస్త్రము ప్రామాణిక మైనచో శిష్యప్రశ్నాదులు లేకయు దానిని బ్రారంభింప వచ్చునుగాన, ప్రామాణికము గానిచో శిష్యప్రశ్నాదు లుత్పన్నము లయినను హేయము గాన నానంతర్య రూపార్థము తెలుపబడలేదు.

మఱియు నథశబ్దమున కానంతర్య రూపార్థమును జెప్పుచో నథ = అనంతరము, యోగానుశాసనం = యోగశాస్త్రము అని మాత్ర మర్థమగును గాన ''ఆరభ్యతే'' (ఆరంభింపబడుచున్నది.) యను నొకపదమున కధ్యాహారము (అవశ్యకమైన పదమును దెచ్చిపెట్టుకొనుట) జేసికొనవలసివచ్చును. ఇచ్చటి పదములతోడనే యన్వయము నిరాకాంక్షముగ బూర్ణమగుచుండగా

నధ్యాహారము చేయుట అగౌరవము గాన దోషము.

మరియు గ్రంథారంభమున నథశబ్దము నుచ్చరించుటవలన మంగళము సూచితమైనది. ''ఓంకారాథ కారౌ'' అను కాత్యాయనుని కృష్ణయజుర్వేదీయ ప్రాతిశాఖ్య 17వ సూత్రముచే మృదంగాది శబ్దము స్వరూపవశమున మంగళమగు విధమున ఓంకారమును నథ శబ్దము శ్రవణమాత్రమున మంగళ ప్రదములు గాన నిచట అథ శబ్దమున కేయర్థము చెప్పినను మంగళ సూచకమే.

యోగమనగా సమాధియని భాష్యము. యుజిర్=యోగే యను ధాతువువలనను యుజ సమాధౌ యను ధాతువువలనను గూడ యోగశబ్దము గలుగును. కాని ఈ రెంటికి నర్థము వేర్వేరుగ నున్నది. యుజిర్ ధాతువువలన నుత్పన్నమగు యోగమునకు సంయోగము (చేరిక) అని యర్థము. అట్లర్థము చేసికొందురేమో యని తలచి యా యర్థమును నివారించుటకై యోగమనగా సమాధి యని భాష్యకారులు చెప్పిరి. కాగా నిచటి యోగశబ్దము యుజ సమాధౌయను ధాతువువలన నుత్పన్నమైనది. కాన ''సమాధి'' యని యర్థము చేసికొనవలయునని వారి భావము.

ఈ పాదముననే యిరువది తొమ్మిదవ సూత్రమున సమాధి యోగమునకు సాధనమని చెప్పబోవుచున్నారు. కాన యోగమును సమాధియు నొక్కటిగా బర్యాయములుగా నిరూపించుట విరుద్ధమని శంకింపవలదు. ఇచట సమాధి పదము ''సమాధానం సమాధిః'' అను భావవ్యుత్పత్తిచే నేర్పడినది గాన వృత్తినిరోధ రూపమగు యోగమును మాత్రము దెలుపును. 29వ సూత్రము నందలి సమాధి పదమున్ననో ''సమాధీయతే అనేన'' అను కరణవ్యుత్పత్తిచే నుత్పన్న మయినది గాన యోగసాధనమను నర్థమును దెలుపును.

ఆ యోగము సయితము చిత్తభూమిక లైదింటియందు నను వర్తించియుండు చిత్త ధర్మము.

1. క్షిప్తము, 2.మూఢము, 3. విక్షిప్తము. 4. ఏకాగ్రము, 5. నిరుద్ధము

నను నవి చిత్త భూమికలు.

1.అందు రజోగుణ బాహుళ్యమువలన మిగుల జంచలమై యైహిక మిథ్యావిషయ సుఖాదులలో సత్యత్వ బుద్ధినుంచి తృణజలూకా న్యాయమున నొక విషయమును విడచి మరియొక విషయమునందు దగుల్కొనుచుండు చిత్తము క్షిప్తమనబడును. సాధారణముగా దైత్యదానవుల మనసు లిట్లుండును.

2.తమోగుణ బాహుళ్యమువలన వివేకశూన్యమై నిద్రాతంద్రాలస్యాదు లలో మునిగి యెక్కుపు డాలస్యమును విడనాడి యేదో ఒక కర్మయందు బ్రవృత్తమయ్యు కోపవివశమై క్రూరకార్య తత్పరమగు చిత్తము మూఢము. సాధారణముగా నిట్టి చిత్తము పిశాచ రాక్షసులకు నుండును.

3. సత్త్వగుణ బాహుళ్యము వలన దుఃఖజనక పదార్థములను వదలి సుఖసాధక కర్మనిర్వర్తనమునందే యభిలాష గల చిత్తము నిక్షిప్త మనబడును. ఇట్టి చిత్తము సామాన్యముగ దేవతల కుండును.

4. రజస్తమోగుణ సంపర్కము లేక, శుద్ధసత్త్వ ప్రధానమై యొకానొక సూక్ష్మతత్త్వము నవలంబించి యెల్లవేళల నిర్వాత స్థలమున నున్న దీపమువలె స్థిరమై యుండు చిత్తమేకాగ్రము. ఇట్టి చిత్తము యమ నియమాది సాధనమూలమున సంప్రజ్ఞాత సమాధియం దారితేరినవారి కుండును.

5. నిరాలంబనమై స్వకారణ ప్రకృతిలో లీనమైన దగుటచే నిస్తరంగమై నిష్పందమై కాలిపోయిన త్రాడువలె సంస్కార మాత్రశేషమై వేగిన సెనగగింజవలె స్వకార్యకరణాసమర్థమైన చిత్తము నిరుద్ధము. ఇట్టి చిత్తము పరవైరాగ్య శీలురకు గలుగును.(16 వ సూ॥ చూడుడు.)

ఇందు క్షిప్తమూఢావస్థలు రెండింట ఒకవేళ చిత్తవృత్తికి నిరోధము గలిగినను రజస్తమః ప్రాచుర్యమువలన నా నిరోధము కైవల్యసాధనము కాదు. కాననే సైంధవుని చిత్తము ప్రబలక్రోధాధీనమై యర్జునుని నిర్జించు తలంపున నొక సమయమున వృత్తినిరోధము గలదైనను గైవల్యమునకు సాధకము గాకపోయెను.

విక్షిప్తావస్థయందు దరచుగ జిత్తవృత్తి నిరోధము గలుగుచుండిన నదియు విక్షేపాభిభూతమై యుండును. కాన యోగముగా బరిగణింపబడదు.

ఏకాగ్రావస్థయందు పరమార్థతత్త్వమును భాసింపజేయుచు నవిద్యాది క్లేశముల నణచుచు కర్మబంధమును సడలించుచు సర్వవృత్తి నిరోధమును గల్గింప సిద్ధముగ నుండునది సంప్రజ్ఞాత యోగ మనబడును.

అట్టి సంప్రజ్ఞాతసమాధి 1. వితర్కానుగతము, 2.విచారానుగతము 3. ఆనందానుగతమునని మూడువిధములని పై గ్రంథమున వివరింపబడును. సర్వవృత్తులును నిరోధింపబడుచో నసంప్రజ్ఞాత సమాధి యనబడును.

అవ- అట్టి యోగమునకు లక్షణము నెరింగించుచున్నారు.

## సూ॥ యోగశ్చిత్తవృత్తి నిరోధః ॥ 2

**యోగః, చిత్తవృత్తి నిరోధః.**

**యోగః=యోగమనగా, చిత్తవృత్తినిరోధః=చిత్తవృత్తులను నిగ్రహించుటయే.**

చిత్తవృత్తులను నిరోధించుట యోగము. ఏదేని యొకకొన్ని చిత్త వృత్తులను నిరోధించుట మాత్రము యోగమని యంటిమేని క్షిప్తావస్థలోను, మూఢావస్థలోను, విక్షిప్తావస్థలోను సయితమీ లక్షణ మతివ్యాప్తమగును. ఏకాగ్ర నిరుద్ధావస్థలు మాత్రమే యోగశబ్దవాచ్యము లనియు క్షిప్తాది ప్రథమావస్థా త్రయము యోగములుగ బరిగణింపబడ వనియు దొలుతటి సూత్రమున భాష్యకర్త యగు వ్యాసభగవానుని యాశయము వివరింపబడినది. కాగా క్షిప్త మూఢ విక్షిప్తావస్థలు లక్ష్యములు గావు. అయినను క్షిప్తావస్థలో సాత్త్వికవృత్తి నిరోధ ముండుటవలనను, మూఢావస్థలో రాజసవృత్తి నిరోధ ముండుట. వలనను, విక్షిప్తావస్థలో సయితము రాజస తామసవృత్తి నిరోధ ముండుట వలనను, వానిని యోగముగ బరిగణింపవలసివచ్చును. కాన నియతి వ్యాప్తిని నివారింప వలయును. దాని కొర్కై సకల చిత్త వృత్తులను నిరోధించుటయే యోగమని వ్యాఖ్యానించితిమేని యీ యతివ్యాప్తి

నివారింపబడును

అనగా క్షిప్తమూఢావస్థలలో నొక్కొక్క వృత్తికి మాత్రమే నిరోధ మున్నను విక్షిప్తావస్థలో రజస్తమో వృత్తులకు రెండింటికిని నిరోధమున్నను క్షిప్తావస్థలో రజోవృత్తియు, మూఢావస్థలో దమోవృత్తియు, విక్షిప్తావస్థలో సత్త్వగుణములును ప్రకాశించుచునే యుండును. కాన సకల వృత్తినిరోధము లేదు. కాన నీ తొలుతటి మూడవస్థల యందును సకలవృత్తి నిరోధ రూపమగు లక్షణ మతి వ్యాప్తము గాలేదని సమాధానము జెప్ప వచ్చును.

కాని యీపక్షమున లక్ష్యమగు నేకాగ్రావస్థయం దీలక్షణము సమన్వయింపదు. కాన నవ్యాప్తి యేర్పడును. ఏకాగ్రావస్థయందు సర్వ వృత్తులు నశించినను శుద్ధసత్త్వము మాత్రము భాసించుచుండుటచే నేకాగ్రతయందు సయితము సకలవృత్తి నిరోధము లేదుగదా! ఈ యేకాగ్రతావస్థను సయితము సంప్రజ్ఞాత యోగముగ వ్యాసభగవానుడు తొలుతటి సూత్రమున బేర్కొని యున్నాడు. కాన నదియు లక్ష్యమే.

కాన క్లేశకర్మవాసనలను సమూలముగ నశింపజేయు చిత్తవృత్తి నిరోధమే యోగమని వ్యాఖ్యానించిన నన్ని దోషములు నివర్తించును. క్షిప్త మూఢ విక్షిప్తావస్థలలోని రాజస తామస వృత్తినిరోధము క్లేశకర్మ వాసనలను సమూలముగ నశింప జేయజాలదు. కాన లక్షణ మచట వ్యాపింపదు. కాన నతివ్యాప్తి లేదు. ఏకాగ్రనిరోధావస్థల యందలి వృత్తినిరోధము క్లేశకర్మ వాసనలను సమూలముగ నశింపజేయును గాన లక్షణము సమన్వయించును.

మఱియు యోగలక్షణమున వృత్తిశబ్దమునకు విశేషణముగ సకల శబ్దమును గ్రహింపకుండుటచే సంప్రజ్ఞాత సమాధియందు తత్త్వజ్ఞాన రూపవృత్తి నిరోధింప బడకున్నను యోగముగనే యంగీకరింపబడినది.

ఇచట నొకే చిత్తమునకు భిన్నభిన్నములగు క్షిప్తాది భూమిక(యవస్థ) లతో సంబంధ మేల గలుగుచున్నది? అసంప్రజ్ఞాత సమాధిలో ధ్యేయాకార సాత్త్వికవృత్తి సయిత మేల నిరోధింపబడును? అను రెండు ప్రశ్న లుదయించు

చున్నవి.

అందుకు సమాధానము- చిత్తమొక్కటియే యైనను ప్రఖ్యాశీలమును (అనగా ప్రకాశస్వభావములు ప్రకాశాధికములు నగు సకల బోధలు గలది. ఇయ్యది సత్త్వగుణమునకు చిహ్నము) ప్రవృత్తి శీలమును (ఇచ్ఛాది సర్వచేష్ట గలది. ఇయ్యది రజోగుణ చిహ్నము) స్థితిశీలము (ఆవృత స్వరూపములగు సకల సంస్కారములు గలది. ఇయ్యది తమోగుణ చిహ్నము) నగుటవలన త్రిగుణము. గుణముల స్వభావము చంచలముగా నయ్యవి న్యూనాధిక భావముతో నుండు నపుడు చిత్తమనేక భూమికలతో సంబద్ధ మగును.

చిత్తసత్త్వము (చిత్తరూపమున బరిణమించిన సత్త్వము) జ్ఞాన శీలమయ్యు సత్త్వగుణహీనమై పరస్పరతుల్యములగు రజస్తమో గుణములతో గూడినచో నణిమాద్యైశ్వర్యములను శబ్దాదివిషయముల నభిలషించును. కాన నిట్టి చిత్తము క్షిప్తమనంబడును. అట్టి చిత్తసత్త్వమే సత్త్వరజశ్శూన్యమై తమోగుణానుగతమైనచో నధర్మాజ్ఞానావైరాగ్యానైశ్వర్యాది యుక్త మగును. ఇట్టి చిత్తమునే మూఢ మందురు. చిత్తసత్త్వమే యావరణ రూపమగు తమో గుణము మిక్కిలి క్షీణింపగా, సత్త్వగుణము ప్రద్యోతింపగా క్రియాశీలమగు రజోగుణ లేశముచే గూడిన దగునేని ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యాదుల విషయమున బ్రవృత్తి శీలమగును. ఇట్టి చిత్తము క్షిప్తమునకన్న విశిష్టమైనది గాన విక్షిప్త మనంబడును. ఆ చిత్తసత్త్వమే రజోలేశమువలన మాలిన్యమును బోద్రోచి శుద్ధసత్త్వరూపమై స్వాభావిక జ్ఞానరూపావస్థితమై ప్రకృతి పురుష వివేకమున మగ్నమై ధర్మమేఘ సమాధి (4పా. 29 సు. చూ.) నిష్ఠమగునేని యేకాగ్ర మనబడును. ఈ ధర్మ మేఘసమాధినే పరప్రసంఖ్యాన మందురు. పరప్ర సంఖ్యాన మనగా వివేకముతో ధ్యేయమగు తత్త్వమును సాక్షాత్కరించుట.

వివేకఖ్యాతి మూలమున ఋతంభరప్రజ్ఞ యుదయించెనేని పురుష చైతన్యము ధర్మపరిణామ లక్షణపరిణామావస్థా పరిణామములను పరిణామత్రయరహిత మైనదనియు, జక్షురాదీంద్రియముల మూలమున బుద్ధివిషయములయందు సంబద్ధ మగునటుల దేనితోడను సంబంధము

లేనిది గాన నిర్లిప్తమైన దనియు, బుద్ధిప్రతిబింబితుడై యాబుద్ధియందు సంసక్తములగు విషయము లుపాధివశమున దనయందున్నటుల బుద్ధి సమర్పిత విషయు డగునది గాన దర్శితవిషయు డనియు, గావుననే బుద్ధినిష్ఠములగు సుఖదుఃఖాదుల సంబంధము లేనిది గాన శుద్ధమనియు, ననంతమనియు, ధ్యేయాకార సాత్త్వికబుద్ధిరూపమగు ప్రసంఖ్యానము పురుష చైతన్యమునకు విపరీతమైన దనియు నెరుకపడును. అనగా ప్రసంఖ్యానము పరిణామశీలము, సత్త్వగుణాత్మకము, ధ్యేయలిప్తము, జన్యము, మలినము, సాంతము గాన హేయమని యెరింగిన చిత్త మావివేకఖ్యాతియందు సయితము విరాగము గలదియై దానిని గూడ నిరోధించును.

అట్టి నిరుద్ధావస్థలోనున్న చిత్తము సంస్కారమాత్ర శేషమగును. అయ్యదియే నిర్బీజసమాధి యనబడును. "న తత్ర కించిత్ సంప్రజ్ఞాయతే" యను వ్యుత్పత్తిచే దానిలో నేదియు బాగుగ భాసింపదు. కాన నసంప్రజ్ఞాత సమాధి యని దీనికి నామమయ్యెను.

కాగా గుణముల న్యూనాధిక భావముచే జిత్త మొక్కటియె యయ్యు ననేకావస్థల సంబంధము గలిగి యుండుటయు బురుషుడు స్వరూప మాత్రస్థితు డగుటకై ధ్యేయాకారవృత్తిని గూడ నిరోధించుటయు యుక్తమే యని యేర్పడినది.

కాగా జిత్తవృత్తినిరోధరూపమైన యోగము సంప్రజ్ఞాత మనియు నసంప్రజ్ఞాత మనియు రెండు విధము లయ్యెను. ఇందు సంప్రజ్ఞాత యోగమునకు సంప్రజ్ఞాతసమాధి, సబీజసమాధి, సవికల్పసమాధి మొదలగునవి పర్యాయపదములు. అసంప్రజ్ఞాత యోగమునకు నసంప్రజ్ఞాత సమాధి, నిర్బీజసమాధి, నిర్వికల్పసమాధి మొదలగునవి పర్యాయ వాచకములు.

అవ-నిరుద్ధావస్థలో ధ్యేయాకారవృత్తి సయితము నిరుద్ధ మగును గాన జిత్తము సంస్కారమాత్రశేషమై తనకు గారణమగు ప్రకృతిలో లీనమగు సమయమున, బుద్ధిబోధాత్మ (చిత్త మేయాకారము ధరించిన నాయాకార

మును గోచరించుట) అగు పురుషుడెట్టి స్వభావముతో నుండును? అను ప్రశ్నకు సమాధానము నొసగుచున్నారు.

**ఓసూ॥ తదా ద్రష్టుస్స్వరూపేఽవస్థానమ్॥ 3**

తదా, ద్రష్టుః, స్వరూపే, అవస్థానమ్॥

తదా=అనిర్బీజసమాధి యేర్పడిన యప్పుడు, ద్రష్టుః = దృక్శక్తి రూపుడగు చేతనపురుషునకు, స్వరూపే=అకల్పితమై యసంగమై నిర్వికారమైన నిజరూపమునందు, అవస్థానమ్=ఉనికి గలుగుచున్నది.

కైవల్యమున (చిత్తమునకు బునరుత్థానములేని లయమున) నౌపాధికములగు శాంత మూఢ ఘోరాది రూపములను విడచి చితిశక్తి రూపుడగు పురుషుడు స్వాభావికమగు నసంగచేతన రూపమున నుండు విధమున నసంప్రజ్ఞాతావస్థలో గూడ బురుషుడు స్వరూప మాత్రావస్థితు డగును.

ప్రశ్న - ఇట్లు పురుషుడు బహిర్ముఖావస్థలో స్వరూపావస్థితుడు గాడనియు నంతర్ముఖావస్థలో నసంప్రజ్ఞాతసమాధిలో స్వరూపావస్థితు డగుననియు జెప్పుటచే బురుషునకు సయితము పరిణామ శీలత్వము చెప్పబడినదిగదా! సర్వకాలములలో నొకే విధముగ నుండక యొక సమయ మున స్వరూపస్థితియు, మఱియొక సమయమున నది లేకుండుటయు జెప్పుటచే ననేక రూపములు ధరించు చితిశక్తి (పురుషుడు) (ఆత్మ) పరిణామశీలుడని యేర్పడుచున్నది. బహిర్ముఖావస్థలో సయితము పురుషుడు స్వరూపావ స్థితుడే యని చెప్పుదురేని సమాధికిని బహిర్ముఖావస్థకును భేద మేమున్నది?

సమా- ముత్యపుచిప్పను జూచి వెండియని భ్రమించి నప్పుడు ముత్యపు చిప్ప స్వరూపము పోయి యందు రజతరూపవస్తు వేర్పడదు. మరియు భ్రమము నశించిన తరువాత ''నిది రజతము కాదు; ముత్యపు చిప్ప''యని జ్ఞానమేర్పడినంత మాత్రమున నా చోట ముత్యపు చిప్ప యుదయించి

రజతము నశింపదు. అస్తినాస్తి యను వ్యవహారము భ్రాంతి కల్పితము మాత్రమే గాని ముత్యపుచిప్ప యెప్పటికిని ముత్యపు చిప్పగానే యున్నది. కాని యొకప్పు డుండుటయు నొకప్పుడది లేకుండుటయు జరుగలేదు.

అట్లే చేతను డేకాకారము గలవాడు. అతనికి పరిణామము లేదు. కాని రెండవసూత్రమున చెప్పిన స్థితియే ఇచ్చట నిరూపించుటచే చిత్తనిరోధమును జెప్పిరే గాని చిత్త్వవిలయము చెప్పలేదు. ఆ సంప్రజ్ఞాత సమాధికాలమున స్వస్వరూపముతో ప్రకాశించును. బహిర్ముఖాంతర్ముఖావస్థల కింతమాత్రమే భేదము.

కాగా సంప్రజ్ఞాత సమాధిసయిత మసంప్రజ్ఞాత సమాధినిబట్టి చూచినచో వ్యుత్థానావస్థయే అనగా బహిర్ముఖావస్థయే.

అవ-వ్యుత్థానకాలమున బురుషుడు స్వస్వరూపముతోడ భాసింప కున్నచో మరియెట్లు భాసించుచున్న యాశంకకు సమాధాన మొసగబడు చున్నది.

## సూ॥ వృత్తిసారూప్యమితరత్ర॥ 4

వృత్తిసారూప్యం, ఇతరత్ర.

దర్శితవిషయత్వాత్ (ఈపదమును భాష్యకారు లధ్యాహరించిరి) విషయ సమర్పణము గలిగియుండుటవలన, ద్రష్టుః=దృక్ఛక్తి రూపపురుషునకు (ఈ పదము 3వ సూత్రము నుండి యనువృత్తము) ఇతరత్ర =సమాధికన్న భిన్నమగు బహిర్ముఖ కాలములో వృత్తిసారూప్యం=చిత్త వృత్తులతో సమాన రూపము, (భాసించును)

పురుషునకు చిత్తవృత్తులతో సమాన రూపత్వమునకు హేతువును జూపుటకై ''దర్శితవిషయత్వాత్'' అను నొకపదమును వ్యాసభగవాను లీసూత్రములోనికి నధ్యాహరించిరి. ఇంద్రియముల ద్వారమున విషయ ములను గ్రహించిన చిత్తము తా ననుభవించిన విషయములను దనయందు

ప్రతిఫలించిన పురుషునియందు దర్శించును. దీనికే విషయనివేదనము లేక విషయసమర్పణ మని పేరు. ఇట్లే విష్ణుపురాణము నందు చెప్పబడి యున్నది.

**గృహీతానింద్రియైరర్థాన్ ఆత్మనే యః ప్రయచ్ఛతి।**
**అంతఃకరణరూపాయ తస్మై విశ్వాత్మనే నమః॥**

అనగా నింద్రియముల మూలమున విషయములను గ్రహించి యాత్మకు సమర్పించు నంతఃకరణము (చిత్తము)నకు వందనమని భావము.

కాగా పురుషుడు చిత్తవృత్తిచే విషయ సమర్పణ మొనర్పబడి యుండుటవలన జిత్తమున నేవృత్తులు గలిగిన నవి యన్నియు నాత్మయందు సయితము గోచరించును గాన చిత్తవృత్తి సమాన రూపము గలవాడగును. అనగా విషయేంద్రియ సంబంధమువలన నుత్పన్నములగు వివిధవృత్తులు చిత్తధర్మములు మాత్రమే గాని యందేవియు పురుషధర్మములు గావు. పురుషుడు జ్ఞానరూపుడు మాత్రమేకాని జిత్తధర్మములు పురుష ధర్మములుగా గోచరించును. అంతియకాని వ్యుత్థానకాలమున నుండు నట్లు తోచెడి చిత్తవృత్తులు యథార్థముగ బురుషునకు సంబంధించినవి గావు. సాంఖ్యాచార్యుడగు పంచశిఖుని సూత్రములవలన సయిత మీవిషయము దృఢతర మగుచున్నది.

1. ఏకమేవ దర్శనం. 2. ఖ్యాతిరేవ దర్శనం.

అనగా దర్శనం=జ్ఞానము, ఏకమేవ=ఒక్కటియే, దర్శనం=శబ్దాది విషయక జ్ఞానమును, ప్రకృతిపురుష వివేకజ్ఞానమును ఇది యంతయు, ఖ్యాతిరేవ=బుద్ధి యొక్క ఖ్యాతివృత్తియే అని యాసూత్రముల కర్థము. కాగా ననశ్వరజ్ఞానమే పురుషుడనియు, నుత్పత్తి వినాశశీలమగు బుద్ధియే యాధార మనియు నెరింగించి నట్లయ్యెను.

యథార్థముగ పురుషుడు సంగరహితు డైనను సాన్నిధ్యవశమున నయస్కాంత మణివలె నుపకారశీలమగు చిత్తము సుఖదుఃఖాద్యాకారమున బరిణమించి భోగ్యముగ నుండుటవలన సుఖదుఃఖాది భోక్త యగు

పురుషునకు స్వము(ధనములేక ఆధీనము) అగుచున్నది. ఈ స్వస్వామి భావసంబంధము ప్రవాహరూపమున ననాది యైనది. కావుననే శాంత ఘోర మూఢాకారవృత్తితో గూడిన చిత్తసాన్నిధ్యముచే బురుషుడు ''నేను శాంతుడను (సుఖవంతుడను), నేను ఘోరుడను (దుఃఖవంతుడను); నేను మూఢుడను'' అని చిత్త ధర్మములను తనయం దారోపించుకొనును.

కాబట్టి మాసిన యద్దమునందు జూచుకొను మనుజుడు నా ముఖము మలినమైనదని యుపాధిభూతమగు నద్దమునందలి మాలిన్యమును దనముఖమునం దారోపించుకొను వడువున నుపాధిభూతమగు చిత్తము నందలి ధర్మములను దనపై నారోపించుకొని పురుషుడు సయితము 'నేను సుఖిని నేను దుఃఖి' నని భ్రమపడును.

ఇట్లు భ్రమించుటలో చిత్తవృత్తిసారూప్యము పురుషునకు గలుగుచున్నది. కాననే బహిర్ముఖావస్థలో బురుషునకు జిత్తవృత్తి సారూప్యము జెప్పబడియెను.

పురుషుడు సంగరహితుడు గాన నితనికి జిత్తసాన్నిధ్యము దేశకృతముగ గాని, కాలకృతముగాని యుండ వీలులేకున్నను. యోగ్యతారూప సాన్నిధ్యము గలదు గాన నదియే యిచట గ్రహింపబడవలయును. అది యెట్లనగా బురుషునందు భోక్తృత్వ ద్రష్టృత్వ శక్తులు గలిగియుండగా జిత్తమునందు భోగ్యత్వ దృశ్యత్వ శక్తులు గలవు. ఈ రెండు విధములగు శక్తులను బరస్పర సంబంధ యోగ్యత యుండుటచే దృశ్యము భోగ్యమునగు చిత్తము స్వముగను; ద్రష్టయు, భోక్తయు నగు పురుషుడు స్వామిగను నగుదురు గాన రెండింటికిని స్వస్వామిభావము. చిత్తమునకున్ను దన స్వరూపము విలక్షణ మైనదను వివేకము లేకుండుటచేతనే పురుషునకు భోగము గలుగును. అవివేకమును వాసనయు బీజాంకురములవలె ననాదులు, గాన స్వస్వామిభావ సంబంధము గూడ యనాది యయ్యెను. కాన యోగ్యతారూప సాన్నిధ్య వశమున చిత్తవృత్తిసారూప్యము పురుషునకు బహిర్ముఖావస్థలో నుండునని చెప్పబడెను.

అవ - చిత్తవృత్తినిరోధమే యవశ్య కరణీయము, కాని చిత్తవృత్తుల నెరుంగక వాని నిరోధింప శక్యము గాదు. చిత్తవృత్తు లసంఖ్యాకము లగుటచే వానినెల్ల నెరుంగుటయు దుర్ఘటము. కాన నసాధ్యమగు కార్యము నుపదేశించుట తగదను శంక బొడమగా నిరోధింపదగు వృత్తులను బేర్కొనుచున్నారు.

## సూ॥ వృత్తయః పంచతయ్యః క్లిష్టాక్లిష్టాః ॥ 5

వృత్తయః, పంచతయ్యః, క్లిష్టాక్లిష్టాః.

ఈ సూత్రములోనికి "తాః, పునః నిరోద్ధవ్యాః, బహుత్వేసతి; చిత్తస్య" యని యారుపదములను వ్యాసభగవాను లధ్యాహరించిరి.

చిత్తస్య=చిత్తమునకు, బహుత్వే సతి=అనేకత్వము గలుగు చుండగా, నిరోద్ధవ్యాః = నిరోధింపదగు, వృత్తయః=వృత్తులు, పంచతయ్యః= అయిదు మాత్రమే, తాః=ఆ యయిదు వృత్తులును, పునః=మరల, క్లిష్టా క్లిష్టాః=క్లిష్టము లనియు నక్లిష్టము లనియు, (రెండు విధములు).

చిత్తవృత్తులు తృష్ణాలజ్జాదిరూపమున ననంతముగ నున్నను బ్రమాణాది పంచవృత్తులలోననే, యన్నియు నంతర్భవించును. కాన నీపంచవృత్తులను నిరోధించినచో సర్వవృత్తులును నిరోధింపబడునుగాన నితరవృత్తులను నిరోధింప బ్రయత్నాంతరము బనిలేదు. కాన వృత్తినిరోధము సాధ్యమేగాని యసాధ్య మెంతమాత్రమును గాదు.

ఈయైదువృత్తులలో నొక్కొక్కటియు గ్లిష్టమనియు నక్లిష్టమనియు రెండేసి విధము లగును. అవిద్యాది క్లేశములవలన నుదయించి ధర్మాధర్మ వాసనా సమూహములకు నాలంబన మగు వృత్తులు క్లిష్టము లనబడును. అవి రాజసతామసములగు ప్రవృత్తి, పరితాప, క్రోధ, లోభాదులు. ధర్మా, దర్మోత్పాదన ద్వారమున జన్మాదులకు గారణములగు గుణములకు బ్రకృతిపురుష వివేకమును గలిగించుటయే పరమావధి గాన బ్రకృతి పురుష వివేకమును విషయీకరించుచు గుణాధికారమునకు విరోధులగు

(గుణాధికారమును ముగింపజేయు) వృత్తులు ము లనంబడును. అవి సాత్త్వికములగు ప్రఖ్యా ప్రసాదాదులు.

ప్రాణులందరును రాగద్వేషయుక్తు లగుటచే క్లిష్టవృత్తి ప్రవాహము గల వారలే యైనను ఆగమానుమానాచార్యోపదేశ పరిశీలనాదులచేత గల్గు నభ్యాసవైరాగ్యములవలన గ్లిష్టవృత్తుల ప్రవాహమును నిరోధించి యక్లిష్టవృత్తి ప్రవాహముగలవా రగుదురు. ఒకవేళ నభ్యాసవైరాగ్యములు తగ్గినచో గ్లిష్ట వృత్తుల ప్రవాహమధిక మగును. మరియొకవేళ నభ్యాసవైరాగ్యములు ప్రబలము లైనచో నక్లిష్టవృత్తి ప్రవాహ మతిశయించును. మరియు బహు కాలము సత్క్రియా సేవనమువలన నభ్యాస వైరాగ్యములు దృఢములైనచో నొకేక్షణమున గ్లిష్టవృత్తులను నిరాకరించి యక్లిష్టవృత్తులే సతత ప్రవాహశీలము లగుటయే గాక యక్లిష్టసంస్కార ప్రవాహమును నయితము నిరంతరముగ వెలయించును. అట్టి యక్లిష్ట సంస్కారములచే నక్లిష్టవృత్తులు మాత్రమే గలుగుచుండును. ఇవ్విధమున నక్లిష్టవృత్తులవలన నక్లిష్టసంస్కారములు నాయక్లిష్టసంస్కారములవలన మరల నక్లిష్టవృత్తులును గలుగుచు నిట్టి వృత్తిసంస్కారచక్రము సంప్రజ్ఞాత సమాధి పర్యంతము తిరుగుచుండును. అసంప్రజ్ఞాత సమాధియం దీయక్లిష్టవృత్తులకు నిరోధము గలుగును. కాన నీ వృత్తి సంస్కార చక్రమునకు గమ్యస్థాన మసంప్రజ్ఞాత సమాధియే.

మరియు వివేకఖ్యాతి యుదయించిన చిత్తము సయితము తన కార్యమునుండి నివృత్త మగును. అక్లిష్టవృత్తులు పరవైరాగ్యముచే నిరుద్ధములు గాగా జిత్తము కృతకృత్యమై సంస్కారమాత్ర శేషమై యాత్మవలె సుఖదుఃఖాదిరహిత మగును. లేదా కైవల్యమున గారణ ప్రకృతిలో లీనమగును. ఈచిత్తప్రళయమే యోగమునకు గడపటి హద్దు.

ఇట్టి క్లిష్టములు నక్లిష్టములు నగు వృత్తు లైదువిధములుగ నుండును.

అవ- పూర్వసూత్రమున సంఖ్యానిర్దిష్టములగు వృత్తులను నామముతో నిర్దేశించుచున్నారు.

## సూ॥ప్రమాణవిపర్యయవికల్పనిద్రాస్మృతయః॥ 6

ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతయః.

ప్రమాణ, విపర్యయ, వికల్ప, నిద్రా, స్మృతయః= ప్రమాణము, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి( ఇవి పంచవృత్తులు)

1. ప్రమాణము, 2. విపర్యయము, 3. వికల్పము, 4. నిద్ర, 5. స్మృతి యని నిరోధింపదగిన చిత్తవృత్తుల కైదింటికిని బేరులు.

అవ - వరుసగా నీపంచవృత్తులకును లక్షణము చెప్పదలచి వానిలో తొలుతటిదగు ప్రమాణమను చిత్తవృత్తికి సామాన్య లక్షణము నామనిర్దేశ మూలముననే సిద్ధింపగా దద్విభాగమును జేయుచున్నారు.

## సూ॥ ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని॥ 7

ప్రత్యక్షానుమానా గమాః, ప్రమాణాని.

ప్రమాణాని= ప్రమాణములు, ప్రత్యక్షానుమానాగమాః= ప్రత్యక్షము, అనుమానము, ఆగమము ( అవి త్రివిధములు).

ఇచ్చట ''ప్రమాణాని'' యను నామనిర్దేశముచేతనే ప్రమాణమునకు సామాన్యలక్షణము సిద్ధించినదని తలంచి, సూత్రకారులు ప్రత్యేకముగా సామాన్యలక్షణమును జెప్పలేదు. కాన ''ప్రమాణాని'' యనుపదము నావృత్తిచేసికొని (అనగా రెండుమారు లుచ్చరించి) యందు తొలుతటి పదమును సామాన్యలక్షణముగ ననుసంధింపవలయును. ''ప్రమీయతే, యేన, తత్ ప్రమాణం'' అను వ్యుత్పత్తిచే ప్రమకు ( అనగా నింతకుముందు ప్రమాణాంతరముచే జ్ఞాతము గాక యుత్తర కాలమున బాధితముగాని పదార్థవిషయ మగు పురుషుని జ్ఞాతమునకు అనగా స్మృతిభ్రమ భిన్నమగు జ్ఞానమునకు) కరణమగునది(సాధన మగునది) ''ప్రమాణము'' అని యర్థము సిద్ధించినది. కాన, ప్రమకు గరణ మగునది ప్రమాణమని

సామాన్యలక్షణము సిద్ధింపగా ననంతరను తదవాంతర భేదజిజ్ఞాస యుదయింపగా రెండవది యగు రూఢప్రమాణపదముతోడి సూత్రము ప్రమాణ విభాగమును దెలుపును.

అనగా నట్టి ప్రమాణము 1. ప్రత్యక్షమనియు, 2. అనుమానమనియు. 3. ఆగమమనియు మూడు తెరంగుల నుండునని యేర్పడినది.

చక్షురాదీంద్రియముల మూలమున జిత్తమునకు ఘటాది బాహ్య వస్తూపరాగము (వృత్తి ద్వారా సంబంధము) గలుగును గాన ఘటత్వాది రూపమగు సామాన్యధర్మ (జాతి) విశేషధర్మ (ప్రత్యేక ధర్మ) సహితమునగు ఘటాదివస్తువు నందలి వాస్తవవిశేష (వస్తుగత ప్రత్యేక) గుణములను మాత్రము గ్రహించువృత్తియే ప్రత్యక్షము. ''ఇయ్యది ఘటము'' అని ఘటాకారము గోచరించుటయే ప్రత్యక్ష ప్రమాణము. దీని యనంతరము ''ఘటమును నేను తెలిసికొనుచున్నాను'' అని విషయ సహితమును జిత్తవృత్తి విషయకము నగు పురుషనిష్ఠజ్ఞానవే ఫలప్రమ యనబడును. కాగా ఇంద్రియములద్వారా గలుగు చిత్తవృత్తియే ప్రత్యక్ష ప్రమాణము. దానిచే గలుగు పురుషనిష్ఠజ్ఞానము ప్రత్యక్ష ప్రమయని యేర్పడినది.

ఈఫలప్రమ వాస్తవమైనది గాదు. పురుషుడు బుద్ధియందు బ్రతిఫలించి బుద్ధికిని దనకును భేదము నెరుంగక తాదాత్మ్యాభిమానము గలిగియుండును గాన నేను తెలిసికొనుచున్నానని యెంచునేగాని యథార్థముగ నా చిత్తవృత్తి పురుషునకు సంబంధించినది గాదు. పురుషుడు కేవలము బుద్ధి ప్రతిబింబితుడు గాన బుద్ధి ప్రతిసంవేదియను విషయము కైవల్యపాదమున నిరువది రెండవ సూత్రమున దెలుపబడును.

అనుమేయములగు వహ్న్యాదులకు (సాధ్యవంత) సపక్షములగు మహానసాదులయం దన్నిట నున్నదియు విపక్షము (సాధ్యవిహీనము)లగు హ్రదాదులయం దెచ్చట నుండని హేతువు విషయమగు జ్ఞానముచే జనించిన చిత్తవృత్తి యనుమాన మనబడును. చంద్రతారకము (చంద్రుడును

నక్షత్రములును) గమనశీలము. దేశాంతరమును బొందుచుండుటవలన, చైత్రునివలె, వింధ్యపర్వతము దేశాంతర ప్రాప్తిలేనిదియు, గమనము లేనిదియు నని యనుమాన ప్రయోగము. ఇచ్చట చంద్రుడు తారకలు నను పక్షమునందు గమన శీలత్వము సాధింపబడుచున్నది.

ఇందుకు దేశాంతరమును బొందుట హేతువు. చైత్రు డన్వయ దృష్టాంతము. వింధ్యపర్వతము వ్యతిరేక దృష్టాంతము. ఇందు దేశాంతరప్రాప్తి యను హేతువు సాధ్యమగు గమనము గల్గియున్నదాన సపక్షమగు చైత్రునియందున్నది. గమనము లేనిది గాన సాధ్యాభావవంతమై విపక్షమగు వింధ్యపర్వతమున లేకున్నది. కాన దేశాంతరప్రాప్తిరూప హేతుజ్ఞానముచే జనించునదియై చంద్రతారకములయందు సాధ్య (గమన) జ్ఞానాకారమగు చిత్తవృత్తి యనుమాన ప్రమాణము. దానిచే బురుషునకు గలుగు ''చంద్రతారకము గమనశీలము'' అనుజ్ఞానము అనుమితిప్రమ యనబడును.

ఇట్లే తనచే వినబడిన విషయమును గాని, యనుమితమగు విషయమునుగాని (తనబోధము) యింకొకరికి సంక్రమింపజేయుట కాప్తునిచే నుచ్చరింపబడు వాక్యముచే గలుగు తదర్థవిషయక చిత్తవృత్తి ఆగమ ప్రమాణము లేక శబ్దప్రమాణ మనబడును. మరియు నా యాగమ ప్రమాణముచే బురుషునకు గలుగు జ్ఞానమాగమప్రమ-లేక శాబ్దీప్రమ యనబడును.

ప్రత్యక్షము చక్షురాదీంద్రియదోషముచే నప్రమాణ మగు విధమున, ననుమానమును హేత్వాభాసములచే హేయమగు విధమున నాగమము సయితము, వక్త తత్వజ్ఞాన విహీనుడై కారుణ్యరహితుడై యథాదృష్ట యథాశ్రుతార్థ ప్రతిపాదకుడు గాకున్నచో, నప్రమాణ మయమగును. తత్త్వజ్ఞాన కారుణ్యయుక్తుడై యథాదృష్ట శ్రుతార్థవాది యగు నాప్తునిచే నుచ్చరితమగు నాగమము ప్రమాణమై యుండును. ఆప్తు డనగా భ్రమ ప్రమాద విప్రలిప్సాకరణాపాటవాది పురుషదోష రహితుడు.

ఇతర శాస్త్రకారులు వచించు నుపమానము నర్థాపత్తియునను ప్రమాణము లనుమాన ప్రమాణమునం దంతర్భవించును.

ఇందు సాధారణ మనుజుడు ప్రత్యక్షమును, వివేకియగు వాడు ప్రత్యక్షానుమానములను, మహామేధావియగు నతడు ప్రత్యక్షానుమానాగమములను మూడింటిని విశ్వసించును. మహాజ్ఞానికి నాత్మసాక్షాత్కార మొక్కటియే ప్రమాణము.

అవ॥ ఇట్లు మొదటిదగు ప్రమాణరూపవృత్తిని విశదీకరించి రెండవది యగు విపర్యయవృత్తికి లక్షణమును దెలుపుచున్నారు.

## సూ॥ విపర్యయో మిథ్యాజ్ఞానమతద్రూపప్రతిష్ఠమ్ ॥ 8

విపర్యయః, మిథ్యాజ్ఞానం, అతద్రూప ప్రతిష్ఠమ్.

మిథ్యాజ్ఞానం=(త్రాటిని జూచి పామనుకొనుటవలె) బాధితజ్ఞానము, అతద్రూప ప్రతిష్ఠం=వాస్తవిక రూపము నందుండదు గాన, విపర్యయః= విపర్యయవృత్తి యనంబడును.

వస్తువుయొక్క నిజరూపమునుండి తొలగక వస్తువుయొక్క యథార్థరూపమును బ్రకాశింపజేయు జ్ఞానము తద్రూపప్రతిష్ఠితము, (సత్యజ్ఞానము) అనబడును. మూసలో కరిగింపబడిన బంగారము మూస యాకారమును ధరించియుండు రీతిని జిత్తము సయితము బాహ్యావస్తు సంబంధమగు నపుడావస్తువు నాకారము గలది యగునేని తద్రూపప్రతిష్ఠిత మగును.

అట్లుగాక వస్తువు వేరువిధమున నుండ జిత్తవృత్తి మరియొక విధమున నగుచో జిత్తవృత్తి యావస్తువుయొక్క యథార్థరూపమున లేదందుము. పైమూసలో, గరిగించి పోతబోసిన లోహద్రవము పోతబోయ సిద్ధపరుప బడిన పాత్రయాకారమునకన్న విలక్షణమగు నాకారము నొందెనేని ఆయాకృతి అతద్రూప ప్రతిష్ఠితము లేక తద్రూపాప్రతిష్ఠిత మనబడును. అట్లే చిత్తవృత్తి

వస్తువు నాకారమునకన్న విలక్షణముగ పరిణమించినచో నతద్రూప ప్రతిష్ఠిత మనబడును. ఏకచంద్రునియందు చంద్రద్వయజ్ఞానము, రజ్జువునందు సర్పజ్ఞానమును అతద్రూప ప్రతిష్ఠితము గాన విపర్యయజ్ఞాన మనబడును.

మరియు నతద్రూప ప్రతిష్ఠితమను పదమునకు జ్ఞానము స్వస్వరూపమునందు స్థితము గాకుండుట యనియు నర్థము చెప్పవచ్చును. చంద్రునియం దేకత్వజ్ఞానమును, సర్పమునందు సర్ప మనెడి జ్ఞానమును స్వస్వరూప ప్రతిష్ఠితము గాన ప్రమాణ మగును. చంద్రునియందు ద్విచంద్ర జ్ఞానమును, రజ్జువునందు సర్పజ్ఞానము నుత్తరకాలమునందు గలుగబోవు చంద్రుడొకడే యనియు నిది రజ్జువనెడు యథార్థజ్ఞానముచే బాధితమై స్వస్వరూపమున నప్రతిష్ఠిత మగును. అనగా నుత్తరకాలమునందలి యథార్థజ్ఞానము పూర్వజ్ఞానమునకు స్వరూప ప్రచ్యుతి యొనర్చి భగ్నపరచును.

ఈ విపర్యయజ్ఞానమే యవిద్య యనబడును. ఇయ్యది 1. అవిద్య లేక తమస్సు, 2. అస్మిత లేక మోహము, 3. రాగము లేక మహామోహము, 4.ద్వేషము లేక తామిస్రము, 5. అభినివేశము లేక అంధతామిస్రము నని పంచవిధము లగును. ఇవియే పంచవిధములగు క్లేశములు. ఇయ్యవి చిత్తమలములను తెలుపు నపుడు వివరింపబడును. (చూ. 2 పా. 3-సూ.)

అవ- ఇంక మూడవది యగు వికల్పవృత్తికి లక్షణమును జెప్పు చున్నారు.

## సూ॥ శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః॥ 9

శబ్దజ్ఞానాను పాతీ, వస్తుశూన్యః, వికల్పః.

వస్తుశూన్యః=వస్తురహితమైన అనగా లేని వస్తువును విషయీకరించుచు, శబ్దజ్ఞానానుపాతీ=అయథార్థ వస్తువాచక శబ్దజ్ఞానా నంతరమున జనించి యథార్థ వస్త్వాకారముగ పరిణమించునట్టి చిత్తవృత్తి, వికల్పః-వికల్పము అనబడును.

ఆ యథార్థవస్తువును దెలుపు శబ్దమును వినిన యనంతరము గలిగి యా యథార్థవస్తు రూపమున బరిణమించుట వికల్పవృత్తి యనబడును. ''చైతన్యము పురుషుని స్వరూపము'' అని వస్తుతః శూన్యమయ్యు శబ్దజ్ఞాన మాహాత్మ్యమువలన వ్యవహారము గలుగుచున్నది. యథార్థముగ చైతన్యమే పురుషుడు. పురుషునకును చైతన్యమునకును భేదము లేదు. అట్లయ్యు పురుషునియొక్క స్వరూపము అని చైతన్యమును పురుషభిన్నముగ శబ్దము వచించుచున్నది. ఈ శబ్దమువలన గలుగు ''చైతన్యము పురుషుడు వేరైనవి'' యను జ్ఞానమే వికల్పజ్ఞానము.

''చైత్రుని యావు'' అనుచో చైత్రుడు వేరు. ఆవు వేరు. ఈ రెండు పదార్థములకును స్వస్వామిభావము యథార్థము గాన నీ వ్యవహారము ప్రమాణ మయ్యెను.

పైతెరగుననే ''పదార్థములయందుండు ధర్మములు లేని పురుషుడు క్రియాభావవంతుడు'' (అనగా క్రియారహితుడు) అనునదిగూడ వికల్ప జ్ఞానమే. నైయాయికులు అభావమును పదార్థాంతరముగ నొప్పుకొనినను సాంఖ్యయోగ మతములలో నభావ మొక పదార్థము గాదు. అధికరణ స్వరూపమే అనగా భూతలమున ఘటము లేకున్నచో, ఘటాభావము అది కేవల భూతలరూపమేగాని మరియొక వస్తువు కాదు. ''ఈ వనమున మామిడిచెట్టున్నది'' యను వ్యవహారములో మామిడిచెట్టును వనమును భిన్నము గాకున్నను వనము నాధారముగను మామిడిచెట్టు నాధేయముగను వ్యవహరించిన విధమున, భూతలమునందు ఘటాభావ మున్నది యను నాధారాధేయభావము సంగత మగునని వీరి మతము.

కాగా నభావపదార్థము లేదని వీరి సిద్ధాంతము గాన పై వాక్యము నందు ''పురుషుడు క్రియాభావవంతుడు'' (క్రియారహితుడు) అను వాక్యమునందు క్రియాభావవంతుడు అనుట పొసగదు. క్రియాభావమను నొకపదార్థ ముండినచో దానిని విశేషణముగా జేసి పురుషుని విశేష్యముగా నుంచి ''క్రియాభావమ గలవాడు'' అని చెప్ప వీలుండును. అభావమే

సిద్ధింపనందున విశేష్య విశేషణభావము సంభవింపదుగాన ''పదార్థముల యందుండు ధర్మము లేని పురుషుడు,'' క్రియాభావవంతుడు అనునదియు వికల్పజ్ఞానములే.

ఇట్లే ''బాణము స్థిత మగుచున్నది''. బాణము స్థిత మయ్యెను. బాణము స్థిత మగును. అనెడు వ్యవహారనులు సయితము వికల్ప రూపములే. ఏలనన స్థిత మనగా గమననివృత్తికి ననుకూలమగు వ్యాపారము (ప్రయత్నము) గలది యని యర్థము. ప్రయత్నముచేత నధర్మము గాన బాణము జడముగాన దానియం దీప్రయత్న ముండజాలదు. మరియు బాణమునకు గర్తృత్వ మసంభూతము. మరియు వర్తమానాది ప్రయత్నము లకు సయిత మర్థము సంభవింపదు. కాన గతినివృత్తిమాత్ర మర్థముగా గ్రహింప వలయును. కాన నిదియు వస్తుశూన్యమై వికల్పరూపవృత్తి యగును.

ఇంకను ''అనుత్పత్తిధర్మా పురుషః'' అనగా పురుషు డుత్పత్తి యను ధర్మపుటభావము గలవాడు (ఉత్పత్తి యను ధర్మము లేనివాడు) అనునదియును వికల్పవృత్తియే. వీరి మతమున భావము లేదని పూర్వమే నిరూపింపబడినది గాన నుత్పత్తి ధర్మభావము గలవాడను విశేషణ విశేష్యభావము పొసగదు. ఒకవేళ పై వాక్యమునకు పురుషుడు అనుత్పత్తిరూప ధర్మము గలవాడని యర్థము చెప్పుదమన్న నదియు వికల్పవృత్తియే- అనుత్పత్తియన్న నుత్పత్త్యభావమేగదా! అయ్యది యంగీకృతము గాదు గాన ధర్మము గాజాలదు. కాన వికల్పవృత్తియే.

ఈ వికల్పవృత్తియం దుత్తరకాలమున బోధ యుండుటచే నియ్యది ప్రమాణములో నంతర్భవింపదు. అట్లున్నను విపర్యయ వృత్తియు గాదు. విపర్యయవృత్తి యందు సాధారణ జనులకు సయితము వెంటనే బోధ ప్రతీతి గలుగును. ఈ వికల్పవృత్తి యందన్ననో బహుళ వ్యవహారవశమున నతినిపుణులగు శాస్త్రవేత్తలకు మాత్రమే శాస్త్రవిచార మూలమున బోధ ప్రతీతి యుదయించును. కాన నీ వికల్పవృత్తి సర్వ విలక్షణ మైనది.

వలయును. ఆ నిద్రావృత్తియు తమోగుణ ప్రధానము గాన నితర వృత్తులవలె సమాధియందు నిరోధింపదగి యున్నది.

అవ॥ ఇపుడు మిగిలియున్న స్మృతివృత్తికి లక్షణమును జెప్పుచున్నారు.

## సూ ॥ అనుభూతవిషయాసంప్రమోషః స్మృతిః॥ 11

అనుభూతవిషయా సంప్రమోషః, స్మృతిః.

అనుభూతవిషయాసంప్రమోషః, అనుభూత=పూర్వము జ్ఞానగోచర మైన , విషయ=విషయములయొక్క, ఆసంప్రమోషః=అనుభూ తమాత్రమైన జ్ఞానము, స్మృతిః=స్మృతివృత్తి యనబడును.

ప్రత్యక్షాది ప్రమాణములచే నొకపు డనుభవగోచర మగు విషయము సంస్కార రూపమున చిత్తమున నణగియుండి, యుద్బోధక సామగ్రి యగు సదృశవస్తుదర్శన శ్రవణములు, అదృష్టము, చింత, ద్వేషము రాగము మొదలగు వానిచే ప్రకాశిత మైనచో పూర్వ మెరింగి యున్న విషయముల యాకారముచే చిత్తము రంజితమై తదాకారముగ పరిణమించును. ఇట్టి సంస్కారోద్బోధము వలన గలుగు చిత్తపరిణామమునే స్మృతి యందురు.

అనుభవము పూర్వమెరుంగని విషయముల విషయమున గలుగును. స్మరణము పూర్వమెరింగిన విషయములగురించి యేర్పడును. మరియు ననుభూతమైనంత మాత్రము స్మృత మగును. ఇయ్యది యనుభవస్మృతుల భేదము. చిత్తము స్మరించునది గ్రాహ్యమగు విషయమునా? లేక గ్రహణజ్ఞాన మునా? అట్లుగాక గ్రాహ్య గ్రహణోభయ ( విషయము, జ్ఞానము - రెంటిని) మును స్మరించునా? యని శంక యుదయించును. అందులకు సమాధానము- కేవలజ్ఞాన విషయకమగు స్మరణము లేదు. గ్రాహ్యావిషయక స్మరణమే యుక్తమని యాపాతతః (పైకి) తోచినను ''ఘటమహం జానామి'' నేను ఘటము నెరుంగుచున్నాను అను ననుభవములో ఘటమును గ్రాహ్యావిషయమును, ఘటజ్ఞానమును రెండును విషయీకరించినవి. కాన

వలయును. ఆ నిద్రావృత్తియు తమోగుణ ప్రధానము గాన నితర వృత్తులవలె సమాధియందు నిరోధింపదగి యున్నది.

అవ॥ ఇపుడు మిగిలియున్న స్మృతివృత్తికి లక్షణమును జెప్పుచున్నారు.

## సూ ॥ అనుభూతవిషయాసంప్రమోషః స్మృతిః॥ 11

అనుభూతవిషయా సంప్రమోషః, స్మృతిః.

అనుభూతవిషయాసంప్రమోషః, అనుభూత=పూర్వము జ్ఞానగోచర మైన , విషయ=విషయములయొక్క, ఆసంప్రమోషః=అనుభూ తమాత్రమైన జ్ఞానము, స్మృతిః=స్మృతివృత్తి యనబడును.

ప్రత్యక్షాది ప్రమాణములచే నొకపు డనుభవగోచర మగు విషయము సంస్కార రూపమున చిత్తమున నణగియుండి, యుద్బోధక సామగ్రి యగు సదృశవస్తుదర్శన శ్రవణములు, అదృష్టము, చింత, ద్వేషము రాగము మొదలగు వానిచే ప్రకాశిత మైనచో పూర్వ మెరింగి యున్న విషయముల యాకారముచే చిత్తము రంజితమై తదాకారముగ పరిణమించును. ఇట్టి సంస్కారోద్బోధము వలన గలుగు చిత్తపరిణామమునే స్మృతి యందురు.

అనుభవము పూర్వమెరుంగని విషయముల విషయమున గలుగును. స్మరణము పూర్వమెరింగిన విషయములగురించి యేర్పడును. మరియు ననుభూతమైనంత మాత్రము స్మృత మగును. ఇయ్యది యనుభవస్మృతుల భేదము. చిత్తము స్మరించునది గ్రాహ్యమగు విషయమునా? లేక గ్రహణజ్ఞాన మునా? అట్లుగాక గ్రాహ్య గ్రహణోభయ (విషయము, జ్ఞానము - రెంటిని) మును స్మరించునా? యని శంక యుదయించును. అందులకు సమాధానము- కేవలజ్ఞాన విషయకమగు స్మరణము లేదు. గ్రాహ్యవిషయక స్మరణమే యుక్తమని యాపాతతః (పైకి) తోచినను ''ఘటమహం జానామి'' నేను ఘటము నెరుంగుచున్నాను అను ననుభవములో ఘటమును గ్రాహ్యవిషయమును, ఘటజ్ఞానమును రెండును విషయీకరించినవి. కాన

ననుభవజన్య మగు సంస్కారమున సయితము గ్రాహ్యగ్రహణములు (ఘట, ఘటజ్ఞానములు) రెండును చేరియుండవలసియున్నది. అట్లె యట్టి సంస్కారముచే గలుగు స్మరణమునందును, గ్రాహ్య . గ్రహణములు (విషయము, జ్ఞానము) రెండును విషయములు గావలసియున్నది.

కారణములు సమముగా నున్నను, (అనువ్యవసాయ) బుద్ధియు, స్మరణమును భిన్నములు, అనువ్యవసాయబుద్ధియందు జ్ఞానము ముఖ్య విశేష్యముగా భాసించును, ''ఘటమహం జానామి'' (నేను ఘటము నెరుంగు చున్నాను) అను ననువ్యవసాయమునకు 'ఘటవిషయిక జ్ఞానము గలవాడను' అని యర్థము కాగా ఘటాంశలో జ్ఞానము విశేష్యమయ్యెను. స్మరణము నందన్నో విషయము (గ్రాహ్యవస్తువు) ముఖ్య విశేష్యముగా భాసించును. ఆఘటము అని స్మరణము గల్గుచో ఘటమే ముఖ్యమగు విశేష్యము. కాన స్మరణము వ్యవసాయముకన్న విలక్షణ మైనది.

ఆ స్మృతి (1) భావితస్మర్తవ్య ము (మిథ్యార్థవిషయ) (2) అభావిత స్మర్తవ్యము - యని రెండు తెరగులు. భావితస్మర్తవ్యమన గల్పితములగు స్మరింపదగిన విషయములు గలది యని యర్థము. ఇట్టి స్మృతి స్వప్నావస్థలో గలుగును. అభావితస్మర్తవ్యమనగా నకల్పితములగు (యథార్థములగు) స్మరణార్థవస్తువులు గలది యని యర్థము. ఇట్టి స్మరణము జాగరూకత గలిగి యుండు నపుడు గలుగును.

స్మరణము లన్నియు ప్రమాణానుభవముచేగాని, విపర్యయానుభవ ముచే గాని, వికల్పానుభవముచేగాని, నిద్రానుభవముచేగాని స్మృత్యనుభవము చేగాని గలుగును. కాన సర్వవృత్తి సాపేక్షముగా నన్నివృత్తులకు కడపటి స్మ నిరూపింపబడెను.

ఈవృత్తు లన్నియు సుఖదుఃఖ మోహరూపములు. ఆ సుఖదుఃఖ మోహములు = క్లేశరూపములు. సూత్రకారుడగు పతంజలిమహాముని రాగద్వేషాఽవిద్యాదులను మాత్రమే క్లేశములుగా లెక్కించి సుఖదుఃఖ

మోహములను గ్లేశములలో గణింపకున్నను ''సుఖానుశయీ రాగః''= (2-7) సుఖవిషయక మగునది రాగము. దుఃఖానుశయీ ద్వేషః= (2-8) దుఃఖవిషయక మగునది ద్వేషము - అని యిట్లు రెండు సూత్రములచే సుఖదుఃఖములను క్లేశకారణములుగ జెప్పబోవుటచేతను, మోహము నవిద్యయు నొక్కటియే గాన మోహముగూడ క్లేశమే గావున సుఖదుఃఖమోహ రూపములగు సకల వృత్తులు నిరోధింపదగినవి. ఈ అయిదు వృత్తులను నిరోధించుచు సంప్రజ్ఞాత సమాధియు దానిచే నసంప్రజ్ఞాత సమాధియు ప్రాప్తించును.

అవ॥ ఇంతవరకును నిరోధింపదగు వృత్తులను నిరూపించి యిక మీదట వానిని నిరోధించుట కుపాయములను బ్రతిపాదించుచున్నారు.

## సూ॥ అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః॥ 12

అభ్యాసవైరాగ్యాభ్యాం, తన్నిరోధః.

అభ్యాసవైరాగ్యాభ్యాం= అభ్యాసము వైరాగ్యమునను నుభయముచేత, తత్= ఆవృత్తులయొక్క, నిరోధః= అడ్డగించుట (ఆపుట)

  ్తల నాపుటకు, 1. అభ్యాసము. 2. వైరాగ్యము నను నవి రెండును బీజప్రాయములు. ఇందు వైరాగ్యము చిత్తమునకు స్వాభావికమగు బహిర్ముఖ ప్రసారమును నిరోధించును. రెండవది యగు నభ్యాసమాత్మో న్ముఖ మగు చిత్తపు టంతర్ముఖ ప్రసారమును స్థిరతర మొనర్చును.

చిత్తమొక నది యనుకొందము, ఈచిత్తనదికి రెండు ప్రవాహములు (పాయలులేక చీలికలు) గలవు. అందొకటి కల్యాణవహము. ఈ కల్యాణవహ ప్రవాహము ప్రకృతి పురుషవివేక రూపమగు - మార్గము గుండ బ్రవహించుచు గైవల్యమువరకును చేరును. అందు రెండవది యగు ప్రవాహము పాపవహము, ఇయ్యది యవివేకరూపమగు మార్గము గుండ బ్రవహించుచు సంసార పర్యంతము(విషయభోగ పర్యంతము)చేరును.

ఇందు విషయభోగరూపమగు పాపవహ ప్రవాహము విషయముల యందు దోషదృష్టి రూపమగు వైరాగ్యముచే నిరోధింపబడును. మరియు వివేకరూపమగు కల్యాణవహ ప్రవాహము వివేకజ్ఞానాభ్యాసముచే దెరువ బడును.

కాగా తీవ్రవేగము గల నదీప్రవాహము మొదట నానకట్టచే దుర్వ్యయము గాకుండ నరికట్టబడి విశాలముగ నొనర్పబడిన కాల్వగుండ పారింపబడి క్షేత్రములను చేరువిధమున, చిత్తవిషయ ప్రవణతా రూపవేగము విషయ దోషదృష్టిరూపమగు వైరాగ్యముచే నరికట్టబడి యభ్యాసమను కాల్వగుండ వివేకక్షేత్రమునకు జేర్పంబడును. కేవలము నదీప్రవాహము నరికట్టగనే ప్రయోజనసిద్ధి లేదు గావునను కుల్యాసహాయమున గాని యానీరు క్షేత్రము జేరజాలదు గానను, అచట నానకట్టయు,. కాల్వయు రెండు నావశ్యకములగు రీతిని యోగమునందు సయితము వైరాగ్యముచే బాహ్యావృత్తులు నిరోధింప బడినను, వివేకాభ్యాస ముండిననే చిత్తము ప్రకృతి పురుష వివేకమును విడనాడ కుండును, అట్లు గానినాడు వృత్తినిరోధమునకు దార్ఢ్యము గలుగకుండుటచే నది క్షణభంగర మగును. కావున నుభయమును చేరియే యోగమునకు సాధనములని తలచియే సూత్రకారులగు పతంజలి మహాముని యీసూత్రమున ''అభ్యాసవైరాగ్యాభ్యాం'' అని ద్వంద్వ సమాసమును గూర్చి యున్నారు. మరియు **'అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే'** యను (భగ. 6-8) భగవద్వచనమునందలి సముచ్చ యార్థకమగు 'చ' యను శబ్దము సయితము వికల్పమును సమ్మతించుట లేదు.

ఈ సూత్రమునం దభ్యాసరూప సాధనమును ముందును, వైరాగ్యరూప సాధనము నావలను జెప్పియున్నను. వైరాగ్యమును ప్రథమ సాధనముగాను కార్యానుగుణముగ మనమెంచవలయును. వైరాగ్యముచే జిత్తమంతర్ముఖ మగునంత పట్టును అభ్యాసము దేనిని చేయును? చిత్తమంతర్ముఖ మగునేని యీయంతర్ముఖత్వము స్థిరముగ నుండుటకై యభ్యాస మపేక్షిత మగును. కాన వైరాగ్యము ప్రథమమునను తదనంతరమున

నభ్యాసము నావశ్యకము లగును. ఈ విషయమును తెలుపతలంచి యే భాష్యకారులగు శ్రీవ్యాసభగవానులు వైరాగ్యమును మున్ముందు వివరించి యంతట నభ్యాసమును వివరించిరి.

అవ॥ పైరెండు సాధనములలో సూత్రమునందు మొదట దెలుపబడిన యభ్యాసమునకు లక్షణమును దెలుపుచున్నారు.

## సూ॥ తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః॥ 13

తత్ర, స్థితౌ, యత్నః, అభ్యాసః॥

తత్ర=ఆ చిత్తవృత్తిని నిరోధించుటలో, స్థితౌ=చిత్తము స్థిరముగా నుండు విషయమున, యత్నః=దానికంగములగు యమ నియమాదుల నుత్సాహముతో ననుష్ఠించుట యను యత్నమే, అభ్యాసః=అభ్యాసము (అనబడును)

రాజస తామస వృత్తులు లేని చిత్తమునకు నెడతెగని సాత్త్విక వృత్తి సహితత్వమును స్థిరపరచుటకై యుత్సాహ పూర్వకముగ చిత్తైకాగ్ర్యమున కంగములగు యమనియమాదులయందు తత్పరు డగుట యభ్యాస మనబడును. (యత్నము, ఉత్సాహము, వీర్యము అను మూడు పదములు సమానార్థకములు).

ఈ యభ్యాసమే చిత్తస్థైర్యమును సంపాదించి చిత్తము నేకాగ్రము నొనర్చును. అసాధ్యమగు కార్యముసయితం మీయభ్యాసము వలన నెరవేరును. విషము, నల్లమందు మొదలగు వస్తువులను భుజించుటచే మనుజుడు సామాన్యముగా చచ్చును. లేదా మత్తుగలిగి యొడలెరుగక పడిపోవును. కాని యావిషపదార్థములను భుజించు నభ్యాసముగల యాతడు చావక మూర్ఛిల్లక యుండుటయు గాక యా యభ్యాసములగు విషపదార్థములను భుజింప కున్నచో మృతసదృశు డగును, ఆ విధముననే ముముక్షువు సయితము చిత్తస్థైర్యము ననవరతము నభ్యసించు చుండునేని యయ్యదియు నతని వశమయి పోవును. దుష్కరమగు కార్యమును సయితము సులభముగా చేయుట యభ్యాసమునకు స్వభావము.

అవ॥ చిత్తపు బాహ్యసంస్కార మనాది యైనది గాన నభ్యాసము నడ్డగించునేని యీాయభ్యాసము చిత్తస్థైర్యము నెట్లు సాధించు నను సంశయమును బోనడచుచున్నారు.

## సూ॥ స తు దీర్ఘకాలనైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః॥ 14

సః. తు, దీర్ఘకాలనైరంతర్యసత్కారాసేవితః, దృఢభూమిః.

సః తు=ఆ ముందు చెప్పబడిన యభ్యాస మన్ననో, దీర్ఘకాల నైరంతర్యసత్కారాసేవితః, దీర్ఘకాల=చాలకాలము వరకును, నైరంతర్య= ఎడతెగకను, సత్కార=తపముచేతను, బ్రహ్మచర్యముతోడను, శ్రద్ధతోడను, విద్యచేతను, ఆసేవితః=అనుష్ఠింపబడినదై, దృఢభూమిః= దృఢస్థితి గలది (గానగును) బాహ్యసంస్కారములచే వెంటనే తిరస్కరింప బడకుండును.

అభ్యాసము తపముతోడను, బ్రహ్మచర్యముతోడను, శ్రద్ధతోడను, జపరూప విద్యతోడను కూడి నిరంతర మనుష్ఠింపబడునేని దృఢమై బాహ్య సంస్కారములచే దిరస్కరింపబడ కుండుటయే గాక యీా బాహ్య సంస్కారములను దానే తిరస్కరించును.

అనాది కాలక్రమాగతములై విషయభోగ వాసనాజన్యములగు బాహ్య సంస్కారములచే జిత్తము చాంచల్యమును మాత్ర మభ్యసించి యున్న కారణమున చాంచల్య మనునది చిత్తమునకు ముఖ్యస్వభావముగా గనపడు చున్నది. కాన నీ చిత్త చాంచల్యము ఆగంతుకములును, స్వల్పకాలస్థితము లగు నే యుపాయములచేనేని నివారింపరానిదియైనను, దీర్ఘకాలపర్యంతము చిత్తస్థైర్యాభ్యాసమువలన నీ చాంచల్యము బోద్రోవవచ్చును. ఇయ్యదియ చిత్తస్థైర్య సంపాదనమునకు ముఖ్యోపాయము. బహుకాలము చిత్తస్థైర్యము నభ్యసింపజాలనిచో బోనిమ్ము. దినమునకు రెండు గడియలైనను నిరంతరముగా ననగా నవిచ్ఛిన్నముగా నభ్యసింపుడు. ఆ యభ్యాసము సయిత మలక్ష్యముగ జేయక శ్రద్ధాదులతోడ నొనర్పుడు, అంతియ చాలును.

ఇయ్యది కష్టసాధ్యమని యీ యభ్యాసమును మానకుడు. ఉత్సాహయుక్తులై ఖేదము నొందక నిరంతరాభ్యాసతత్పరులు గండు. ఈ విషయము భగవద్గీతయందును జెప్పబడియున్నది. **"స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా (6-23.) అనగా శీఘ్రముగ"** సిద్ధింప లేదని ఖేదము నొందక శ్రద్ధతో యోగ మభ్యసింప వలయును అని భావము.

అవ॥ చిత్తైకాగ్ర్యమునకు సాధనమును, చిత్తైకాగ్ర్య విరోధులగు విషయవృత్తులకు ప్రతిబంధకము నగు నపరవైరాగ్యమునకు లక్షణమును జెప్పుచున్నారు.

## సూ॥ దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్ ॥ 15

దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్య వశీకారసంజ్ఞా, వైరాగ్యమ్.

దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్య, దృష్ట=ఇహలోకమునందు దృష్టి గోచరములై భోగోపయుక్తములగు వనితాన్నపాన స్రక్చందన, ప్రభుత్వాదులయందును, ఆనుశ్రవిక=వేదాదులయందు శ్రుతములై స్వర్గము నందు గలుగు నమృతపానాప్సరః ప్రాప్తి జరామృత్యురాహిత్యాదు లందును, విదేహభావప్రాప్తి. ఈ ప్రకృతులయప్రాప్తి (1-19 సూ.చూ.)యందును. అన్నిటి విషయమునను, వితృష్ణస్య= ఆశలేని ముముక్షువునకు, వశీకార సంజ్ఞా=వశీకార సంజ్ఞ యను పదముచే వ్యవహరింపదగు, వైరాగ్యం= అపరవైరాగ్యము (గలుగును).

స్రక్చందన వనితా భోజన పాన శయ్యాసనాది భోగములు మన కనవరతము కనబడుచు నైహిక (అదివ్య) భోగము లనబడును. స్వర్గము, ఇంద్రత్వము, అమృతపానము, అప్సరస్సంబంధము, స్థూలసూక్ష్మ శరీరములను విడచి లీన మగుటయు, చిత్తమునకు ప్రకృతి లయము (1-19 చూ.) నను నీయవి యానుశ్రవికములు. అనగా శ్రుతిస్మృతులవలన వినబడు దివ్యభోగము లనబడును.

ఇట్టి దివ్యాదివ్య భోగములు లభించినను విషయము లందన్నిటను

దోషము లున్నవని యెంచి (ప్రసంఖ్యానముద్వారా) యావిషయముల యందు రాగద్వేషములు లేక యియ్యది గ్రాహ్యమని యేని యియ్యది త్యాజ్య మనియేని తలంపకుండుటయే వశీకారసంజ్ఞక వైరాగ్యము.

ఈ వశీకారసంజ్ఞక వైరాగ్యము సయితము బాహ్యావృత్తి నిరోధమునకు ముఖ్యోపాయమే. ఏ వస్తువు విషయమున మనుజునకు మిక్కిలి వైరాగ్యము గలిగినదో యా వస్తువునుగూర్చి విరక్తు డెప్పుడును నాశింపడు. మరియు నావస్తువు కంటబడెనేని యాతని మనస్సు కటకటబడును గూడ. అట్లే దివ్యవస్తువుల విషయమున దోషమును గమనించినందున వైరాగ్యము ఉదయించెనేని యా విరక్తమగు చిత్తమున నేనాటికిని మరల విషయోప భోగమునం దాశ యావంతయు నంకురింపదు సరిగదా! యట్టి భోగములను చూచెనేనియు దలచె నేనియు జిత్తముత్తలపడును. కావుననే చిత్తపు బాహ్యావృత్తి వైరాగ్యముచే నిరోధింపబడును. ఇట్టి వైరాగ్యము గలుగుటకు బ్రసంఖ్యానము (అనగా విషయములయందు దోషదృష్టి) తప్పక యుండ వలయును. ప్రసంఖ్యానము లేక దృఢవైరాగ్యము గలుగదు.

వస్తుతః వైరాగ్యములు నాలుగు. అయ్యవి. 1. యతమాన సంజ్ఞకము, 2. వ్యతిరేక సంజ్ఞకము, 3. ఏకేంద్రియ సంజ్ఞకము, 4. వశీకారసంజ్ఞక మనబరగును. వీనిలో గడపటి దగు వశీకార సంజ్ఞకాపర వైరాగ్యము సూత్రించిన కారణమున బూర్వ వైరాగ్యములు మూడును సూచితము లయ్యెను. అట్లు గాదేని యా మూడు వైరాగ్యములు గ్రమముగ గలుగక కడపటిదగు వశీకారసంజ్ఞక వైరాగ్యము గలుగదు. కాన నసంగత మగును. కాన నవియు నిచట ప్రతిపాదిత తుల్యములే గాన వానిని వివరింపవలసి యున్నది.

1. యతమానసంజ్ఞక వైరాగ్యము- రాగాదులు చిత్తకమలములుగాన, నా రాగాదులే యింద్రియములను విషయములపై బ్రసరింపజేయు చున్నవి. కాన రాగాదులు ఇంద్రియములను విషయములపై బ్రసరింప జేయకున్న బాగుండునని తలంచి రాగాదులను లోలోన నశింపజేయ యత్నించుటయు యతమాన సంజ్ఞక వైరాగ్యము. ఇది వైరాగ్యమునకు మొదటిదశ.

2. వ్యతిరేకసంజ్ఞక వైరాగ్యము-పైవిధమున రాగాది మలముల నుపచరింప యత్నింతుమేని యందు గొన్ని పక్వము లగును. మరికొన్ని పక్వము లగుటకు సిద్ధముగా నుండును. అట్టి స్థితియందు వైద్యునిరీతి పక్వములగు వానిని యపక్వమలములకన్న వేరుగా నెరుగుట (అనగా యీచిత్తకమలములు నివర్తించినవి. ఈ మలము లింకను నివర్తింవలసి యున్నవి యని యెరుగుట) వ్యతిరేకసంజ్ఞక వైరాగ్యము. ఇది వైరాగ్యమునకు రెండవ మెట్టు.

3. ఏకేంద్రియ సంజ్ఞక వైరాగ్యము-ఇంద్రియము లన్నియును పక్వము లగుటచే నామలము లింద్రియములను ప్రవర్తింప శక్తిచాలక యుత్కంఠా మాత్రమున చిత్తమున నిలచియుండుట యేకేంద్రియ సంజ్ఞక వైరాగ్యము. ఇయ్యది వైరాగ్యమునకు మూడవ పర్వము.

4.వశీకారసంజ్ఞ వైరాగ్యము-నిఖిల విషయములయందు దోషదృష్టిచే నుపేక్షాబుద్ధి గలుగుటచే నుత్కంఠ సయితము నివర్తించెనేని యయ్యదియ వశీకారసంజ్ఞక వైరాగ్యము. ఇయ్యది వైరాగ్య తురీయావస్థ.

అవ॥ ఇట్లు సంప్రజ్ఞాత యోగమునకు సాధనమగు నపర వైరాగ్యమును నిరూపించి యసంప్రజ్ఞాత సమాధికి సాధనమగు పరవైరాగ్యమునకు లక్షణమును నుడువుచున్నారు.

## సూ॥ తత్పరం పురుషఖ్యాతేః గుణవైతృష్ణ్యమ్॥ 16

తత్, పరం, పురుషఖ్యాతేః, గుణవైతృష్ణ్యమ్.

పురుషఖ్యాతేః=ప్రకృతిపురుషవివేకము గలుగుటవలన, గుణ వైతృష్ణ్యమ్-గుణకార్యమగు వివేకజ్ఞాన విషయమునను తృష్ణ (ఆదరము) లేకుండుటయును, తత్=ఆవైరాగ్యము, పరం=పరవైరాగ్యము.

ఐహికాముష్మిక విషయములయందు దోషదర్శి యగుటచే విరక్తుడై (ఇంతవరకు నపరవైరాగ్యము) యోగి ఆగమాది మూలమున బురుష

దర్శనాభ్యాసవశమున రజస్తమములు నశింపగా విశుద్ధమగు సత్త్వముచే ప్రవివేకము, (పురుషుడు శుద్ధుడు అనంతుడు, గుణములు అశుద్ధములు సాంతములు.) బుద్ధి గలవాడై (ఇంతవరకు ధర్మమేఘసమాధి చెప్పబడినది); యనంతరము వ్యక్తధర్మములగు లౌకికాలౌకిక జ్ఞానక్రియాది గుణముల నుండియు, నవ్యక్తధర్మములగు విదేహప్రకృతిలయాది గుణముల నుండియు విరక్తు డగును.

అనగా నైహికాముష్మిక విషయముల మీద నాశ మాని ప్రకృతి పురుషవివేకము గలిగి యుండుట యొక వైరాగ్యము. ఆ ప్రకృతి పురుష వివేకమునందు సయితమాశ లేకుండుట రెండవ వైరాగ్యము. ఇయ్యదియే పరవైరాగ్యము. ఈరెండవ వైరాగ్యమునందు సంప్రజ్ఞాత సమాధిలోని ధ్యేయాకార వృత్తిని నిరోధించుటకు ధ్యేయాకారమునందు వైరాగ్యము గలుగును. అనగా సమాధికి ఫల మగు దానియం దిచ్ఛ యుండదు. రజస్తమ ముల లేశమేని యందు లేకుండుటచే ఈ పరవైరాగ్యమును జ్ఞానప్రసాద మాత్రము అందురు. జ్ఞానప్రసాద ముదయించుచో పురుషుడాత్మ జ్ఞానము గలవాడై ప్రాప్యమగు జ్ఞానము (కైవల్యము) ప్రాప్తించినది. నశింపజేయదగు పంచక్లేశములు నశించినవి. సానుబంధమైన జనన మరణ కారణమగు సంసారము త్రెంపబడెను - అని తలంచును.

ఈ వైరాగ్యమే జ్ఞానమున కవధి(ఎల్ల), కైవల్యము సయిత మీవైరాగ్యమును వెంట నంటియుండును.

అవ॥ ఇట్లు వృత్తి నిరోధోపాయములగు నభ్యాసవైరాగ్యముల నిరూపించి యీ యుపాయములచే జిత్తము నిరోధించిన యోగికి గలుగు సంప్రజ్ఞాత సమాధిలోని యవాంతర భేదములను తెలుపుచు తత్స్వరూప లక్షణము నెరింగించుచున్నారు.

**సూ॥ వితర్కవిచారానందాస్మితాస్వరూపానుగమాత్ సంప్రజ్ఞాతః ॥** 17

వితర్క విచారానందాస్మితా స్వరూపానుగమాత్, సంప్రజ్ఞాతః॥

వితర్కవిచారానందాస్మితా స్వరూపానుగమాత్ = వితర్కము యొక్కయు, విచారముయొక్కయు, ఆనందము యొక్కయు, అస్మిత యొక్కయు, స్వరూప=స్వరూపములయొక్క సంబంధము వలన, సంప్రజ్ఞాతః= సంప్రజ్ఞాత సమాధి (గలుగును).

తా॥ సంశయవిపర్యయ రహితముగ ధ్యేయాకారమును యథార్థముగ విషయీకరించు భావనావిశేషమే సంప్రజ్ఞాతసమాధి యనబడును. కాగా ధ్యేయ వస్తుభేదమువలన సంప్రజ్ఞాత సమాధియు, 1.వితర్కాను గతము 2. విచారానుగతము 3.ఆనందానుగతము 4. అస్మితానుగతము నని నాలుగు తెరగుల నుండును. ఇట్టి భావననే సవికల్పసమాధి లేక సవికల్పయోగ మందురు.

విషయాంతరములకు జననీక చిత్తము నేదేనొక ధ్యేయపదార్థముతోడ మాటిమాటికిని జేర్చుటయే భావన యనబడును. ఈ భావనకు విషయమగు వస్తువు భావ్య మనబడును. ఈ భావ్యవస్తువు (1) గ్రాహ్యము (2)గ్రహణము. (3)గ్రహీత యని ముత్తెరంగుల నుండును. గ్రాహ్యమొక్క టియే, స్థూలసూక్ష్మ భేదములచే నిఱుతెఱగులు. ధనుర్విద్య నభ్యసించు నతడు తొలుత స్థూల లక్ష్యమును గొట్టుట యలవరచుకొని యనంతరము సూక్ష్మలక్ష్యమును గొట్ట నుద్యుక్తు డగునటుల యోగాభ్యాసియు ముందుగ స్థూలభౌతిక చతుర్భుజాద్యాకారమునందు భావనను నిలిపి యటుపిమ్మట సూక్ష్మ పంచతన్మాత్రములయందు బాదుకొలుపును. ఆ స్థూల సూక్ష్మ భావనలు గ్రాహ్యభావన లనబడును.

ఇందు స్థూలభావనయే వితర్కానుగత సంప్రజ్ఞాతసమాధి. సూక్ష్మవిషయకత భావనయే విచారానుగత సంప్రజ్ఞాతసమాధి. ఇట్టి రజస్తమో లేశయుతమై సత్త్వప్రధానమై యహంకార కార్యమైన యింద్రియ దశకము విషయమున గలుగు భావనయే (గ్రహణ సమాధి) ఆనందానుగత

సంప్రజ్ఞాతసమాధి యనబడును. సత్త్వము సుఖప్రకాశ రూపముగాన సత్త్వప్రధానమగు నీ సమాధి యానందానుగత మనబడెను. ఈ యానందానుగతసమాధిలో నిమగ్నులై ప్రకృతి పురుషతత్త్వముల తెలివియే లేకుండువారు విగత దేహాహంకారులు గాన విదేహు లనబడుదురు.

ఇంద్రియములకు కారణమగు నహంకారమేని, బుద్ధియేని, ప్రకృతి యేని, పురుషుడేని విషయము గాగల భావన (గ్రహీతృసమాధి) యస్మితానుగత సంప్రజ్ఞాతసమాధి. అస్మిత యన నహంకారము. ఈ యహంకారము బహిర్ముఖావస్థయందు గలుగు క్లేశరూపాహంకారము గాదు. అంతర్ముఖావస్థ యందు గలుగు నానందరూపమై యింద్రియములకు కారణమగు నహంకారమని తలచవలయును. మరియు నీయహంకారము ఆత్మతోడ బుద్ధికి నైక్యమును తెలుపు జ్ఞానమే యని భాష్యకారులు ''ఏకాత్మికా సంవిత్ అస్మితా'' యని వ్యాఖ్యానించి యున్నారు.

ఈ యస్మితానుగత సమాధిలోని యానందమునకు దనివి జెంది యాత్మదర్శన ప్రవృత్తులుగాని వారి చిత్తము కారణ ప్రకృతియందు లీనమగును. కాన వారు ప్రకృతిలీను లనబడుదురు.

ఈ నాల్గు సమాధులయందును వితర్కానుగతమును దాటిన విచారానుగతమును, దానినధిగమించిన నానందానుగతమును, దాని నతిక్రమించిన నస్మితానుగత సమాధియు నొనగూడును.

వీనిలో మొదటిదగు వితర్కానుగత సమాధి, వితర్కము, విచారము, ఆనందము, అస్మితలతోడ గూడియే యుండును. ఏలనన ఘటాది కార్యములందు మృత్తిక తప్పక యుండితీరు విధమున సకల కార్యముల యందును తత్కారణమును అనుగతమై యుండును. అట్లె పంచభూతములకు పంచతన్మాత్రలు కారణము లగుటచే స్థూలభూతముల యందు తన్మాత్ర లనుసరించి యుండును. ఇట్లు పంచతన్మాత్రల కహంకారము కారణము గాన తన్మాత్రల ద్వారా నహంకారమును పంచభూతములలో ననుగతమై

యుండును. అహంకారమునకు బుద్ధి కారణము గాన నహంకారముద్వారా బుద్ధియు పంచభూతములలో చేరియే యుండును. కాగా స్థూలభూతము లను భావించుచో తన్మాత్రలను అహంకారములను బుద్ధిని భావించి నట్లగును. కాగా ఈస్థూల విషయక మగు వితర్కానుగతసమాధి వితర్క విచారానందాస్మితానుగతమే యగును. ఇట్లే విచారానుగత సంప్రజ్ఞాత సమాధియు, విచారానందాస్మితములచే ననుసరింపబడి యుండును. ఈ సమాధి యందు స్థూలభూతముల భావన గలుగదు. కాన నిందు వితర్కము మాత్ర ముండదు. తక్కిన మూడు నుండును. అట్లె యానందానుగత సంప్రజ్ఞాత సమాధిలో స్థూలసూక్ష్మ భూతములు భాసించవు. కాన నది యానందాస్మితలు రెంటితో కూడియుండును. అస్మితానుగత సంప్రజ్ఞాత సమాధిమాత్ర మొంటరిగ నుండును. ఇందస్మితాతిరిక్త మగు నేదియు భాసింపదు.

ఈ సమాధు లన్నియు ధ్యేయాకారము నవలంబించి యుండును. కాన సాలంబనము లనియు, మరియు వీటన్నిట నాత్మభిన్నములైన యనాత్మ స్వరూపములను ధ్యానించుట యను నజ్ఞానరూపబీజ ముండును గాన నివి సబీజసమాధు లనియు పేర్కొనబడును.

అవ॥ ఇట్లు అపరవైరాగ్యముచే గలుగు సంప్రజ్ఞాత సమాధిని వివరించి యిక పరవైరాగ్యముచే గలుగు నసంప్రజ్ఞాత సమాధికి లక్షణమును దెలుపుచున్నారు.

## సూ॥ విరామప్రత్యయాభ్యాసపూర్వః సంస్కారశేషోఽన్యః॥ 18

విరామప్రత్యయాభ్యాసపూర్వః, సంస్కారశేషః, అన్యః॥

విరామప్రత్యయాభ్యాసపూర్వః, విరామ=ముందు జెప్పిన వితర్కాది భావనలను విడచుటకు, ప్రత్యయ=కారణమగు పరవైరాగ్యము యొక్క, అభ్యాసః=అభ్యాసము, పూర్వః=ముందు గలుగు నట్టి, సంస్కార శేషః=వృత్తి రహితమగు సంస్కారమాత్రశేషము, అన్యః= పూర్వోక్త సంప్రజ్ఞాత సమాధికన్న

వేఱైనది, అనగా నసంప్రజ్ఞాత సమాధి యనబడును.

వేయింపబడిన శనగగింజ మొలకెత్తజాలకుండి స్వాకారమాత్ర శేషమై యున్న వడువున స్వవృత్తులు (ధ్యేయాకారముగూడ) నిరోధింపబడిన చిత్తము సయితము వృత్తి రూప కార్యమును జేయజాలక సంస్కారమాత్ర శేష మగును. అట్టి స్థితియే, యసంప్రజ్ఞాత సమాధి యనబడును. ఈ సమాధి సులువుగ లభింపదు గాని పరవైరాగ్యముచే లభించును. సంప్రజ్ఞాత యోగమునందు ధ్యేయాకార మాశ్రయము (ఆలంబనము) గానుండును. కాని యీ అసంప్రజ్ఞాత సమాధి యందన్ననో (ఆలంబనము) యాశ్రయ మొండు లేదు. కాన నీ యసంప్రజ్ఞాత సమాధికి విరామ ప్రత్యయము (అనగా భావనలు లేకుండుటకు గారణమగు పరవైరాగ్యము మాత్రమే) యుపాయము గాజాలును. కాని ధ్యేయాకారము నాలంబనముగా నొనర్చికొని కలుగు నపరవైరాగ్య ముపాయము (సాధనము) గాజాలదు. ఎక్కడ నైనను గారణము కార్యమునకు సమానరూపము గలదిగా నుండవలయును. అపరవైరాగ్యమున ధ్యేయాకార మాలంబనముగా నుండుటచే నది సాలంబనము. అసంప్రజ్ఞాత సమాధి నిరాలంబనము గాన నిరాలంబన మగు పరవైరాగ్యమే దీనికి సాధన మగును. అసంప్రజ్ఞాత సమాధి సంసారబీజ భూతము లగు నవిద్యాది క్లేశములు నశించుటవలన నిర్బీజ సమాధి యనబడును. మరియు నది ఆలంబనము (ఆశ్రయము) లేనిది గాన నిరాలంబనసమాధి యనబడును.

చిత్తమునకు 1. వ్యుత్థానము (బహిర్ముఖావస్థ) 2. సమాధి ప్రారంభము, 3. ఏకాగ్రత, 4. సర్వవృత్తి నిరోధము - అను నాలుగు పరిణామములు గలవు. రెండవ సూత్రములో తొలుత దెలుపబడిన క్షిప్తము మూఢమునను రెండవస్థలు వ్యుత్థాన మనబడును. మూడవది యగు విక్షిప్తభూమికలో సత్త్వగుణ మతిశయించి యుండును గాన నది సమాధి ప్రారంభముగ నంగీకరింపబడెను. నాల్గవది యగు నేకాగ్రభూమికయే యేకాగ్రత యను పరిణామము. ఐదవదియగు నిరుద్ధభూమికయే నిరోధావస్థ. ఇందు వ్యుత్థానమున గలిగియుండు సంస్కారములను సమాధి

ప్రారంభముచే గలుగు సంస్కారములును, సమాధి ప్రారంభమున గలిగిన సంస్కారములు నేకాగ్రతచే గలుగు సంస్కారములను దొలగించును. ఏకాగ్రతయందు గలుగు సంస్కారములను నిరోధముచే గలుగు సంస్కారములు తొలగించుచు తాము సయిత మణగిపోవును. ఇట్టి స్థితి యస్వాభావికము గాదు. వెండితో సీసమును జేర్చి కొలిమిలో నూదినచో సీసము వెండిలోనుండు మాలిన్యమును బోకడచి తానును నశించిపోవునట్లు నిరోధసంస్కారము లేకాగ్రతాజన్య సంస్కారమును దొలగించి తామును నశించును.

అవ॥ ఈ వృత్తినిరోధము (1) ఉపాయప్రత్యయము (శ్రద్ధాద్యుపాయ ములచే గలుగునది) (2) భవప్రత్యయము (ఆత్మభిన్న వస్తువుల నాత్మయని తలచుటయను నజ్ఞానముచే గలుగునది) నని రెండు విధములు. ఇందుపాయ ప్రత్యయము యోగులకు గలుగును. (ఇయ్యది ముక్తి సాధనము గాన ముముక్షువులకు గ్రాహ్యము. ఈ విషయము 1-20వ సూత్రమున నెరింగింపబడును.) ఇప్పుడు రెండవది యగు భవప్రత్యయ మెవరికి గలుగునో చెప్పుచున్నారు.

## సూ॥ భవప్రత్యయో విదేహప్రకృతిలయానామ్ ॥ 19

భవప్రత్యయః, విదేహప్రకృతిలయానామ్।

దేహప్రకృతిలయానామ్, విదేహ=స్థూలసూక్ష్మ దేహము లను విడనాడి ఆనందసమాధిలో నుండువారికిని, ప్రకృతి లయానాం= కారణ ప్రకృతియందు లీనమగు మనసు గలవారికిని, భవప్రత్యయః= భవప్రత్యయము అను సమాధి గలుగును.

భవశబ్దమునకు సంసారమనియు, సంసారకారణమగు నజ్ఞానము (అవిద్య) అనియు నర్థములు. సంసారమనగా-జన్మమరణ ప్రవాహము కాగా ''భవస్య ప్రత్యయః'' అను వ్యుత్పత్తిచే సంసారకారణము అనిగాని ''భవ ఏవ ప్రత్యయః యస్య'' అను వ్యుత్పత్తిచే నజ్ఞానమే (అవిద్యయే)కారణముగా గలది యను

నర్థములు సిద్ధించును. కాగా విదేహులకును ప్రకృతిలయులకును గలుగు వృత్తి నిరోధము ఆత్మతత్త్వాజ్ఞానజన్యమును, జన్మమరణ ప్రవాహ కారణము నగునుగాని ముక్తికి నుపాయము గాదు.

ఇందు విదేహు లనగా పంచభూతములయందుగాని యింద్రియము లందేని (వికృతులయందు) యాత్మభావన చేసి సమాధియందు వానిలో నేదేనొండాలంబనముగ నుంచికొని ధ్యానించువారలు. వీరలు దేహమును త్యజించి నంతట తామాత్మగా దలచి భావించు భూతములలో నేని, యింద్రియములలో నేని (వికృతులలో) లీన మగుదురు. వీరిచిత్తము సంస్కారమాత్ర శేష మగును, వీరికి దేహ ముండదు గాన విదేహులు(దేహము లేని వారు) అని చెప్పబడుదురు.

ఇట్టివారు కొంతకాలము దేవతలై యుండి మరల భూమియం దుద్భ వింతురు. వీర లాయవస్థలో కైవల్యముతో తుల్యమగు (వృత్తి నిరోధసామ్యము వలన నిట్లు చెప్పబడినది గాని యథార్థముగ కైవల్యమునకు దీనికి పోలిక లేదు) పదవి ననుభవించి మరల స్వకాలపరిమాణము ముగిసినంతటనే సంసారమున దగుల్కొందురు. అనగా నింద్రియచింతకులు పది మన్వంతరములును, భూతచింతకులు నూరు మన్వంతరములును దాటిన వెంటనే మరల సంసారమున బడుదురు. ఈ విషయమున వాయుపురాణమున నిట్లున్నది.

**దశ మన్వంతరాణీహ తిష్ఠన్తీన్ద్రియచింతకాః।**
**భౌతికాస్తు శతం పూర్ణం సహస్రం త్వాభిమానికాః।**
**బౌద్ధా దశసహస్రాణి తిష్ఠంతి విగతజ్వరాః।**
**పూర్ణం శతసహస్రం తు తిష్ఠన్త్యవ్యక్త చింతకాః।**
**పురుషం నిర్గుణం ప్రాప్య కాలసంఖ్యా న విద్యతే॥**

ఇంద్రియములయం దాత్మచింతన మొనర్చువారు పదిమన్వంతరము లింద్రియములలో లీనమ్మై యుందురు. పంచభూతముల నాత్మగా భావించువారలు నూరు మన్వంతరములు భూతములలో లీనులై యుందురు. అహంకారమును భావించువారు వేయి మన్వంతరము

లహంకారమున లీనులగుదురు. బుద్ధి నాత్మగా భావించువారు పదివేల యేండ్లు బుద్ధిలో లీనమగుదురు. అవ్యక్తము (మూలప్రకృతి) నాత్మగా నుపాసించు వారు నూరువేల యేండ్లు ప్రకృతియందు లీనులయ్యెదరు. వీరియానందా నుభవముల కివి హద్దులు. ఆవల సంసారమున బడుదురు. అసంప్రజ్ఞాత సమాధి ద్వారమున నాత్మచింతన మొనర్చువారలు శాశ్వతానందము నందుండుదురు. వారికి సంసారప్రాప్తి యెన్నటికిని లేదు.

ప్రకృతిలయు లనగా- ప్రకృతియందేని, మహాతత్త్వమునందేని, యహం కారమునందేని, పంచతన్మాత్రల యందేని యాత్మత్వభావన చేయువారలు. వీరు దేహత్యాగానంతరము తాము భావించు ప్రకృతిలో లీను లగుదురు గాన ప్రకృతిలయు లనబడుదురు. వీరల యానంద కాలపరిమితి యింతకుముందే తెలుపబడినది. గ్రీష్మకాలముననే మట్టిలో గలసిన కప్ప వర్షాకాలము రాగానే మరల స్వస్వరూపము నొందును. ఆ కాలపరిమితి దాటినంతనే మరల సంసారమున బడుదురు.

ఈ విదేహులును ప్రకృతిలయులును తమ ధ్యేయములలో లీనులై యుండువరకును శరీరేంద్రియ విషయ సంయోగము లేకుండుటచే వీరి చిత్తవృత్తు లుడిగియుండును. కాగా నిట్టి ప్రకృతి వికృతి లయకాలము లందు గలుగు చిత్తవృత్తి నిరోధము భవప్రత్యయ మనబడును. ఈ సమాధి యాత్మభిన్నములగు ప్రకృతివికృతులయం దాత్మత్వభావన యను నజ్ఞానము (అవిద్య) చే గలిగిన జన్మమరణములకు గారణముగనే యుండును. గ్రహణ సమాధి యందుండువారు విదేహులు, గ్రహీతృసమాధి గలవారు ప్రకృతి లయులు.

అవ॥ ఇట్లు భవప్రత్యయసమాధిని వివరించి యింక యోగులకు గ్రాహ్యమగు నుపాయప్రత్యయసమాధిని దెలుపుచున్నారు.

## సూ॥ శ్రద్ధావీర్యస్మృతిసమాధి ప్రజ్ఞా పూర్వక ఇతరేషామ్ ॥ 20

శ్రద్ధావీర్యస్మృతి సమాధి ప్రజ్ఞాపూర్వకః, ఇతరేషామ్.

ఇతరేషాం=విదేహులకన్నను ప్రకృతిలయులకన్నను భిన్నులగు యోగులకు (గలుగు సంస్కారమాత్ర శేషమగు వృత్తి నిరోధము) శ్రద్ధావీర్యస్మృతిసమాధి ప్రజ్ఞాపూర్వకః=శ్రద్ధా పూర్వకమును, వీర్యపూర్వక మును, స్మృతి పూర్వకమును సమాధిపూర్వకమును, ప్రజ్ఞాపూర్వకమును నగును. (అనగా శ్రద్ధాద్యుపాయ ములచే గలుగును. కాన నుపాయ ప్రత్యయ మనబడును.)

తా॥ ఉపాయప్రత్యయసమాధి యోగులకు మాత్రము గలుగును. ఈ సమాధిసిద్ధికి 1. శ్రద్ధయు, 2.వీర్యము. 3.స్మృతి. 4. సమాధి. 5.ప్రజ్ఞ యనునవి యుపాయములు.

1. ఇందు శ్రద్ధ యనగా యోగవిషయమున బ్రవర్తించు చిత్తము నిర్మలముగా నుండుట. దీనినే యభిరుచి యనియు నుత్కటేచ్ఛ యనియు గూడ వ్యవహరింతురు. ఇట్టి శ్రద్ధశాస్త్రపఠనము ఆచార్యాద్యుపదేశము అనుమానముల వలన తెలియబడిన వస్తువు విషయముననే ప్రవర్తించును, గాని యితర వస్తువుల విషయమున గలుగదు. (ఇతర వస్తువిషయకమగు) నభిరుచి యిచ్ఛుట శ్రద్ధ యనబడదు) ఇట్లు శ్రద్ధయే తల్లివలె శుభకరమై యోగిని గాపాడును.

2. వీర్యము-పై వివరింపబడిన శ్రద్ధగలిగి వివేకము నభిలషించిన యోగికి యోగవిషయమున గలుగు నుత్సాహము (ప్రయత్న విశేషము) వీర్య మనబడును. ఈ వీర్యము సయితము శ్రద్ధ యుండిననే గలుగును. ఈ వీర్యమునే ధారణ యనియు నందురు.

3. స్మృతి- పై శ్రద్ధాజన్యమగు వీర్యమువలన యోగికి ధ్యేయవస్తువు విషయమున జిత్తస్థైర్యరూపమగు ధ్యానము లభించును. ఆ ధ్యానమే స్మృతి యనబడును.

4. సమాధి- పై స్మృతి (ధ్యానము) కలుగుటచేతనే యోగి చిత్త మచంచలమై యోగమునకు కడపటి యంగమగు సమాధి నొందును. (సమాధ్యంగములగు యమనియమాదుల నొందును.)

5. ప్రజ్ఞా-పై విధమున సమాధినిష్ఠమగు చిత్తమునకు ప్రజ్ఞా వివేకము, (జ్ఞానాధిక్యము, సంప్రజ్ఞాతసమాధి) గలుగును. ఈ జ్ఞానాధిక్యముచేతనే యోగి తత్త్వజ్ఞానము (వస్తువిషయక యథార్థజ్ఞానము) గలవాడగును.

ఈ వివేక జ్ఞానము నభ్యసించుట చేతనే వివేకజ్ఞాన విషయమున వైరాగ్యమును (జ్ఞానప్రసాద మాత్రము) ఆ వైరాగ్యము వలన నసంప్రజ్ఞాత సమాధియు గలుగును.

కాగా శ్రద్ధచే యోగవిషయమున నుత్సాహము గలిగి, యంతట దానిచే ధ్యేయవస్తువిషయమున తైలధారవలె నెడతెగని స్మృతిధార(ధ్యానము) యుదయించి, యావల దానిచే ,సంప్రజ్ఞాత యోగమునకు గడపటి సాధనమగు సమాధి లభించి దానిచే సంప్రజ్ఞాత యోగము గలుగును. సంప్రజ్ఞాతయోగము నభ్యసించుటచే,సంప్రజ్ఞాతము నశించుటయేకాక, నసంప్రజ్ఞాతయోగము లభించును.

అవ॥ పై చెప్పిన శ్రద్ధాద్యుపాయములు పూర్వపుణ్య తారతమ్యమువలన కొందరికి మృదువుగను, మరికొందరికి మధ్యములుగను నికగొందరి కధికములుగను లభించుటచే తొలుత యోగులు 1.మృదూపాయులు, 2.మధ్యోపాయులు, 3. అధికోపాయులు నని ముత్తెఱంగు లగుదురు. మరియు నుపాయానుష్ఠాన విషయమున వేగపు దారతమ్యముచే బై ముత్తెరంగులగు యోగు లొక్కొక్కరును మరల ముప్విధము లగుదురు. కాగా మృదూపాయుడ(1.మృదూపాయ మృదుసంవేగుడు, 2.మృదూపాయ మధ్యసంవేగుడు. 3.మృదూపాయాధిక సంవేగుడు నని) మూడువిధములుగ నుండును. ఇట్లె మధ్యోపాయుడును, అధిమాత్రో పాయుడును మూడు తెరంగులు గాగా యోగులు తొమ్మండుగురైరి. కాగా నధిమాత్రోపాయులకు దక్కిన వారి కన్న ముందుగ సమాధి లభించును.

## సూ॥ తీవ్ర సంవేగానామాసన్నః ॥ 21

తీవ్రసంవేగానాం, ఆసన్నః.

అధి మాత్రోపాయానాం (ఈపదమును సూత్రములలోనికి భాష్యకారు లధ్యాహరించిరి.) దృఢశ్రద్ధాద్యధికోపాయములు గల యోగు లలో, తీవ్రసం వేగానాం= శీఘ్రలాభము కొరకెడతెగని యిచ్ఛాప్రాబల్యము గల వారలకు, ఆసన్నః= (సమాధిలాభమును, సమాధి ఫలమును) శీఘ్రముగా నగును.

పూర్వపుణ్యవశమున శ్రద్ధాద్యుపాయము లధికముగా నుండుట చేతను, సమాధి లాభముకొరకెడతగని యిచ్ఛ ప్రబలముగా గలిగియుండుట చేతను, అధికోపాయ తీవ్రసంవేగు లగు యోగులకు తక్కిన వారందరికన్న మున్నె ద్వివిధ సమాధియు సంప్రజ్ఞాతసమాధి ఫలమగు నసంప్రజ్ఞాత సమాధియు, నసంప్రజ్ఞాత ఫలమగు కైవల్యమును నొనగూడును. కాగా నధిమాత్రోపాయ మధ్యసంవేగున కింతకన్న విలంబముగను, అధిమాత్రో పాయమందసంవేగుల కంతకన్న నాలస్యముగను, వీరి ముగ్గురికన్న మధ్యోపాయులకును, వారికన్న మందోపాయులకును విలంబముగ గాని సమాధ్యాదు లొనగూడవని యేర్పడినది. మృదూపాయునికి సైతము సమాధి లభించియే తీరును. కాని విలంబముగ గాని సిద్ధింపదు. ఈ విషయమే శ్రీభగవద్గీతలో.

**యోగినామపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా।**
**శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః॥**

అనగా యోగులందరిలోను శ్రద్ధా (యిది యితరోపాయములకు సూచకము) వంతుడై నాయందు చిత్తము జేర్చి యుపాసించువాడు యోగు లలో నుత్తముడు అని యధిమాత్రతీవ్రసంవేగుని గురించి చెప్పబడియెను.

మరియు నచ్చటనే **''బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే''**- జ్ఞానవంతుడు పలుజన్మముల నందియేని ఆత్మసాక్షాత్కారము నందితీరును అని మృదూపాయమృదుసంవేగుని గూర్చియు; **''న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి''** - కల్యాణకర మగు యోగసాధనముల నవలంబించు వాడొకడును దుర్గతి నొందడని, తెలుపుట యెంత విలంబ మయినను సిద్ధిమాత్రము గలిగి తీరుననియు చెప్పబడెను.

అవ॥ తీవ్రసంవేగులకు సయితము మరల త్రివిధత్వమును చెప్పుచూ మరియొక విశేషమును దెలుపుచున్నారు.

## సూ॥ మృదుమధ్యాధిమాత్రత్వాత్ తతోఽపి విశేషః ॥

మృదుమధ్యాధిమాత్రత్వాత్, తతః, అపి, విశేషః॥

తీవ్రసంవేగానాం=(యీా పదము పూర్వసూత్రమునుండి యిందను వర్తించును) తీవ్రసంవేగము గలవారలు, మృదుమధ్యాధి మాత్రత్వాత్ = మృదుత్వము, మధ్యత్వము, అధికత్వమునను భేదమువలన, తతః అపి = ఆ తీవ్రసంవేగులయందును, విశేషః=సమాధి ప్రాప్తి, సమాధిఫల ప్రాప్తుల తర తమభావము(గలుగుచున్నది.)

తీవ్రసంవేగులు సయితము మృదుమధ్యాధిక భేదములచే ముప్విధము లగుదురు. అనగా 1.మృదుతీవ్రసంవేగులు, 2. మధ్య తీవ్రసంవేగులు, 3.అధికతీవ్రసంవేగులు ననబడుదురు. అనగా తీవ్రత్వమునందును, అల్పత్వము, మధ్యత్వము, అధికత్వము కలిగి యుండుటచేత తీవ్రసంవేగులు మూడు తెరుంగు లగుదురు. కాగా మృదుమధ్యోపాయులకన్న అధికోపాయు లకు శీఘ్రసిద్ధి యగును. ఆ యధికోపాయులలోను మృదుమధ్యసంవేగుల కన్న, తీవ్రసంవేగులకు శీఘ్రతమసిద్ధి యగును. అధిమాత్రోపాయ తీవ్రసం వేగులలోను, అధిమాత్రోపాయ మృదుతీవ్రసంవేగులకు శీఘ్రము గను, అధిమాత్రోపాయ మధ్యతీవ్రసంవేగులకు శీఘ్రతరముగను, అధిమాత్రో పాయాధిక తీవ్రసంవేగులకు శీఘ్రతమముగను సంప్రజ్ఞాత సమాధియు, తజ్జన్యమగు నసంప్రజ్ఞాతసమాధియు, తత్ఫలమగు కైవల్యమును లభించును.

కాగా నధికమాత్రోపాయాధిక తీవ్రసంవేగు లగుటకు యోగులు యత్నింపవలయును గాని యేమాత్ర మాలస్య మొనర్పరాదు.

అవ॥ శీఘ్రముగ సమాధి సిద్ధించుటకు పైజెప్పిన యుపాయములు మాత్రమే సాధనమా? లేక మరియొక యుపాయ మేదేని గలదా? యను శంకానివారణము చేయబూని సుకరమగు నుపాయాంతరమును జెప్పు

చున్నారు.

## సూ॥ ఈశ్వరప్రణిధానాద్వా ॥ 23

ఈశ్వర ప్రణిధానాత్, వా.

వా=అట్లు గానిచో, ఈశ్వర ప్రణిధానాత్=ఈశ్వరోపాసన (భక్తి) వలన, విశేషః=(ఈపదము పూర్వసూత్రమునుండి యనువర్తించును.) సమాధిప్రాప్తియు. కైవల్యప్రాప్తియు నత్యంత శీఘ్రముగ గలుగును.

తా॥ ముందు వివరింపబడిన శ్రద్ధాద్యుపాయములవలన సమాధియు తత్ఫలమును మిగుల శీఘ్రముగ సిద్ధించుచున్నను భగవత్ప్రణిధాన మను సుకరమగు సాధనమువలన నంతకన్న శీఘ్రముగ సమాధియు తత్ఫలమును బ్రాప్తించును.

కాయికములు, వాచికములు, మానసికములు నగు సమస్త కర్మలను ఈశ్వరాధీనములని తలచి, తాను చేయు కార్యములకు గలుగు ఫలము నపేక్షింపక, శరీరసుఖము నపేక్షింపక, సర్వకర్మఫలములను ఈశ్వరార్పణ మొనర్చి, ఈశ్వరధ్యానమునందే మునిగి ఈశ్వరనామములను చింతించుట, సుఖవిశేషము లేక భక్తివిశేషమే ప్రణిధానము. ఈప్రణిధానమును గూర్చి ఈ యధ్యాయమునందే 28వ సూత్రమునందు (''తజ్జపస్తదర్థభావనం'' అని) చెప్పబడును.

ఇట్టి భక్తివిశేషముచే నీశ్వరుడు లోబరచుకొనబడి ప్రసన్నుడై ''ఈ నాభక్తునకు శీఘ్రముగ సమాధి సిద్ధించుగాక'' యను నభిధ్యాన (సంకల్పము) మాత్రముచే భక్తుని ననుగ్రహించును. ఇట్టి యీశ్వరాభిధ్యానము (సంకల్పము) చే నతిశీఘ్రముగ సమాధియు దత్ఫలమగు కైవల్యమును లభించును.

మరియు భగవద్గీతలో-

**అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥**

అనగా ననన్యభక్తితో నన్నుపాసించు వారలకు యోగక్షేమములను (అప్రాప్తసమాధి ప్రాప్తియు, తత్స్థిరీకరణమును) నేనే గలిగింతును అని యీశ్వర ప్రణిధానమునకు సమాధిసాధనత్వము చెప్పబడినది.

అవ॥ దీనిపై నీశ్వరు నొప్పుకొనని (నిరీశ్వర)సాంఖ్యుల కాశంక గలుగును. సకల ప్రపంచమునకును బ్రధానము ముఖ్యమగు నుపాదాన కారణము. చేతను డగు పురుషుడు ముఖ్య మగు నిమిత్తకారణము. కాగా చేతనాచేతనాత్మక మగు సకల ప్రపంచమును ప్రధానము (మూలప్రకృతి) చేతను, బురుషునిచేతను వ్యాప్తమై యున్నది.కాన నీశ్వరుడెవడు? వాడచేతన మంటిరేని జడస్వరూపుడగు నతనిని భక్తివిశేషముచే లోగొనుట పొసగదు. చేతను డంటిరేని యతడు ముక్తుడుగ నెంచవలయును గదా! అట్టి ముక్తుని చిత్తముదాసీనమై యస్మితా (అహంకార)ది రహితమైనది గాన నట్టి యీశ్వరునకు బ్రణిధానము (భక్తునకు సమాధిలాభము గలిగించు సంకల్పము) గలుగదు గదా! కాన బ్రధానమునకన్నను, బురుషునకన్నను భిన్నమగు నీశ్వరు డెవడు? అను ప్రశ్న గలుగగా బురుష లక్షణము నెరింగించు చున్నారు.

## సూ॥ క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః॥ 24

క్లేశకర్మవిపాకాశయైః, అపరామృష్టః, పురుషవిశేషః, ఈశ్వరః॥

క్లేశకర్మవిపాకాశయైః, క్లేశ=అవిద్యాది పంచక్లేశములచేతను, కర్మ= క్లేశజనితములగు శుభాశుభకర్మలచేతను, విపాక=శుభాశుభకర్మలచే గలుగు సుఖదుఃఖరూప ఫలములచేతను, ఆశయైః=సుఖదుఃఖానుభవముచే గలుగు వాసనల (సంస్కార) చేతను, అపరామృష్టః=తాకబడని, పురుషవిశేషః= ఒకానొక పురుషుడు (పురుషులందరికన్న భిన్నుడు=లేక ఉత్కృష్టుడు) ఈశ్వరః= ఈశ్వరుడు.

అవిద్య,అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము నగు పంచక్లేశములు (2-3)ను; విహితము, నిషిద్ధము, మూఢము నను త్రివిధకర్మలును; జాతి,

ఆయువు, భోగము నను విపాకత్రయమును; (2-13) పూర్వకర్మవాసనలు నను వానిసంపర్కము కించిత్తును లేక పురుష, విలక్షణుడుగ నుండునత డీశ్వరు డని (యీశ్వరలక్షణము) చెప్పబడినది. లక్షణ మనగా లక్ష్యముల నతిక్రమించి యలక్ష్యముల యందుండక, లక్ష్యములయం దన్నిట వ్యాపించి యుండవలయును. క్లేశాదిరహితత్వ మను నీలక్షణము ఈశ్వరుని యందుమాత్రముండి యీశ్వర భిన్నులగు పురుష ప్రధానముల యందుండగూడదు.

సాంఖ్య యోగ మతములందు క్లేశాదినిఖిల ధర్మములును జిత్తనిష్ఠములే గాన పురుషు డసంగుడు గాన పురుషుడు సయితము క్లేశాది రహితుడే గాన లక్ష్యముగా పురుషునియం దీలక్షణమున కతివ్యాప్తి గలుగును. కాగా పురుషుడును ఈశ్వరుడును సమానులే గాన నీశ్వరుని పురుషవిశేషుడు (విలక్షణుడు) అనుట పొసగదు. కాన నీలక్షణము యుక్తము కాదని శంక వొడముచున్నది.

సమా-ఈశ్వరుడును పురుషుడును స్వభావసిద్ధముగ క్లేశరహితులే, పురుషుడు తన అవివేకముచే చిత్తము తానేయని భ్రమించి ఉపాధిభూత చిత్తనిష్ఠములగు క్లేశాదులను తనవేయని తలచును. కాన పురుషు డుపాధికములగు క్లేశములు గలవాడగును, పురుషుడు చిత్తగతము లగు క్లేశాదులకు ఫలములును, తనయందు ప్రతిబింబించి నవియునగు సుఖదుఃఖముల ననుభవించును గాన చిత్తమునకు స్వామి, చిత్తముస్వము కాన చిత్తమునకును బురుషునకును స్వస్వామి భావసంబంధము. ఈ సంబంధముచేతనే, యుద్ధమున సైనికులకు గలుగు జయాపజయములు (ఫలము) ప్రభువునకు గలిగినట్లు వ్యవహరింపబడు విధమున జిత్తమున నుండు క్లేశాదులు పురుషునం దున్నటుల వ్యవహరింపబడును. ఇట్లు క్లేశాది సంబంధమును సుఖాది భోగమును జిత్తరూపోపాధిజీవితము గాన నౌపాధికమే గాని స్వాభావికము గాదు. ఈ విషయమే కఠోపనిషత్తులో **''ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః''** అని (అనగా జ్ఞానులు శరీరేంద్రియ మనో

రూపోపాధియుక్తు డగునాత్మనే భోక్తయని చెప్పుదురు. అని యర్థము) చెప్పబడినది. కాన నౌపాధిక క్లేశాది సంబంధమవివేకమువలననే గలుగును గాన పురుషుడు మాత్రమే క్లేశాది సంబంధము గలిగియుండును.

ఈశ్వరు డన్ననో వివేకయుక్తు డగుటవలన నవివేకప్రయుక్త మగు క్లేశాదిసంబంధ మతనికి గలుగదు. మరియు క్లేశాదిజన్యమగు సుఖ దుఃఖాది బోగము నీశ్వరునకు గలుగదు. కావుననే ఈశ్వరుడు పురుష విశేషుడు (విలక్షణుడు.) కాన నీ లక్షణ మీశ్వరునియందు మాత్ర మన్వయించును గాన దోషము లేదు.

అయినను క్లేశాది సంపర్కము లేని కేవలులు (కైవల్యము నొందిన వారు) చాలమంది గలరు గదా! వారియం దతివ్యాప్త మగు నందురేని యట్లు గాదు. కేవలులు సయితము తొలుత క్లేశయుక్తులై ప్రకృతిలయులకు గలుగు ప్రాకృతబంధమును, విదేహులకు గలుగు వైకారికబంధమును, ఇహపరవిషయ లోలురకు గలుగు దక్షిణాబంధమును గొంతకాల మనుభవించియే యెట్లేని వానిని త్రెంపికొని కైవల్యము నందిరి గాన, వారును బొత్తుగా క్లేశాది సంపర్కము లేనివారు గారు. ఈశ్వరున కన్ననో పై బంధత్రయసంబంధ మింతకుమున్ను గలుగలేదు. ఇక గలుగదు. కాన నీశ్వరునికి కేవలులవలె పూర్వబంధకోటియు, ప్రకృతిలయులకువలె నుత్తరబంధకోటియు లేదు గాన నితడు నిత్యముక్తుడు. సర్వకాలము నీశ్వరుడు.

కాగా క్లేశాది సంబంధ మెప్పుడును లేనివా డీశ్వరుడె గాని కేవలులు, ప్రకృతిలీనులును గారు.

పై విచారముచే నీశ్వరలక్షణ మిట్లేర్పడినది. ''ఔపాధిక క్లేశాది సంబంధము కాలత్రయమునను లేని పురుష విలక్షణు డీశ్వరుడు.''

జడమగు ప్రకృతి ప్రేరకు డవశ్య ముండవలయును, ప్రేరకుడు లేనిచో సారథిలేక రథ మడ్డుగైనను కదలని చందమున జడమగు ప్రకృతియు సంసారమను చక్రమును బ్రవర్తింపజేయజాలదు. కాన బ్రకృతికి ప్రేరకు

డెవ్వడు? అతడు పురుషు డందువేని యతడు సంగరహితుడును నిష్క్రియుడు నగుటచే నది సరిపడదు. కాన విశుద్ధసత్త్వోపాధికుడును నిత్యజ్ఞాన క్రియైశ్వర్యశాలియు చేతనుడు నగు నీశ్వరుని తప్పక యొప్పుకొనవలయును. ఈశ్వరుడె ప్రకృతికి ప్రేరకుడను విషయము శ్వేతాశ్వతరోపనిషత్తులో

**''మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్''**

(ప్రకృతిని మాయగను అట్టి మాయను ప్రేరేపించువాని నీశ్వరునిగ నెరుగవలయును) అనియు, భగవద్గీతలో

**''మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్''**

(నాప్రేరణచేతనే ప్రకృతి చరాచరాత్మక ప్రపంచమును గలిగించును) అనియును చెప్పబడెను.

రజస్తమోరహిత మగు శుద్ధసత్త్వము గల చిత్తధర్మము లగు ప్రేరణాది క్రియారూప మగు పరిణామ మీశ్వరునియం దసంభవముగ దోచినను, చిత్తమునకును నిత్యముక్తుడగు నీశ్వరునకును స్వస్వామి భావము సంభవింప నట్లున్నను. ఈశ్వరుడు చిత్తపు స్వభావము నెరిగియు తాపత్రయ పీడితులను జ్ఞానధర్మోపదేశముగుండ నుద్ధరించుటకును, ప్రకృతిని ప్రేరేపించి సంసార మును ప్రవర్తింపజేయుటకును, విశుద్ధ సత్త్వరూప చిత్తమును ధరించునుగాన పై దోషములు గలుగవు. అవిద్యాస్వభావము నెరుగక దానిని సేవించువాడే భ్రాంతు డగును. అట్లుగాక, యవిద్యాస్వభావము నెరిగి సేవించువాడు భ్రాంతుడు గాదు. రామకృష్ణాది వేషములను ధరించి యట్లె యభినయించు నటుడు భ్రాంతు డగునా!

ఇచట మరియొక శంక కెడమున్నది. క్లేశమగ్నులగు జనుల నుపదేశద్వారమున నుద్ధరింపజేయుట కిచ్ఛ బొడమిగదా! యీశ్వరుడు విశుద్ధ సత్త్వరూపమగు నుపాధిని ధరించుట, పైయుద్ధరణేచ్ఛ యీక్రింది యుపాధి యున్ననే గదా కలుగును. కాగా నొకటి యున్ననే మరియొకటి

గలుగును. కావున నుపాధికిని ఇచ్ఛకును నన్యోన్యాశ్రయ మను దోషము.

సమా- అయినను బీజాంకుర న్యాయమున నీశ్వరుని అభిధ్యానము (సంకల్పమును) విశుద్ధసత్త్వము ననాదులై యొకటియం దొకటి యిమిడి యున్నందున నన్యోన్యాశ్రయము లేదు. అనగా నుత్పత్తిలయము లనాదు లగుటచే నొకసృష్ట్యంతమున నీశ్వరునకు సంహారేచ్ఛ గలుగుటతో పాటు ''ప్రళయకాలావధి దాటినతోడనే మరల నీవి శుద్ధసత్త్వమును ధరింతును.'' అని అభిధ్యానము (సంకల్పము) గూడ గలుగునని యొప్పుకొందుమేని ప్రళయకాలమున ప్రధానములో లీనమయ్యు జిత్తముపై ప్రణిధాన సంస్కారముచే మరల కార్యోన్ముఖ మగును. (అనగా సంకల్పాదులను గలిగించును) కాగా ఈశ్వర ప్రణిధానమును అతని విశుద్ధసత్త్వ గ్రహణమున నాదులు గాన నన్యోన్యాశ్రయము లేదు.

విశుద్ధసత్త్వమయ మగు చిత్తము గలవాడు గాన నీశ్వరుడు సర్వోత్కృష్టు డనుట ప్రమాణసిద్ధమా? లేక అప్రమాణమా?

ప్రమాణసిద్ధము కాదందుమేని ఈశ్వరుడు సర్వోత్కృష్టుడు గాక పోవును. ప్రమాణసిద్ధమే యని సమాధాన మిచ్చుచో నాప్రమాణ మెయ్యది? యని యడుగుదురేని-

సమా॥ శ్రుతిస్మృత్యాదిరూపమగు శాస్త్రమే ప్రమాణము.

ప్రశ్న॥ శాస్త్ర మనగా ప్రత్యక్షానుమానములలో దేనిచే నేని యనుభవమునకు వచ్చు విషయమును తెలుపు వాక్యవిశేషమే గదా! ఈశ్వరుని యుత్తమత్వ మెవరికిని బ్రత్యక్షగోచరము గాదు గాన తద్విషయమున శాస్త్రము ప్రమాణము గాజాలదు గదా!

సమా॥ భ్రమప్రమాదాది పురుషదోష రహితుడును సర్వజ్ఞుడు నగు నీశ్వరునకు, ఈశ్వరుని సర్వజ్ఞత్వమునకు ప్రత్యక్షమగు వేదమే ప్రమాణము.

ప్రశ్న॥ ఈశ్వరునికి సర్వజ్ఞత్వము సిద్ధించినగాని వేదము ప్రమాణము

గాజాలదు, వేదము ప్రమాణ మైనగాని ఈశ్వరుని సర్వజ్ఞత్వము నిలువదు గదా!

సమా॥ ఈశ్వర ప్రణీతములగు మంత్రము లాయా నియత కార్యముల నాచరించుచుండుటవలనను, తత్ప్రణీతములే యగు నాయుర్వేదాదులు తప్పక ఫలించుచుండుటచే వేదేతర ప్రమాణములచేతనే ఈశ్వరునకు సర్వజ్ఞత్వము సిద్ధించుచున్నది. కాగా ఇట్టి సర్వజ్ఞుడగు నీశ్వరునకు ప్రత్యక్షము లగు వేదములు ప్రమాణము లగును. ఇపు డన్యోన్యాశ్రయమునకు అవకాశము లేదు. కాన నందు ప్రదిపాదిత మగు నీశ్వరుని యుత్కర్ష వేదరూప ప్రమాణ సిద్ధము.

పూర్వోక్తమగు నీశ్వరోత్కర్షయు వేదాది శాస్త్రములును ఈశ్వరుని విశుద్ధసత్త్వరూప చిత్తమున నున్నవి. కావున వీని కనాది నిమిత్తనైమిత్తిక భావసంబంధము గలదు.

పై వివరించిన సర్వోత్కృష్టత్వముచే నీశ్వరుడు నిత్యముక్తుడును. నిత్యైశ్వర్యశీలుడు నగును.

మరియు నీశ్వరు డణిమాద్యైశ్వర్యవంతు లగు యోగుల కన్నను విలక్షణుడు లేక యుత్కృష్టుడు. ఇతని యైశ్వర్యమునకు సమానైశ్వర్యమేని, యధికైశ్వర్యమేనియు లేదుగాన నీశ్వరుని యైశ్వర్యమున సమానము నన్యూనము నగును. యోగుల యైశ్వర్య మన్ననో మరియొక యోగి యైశ్వర్యమునకు సమానముగ గాని, మరియొక యోగి యైశ్వర్యమునకంటె తక్కువగ నేని యుండును గాన యోగి ఐశ్వర్యము అసమానమును అన్యూనమును గాదు. ఈశ్వరుని యైశ్వర్య మన్ననో సర్వోత్కృష్ట మగుటచే దానికి సాటియైన యైశ్వర్యమును అధికైశ్వర్యమును లేదు.

కాన సర్వోత్తమ మగు నైశ్వర్యము గలవాడే ఈశ్వరుడని యంగీకరింతుము. ఇట్లీశ్వర సమాన మగు సర్వోత్తమైశ్వర్యము గల యత డింకొకడు లేడనియు నంగీకరింపవలయును- అట్లుగాక తత్సదృశుని

మరియొకని నొప్పుకొందుమేని యాతడుగూడ ఈశ్వరునివలె సత్య సంకల్పాదులు గలిగి యుండునని తప్పక యంగీకరింపవలసి వచ్చును. అట్లంగీకరించితిమేని ఈశ్వరునకును దత్సమానునకు నొకేవస్తువు విషయమున ''నిది క్రొత్తది యగుగాక'' యని యొకనికిని, మరియొకనికి ''నిది ప్రాతది యగు గాక'' యనియు సంకల్పము గలిగినచో నే సంకల్పము నెరవేరును? రెండును నెరవేరు నందమా, అది వస్తుస్వభావ విరుద్ధము, ఒక వస్తు వొకే సమయమున విరుద్ధ ధర్మద్వయము గలదిగా నుండదు గదా! రెండు సంకల్పములు నెరవేరనందున మీసత్యసంకల్పత్వము భిన్నమగును. కాన నిరువురిలో నొక్కడు నీశ్వరుడు కాజాలడు. అదిగాక వస్తువేదేని యొక ధర్మము గలిగియుండునేగాని యేధర్మమును లేకయుండదు. ఇందొకని సంకల్పము సత్యముగను, మరియొకని సంకల్పము మిథ్యగను దలతుమేని మిథ్యాసంకల్పశీలు డీశ్వరుడు గాజాలడు గాన, సత్యసంకల్పుడు మాత్రమే ఈశ్వరు డగును. కావునను ఈశ్వరు డొక్కడే యని సిద్ధించును గదా!

అట్లుగాక యిరువురికి నొకవిధమున సంకల్పము గలుగునేగాని పై విధమున విరుద్ధసంకల్పములు గలుగవందుమేని యనేకేశ్వరులు సిద్ధింతురు గాని దానిచే నేమి ప్రయోజనము? అనేకులు నేకీభవించి సభారూపమున నుండి కార్యమును జరుపుచుందు రందుమేని యందొకడును ఈశ్వరుడు గాడు, గాన ఈశ్వరుడు సిద్ధింపకపోవును.

కాన, క్లేశాదిసంపర్కశూన్యుడై నిస్సమాభ్యధికైశ్వర్యశాలియై సర్వజ్ఞుడగు పురుషవిశేషుడే ఈశ్వరుడు.

అవ॥ ఇట్లు ఈశ్వరుని యునికియందును, అతని యుత్కర్షకును, వేదరూపశాస్త్రమును, యోగుల యనుభవమును, ప్రమాణములుగ నేర్పడినను, వారికి గలుగు భ్రాంతిని నివారించుట కుపమాన ప్రమాణమును దెలుపుచున్నారు.

**సూ॥ తత్ర నిరతిశయం సర్వజ్ఞబీజమ్ ॥ 25**

తత్ర, నిరతిశయం, సర్వజ్ఞబీజమ్.

తత్ర=ఆ ఈశ్వరునియందు. సర్వజ్ఞబీజం (సార్వజ్ఞ బీజం)= సర్వజ్ఞత్వమునకు కారణమగు జ్ఞానము, నిరతిశయం=తనకన్న నతిశయములేనిది (సర్వాతిశయ మైనది. లేక పరాకాష్ఠ నొందినది).

సత్త్వగుణము న్యూనాధిక భావములతో నుండుటచే గొందరు వర్తమాన పదార్థములను మాత్ర మెరుగుదురు. కొందరు భూతవస్తువును, కొందరు భవిష్యత్తును, మరికొందరు భూతభవిష్య ద్వర్తమాన వస్తువుల నెరుగజాలుదురు. ఇక గొందరు స్థూలవస్తువులను మాత్రము తెలిసి కొందురు. మరికొందరు సూక్ష్మవస్తువులను పరమాణ్వాదుల నెరుంగుదురు. మరికొందరొక వస్తువును మరికొందరు బహువస్తువుల నెరుంగ గలిగియుందురు.

కావున వీరందరియందును సర్వజ్ఞతా కారణమగు జ్ఞానము సాతిశయము (తక్కువ యుత్కర్షగలది) గనే యున్నది. అనగా తనకన్న నతిశయము గలది. ఈశ్వరజ్ఞాన మింతకన్న నతిశయ మైనది గాన నీ పురుష జ్ఞానము లన్నియు సాతిశయములే యగును.

సాతిశయ (తనకన్న నతిశయముగల) జ్ఞానము వృద్ధినొంది యెచట నిరతిశయ మగునో యట్టి నిరతిశయ (తనకన్న నతిశయములేని) జ్ఞానము గల యాతడే ఈశ్వరుడు. తక్కువ యాధిక్యమను ధర్మముగల పదార్థము సాతిశయము. (తక్కువ యుత్కర్ష గలది) అది తప్పక సాతిశయ మగును. ఆవాలు సెనగలు రేగుపండు నుసిరిక పండును మారేడుపండును - మొదలగు వానియందు ముందటి వానికన్న వెనుకటి పదార్థములయందు మహత్త్వ పరిమాణమును, వెనుకటి వానికన్న ముందటివాని యందణుత్వ పరిమాణమును సాతిశయములు. కాని మారేడుపండు నందలి మహత్త్వ పరిమాణమున కాకసమునందు నిరతిశయత్వము లేక పరాకాష్ఠ (అత్యంతోత్కర్ష). ఆకాశమునకంటె పెద్దపదార్థము లేదు గదా! అట్లే యావగింజయందలి యణుపరిమాణమునకున్ను, పరమాణువునకన్న

చిన్నవస్తువు లేదు. కాన పరమాణువు నందు నిరతిశయత్వము గలుగును.

అట్లే ప్రకృతమున కీట,పశు,పక్షి, మానవ, ముని, దేవాదులయందు జ్ఞానము సాతిశయము. అయ్యదియే ఈశ్వరునియందు నిరతిశయముగ (తనకన్న నతిశయము లేనిదిగ) నగును. కాన నీశ్వరుడు నిరతిశయ జ్ఞానవంతుడు.

కాగా (అనుమానసాధన మిట్లేర్పడును.) సర్వజ్ఞత్వమునకు కారణమగు జ్ఞానము నిరతిశయము (తనకన్న మిన్న లేనిది.) సాతిశయ మగుటవలన-పరిమాణమువలె, సాతిశయ మగు మహత్త్వరూప పరిమాణ మాకాశమునందును, అణుత్వము పరమాణువునందును నిరతిశయములుగ నున్నవి. అట్లే ప్రకృతమున సాతిశయ మగు జ్ఞానము సయిత మీశ్వరుని యందు నిరతిశయ మగును.

పై యనుమానముచే నిరతిశయ జ్ఞానాశ్రయుడై సామాన్యముగ నీశ్వరుడు సిద్ధించినను నారాయణాది సంజ్ఞాదివివేకజ్ఞానము శ్రుతిస్మృతీతిహాసపురాణాదులవలన గలుగును.

నిత్యతృప్తుడును వైరాగ్యాతిశయశాలియు నయ్యు నీశ్వరుడు తన ప్రయోజనమునకు గాక మహాప్రళయమున ప్రకృతిలీనులగు పురుషుల నుద్ధరించుటకు సంసారమును ప్రవర్తింపజేయును. ఆయా పురుషుల పూర్వ సుకృత తారతమ్యానుగుణముగ ఫలము గలుగును గాన నీతనికి విషమదృష్టి గలదను (ఒకరిని సంపన్నునిగ మరియొకని దరిద్రునిగ నిట్లు పక్షపాతములు చేయుటయును) దోషము లేదు.

కాగా ననాదియగు సంసారమున బూర్వపూర్వ కృతకర్మలకు ఫలము నిచ్చుటకును జ్ఞానధర్మోపదేశము చేసి పురుషుల నుద్ధరించుటకును, ఈశ్వరుడు తాను స్వయముగ నిత్యతృప్తు డయ్యు గరుణచే బ్రవర్తించును.

తనకు ప్రయోజనము లేకున్నను కృపావశమున ప్రవృత్తి గలుగునను విషయమును నిరీశ్వర సాంఖ్యుడగు పంచశిఖాచార్యుడు గూడ నంగీకరించెను.

**''ఆదివిద్వాన్ నిర్మాణచిత్తమధిష్ఠాయ కారుణ్యాద్భగవాన్ పరమర్షి రాసురయే జిజ్ఞాసమానాయ తంత్రం ప్రోవాచ''** అని పంచశిఖ సూత్రవము. అనగా ఆదివిద్వాంసుడగు భగవత్కపిలమహర్షి యోగబలనిర్మిత మగు చిత్తము నాశ్రయించి కరుణావశమున జిజ్ఞాసువగు నాసురికి సాంఖ్యయోగ విద్య నుపదేశించెను అని భావము.

అవ-పూర్వోక్తానుమానముచే నిరతిశయజ్ఞానాశ్రయులు బ్రహ్మాదు లేల కారాదు? అను నాశంకకు సమాధానముగా బ్రహ్మాదులకన్న నీశ్వరునకు విశేషమును దెలుపుచున్నారు.

## సూ॥ పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్॥ 26

('స ఏష పూర్వేషామపి' యనియు 'సర్వేషామపి గురుః' యనియు పాఠాంతరములు).

పద॥ పూర్వేషాం, అపి, గురుః, కాలేన, అనవచ్ఛేదాత్.

అర్థము॥ సః ఏషః=(ఈరెండు పదములు భాష్యములో నధ్యాహారము చేయబడెను, కొందరు వ్యాఖ్యాతలు సూత్రములో నున్న వనియే తలచిరి) అట్టి ఈశ్వరుడు, పూర్వేషాం అపి = పూర్వపూర్వ సృష్టులయం దుత్పన్నులగు బ్రహ్మాద్యుపదేష్టలకును, (సర్వేషాం అపి =బ్రహ్మాదు లందరికిని) గురుః = ఉపదేశకుడు, లేక జనకుడు, కాలేన = కాలముచే, అనవచ్ఛేదాత్ = పరిమితుడు కాకుండుటవలన.

బ్రహ్మాదులు దత్తత్కల్పములయందు ధర్మోపదేశమును జేయు చుండి యాధునికోపదేష్టలకన్న ప్రాచీనులుగనే యున్నను వారు కాల పరిచ్ఛిన్నులు. అనగా పరిమితకాలము వరకు మాత్ర ముండువారు. సృష్టి మొదలు మహాప్రళయమువరకు మాత్రము వారి యునికి పరిమితమై యున్నది. ఈశ్వరు డన్ననో కాలపరిచ్ఛిన్నుడు గాడు. అనగా త్రికాలా బాధితుడు. అనగా భూతభవిష్యద్వర్తమాన కాలములయందును, ఈశ్వరుడు లేడను ప్రతీతికి గోచరము గానివాడు. అనగా కాలపరిమితి లేక సర్వకాలములయందు

శాశ్వతముగా నుండువాడు. కాగా ఈ సృష్ట్యాది యందు ఈశ్వరుడు సిద్ధించినట్లె, పూర్వపూర్వ సర్గములయందు సయిత మట్లె ఈశ్వరు డుండుట తటస్థించుటచే నీశ్వరు డనాది, అనంతుడు.

కాననే ఈశ్వరుడు పూర్వులగు బ్రహ్మాదులకు నుపదేష్టయు జనకుడు నగును.

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై।**
**తం హి దేవమాత్మ బుద్ధి ప్రకాశం ముముక్షుర్వై శరణ మిహం ప్రపద్యే ॥**
(శ్వేతాశ్వతరోపనిషత్ అ.6. మంత్ర-18)

అనగా సృష్ట్యాదియందు బ్రహ్మను సృజించి యాతనికి వేదముల నుపదేశించిన యాత్మబుద్ధి ప్రకాశుడగు నీశ్వరుని మోక్షాపేక్షి నగు నేను శరణు బొందుదును అని భావము. ఇందు పైయర్థమే యెరింగింపబడెను.

కాన కాలపరిచ్ఛిన్నులగు బ్రహ్మాదులందరికన్నను గాలపరిచ్ఛేదము లేని ఈశ్వరుడుత్కృష్టుడు.

అవ॥ఇట్లీశ్వరుని రూపించి యాఈశ్వరుని ప్రణిధానము (సంకల్పము) ను నిరూపింపబోవుచు దొలుత ఈశ్వరునకు వాచకమును దెలుపుచున్నారు.

## సూ॥ తస్య వాచకః ప్రణవః॥ 27

తస్య, వాచకః, జీ(ప్రణవః,

తస్య=అట్టి ఈశ్వరునకు, వాచకః=బోధక (అభిధాయక) మగు శబ్దము, ప్రణవః=ఓంకారము.

సర్వజ్ఞత్వాది విశిష్టుడగు నీశ్వరున కోంకారము వాచకము. ఓంకారమునకు నీశ్వరుడు వాచ్యుడు. ఈశ్వరునకు నోంకారమునకును వాచ్యవాచక భావసంబంధము. గోశబ్దము శృంగ పుచ్ఛ సాస్నా (గంగడోలు) ఆదిమత్పదార్థ విశేషమునకు వాచకమగు నటుల నోంకార మీశ్వరునకు వాచకము. కాననే

యాజ్ఞవల్క్యుడు.

**అదృష్టవిగ్రహో దేవో భావ గ్రాహ్యోహ్యతీంద్రియః ।**
**తస్యోంకారః స్మృతోనామ తేనాహూతః ప్రసీదతి ।।''** యని చెప్పెను.

మరికొందరు 'ఏతదాలంబనం శ్రేష్ఠమేతదాలంబనం పరం' అని కఠోపనిషత్తునందు యముడు నచికేతసునకు ఓంకారమే శ్రేష్ఠమగు నాలంబనము అని యోంకారము బ్రహ్మబుద్ధి కాలంబనముగా నుపదేశించుటచే సాలగ్రామము విష్ణుప్రతీక (విష్ణుభావన కాలంబనము) మయినట్లు ఓంకారము సయిత మీశ్వరప్రతీక మందురు.

ఓంకారమునకును ఈశ్వరునకును జెప్పబడిన వాచ్యవాచకభావము సంకేతజన్యమా? లేక సంకేతద్యోత్యమా? (సంకేతముచే వెలువరింప బడునది) యను శంక గలుగును.

సంకేత మనగా 'నీశబ్దముచే నీయర్థబోధ గలుగు గాక' యను నీశ్వరుని ఇచ్ఛ (అనగా ఘట పదముచే లావై గుండ్రనగు పొట్టగలిగి శంఖము వంటి మెడగల వస్తువు అనగా కుండ బోధిత మగుగాక యను నిచ్ఛవంటిది.) ఇట్టి సంకేతముచే నోంకారేశ్వరులకు వాచ్యవాచక సంబంధము జనించిన దందుమేని జన్యపదార్థ మెల్లను, నాశశీలమే గాన నీ సంబంధము నశించవలసియుండును. కాన నిది సంకేతజన్యము గాదు.

మరి ప్రదీపప్రకాశ మిదివరకు గలిగి యుండియే యంధకారాదిప్రతి బంధకమువలన నగుపడని పదార్థమును ద్యోతింపజేయు విధమున సంకేతమోంకారేశ్వరులకు నిత్యమగు (అదివరకే యున్న) వాచ్యవాచక భావమును ద్యోతింపజేయు ననియే యంగీకరింపవలయును. కాగా ఈశ్వరుడు పూర్వమందున్న యర్థమునే సంకేతరూపమున బ్రకాశింప జేయును, గాని క్రొత్త యర్థమును గల్పింపడు.

పితకును, పుత్రునకును సంబంధము పుట్టుకతోడనే సిద్ధించినది. అది యే దశరథుడు రామునకు పిత, రాముడు దశరథుని పుత్రుడు అను

సంకేతముచే వ్యక్తపరుపబడుచున్నదే గాని వారికి లేని సంబంధ మొందు కల్పింపబడుట లేదు గదా!

ఇట్లే ఈశ్వర సంకేతముగూడ నదివరకున్న శబ్దార్థసంబంధమునే వెలువరచును. ఇట్టి సంకేత మాసృష్టిలో బూర్వపూర్వసృష్టులయందు నయిత ముండవలయును గాన సదృశ వ్యవహార పరంపరవలన శబ్దార్థములకు వాచ్యవాచక భావసంబంధము నిత్యమే యని మీమాంసా శాస్త్రవేత్తలును నిశ్చయించిరి.

ఒకవేళ ప్రళయవేళలో శబ్దము శక్తితోడనే ప్రకృతిలో లీనమైనను మరల సృష్టివేళలో శబ్దము స్వశక్తి సహితముగనే యుత్పన్న మగునని యంగీక రింతుము గాన శబ్దార్థసంబంధము ననుసరించియే సంకేతము గలుగునుగాని, శబ్దార్థసంబంధము సంకేతజన్య మేమాత్రమును గాదు.

అవ॥ ఇట్లు ప్రణవమునందలి వాచకత్వమును ఈశ్వరుని వాచ్యత్వము నెరింగిన యోగి యొనరింపవలసిన కార్యమును దెలుపుచున్నారు.

## సూ॥ తజ్జపస్తదర్థభావనమ్॥ 28

తజ్జపః, తదర్థభావనమ్.

విజ్ఞాతవాచ్యవాచకత్వస్య.యోగినః=( భాష్యకారు డీరెండు పదములను సూత్రములోని కధ్యాహారము చేసెను.) ఈశ్వరుని వాచ్యత్వమున, ప్రణవపు వాచకత్వమును నెరింగిన యోగికి, తజ్జపః= అట్టి ప్రణవమును జపించుటయు, ఆ ప్రణవమున కర్థమగు నీశ్వరుని ధ్యానించుటయు ( కర్తవ్యము).

ప్రణవమును జపించుచు నాప్రణవ ప్రతిపాద్యుడగు నీశ్వరుని ధ్యానింపవలయును. ఇదియే ఈశ్వర ప్రణిధాన మనబడును. విచారింపగా ప్రణవజపమును ఈశ్వరభావనయు నొకే సమయమున సంభవింపవు. చిత్తమును సర్వవిషయముల నుండియు మరలించి యీశ్వరుని యందు మాత్ర ముంచుట యీశ్వరభావన యనబడును. కాన జపము విషయమున

జిత్తమున్న సమయమున భావన సిద్ధింపదు. కాన నీశ్వర భావనకు ముందు వెనుకల నోంకార జప మొనర్పవలయును. కాబట్టియే వ్యాసభగవానుడు.

**స్వాధ్యాయాత్ యోగమాసీత యోగాత్స్వాధ్యాయ మాచరేత్।**
**స్వాధ్యాయయోగసంపత్త్యా పరమాత్మా ప్రకాశతే ॥** అనిరి.

అనగా ప్రణవజపానంతరము యోగమును (అనగా నీశ్వర భావన) నుపాసింపవలయును. ఈశ్వరభావనానంతరము నోంకారమును జపింప వలయును. (ఇట్లోంకారేశ్వరభావనలచే బరమాత్మ సాక్షాత్కరించును)

సూత్రకారు డీశ్వరప్రణిధానము వలన సమాధిలాభము గలుగునని ఈ సమాధిపాదమునం దిరువదియారవ సూత్రమున జెప్పెను. భగవద్గీతలో కృష్ణభగవానుడో -

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్।**
**యఃప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ॥**

అనగా నేకాక్షర ప్రణవబ్రహ్మమును జపించుచు నన్ను (ఈశ్వరుని) భావించుచు దేహమును విడచు నాతడు మోక్షమున కేగును అని ఈశ్వర ప్రణిధానమునకు సాక్షాన్మోక్షమును ఫలముగా దెలిపి యుండుటచే విరోధము తోచుచున్నది. కాని ఈ శ్లోకమునకు ముందటి శ్లోకాంతము నందలి ''ఆస్థితితో యోగధారణాం'' అను పాదము నీశ్లోకముతో జేర్చి పూర్వార్ధము తోడ నన్వయింతుమేని ''ఏకాక్షరప్రణవ బ్రహ్మమును జపించుచు నన్ను భావించుచు యోగధారణము నొందినవాడై (సమాధిలాభము నొందినవాడై) దేహమును త్యజించి యేగు నతడు మోక్షమునకు చేరునను నర్థము లభించును. కాన భగవద్వాక్యముచేతగూడ నీశ్వర ప్రణిధానముచే సమాధిలాభమును, దానిచే మోక్షము లభించునని యేర్పడుటచే నేమాత్రమును విరోధము లేదు.

అవ-ఈశ్వర ప్రణిధానమునకు ఫలము సమాధిలాభము మాత్రమేనా? లేక యింకేమైన గలదా? యను శంకానివారణార్థము ప్రణిధానమునకు

ఫలాంతరమును సయితము చూపుచున్నారు.

## సూ॥ తతః ప్రత్యక్చేతనాధిగమో ఽప్యంతరాయాభావశ్చ॥ 29

తతః, ప్రత్యక్చేతనాధిగమః, అపి, అంతరాయాభావః, చ.

(కించ, అస్య, భవతి, అను మూడు పదములను భాష్యకారుడీసూత్రములోని కధ్యాహరించెను.) కించ=మరియు, అస్య= ఈ ఈశ్వర ప్రణిధానముగల యోగికి, తతః= ఆ పూర్వోక్తమగు నీశ్వర ప్రణిధానముచే, ప్రత్యక్చేతనాధిగమః, ప్రత్యక్చేతన= జీవాత్మసాక్షియొక్క, అధిగమః అపి= సాక్షాత్కారమును, అంతరాయాభావఃచ= విఘ్నములు లేకుండుటయు, భవతి= కలుగును.

ఈశ్వరప్రణిధానమునందు బూనుకొనిన వానికి వ్యాధి మొదలగు విఘ్నములు గలుగవు. మరియు నందువలన స్వస్వరూప దర్శనముగూడ గలుగును. కాగా ఈశ్వర ప్రణిధాన (ఉపాసన)ముచే సమాధి లభించుట మాత్రమేగాక, విఘ్ననివృత్తి పూర్వకముగ నాత్మసాక్షాత్కారము సయిత మానుషంగికముగా గలుగును.

అనగా నీశ్వర ప్రణిధానముచే పురుషవిశేషు డగు నీశ్వరుడు శుద్ధుడు, ప్రసన్నుడు, కేవలుడు, జాత్యాయుర్భోగము లగు నుపసర్గత్రయరహితుడు-ననిభాసించు విధమున ప్రత్యగాత్మ, జీవాత్మయు బుద్ధిసాక్షియగు పురుషుడని తెలిసికొనును.

ఏ పదార్థమును భావించుచున్న ఆ పదార్థమే సాక్షాత్కరింప వలయునను నియమానుగుణముగా నీశ్వర ప్రణిధానముచే నీశ్వరుడే సాక్షాత్కరింపవలసి యుండగా ప్రత్యగాత్మ సాక్షాత్కార మెట్లు గలుగు నను శంక యుదయించును.

కాగా ఈశంక నిరాధార మైనది. ఏలనన, ఒక పదార్థమును భావించు నపుడు దానికి విజాతీయ మగు (విరుద్ధజాతి గల) పదార్థము సాక్షాత్కరింప

వీలు లేదే గాని భావ్యమాన పదార్థమునకు సజాతీయ (సమాన జాతిగల) పదార్థమును సాక్షాత్కరించుట విరుద్ధము గాదు. ఒక శాస్త్రము చదివిన వారికి తదితర తత్సజాతీయ శాస్త్రమున ననుభవము గలుగుట గాంచు చున్నాము గదా!

కాన నీశ్వరునకును ప్రత్యగాత్మకును మిగుల సామ్య ముండుటంబట్టి ఈశ్వర ప్రణిధానమునకు బూనుకొనిన ఆతనికి స్వస్వరూప సాక్షాత్కారము సంభవమే యగును.

అవ॥ అంతరాయము లననేమి? అవి చిత్తవిక్షేపకములై చిత్తమును యేకాగ్రతనుండి తొలగించునవి యన్నచో ఆయంతరాయము లెన్ని? యను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నారు.

**సూ॥ వ్యాధిస్త్యాన సంశయప్రమాదాలస్యా -**
**విరతి భ్రాంతిదర్శనాలబ్ధభూమికత్వా-**
**నవస్థితత్వాని చిత్తవిక్షేపాస్తేఽన్తరాయాః॥ 30**

వ్యాధిస్త్యాన సంశయః ప్రమాద ఆలస్య అవిరతి భ్రాంతిదర్శన అలబ్ధ భూమికత్వ అనవస్థితత్వాని, చిత్తవిక్షేపాః, తే, అన్తరాయాః॥

వ్యాధిస్త్యాన, అనవస్థితత్వాని= 1.వ్యాధి. 2.స్త్యానము, 3.సంశయము, 4.ప్రమాదము, 5.ఆలస్యము, 6.అవిరతి, 7.భ్రాంతిదర్శనము, 8.అలబ్ధభూమి కత్వము, 9.అనవస్థితత్వము ననునవి, చిత్తవిక్షేపాః = చిత్తస్థైర్యభంగకరములు, తే = అట్టి తొమ్మిదియు, అంతరాయాః = యోగమునకు విఘ్నములు.

పై తొమ్మిది యంతరాయము లుండిననే ప్రమాణాది వృత్తు లుత్పన్నమై చిత్తమును క్షోభింపజేయును. ఇవి లేనిచో జిత్తము స్థిరముగ నుండును. ఇట్లన్వయ వ్యతిరేకములచే, నీ తొమ్మిదియు యోగభంగ కరములగు విరోధములుగా నేర్పడెను. ఇందు.

1.వ్యాధి:-వాతపిత్తశ్లేష్మములను ధాతువుల వైషమ్యము (న్యూనాధిక

భావము) ఆహార పరిణామ రూపములగు మధురామ్ల కటు రసముల వైషమ్యము, చక్షుఃప్రభృతి కరణముల వైషమ్యమును వ్యాధి యనబడును.

2.స్త్యానము:-ఇచ్ఛ యున్నను చిత్త మేకార్యమునందును ప్రవర్తింపజాలకుండుట.

3.సంశయము- నేను సమాధిని సాధింపగలుగుదునా? సాధింపజాలనా? నాకు యోగరూప కార్యము సిద్ధించునా? లేదా? యని యిట్లు పక్షద్వయము నవలంబించిన జ్ఞానము.

4.ప్రమాదము- సమాధికి సాధనములను భావింపకుండుట అనగా నుత్సాహముతోడ సాధనములయందు బ్రవర్తింపకుండుట.

5.ఆలస్యము-కఫప్రకోపమువలన గలిగిన శరీరగురుత్వము (ఒడలి బరువు) చేతను,తమోగుణ ప్రకోపముచే గలుగు చిత్తగురుత్వముచేతను, (చిత్తమాంద్యముచేత) సమాధి సాధనములయందు బ్రవర్తింపకుండుట.

6.అవిరతి-విషయేంద్రియ సంయోగముచే విషయానుభవ విషయమున గలుగు నతృప్తి.

7.భ్రాంతిదర్శనము-విపర్యయజ్ఞానము, యోగసాధనములను తత్సాధనములు గావనియు, యోగసాధనములు గానివానిని తత్సాధనములనియు తలంచుట.

8.అలబ్ధభూమికత్వము-ఏదేని ప్రతిబంధకముచే మధుమత్యాది సమాధి భూమికలలో నొక్కటియు లభింపకుండుట.

9.అనవస్థితత్వము-ఎట్లెట్లో మధుమత్యాది సమాధిభూమికలలో నొకదాని నొందియు, జిత్త మీభూమికయందు నిలుకడగా నుండకుండుట. సమాధి ప్రాప్తించిననే చిత్తము స్థిరముగా నుండును గాని యోగావస్థావిశేషమగు నొకభూమికను బొంది తాను కృతార్థుడై నట్లెంచెనేని సమాధి లభింపకుండుటచే నాభూమికనుండి జారును.

పై చిత్తవిక్షేపకములు తొమ్మిదియు యోగమలములు లేక యోగప్రతి పక్షములు లేక యోగాంతరాయములు నని వ్యవహరింపబడును.

అవ॥ ఈ తొమ్మిది మాత్రమే యోగప్రతిబంధకములు గావు. ఈ తొమ్మిది యున్నచో మరికొన్ని ప్రతిబంధకములును సంభవించునని యెంచి వాని స్వరూపమును గూడ నెరింగించుచున్నారు.

## సూ॥ దుఃఖ దౌర్మనస్యాంగమేజయత్వ శ్వాస ప్రశ్వాసా విక్షేపసహభువః ॥ 31

పద॥ దుఃఖ దౌర్మనస్యాంగ మేజయత్వ శ్వాస ప్రశ్వాసాః, విక్షేప సహభువః.

అర్థము॥ దుఃఖ...ప్రశ్వాసాః, దుఃఖ = దుఃఖము, దౌర్మనస్య = దౌర్మనస్యము, అంగమేజయత్వ= అంగమేజయత్వము, శ్వాస = శ్వాసయు, ప్రశ్వాసాః = ప్రశ్వాసయు, విక్షేపసహభువః = చిత్తవిక్షేపములగు వ్యాధ్యాదులగు తొమ్మిదింటితోడ బుట్టును.

పూర్వము చెప్పబడిన వ్యాధ్యాది విక్షేపములు గలిగినచో 1.దుఃఖము, 2.దౌర్మనస్యము, 3.అంగమేజయత్వము, 4.శ్వాసము. 5.ప్రశ్వాసము - నను నీయైదు ప్రతిబంధకములు గూడ గలుగును.

1.దుఃఖము-దేనిచే మనుజులు తిరస్కృతులై దానిని తిరస్కరింప యత్నింతురో యది దుఃఖము. ఆ దుఃఖము 1.ఆధ్యాత్మికము, 2.ఆధి భౌతికము, 3.ఆధిదైవికము నని మూడు విధములు. ఇందాధ్యాత్మిక దుఃఖ మనగా (ఆత్మ, మనస్సు,శరీరము) కామ క్రోధాది జన్యమగు మానసిక పరితాపమును, వాతాది ప్రకోపజన్యమగు శారీరకజ్వరాది రోగము నగును.

ఆధిభౌతికదుఃఖ మనగా - సింహవ్యాఘ్రాది భూతములచే (జంతువులచే) గలుగు దుఃఖము. ఆధిదైవిక దుఃఖము అనగా - పిడుగు పడుట, దయ్యము పట్టుట, అతివృష్టి, అనావృష్టి మొదలగువానిచే గలుగు దుఃఖము.

2.దౌర్మనస్యము-తాగోరిన కోర్కె నెరవేర కుండుటచే గలుగు చిత్తక్షోభము.

3. అంగమేజయత్వము-శరీరమునందలి యొక్కొక్క యంగము కంపించుట. ఇయ్యది సమాధిసాధన మగు నాసనమునకు విరోధి.

4.శ్వాస-ఎరుగకయే వెలుపలి గాలిని లోనికి పీల్చుకొనుట. ఇయ్యది రేచకప్రాణాయామమునకు విరోధి.

5.ప్రశ్వాస-అనుకొనకయే లోపలి కోష్ఠమునందలి గాలి వెలుపలికి వెడలించుట. ఇయ్యది పూరకప్రాణాయామమునకు విరోధి.

ఈయైదును విక్షిప్త చిత్తునకు గల్గునేగాని సమాధినిష్ఠ చిత్తునకు గలుగవు. కాన విక్షేపములతో బుట్టునవి యని చెప్పబడెను.

అవ॥ఈ విక్షేపము లన్నియు సమాధికి విరోధములు గాన వీనినిగూడ నభ్యాస వైరాగ్యములచేతనే నిరోధింపవలయును. ఆ రెండింటిలో నీశ్వర ప్రణిధాన రూపమగు నభ్యాస విషయమును ముగించుచున్నారు.

## సూ॥ తత్ప్రతిషేధార్థ మేకతత్త్వాభ్యాసః ॥ 32

పద॥ తత్ప్రతిషేధార్థం, ఏకతత్త్వాభ్యాసః,

అర్థము॥ తత్ప్రతిషేధార్థం=ఆవిక్షేప(వ్యాధ్యాదులు)ములను నివారించు టకు, ఏకతత్త్వాభ్యాసః=ఒకేతత్త్వము (ముఖ్యతత్త్వము) నభ్యసింప వలయును.

చిత్తవిక్షేపముల బోనడచుట కేదేని యొకే తత్త్వము నేకాగ్రతతో నభ్యసించవలయును. ''ఆ లక్ష్యమగు తత్త్వమీశ్వర తత్త్వమే గానక్కరలేదు.'' అని కొందరనిరి. కాని 19వ సూత్రములో నీశ్వర ప్రణిధానము నంతరాయని వృత్తికి సాధనముగా జెప్పి 30-31 సూత్రములలో నాయంతరాయముల దెలిపిరి గాన నుపసంహార రూపమగు నీ సూత్రమున నుపక్రమానుగుణముగ ముఖ్య మగునది నీశ్వరతత్త్వాభ్యాసమే యని యర్థము చెప్పిననే యుపక్రమోపసంహారముల కైక్యరూపము సిద్ధించును. కాన విక్షేపాది

నిరాసమునకై ముఖ్యమగు నీశ్వరతత్త్వము నభ్యసింపవలయునని భావము.

బౌద్ధులు చిత్తమునకు క్షణికత్వము (క్షణికమాత్ర ముండుట) నంగీకరించి యది తనకు విషయ మగు నొకవస్తువును తప్ప ఇతరమును విషయీకరింప దనియు కాననే ప్రత్యయమాత్రము (నిరాధారము) అనియు తలంతురు.

వీరి మతమున నొక్కొకచిత్త మొక్కొక విషయమున మాత్రము ప్రవర్తించును గాన నన్నిచిత్తములు నేకాగ్రములే గాన వాటికి ననేక విషయములకు బారుట యను విక్షేపము గలుగదు. కాన వైనాశిక(బౌద్ధ) గురువగు బుద్ధుడు విక్షేపము బోనడచుట కొరకు శిష్యుల చిత్తము లన్నిటికి నేకాగ్రతా భావనను బోధించుట వ్యర్థమే యగును. ఒకవేళ విషయము లన్నిటి నుండి తొలగి యేదేనొకే విషయమున చిత్తమునకు నిరంతరస్థితి గలుగుటయే యేకాగ్రత యని నిర్వచించి యట్టి యేకాగ్రత బుద్ధునిచే నుపదేశింపబడె నందుమేని యపుడు చిత్తమునకు ప్రత్యర్థ నియతత్వము (ఒకవస్తువునందు మాత్రము ప్రవర్తించుటయును) క్షణికత్వమును భగ్నము లగును. చిత్తము ప్రత్యర్థనియత మగుచో పలువిషయములకు బోజాలదు. క్షణిక మైనచో నితర విషయములనుండి తొలగించులోననే నశించును గదా! కాన చిత్తము ప్రత్యర్థనియతము (ఒకే వస్తువును విషయీకరించునది) కాదు.

మరియొక వేళ ఒక్కొక్కవిషయమును విడుచుచు నొక్కొక విషయమునకు బారుట విక్షేపమనియు, ఒకేవిషయమున నిరంతరస్థితి యేకాగ్రత యనియు మేము విక్షేపైకాగ్రతలకు లక్షణము చెప్పము. "నీల పీతాది పరస్పర విభిన్నవిషయాకారము నొందుటచే ననుక్షణము చిత్తమున గలుగు విలక్షణరూప పరంపరాశీలత్వము విక్షేపము. నిరంతర సదృశములగు విషయాకారములచే జ్ఞానమాత్రమగు చిత్త ప్రవాహ మేకాగ్రము" అని నిర్వచించినచో బుద్ధుని యేకాగ్రతోపదేశము సరిపడును గదా! యందురేని యీ క్రింది ప్రశ్నలకు సమాధానము నొసగుడు.

మీరు చెప్పిన యేకాగ్రత చిత్తప్రవాహపు (చిత్తధారకు) ధర్మమా? చిత్త ప్రవాహములో నేకదేశమగు చిత్తమునకు ధర్మమా? (చెందినదా?)

చిత్తప్రవాహ (పరంపరా) ధర్మ మందురేని, చిత్తప్రవాహ మనగా ప్రత్యేకమగు చిత్తములే గాని చిత్తములకన్న భిన్నమగు మరియొకటి లేనందున ధర్మియే లేకున్న ధర్మ మెట్లుండును? మరియు సర్వవస్తువులు బౌద్ధ మతమున క్షణికములు గాన, చిత్తప్రవాహము సయితము క్షణికమే కాన స్థిరమగు నాశ్రయము లేకుండుటచే (ఏకాగ్రతయందుండుట సంభవింపదు గాన) చిత్తప్రవాహధర్మ మనరాదు.

ఒక్కొక్కచిత్తమున ధర్మ మంటిరేని, చిత్తప్రవాహములో నొక భాగమగు నొక్కొక చిత్తము సమానవిషయ ప్రవాహము గలిగి యున్నను, లేక భిన్నవిషయ ప్రవాహము గలిగియుండినను, ఎట్లైనను తాను ప్రత్యర్థ నియతము (ఒకే విషయమును గ్రహించునది) గావున చిత్తమెల్లవేళల నేకాగ్రమైయే యుండును. కాన చిత్తమున కొకప్పుడును బౌద్ధమతమున విక్షేపము సంభవింపదు. దానిచే బుద్ధుడు శిష్యులకు చిత్తవిక్షేప నివారణమున్నకై యేకాగ్రత నుపదేశించుట యసంగతమే.

కావున చిత్త మొక్కటియే స్థిరమై (క్షణములో నశింపక) యనేక విషయముల మీదికి బరువు లెత్తుచుండును. దాని నుపాయ సహాయమున నొక్క విషయముననే నిలుపుటయే యేకాగ్రత యగును.

మరియు బౌద్ధమతము ప్రకార మొప్పుకొంటిమేని మరియొక దోషము గూడ నేర్పడును. క్షణికమగు చిత్తమున కేదేని యొక్క వస్తువే విషయ మగును గాని భిన్నభిన్నములగు పలువస్తువులు విషయములు గావు గాన నింతకుముం దనుభవించిన నానాపదార్థములను స్మరించుట యెట్లు సరి పడును? అపుడనుభవించిన చిత్తములు వేరు, ఇపుడు స్మరించు చిత్తము వేరుగాన ననుభూత విషయజ్ఞానరూపమగు స్మరణము గలుగగూడదు.

మరియు నొకచిత్తముచే నొనర్పబడిన పుణ్యపాపాది కర్మములకు

ఫలమును వేరొకచిత్త మనుభవింపవలసివచ్చును. ఇట్టి స్థితి నంగీకరించితి మేని కృతహానము (చేసినది పోవుట), నకృతాభ్యాగమము (తానుచేయక పోయినను ఎవరో చేసినది తనకు వచ్చుట) - అను దోషములు గలుగును.

బౌద్ధమతమున చిత్తముకన్న వేరగు నాత్మ లేదు గాన (కర్మ ఫలాదులు, చిత్తములు అనేకములు చెప్పబడెనుగాన) తదనుగుణముగా శంక చేయబడెను.

దీనిపై నిట్లు సమాధానము చెప్పవచ్చును. కృతహానాకృతా భ్యాగమములు దోషములు గావు. పుత్రుడు చేసిన తర్పణఫలమును తండ్రి యనుభవించుటయు, పుత్రజన్మమున తండ్రి చేయు వైశ్వానరేష్టిచే గలుగు తేజస్విత్వాదిఫలములు పుత్రునకును గలుగునని శాస్త్రములందు దెలుపబడి యున్నది. కాన నట్లే యొకచిత్తముచే నొనర్పబడిన కర్మల ఫలము నింకొక చిత్త మనుభవించుట సమంజసమే.

కాని యిదియు సరిగాదు. పై సమాధానములోని కర్తృభోక్తలకు పితాపుత్ర సంబంధము జన్యజనకభావము గలదు. కాన వారొండొరుల కర్మలకు ఫలము ననుభవించుట సహజమే. బౌద్ధులు పూర్వచిత్తము నుత్తరచిత్తమునకు కారణమని యంగీకరింపరు. మరి సంబంధ రహితముగనే నూతనచిత్తములు గలుగుచుండు నందురు. కాన పరస్పర సంబంధము లేని చిత్తములకు కర్మఫల పరివర్తనము సరిపడదు.

అదిగాక తర్పణము నొనర్చు పుత్రుడు పితృవ్యాద్దేశ్యకముగ వానికి చెందవలయునని సంకల్పించి చేయును. అట్లే జన్మదినమున వైశ్వానరేష్టిని చేయు తండ్రియు శిశువునకు తేజస్విత్వాదులు గలుగవలయునని సంకల్పించియే చేయును. కాన పై యుదాహరణములో నొకరి కర్మకు ఫలమొక రనుభవించుట తగును గాని పూర్వచిత్త ముత్తరచిత్తమునకు ఫలము గలుగవలయునని యుద్దేశముతో కర్మనాచరింప కుండుటచే నుత్తరచిత్తము నకు కర్మఫల సంబంధము పొసగదు.

ఇంతయేల? ఎన్నియుక్తులతో సమర్థింపజూచిన నియ్యది గోమయ పాయసీయ న్యాయమునే మేలనిపించును. గోమయపాయసీయ న్యాయ మనగా గోమయము (ఆవు పేడ) పాయసమువలె స్వాదుభక్ష్యము; గోజన్యముగాన, గోక్షీరమువలెనని యావుపేడను స్వాదుభక్ష్యమని నిరూపించుట. ఇది మిక్కిలి హేయమైనది.

ఈ గోమయ పాయసీయ న్యాయము మేలు. ఇందు గోజన్యము గాన నని హేతువుగూడ నిరూపింపబడినది, ఒక చిత్త మొనర్చిన కర్మకు ఫలమును మరియొక చిత్త మనుభవించుటలో నేమాత్రము హేతు వైనను నిరూపితము గాకపోవుటచే నింతకన్న గోమయ పాయసీయ న్యాయమే మేలు.

చిత్తమునకు భిన్నత్వము నంగీకరించుచో స్వానుభవము నిరోధించును. ''నేను చూచిన దానినే తాకుచున్నాను.నేను తాకిన దానినే చూచుచున్నాను.'' అను బిన్నభిన్న జ్ఞానములలో నేను-నేను అని తోచుచు భిన్నభిన్న జ్ఞానముల కాశ్రయమగు నేకరూపమగు (అహం=నేను) వస్తువే తోచుచున్నది గదా! అట్టి ప్రతీతి యత్యంత భిన్నములును క్షణికములు నగు చిత్తములయందు సరిపడదు.

కాన పై ప్రత్యభిజ్ఞారూపమగు ప్రత్యక్షానుభవ బలముచే గలుగు చిత్తైకత్వప్రతీతి యితర ప్రమాణములచే నిరాకరింపబడదు. కపిల మహర్షియు **''న ప్రత్యభిజ్ఞా బాధాత్''** (సాంఖ్యసూ 1-35) అని ప్రత్యభిజ్ఞ - కుదరదు గాన చిత్తమునకు ఏకత్వమే గాని భిన్నత్వము లేదని చెప్పెను.

ప్రత్యక్షమే ప్రబల ప్రమాణము. ఈ ప్రత్యక్షమూలముననే యితర ప్రమాణములు సిద్ధించును.

''ప్రతివస్తువును క్షణికమగు వస్తువుగాన, దీపజ్వాలవలె'' నను బౌద్ధుల యనుమానమున నుదాహృతమగు దీపజ్వాల యనేక క్షణములవరకు నుండుటచే క్షణికత్వము సాధితము గాదు. ఈ విషయమునే కపిల మహర్షి **''దృష్టాంతాసిద్ధేశ్చ''** (సాంఖ్య-సూ 1-37)యని దృష్టాంత మగు దీపజ్వాల

లోనే క్షణికత్వము లేకుండుటచే క్షణికత్వము సిద్ధింపదని చెప్పిరి. కాన చిత్తమొక్కటియై స్థిరమై యనేక విషయములను గ్రహించును.

అవ॥రాగద్వేషాది మలములను దొలగించుకొని చిత్తమీశ్వర ప్రణిధాన యోగ్య మగుటకు సాధనములను దెలుపుచున్నారు.

**సూ॥ మైత్రీ కరుణాముదితోపేక్షాణాం**
**సుఖదుఃఖ పుణ్య విషయాణాం**
**భావనాత శ్చిత్తప్రసాదనమ్ ॥ 33**

మైత్రీకరుణాముదితోపేక్షాణాం, సుఖదుఃఖపుణ్యాపుణ్య విష యాణాం, భావనాతః, చిత్త ప్రసాదనమ్.

సుఖదుఃఖ పుణ్యాపుణ్య విషయాణాం=సుఖవిషయమున, దుఃఖ విషయమున, పుణ్యవిషయమున, పాపవిషయమునను, (క్రమముగా) మైత్రీకరుణాముదితోపేక్షాణాం = 1.మైత్రి, 2.కరుణ, 3.ముదిత, 4.ఉపేక్షల యొక్క, భావనాతః =భావించుటవలన, చిత్తప్రసాదనం = చిత్తము నిర్మల మగును.

వానిలో సుఖభోగపరులగు పురుషుల విషయమున మైత్రిని భావింప వలయును. దుఃఖితుల విషయమున కరుణను భావింపవలయును. పుణ్యాత్ముల విషయమున ముదితను భావింపవలయును. పాపాత్ముల విషయమున నుపేక్షను భావింపవలయును. అనగా సుఖపడు వారితో చెలిమియు, దుఃఖితులయెడ జాలియు, పుణ్యాత్ములయెడ సంతసమును, పాపులయెడ నుదాసీన(తాటస్థ్య) భావము నభ్యసించినచో శుక్లధర్మము కలుగును. శుక్లధర్మ మనగా పాపలేశము లేనిదై, స్వాధ్యాయాభ్యసనాదులవలన గలుగు ధర్మమువలె నిర్మల మైనది. యజ్ఞాదులచే గలుగు ధర్మము సయితము శుక్లకృష్ణమే గాని, శుద్ధశుక్లము గాదు. ఆ యాగమునందు పశుహింసారూప పాపసంపర్కము వలన కృష్ణత్వము లేశముగా ననువర్తించియే యుండును.

శుక్లధర్మముచే చిత్తము ప్రసన్న మగును, ప్రసన్నమగు చిత్తమేకాగ్రమై

స్థైర్యము నొందును.

రాజస తామస రూపములగు 1.రాగము, 2.ద్వేషము, 3.ఈర్ష్య. 4.పరాపకారచికీర్ష, 5. అసూయ, 6.అమర్షములను నారు చిత్తమలములచే విక్షిప్తమగు చిత్తమున క్రమముగ (1)రాగకాలుష్యము, (2) ద్వేషకాలుష్యము, 3)ఈర్ష్యా కాలుష్యము, (4)పరాపకారచికీర్షా కాలుష్యము. (5)అసూయా కాలుష్యము, (6)అమర్షకాలుష్యమును గలుగును.

(1) రాగకాలుష్యము - స్నేహ పూర్వకముగా తాననుభవించిన సుఖము తనకు సర్వకాల ముండవలయునను రాజసవృత్తి విశేషము.

(2)ద్వేషకాలుష్యము-దుఃఖము ననుభవించినంతనే దుఃఖప్రదాన విషయమున నశుభచింతన మను తామసవృత్తి విశేషము.

(3) ఈర్ష్యాకాలుష్యము-ఇతరుని గొప్పదనము (సుఖమును) చూచి మనసులో వ్యథ జెందుట.

(4) పరాపకార చికీర్షాకాలుష్యము - ఇతరుల కపకారము చేయదల చుట.

(5) అసూయాకాలుష్యము - ఇతరుని శ్లాఘ్యగుణములయందు దోషత్వము నారోపించుట.

(6)అమర్ష కాలుష్యము-నిందావాక్యములకు గురియై యవమానపడి నిందకునిపై పగదీర్చుకొన జూచుట-

ఈ యారు కాలుష్యములలో నేది యున్నను చిత్తమును విక్షిప్త మొన ర్చును. కాన మైత్ర్యాదిభావనలచే వీనిని దొలగించి చిత్తమును నిర్మల మొనర్చుకొనవలయును.

సుఖవంతునితో మైత్రి చేసినచో మిత్రుని సుఖమును తనదిగనే దలచును గాన రాగేర్ష్యాకాలుష్యములు రెండును కడతేరును. దుఃఖితుల యందు దయ జూపుటచే ద్వేషపరాపకారచికీర్షా కాలుష్యములు రెండును

తేరును. పుణ్యాత్ముల గాంచి యీతని జన్మము ధన్యము, ఈతని గన్న తల్లి దండ్రు లెంతో సుకృతవంతులు గదా! ఆహా! ఈతని జన్మముచే నతని కులము శోభిల్లుచున్నది. అని యిట్లామోదించుట (ఆనందపడుట) యలవరచు కొనినచో నసూయాకాలుష్య మడుగంటును. ఇట్లే పాపులను జూచి ''వీరు నను దిట్టినను అవమానించినను నేను వీరికి ప్రత్యపకారము చేయను. వారి పాపఫలము వారే యనుభవింతురు.'' అను నుపేక్షాభావము నలవరచు కొనినచో నమర్షకాలుష్యము తొలగును.

కాన నీ చతుర్విధభావనల నభ్యసించుటచే షడ్విధ చిత్తకాలుష్యములు మాయును. చిత్తము ప్రసన్న మగును. మరియు నది యాప్రసాదముచే నేకాగ్రమై స్థిరత్వము నొందును.

అవ॥ ఇంక ప్రసన్న మగు చిత్తమేకాగ్రత నొందుట కుపాయముల దెలుపుచున్నారు.

## సూ॥ ప్రచ్ఛర్దన విధారణాభ్యాం వా ప్రాణస్య॥ 34

ప్రచ్ఛర్దనవిధారణాభ్యాం, వా, ప్రాణస్య॥

ప్రాణస్య=కోష్ఠ (కంఠము మొదలు గుదమువరకుగల మధ్య కాయరంధ్రమునకు కోష్ఠమనిపేరు) స్థితవాయువు యొక్క, ప్రచ్ఛర్దన విధారణాభ్యాం వా= ప్రచ్ఛర్దన =నాసారంధ్రముల నుండి యత్నవిశేషముచే బయలు పరచుట (రేచనము) విధారణాభ్యాం వా=కొంతసేపు వెలుపలిగాలి లోపలికి పోకుండ నాపుట (కుంభకప్రాణాయామము) అను రెండింటిచేతగూడ మనసః, స్థితిః=(ఈ రెండు పదములు రాబోవు సూత్రమునుండి యపకర్షింపబడును) చిత్తమునకు స్థిరత్వము గలుగును.

ఉదరమునందలి వాయువును యోగశాస్త్రోక్తయత్న విశేషముచే నాసారంధ్రము గుండా మెల్లమెల్లగ బయలుపరచి కొంతపట్టు వాయువును లోనికి పీల్చక స్తంభింపజేయుట యను రేచక కుంభకములను మరల మరల చేయుచుండినచో గూడ మనస్సు నిలకడ చెందును. ఇచ్చట వా యను

వికల్పము రాబోవు సూత్రములను బట్టియేగాని గతసూత్రమునుబట్టి ప్రయోగింపబడలేదు. అనగా మైత్ర్యాదులచేతగాని, ప్రచ్ఛర్దనాదులచేతగాని యని యర్థము గాదు. విషయవత్ప్రవృత్తి మొదలగు వాటిచేతగాని రేచకకుంభకములచేతనేని మనస్సు స్థిరపడునని భావ మెరుంగవలయును. ఏలనన భాష్యకారుడగు వ్యాసభగవానులు పూర్వ(133) సూత్రభాష్యమున ''తతశ్చ చిత్తం ప్రసీదతి'' యని మైత్ర్యాదులను చిత్తప్రసాదమునకు కారణముగా జెప్పి యీ సూత్రభాష్యమున ''తాభ్యాం వా మనసః స్థితిం సంపాదయేత్'' ఆ ప్రచ్ఛర్దన విధారణములచే నేని చిత్తైకాగ్ర్యమును గడించవలయునని చెప్పిరి. ''మనసః స్థితిం'' యను రెండు పదముల నపకర్షించుటను గూడ నిందుచే సూచించిరి. కాగా మైత్ర్యాదు లన్నిటిచే మనః ప్రసాదమును సాధించి యాప్రసాదముచే ప్రాణాయామాదులలో దేనినేని సాధించి దానిచే చిత్తైకాగ్ర్యము నొందవలయును.

ప్రాణ (వాయు) నిరోధముచే చిత్తస్థైర్యము గలుగుట యసంభవము గాదు.

**ద్వే బీజే చిత్తవృక్షస్య ప్రాణస్పందనవాసనే।**
**ఏకస్మింశ్చ తయోః క్షీణే క్షిప్రం ద్వే అపి నశ్యతః ॥** (వాసిష్ఠము)

అనగా చిత్తమను చెట్టునకు నిశ్శ్వాసోచ్ఛ్వాసరూప మగు వాయుస్పందన మొకవిత్తనము, వాసన (సంస్కారము) మరియొక విత్తనము. ఈ రెంటిలో నొక్కటి నశించినచో మరియొకటి తనంతట తానే నశించును. కాన ప్రాణ (వాయు) నిరోధముచే వాసన నశించును గాన దానిచే చిత్తస్థైర్యము గలుగును.

ఇచట గొందరు విధారణ మనగా గుంభకము, రేచకానంతరము పూరకము, లేక కుంభకము పొసగదు గాన పూరకము సయిత మాక్షిప్త మగును. కాగా రేచక పూరక కుంభక రూపమగు ప్రాణాయామమువలన జిత్తస్థైర్యము గలుగును అని చెప్పుదురు.

అవ॥ గతసూత్రములోని వికల్పమునకు విషయములగు సాధనాంతర

మును దెలుపుచున్నారు.

**సూ॥ విషయవతీ వా ప్రవృత్తిరుత్పన్నా**
**మనసః స్థితి నిబంధినీ ॥ 35**

విషయవతీ,వా, ప్రవృత్తిః ఉత్పన్నా, మనసః, స్థితినిబంధినీ.

వా=అట్లుగానిచో, విషయవతీ=గంధాదివిషయములను ప్రత్యక్షమొనర్చుకొను, ప్రవృత్తిః=యోగిచిత్తవృత్తి, ఉత్పన్నా = ఉదయించినదై, మనసః=చిత్తమునకు, స్థితి నిబంధినీ= స్థైర్యకారణ మగును.

గంధ రస రూప స్పర్శ శబ్దము లైదును విషయము లనబడును. ఇయ్యవి స్థూలభూతములగు పృథివ్యప్తేజో వాయ్వాకాశ నామక పంచభూతాశ్రితము లగుచో మనుజభోగోపయోగు లగును గాన లౌకికము లనియు, పంచతన్మాత్రా కార్యములై సూక్ష్మభూతముల నాశ్రయించి యున్న వగుచో దేవమాత్రభోగోపయోగులు గాన దివ్యము లనియు చెప్పబడును. ఇందు లౌకికవిషయములు సహజముగనే యనుభవ గోచరము లగుచుండును. కాన, దివ్యములగు గంధాది విషయముల నుపాయముచే సాక్షాత్కరించుటయే విషయవత్ప్రవృత్తి యనబడును. ఇయ్యది విషయభేదము ననుసరించి యైదువిధము లగును.

1.గంధప్రవృత్తి=అనగా తన నాసికాగ్రమున సంయమముచే చిత్తమును నిలుపుటచే గలుగు దివ్యగంధ సాక్షాత్కారము. దీనినే దివ్యగంధసంవిత్తు అందురు.

2.రసప్రవృత్తి= తన జిహ్వాగ్రమున చిత్తమును ధరించినచో దివ్యరస సాక్షాత్కారము గలుగును. దీనినే దివ్యరససంవిత్తు అందురు.

3.రూపప్రవృత్తి=అనగా తాలుభాగమున (దవడయందు) తన సంయమముచే చిత్తమును నిలుపుటచే గలుగు దివ్యరూపసాక్షాత్కారము. దీనినే దివ్యరూపసంవిత్తు అందురు.

4.స్పర్శప్రవృత్తి=అనగా నాలుక నడుమ చిత్తమును నిలుపుటచే గలుగు దివ్యస్పర్శ సాక్షాత్కారము. దీనినే దివ్యస్పర్శ సంవిత్తు అందురు.

5.శబ్దప్రవృత్తి యనగా=నాలుక మొదట చిత్తమును నిలుపుటచే గలుగు దివ్యశబ్ద సాక్షాత్కారము. దీనినే దివ్యశబ్దసంవిత్తు అందురు.

ఈ పంచవృత్తులు గలిగెనేని యవి చిత్తమును నిలుకడగ నుంచును. వీనిచేతనే యోగిచిత్తము స్వస్వరూప సాక్షాత్కారమునకు గాని, ఈశ్వర సాక్షాత్కారమునకు నేని సమర్థ మగును - కాన నీశ్వరప్రణిధానముచే స్వస్వరూప సాక్షాత్కార మెట్లు గలుగును? అను సంశయమును గూడ విషయవత్ప్రవృత్తులు పారద్రోలును గాన సమాధి ప్రజ్ఞకు ద్వారము లగును. అనగా ఈ ప్రవృత్తులు గలిగెనేని అనాయాసముగ సమాధి సిద్ధించును.

ఇట్లే చంద్రసూర్యగ్రహ ప్రదీపరత్నాదుల విషయమున జిత్తము నిలుపుటచే గలుగు తత్తత్సాక్షాత్కారములుగూడ విషయవత్ప్రవృత్తియే యని యెరుగవలయును.

ఈ ప్రవృత్తు లన్నియు మోక్షోపయోగులు గావు, గాన మోక్షసాధన నిరూపణ ప్రవృత్తమగు నీశాస్త్రమున వానిని వివరించుట యసంగతముగ దోచినను దోచవచ్చును. కాని యాత్మభిన్న వస్తువిషయక చిత్తధారణముచే ననాత్మవస్తు సాక్షాత్కారము గలుగు తెఱగున నాత్మవిషయ చిత్తధారణముచే నాత్మప్రత్యక్షము గలిగి తీరును. కాన నాత్మసాక్షాత్కార మసంభవము గాదని విశ్వాసము జనింపజేయుటకు తెలుపబడెను.

శాస్త్రాదులు యథార్థ ప్రతిపాదన సమర్థములు గాన శాస్త్రముచేతను, అనుమాన ప్రమాణముచేతను, ఆచార్యోపదేశముచేతను ఎరిగిన వస్తువు యథార్థమే యయినను వారిచే దెలుపబడిన దానిలో కొంతయేని తన యింద్రియములకు గోచర మగునంతవరకు బరోక్షమువలె నుండి యత్యంతసూక్ష్మము లగు మోక్షాది విషయమున నిశ్చయబుద్ధి గలుగదు. కాన శాస్త్రానుమానాచార్యోపదేశములను దృఢపరచుకొనుటకే యందు గొంత

భాగమును దప్పక ప్రత్యక్షము చేసికొనవలయును, అట్లు ఉపదిష్టార్థమునందు కొంతయేని ప్రత్యక్ష గోచర మగుచో నుపదిష్ట మంతయు మోక్షపర్యంతమగు సర్వవిషయములును విశ్వసింపబడును. కాన మోక్షా ద్యుపదేశములయందు విశ్వాసము గలిగించుటకే ఈ విషయవత్ప్రవృత్తులు తెలుపబడెను.

ఈ ప్రవృత్తులలో నేదేని యొకటి గలిగినను తత్తద్గంధాది విషయమున దోషదర్శనముచే వశీకారసంజ్ఞిక వైరాగ్యము(1-15) కలుగగా నుత్తర భూమికా రూపమగు నర్థమును చిత్తము సాక్షాత్కరింపజాలి యుండును. కాన వశీకారసంజ్ఞిక వైరాగ్యముచే శ్రద్ధయు, వీర్యమును, స్మృతియు సమాధియు నిరంతరాయముగ కలుగును.

కాన నుపదిష్టార్థములపై విశ్వాసము (నమ్మకము) కొరకును, చిత్తస్థైర్యము కొరకును తొలుదొలుత నీ ప్రవృత్తుల నార్జింప వలయును.

అవ॥ ఇంకను చిత్తస్థైర్యమున కుపాయములు దెలుపుచున్నారు.

## సూ॥ విశోకా వా జ్యోతిష్మతీ॥ 36

విశోకా, వా, జ్యోతిష్మతీ॥

వా = అట్లు గానిచో, విశోకా = దుఃఖరహిత మగు, జ్యోతిష్మతీ = జ్యోతిష్మతి యను "(ప్రవృత్తిరుత్పన్నామనసః స్థితి నిబంధినీ" యను పూర్వసూత్రభాగ మంతయు నిచట ననువర్తించును) ప్రవృత్తిః = పవృత్తి, ఉత్పన్నా= కలిగినదై, మనసః = చిత్తమునకు, స్థితినిబంధినీ = స్థైర్యమును గలిగించును.

విషయవత్ప్రవృత్తి యుత్పన్నమై చిత్తమును స్థిరపరచు విధముననే శోకరహితమగు జ్యోతిష్మతిసంజ్ఞక మగు ప్రవృత్తియు నుత్పన్న మగుచో చిత్తస్థైర్యమును గలిగించును.

ఇచ్చట నీ విషయమును ముందు తెలిసికొనవలయును. నాభికి

(బొడ్డునకు) పైగా పది యంగుళములు స్థలములో నెనిమిది రేకులు నెఱ్ఱనిరంగు గలిగి యైదురంధ్రములు గల హృదయకమల మధోముఖముగ ముకుళించి యుండును. దాని కాడ పై నుండి క్రిందికి వ్యాపించి యుండును. రేచక ప్రాణాయామాభ్యాసము ద్వారా యా యధోముఖ కమల మూర్ధ్వముఖముగానై ముకుళితావస్థను వదలి వికసించును. అట్లు వికసించిన యా హృదయపుండరీకము లోపల సూర్యమండలము 'అ' కారము, జాగరితస్థానము నుండును. దానిపై చంద్రమండలము 'ఉ' కారము స్వప్నస్థానము నుండును. దానిపై వహ్నిమండలము 'మ' కారము సుషుప్తి స్థానము నుండును. దానిపై నాకాశరూప మగు పరబ్రహ్మనాదము నర్ధమాత్ర తురీయ స్థానమును గలవు. ఆ హృత్పుండరీకకర్ణిక (బొడ్డు) యందు సర్వతో వ్యాప్తమగు శాఖలు గల మనోవహనాడి యొక్క మూలము పాదుకొనియున్నది. ఆ మనోవహనాడి నుండి సొరతీగనుండివలె నొకశాఖ పైకి ప్రాకును. అదియే బ్రహ్మనాడి యనియు, సుషుమ్నానాడి యనియు చెప్పబడును. ఈ సుషుమ్నానాడి సూర్యాది మండలముల నడుమనుండి సరాసరిగ వెన్నెముక నాధారము చేసికొని మూర్ధపర్యంతము పోవును. ఈ నాడియే చిత్తస్థానము.

కాన యోగి తన చిత్తమును సుషుమ్నానాడియందు సంయమముచే నిలిపెనేని బుద్ధిసంవిత్తు గలిగి, సాత్త్వికజ్యోతిస్స్వరూపమును, ఆకాశ కల్పమును భాస్వరమునై; యా చిత్తమొకతూరి సూర్యాకారముగను, మరియొకతూరి చంద్రుని చందమునను, మరియొకతేప గ్రహముల విధమునను, మరియొకవేళ రత్నప్రకాశరూపమునను భాసించును. తరువాత మరల చిత్తసాక్షాత్కారము గలుగును. ఇయ్యది జ్యోతిస్స్వరూప మగు చిత్తమును సాక్షాత్కరించుట గాన జ్యోతిష్మత్ప్రవృత్తి యనబడును. ఇందు సూర్యాద్యనేక విషయములు గలవు. కాన నిదియు విషయవత్ప్రవృత్తియే. ఇందు సత్త్వగుణము ప్రధానముగా నుండి రజస్తమస్సంబంధము లేదు గాన దీనికే విశోక యనియు నామాంతరము.

ఇట్లే యస్మిత (అహంకారము) యందు సంయమస్థిర మగు చిత్తము

నిస్తరంగమగు మహాసముద్రమువలె శాంతమై యనంతమై సత్యప్రధాన మగు నస్మితామాత్రముగ నగును. దీనినే యస్మితామాత్ర జ్యోతిష్మత్ప్రవృత్తి యందురు. ఈవిషయమునే సాంఖ్యప్రవర్తకు డగు పంచశిఖాచార్యుడు నిటుల నుడివెను. ''తమణుమాత్రమాత్మాన మనువిద్యాఽస్మీత్యేవం తావత్సం ప్రజానీతే'' అనగా దుర్జ్ఞేయ మగుటచే నణుమాత్రమగు నస్మితా (అహంకార) స్థానమును ధ్యానించినచో నస్మితామాత్రప్రతీతి గలుగునని భావము.

కాగా విషయవత్ప్రవృత్తియు నస్మితామాత్ర ప్రవృత్తియు నగు రెండు చిత్తసంవిత్తులును సాత్త్వికప్రకాశ ప్రచారములు గాన జ్యోతిష్మత్తు లనబడును. కాననే ఈ రెండును విశోకములు గూడ నగును. కాన విశోకవిషయవ జ్జ్యోతిష్మత్ప్రవృత్తిచేతను. విశోకాస్మితామాత్ర జ్యోతిష్మత్ప్రవృత్తిచేతను చిత్తము స్థిరతనొందునని తెలిసినది.

అవ॥ మరియొక యుపాయమును దెలుపుచున్నారు.

## సూ॥ వీతరాగవిషయం వా చిత్తమ్॥ 37

వీతరాగవిషయం, వా, చిత్తమ్.

వా = అట్లు గానిచో, వీతరాగవిషయం= వీతరాగులగు యోగుల చిత్తవిషయమున సంయమముచే, చిత్తం = సాధకుని చిత్తము, స్థితిపదం లభతే = (యని యధ్యాహార్యము) స్థిరత్వము నొందును.

వీతరాగులగు సనకసనందన శుకవ్యాసాదియోగుల చిత్తమునందు తనచిత్తమును బాదుకొలిపి ధ్యానించుచో సాధకుని చిత్తము తదాకారము నొంది స్థిరత్వము నొందును.

పైసూత్రములవలన చిత్త మెచ్చోట సంయమముచే నిలుపబడునో తదాకారము నొందునని విదితమైనది గాన నింతకు మున్నే వీతరాగమై స్థిరపదము నొందిన సనకాది మునీంద్రుల చిత్తముతో జేర్పబడిన సాధకుని

చిత్తము సులభముగ స్థిరమగును.

అవ॥ వేరొండుపాయమును దెలుపుచున్నారు.

**సూ॥ స్వప్ననిద్రాజ్ఞానాఽలంబనం వా॥ 38**

స్వప్న నిద్రాజ్ఞానాఽలంబనం, వా॥

వా = అట్లు గాదేని, స్వప్ననిద్రాజ్ఞానాఽలంబనం- స్వప్న = సాత్త్వికస్వప్న సమయమునందలియు, నిద్రా = సుషుప్తిసమయము నందలియు జ్ఞాన = జ్ఞానము, లేక జ్ఞానమున విషయమగు పదార్థములు, ఆలంబనం = ఆధారముగా గల చిత్తం = (ఈ పదము పూర్వసూత్రము నుండి యనువృత్తము) సాధకుని చిత్తము, స్థితిపదం లభతే =స్థైర్యము నొందును.

ఒకానొక సమయమున నేకాంతపరిశుద్ధవనప్రదేశమున జంద్ర మండలమునుండి వెలువడెనో యన్నట్లు కోమల మృణాలఖండ పాండురముల నంగప్రత్యంగములతో నొప్పారుచు సురభిళ మల్లికామాలతీ మాలికా విరాజిత మగుచు చంద్రకాంత మణిమయ మగు చంద్రశేఖరుని ప్రతిమను గాని, తమాలశ్యామల మసృణమాంగ లాంగకములతో నొప్పులు గలుగుచు శ్రీవత్సకౌస్తుభ వైజయంతీ విరాజమానమై చతుర్భుజమై యిందిరామందిరమగు నెద గుదురుకొనిన యింద్రనీలమయ నారాయణ ప్రతిమనుగాని గాంచి తత్పూజాతత్పరుడై యుండినట్లు కల గని తటాలున మేలు కాంచెనేని యాపురుషుని చిత్తము ప్రతిమాదర్శనము నందును, తత్పూజనము నందును దనివి జనక యితర విషయములకు జొరకుండును. కాన సాత్త్విక స్వప్నజ్ఞానమున విషయమగు ప్రతిమాదులయందు చిత్త మనాయాసముగ నిలుపవచ్చును. దానిచే చిత్తస్థైర్య మేర్పడును.

ఇట్లే గాఢనిద్రనుండి మేల్కొనిన యతడు ''నేను సుఖముగ నిదురించితిని'' అని స్మరించును గదా! ఆ స్మరణములో విషయమగు సుఖమయ మగు తన రూపమునందు చిత్తమును బాదుకొలిపినను చిత్తము స్థిరముగ నిలుచును.

అవ॥ ఇంకొక యుపాయమును జెప్పి ప్రవృత్తి ప్రకరణమును ముగించుచున్నారు.

## సూ॥ యథాభిమతధ్యానాద్వా ॥ 39

యథాభిమతధ్యానాత్, వా॥

వా = అది కాకున్న, యథాభిమతధ్యానాత్ , యథాభిమత, తన కిచ్చవచ్చిన పదార్థముయొక్క, ధ్యానాత్ = ధ్యానించుట వలనను, చిత్తం = సాధకుని చిత్తము, స్థితిపదం లభతే = స్థైర్యము నొందును.

పూర్వోక్తభిన్నమగు నేదేని యిష్టవస్తువున చిత్తమును నిలిపినను చిత్తస్థైర్యము కలుగును. అనగా ఛాందోగ్యోపనిషత్తునందు -

**అథ య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే**
**హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః ।**
**తస్య యథా కప్యాసం పుండరీకమేవాక్షిణీ తస్యోదితి నామ స ఏష సర్వేభ్యః**
**పాప్మభ్యః ఉదిత ఉదేతి హ వై సర్వేభ్యః పాప్మభ్యో య ఏవం వేద ॥**

అనగా సూర్యమండలాంతర్గతుడై స్వర్ణభూషణుడై సువర్ణశ్మశ్రు (గడ్డము మీసము గలవాడు) స్వర్ణకేశుడై నఖశిఖాపర్యంతము సువర్ణ ప్రకాశుడై సూర్యోదయ నూతన వికసిత తామరస నయనుడైన యా పురుషుడు (ఉదితః) పాపరహితుడు గావునను, వానిని సమాధియందు సాక్షాత్కరించు యోగి పాపములనుండి విడివడును. (ఉదేతి) కావునను అతనికి 'ఉత్' అను నామము అని చెప్పబడిన సూర్యమండలాంతర్గత పురుషునియం దిష్ట మున్నచో నతనియందేని నీతిప్రియు డగు శ్రీరాముని యందేని, గోపవధూ కిశోరుడగు నందనందనుని యందేని, త్రిశూలధారి యగు పరమశివునందేని, వీణాపుస్తక ధారిణియగు సరస్వతియందేని, యింకను తన కభీష్టమగు నెవ్వరియందేని గురువునందేని చిత్తమును బాదుకొలిపినచో చిత్త స్థైర్య మలవడును.

అవ॥ ఇట్లు చిత్తస్థిత్యుపాయములను బ్రతిపాదించి పరిపూర్ణ చిత్తస్థైర్యము నెరుకపరచు చిహ్నములను నిరూపించుచున్నారు.

## సూ॥ పరమాణుపరమమహత్వాన్తోఽస్య వశీకారః॥ 40

పరమాణు పరమమహత్వాన్తః, అస్య, వశీకారః॥

అస్య=పూర్వోక్తోపాయములచే స్థిరమగు నీచిత్తమునకు. పరమాణు పరమమహత్వాన్తః - పరమాణు = సూక్ష్మవస్తువులలో నుత్కృష్ట మగు పరమాణువును, పరమమహత్వ = మహాపరిమాణము గల పదార్థములలో నుత్కృష్ట మగు ఆకాశమును, అంతః = అవధి (హద్దు) గా గల, వశీకారః = వశ్యము చేసికొనుట గలుగును.

ముప్పదినాల్గవ సూత్రము మొదలుకొని యింతవరకు నిరూపించిన యుపాయములచే సూక్ష్మ వస్తువునం దేకాగ్రమైన చిత్త మతిసూక్ష్మ మగు పరమాణు పర్యంత మగు నన్ని పదార్థములయందును స్థితిపదము (స్థిరత్వము) నొందును.

మహత్తగు నేదేని వస్తువునందు నిలుపబడిన చిత్తము పరమ మహత్తగు నాకాశపర్యంతము స్థితిపదము నొందును. సూక్ష్మములలో సూక్ష్మమగు పరమాణువువరకును స్థూలములలో స్థూలమగు నాకాశమువరకును రెండు వైపులను పరుగుదారు చిత్తమునకు నిరోధము లేకుండుటయే పరవశీకారము. దీనిచే నే వస్తువున దన కభిలాష పొడమునో యా వస్తువు నందే చిత్తమును స్థిరముగా నిలుపగలుగును.

ఇట్టి వశీకారముచే యోగిచిత్తము పరిపూర్ణ మైనదిగా నెరుగబడును గాన చిత్తస్థైర్య సంపాదనోపాయము లగు ప్రచ్ఛర్దనాదులు (34-35- 36-37- 38-39) ఇక ననావశ్యకములు.

కాగా సూక్ష్మములలో ప్రవేశించు చిత్తము పరమాణువు వరకును చేరి స్థిరపడుటయు స్థూలములలో బ్రవేశించిన చిత్తము పరమమహత్తగు

నాకాశమువరకు చేరి స్థిరపడుటయు ననునవియే చిత్తపుస్థైర్య పూర్తికి చిహ్నములు.

అవ॥ స్థిరత్వము గల చిత్తమునకు వశీకారమును జెప్పి యట్టిచిత్తమునకు గలుగు సంప్రజ్ఞాతసమాధి యెట్టిది? అది యే విషయమున గలుగును? అను విషయము నెరుకపరచుచున్నారు.

## సూ॥ క్షీణవృత్తేరభిజాతస్యేవ మణేర్గ్రహీతృ - గ్రహణగ్రాహ్యేషు తత్స్థతదంజనతా సమాపత్తిః॥ 41

క్షీణవృత్తేః, అభిజాతస్య, ఇవ, మణేః, గ్రహీతృగ్రహణ గ్రాహ్యేషు, తత్స్థతదంజనతా, సమాపత్తిః॥

అభిజాతస్య = ఉత్తమజాతి గల, మణేఃఇవ = రత్నమునకువలె, క్షీణవృత్తేః = రాజసతామసవృత్తి రహితమగు స్వచ్ఛచిత్తమునకు, గ్రహీతృగ్రహణ గ్రాహ్యేషు- గ్రహీతృ = జ్ఞాతయగు పురుషుని యందును, గ్రహణ = కరణములగు నింద్రియములయందును, గ్రాహ్యేషు = పంచతన్మాత్రలయందును, స్థూల భూతాది వస్తువుల యందును, తత్స్థతదంజనతా = ఏకాగ్రస్థితినొంది యావిషయములకు సమానమగు నాకారమును గాని, తాద్రూప్యమును గాని పొందుట, సమాపత్తిః = సంప్రజ్ఞాతసమాధి యనబడును.

ఉత్తమజాతి గలిగి యతినిర్మల మగు స్ఫటికమణి, రక్తాది వర్ణవిశిష్ట మగు దాసానిపువ్వు మొదలగువాని నాశ్రయించి యాశ్రయ రక్తాది వర్ణములు గలదిగ దోచునటుల నభ్యాస వైరాగ్యములచే రాజస తామస వృత్తులు క్షీణించిన చిత్తము మైత్ర్యాది భావనలచే విశదమై స్థూలసూక్ష్మ భూతములను గ్రాహ్యరూపము నాధారము చేసుకొనునేని గ్రాహ్యరూపము గలదిగ దోచును. అట్లే తన్మాత్రోపరక్తమై తన్మాత్రలతో గలసి తన్మాత్రరూపమున భాసించును. అట్లే స్థూలమగు ఘటాద్యాలంబన వస్తువులచే నుపరక్తమై స్థూలరూపము నొంది ఘటాది స్థూలాకారమున దోచును. మరియు స్థావరజంగమాది విశ్వభేదోపరక్తమై స్థావర జంగమాదికము నొంది స్థావర జంగమాద్యాకారమున

దోచును.

గ్రహణమగు నింద్రియములచే నుపరక్తమై (ప్రతిబింబితమై) యింద్రియములను గలసి యింద్రియాకారమున గోచరించును.

గ్రహీత యగు నహంకారోపాధిక పురుషునిచే నుపరక్తమై (ప్రతిబింబితమై) గ్రహీతృపురుషరూపము గలదై గ్రహీతృపురుష స్వరూపమున దోచును. మరియు ముక్తపురుషోపరక్తమై ముక్తపురుష రూపము నొంది ముక్తపురుషాకారమున భాసించును.

కాన నుత్తమజాతి స్ఫటికపువలె చిత్తము గ్రహీతలయందును గ్రహణవస్తువులగు నింద్రియములయందును గ్రాహ్యములగు భూతాదులయందును జేరి తదుపరక్తమై తత్తదాకారము నొందుటయే సమాపత్తి యను సంప్రజ్ఞాతసమాధి యని సారాంశము.

అవ॥ పైమూడింటియందును గ్రాహ్యసమాపత్తి 1. సవితర్క-గ్రాహ్య సమాపత్తియు, 2. నిర్వితర్క-గ్రాహ్య సమాపత్తియు, 3. సవిచారగ్రాహ్య సమాపత్తియు, 4. నిర్విచారగ్రాహ్య సమాపత్తియు నని నాల్గువిధములు. ఈనాల్గింటను మొదటి రెండు స్థూలగ్రాహ్య సమాపత్తు లనియును, వెనుకటి రెండును సూక్ష్మగ్రాహ్య సమాపత్తు లనియు బిలువబడును. వీనిలో సవితర్క-గ్రాహ్యసమాపత్తిని దెలుపుచున్నారు.

## సూ॥ తత్ర శబ్దార్థజ్ఞాన వికల్పైః సంకీర్ణా సవితర్కా సమాపత్తిః॥ 42

తత్ర, శబ్దార్థజ్ఞానవికల్పైః, సంకీర్ణా, సవితర్కా, సమాపత్తిః॥

తత్ర= గ్రహీతృగ్రహణ గ్రాహ్యసమాపత్తులలో, శబ్దార్థజ్ఞాన వికల్పైః- శబ్దార్థజ్ఞాన = శబ్దముయొక్కయు, నర్థముయొక్కయు, జ్ఞానము యొక్కయు, వికల్పైః = వికల్పములచేత, సంకీర్ణా = వ్యాప్తమగు (కలసిన)నది, సవితర్కా సమాపత్తిః = సవితర్క సంప్రజ్ఞాత సమాధి యనంబడును.

కంఠతాల్వాది సంయోగముచే నుత్పన్నమై శ్రోత్రేంద్రియ గ్రాహ్యమైన గోశబ్దమునకు ''గౌః'' అను నుచ్చారణము గలుగునట్లు కొట్టములో నున్న శృంగసాస్న(గంగడోలు)దిమద్వ్యక్తి యగు గోశబ్దార్థము సయితము ''గౌః'' అనియే చెప్పబడును. అట్లే గోవ్యక్తిని చూచుటచే, జిత్తమునకు గలుగు గవాకార పరిణామ విశేషమగు గోజ్ఞానముగూడ ''గౌః'' అనియే కలుగును. పై మూడు స్థానముల యందును, గోశబ్దము, గోరూపార్థము, గోజ్ఞానము నను భిన్నవస్తువుల కేకత్వము బోధిత మగుచున్నది. ఇయ్యది వస్తుశూన్యము గాన శబ్దార్థజ్ఞాన వికల్ప మని చెప్పబడును.

అనగా గోశబ్దము కంఠాదిస్థితమై యుదాత్తానుదాత్తాది ధర్మము గలిగి యుండును. గోశబ్దార్థ మగు గోవ్యక్తి గోష్ఠాది (కొట్టము మొదలగు వాని యందు) స్థితమై జడత్వ మూర్తత్వాది ధర్మములు గలిగియుండును. ఇట్లే గోజ్ఞానము చిత్తస్థితమై ప్రకాశము అమూర్తత్వము మొదలగు ధర్మములు గలిగియుండును. కాన శబ్దార్థ జ్ఞానములు వేర్వేరు త్రోవలు గలవి యయిన నివి యెల్లచోటులను కలియబడి యభిన్నముగనే తోచును గాన వికల్పాత్మక మనబడును.

అనగా గోశబ్ద ముచ్చరించినపుడు గోవును; గోజ్ఞానమును ప్రతీత మగును. గోవును జూచి ''యిది గోవు'' అని యన్నపుడును గోశబ్దము గోజ్ఞానమును తోచును. ఇట్లె గోజ్ఞాన స్థలమునను గోశబ్దార్థము లభేదముగ గోచరించును. కాన పరస్పర సంకీర్ణములై వికల్పాత్మకము లగును.

స్థూలభూతేంద్రియములయందు చిత్తమును నిలిపి సమాధినిష్ఠ డగు యోగికి గవాది పదార్థము సమాధి ప్రజ్ఞకు గోచరమై శబ్దార్థజ్ఞానవికల్పముచే గూడిన దగుచో అనగా ''ఇది గోశబ్దము ఇయ్యది గోరూప వస్తువు, ఇయ్యది గోరూపజ్ఞానము'' అను విభాగము లేక సామాన్యముగ దోచునేని, యది సంకీర్ణమై సవితర్క-సమాపత్తి (సంప్రజ్ఞాత సమాధి) యనబడును.

ఈ భావనయందు యథార్థజ్ఞానము లేదు గాన దీని నపర ప్రత్యక్ష

మందురు.

అవ॥ గవాది శబ్దములకు శృంగసాస్నాదిమద్వ్యక్త్యా(గవా) దులతోడ గల నియతసంబంధమునకే సంకేత మనిపేరు. అట్టి శబ్దసంకేతము తెలియని మనుజునకు ''గామానయ'' (గోవును తెమ్ము) అను వాక్యమును వినుటచే నెట్టి యర్థమును ప్రతీతము గాదు. కాని గోశబ్దమునకు శృంగసాస్నాది విశిష్టవ్యక్తియందు సంకేత మనియు, ''ఆనయ'' పదమునకు దూరమున నున్న వస్తువును దగ్గర తెచ్చుటయందు సంకేతమనియు సంకేతజ్ఞానము గల యాతని కీవాక్యమును వినినంతనే యర్థబోధ గలుగుటచే నాతడు గోవును తెచ్చును. కాన శబ్దసంకేతస్మరణమే యాగమానుమాన జ్ఞానములకు కారణము.

అర్థమునందు మాత్రమాదరము గల చిత్తముచే ననవరతము నర్థమును మాత్రము గ్రహించు నభ్యాసవశమున శబ్దసంకేతస్మృతిని వదలినచో నాగమానుమాన జ్ఞానరూప వికల్పములు లేని సమాధి జ్ఞానమునందు స్వరూపమాత్రమున నున్న మర్థ మర్థరూపముగనే భాసించును. కావునను, శబ్దజ్ఞానవికల్పముల కచట తావులేదు గాన నది నిర్వితర్కా సమాపత్తి యనబడును. ఈ భావనలో విపర్యయ జ్ఞానము లేశమును లేకుండుటచే నిది పర ప్రత్యక్ష మనబడును.

యోగులు పరప్రత్యక్షము గలవారైనను వారాగమముచేత ననుమానము చేతను పదార్థతత్త్వము నుపదేశింతురుగదా! ఆగమానుమానములు యోగి పరప్రత్యక్షములో విషయము గాకున్నచో వారుపదేశించుట పొసగదు. కాన పరప్రత్యక్షములో నాగమానుమానములు విషయ మగు నని యంగీకరించి తీరవలయును. అట్లంగీకరించితిమేని పరప్రత్యక్షము సయితము వికల్పసయితమే యగును గదా! ఇయ్యది నిర్వితర్కా మెట్లగును? అను శంక యుదయింపవచ్చును.

కాని పరప్రత్యక్ష మాగమానుమానములకు బీజ (కారణ)మే గాని

యాపరప్రత్యక్షములో నివి విషయము గావు. ఒక దానికి కారణ మగునది యెల్ల దానిని విషయీకరింపవలయునను నియమము లేదు. ధూమ జ్ఞానము వహ్నిజ్ఞానమునకు కారణమే గాని వహ్నిని విషయీకరింపదు గదా!.

కాన యోగులు నిర్వికల్పమగు ప్రత్యక్షముచే తత్త్వమును గ్రహించి యంతట నాగమానుమానములచే వికల్పించి బోధింతురు. కాన నిర్వితర్కసమాధి జన్యజ్ఞానము ప్రమాణాంతరముచే సంకీర్ణము గాదు.

అవ॥ అట్టి నిర్వితర్కసమాధికి లక్షణము నెరింగించుచున్నారు.

## సూ॥ స్మృతిపరిశుద్ధౌ స్వరూపశూన్యేవాఽర్థ మాత్రనిర్భాసా నిర్వితర్కా॥ 43

స్మృతిపరిశుద్ధౌ, స్వరూపశూన్యా, ఇవ, అర్థమాత్ర నిర్భాసా, నిర్వితర్కా.

స్మృతిపరిశుద్ధౌ = ఆగమానుమానకారణ మగు శబ్దసంకేత స్మరణము లేకుండగా, అర్థమాత్రనిర్భాసా = కేవలము గ్రాహ్య పదార్థమును మాత్రము ప్రకాశింపజేయు, స్వరూపశూన్యా ఇవ = ఇవగ్రహణమగు తన జ్ఞానాత్మక రూపము లేని దానివలెనున్న (సమాపత్తి), నిర్వితర్కా= నిర్వితర్క సంప్రజ్ఞాత సమాధి యనబడును.

సవితర్క సంప్రజ్ఞాత సమాధిలో గ్రాహ్యవస్తువు, గ్రాహ్యవాచక శబ్దము, గ్రాహ్యపదార్థజ్ఞానము - నను మూడు విషయములు చిత్తమున నుండు విధమున నిర్వితర్క సమాధిలో నుండవు. ఈ స్థితిలో చిత్తమున కేవలము ధ్యేయవస్తువే నిలిచియుండును గాని తద్వాచక శబ్దముగాని, తద్విషయక జ్ఞానము గాని కలుగవు. కావుననే చిత్తము ధ్యేయాకారముగ పరిణమించును గాని గ్రహణరూపమగు తన జ్ఞానాకారమున నుండదు.

ఈ సమాధియందు విషయమగు స్థూలఘట గవాదిరూప వస్తువు అణుసమూహ రూపము గాని, విజ్ఞానస్వరూపము గాని, యణువులనుండి ద్వ్యణుకాది క్రమమున గలిగిన కార్యరూపముగాని కాదు. ''ఇదియొక

ఘటము'' అన్నట్లేకబుద్ధి గలిగింప జాలిన దృశ్యరూపమగు నణువుల స్థూలపరిణామ విశేషము.

సౌత్రాంతికులు వైభాషికులు నను బౌద్ధులు దృశ్యమగు ఘట మనంత పరమాణువుల సంఘాతమే యందురు. కాని యట్లంగీకరింతుమేని, ''ఒక పెద్ద ఘటము'' అనుచో నేకత్వప్రతీతి యసంగత మగును. అనేక పరమాణువుల కేకత్వ వ్యవహారము పొసగదు గదా! మరియు పరమాణువుల యందు మహత్త్వము లేదు గాన ''పెద్ద'' యను విశేషణమును సరిపోదు. మరియు ఘటము పగిలిపోయినచో నది పరమాణు విభాగ (వియోగ)మే కావలసివచ్చును కాన పరమాణువు లతీంద్రియములు గాన కపాలాదికములు కానుపింపకూడదు. కాన సంఘాతవాదము నిస్సార మైనది.

యోగాచార్యులను బౌద్ధులు ఘటాదికము విజ్ఞానస్వరూప మందురు. అ సమ్మతింతుమేని ''ఘటము'' అని ప్రతీతికి బుద్ధియే యాధార మగును. కాన ''బుద్ధిలో ఘటము'' అను ప్రతీతి గలుగునే గాని 'భూతలమున ఘటము' అను ననుభవసిద్ధ మగు ప్రతీతి కలుగజాలదు. ఘటాదికము బుద్ధిరూపమే యని యంగీకరింతుమేని ''నేను ఘటము'' అను ప్రతీతి గలుగవలసి యుండును. కాన విజ్ఞానవాదము గూడ త్రోసివేయదగినదే.

నైయాయికులు రెండణువులచే ద్వ్యణుకము, మూడుద్వ్యణుకములచే త్ర్యణుకము ఇట్లు చతురణుకాది కార్యము కలుగును గాన ఘటము పరమాణువులకు కార్య మందురు. అట్లగుచో మట్టివలననే కుండ యేల గలుగవలయును? ఇసుకనుండి గూడ ఘటము కలుగవలసి యుండును గదా! ఘటము పూర్వము మృత్తికయందు లేనట్లిసుక యందును లేదు గావునను లేని వస్తువు కలుగుటయే యుత్పత్తి యగును గాని ఇసుకయందు ఘటమేల గలుగదు? కాన నైయాయికుల (లేనిది కలుగుటయను) యారంభవాద మసంగతము.

నువ్వులలో నభివ్యాప్తమై యున్న చమురు యంత్రపీడనముచే

నభివ్యక్తమగు విధమున మృత్పిండములో నిమిడియున్న ఘటమే కులాలాది వ్యాపారముచే నభివ్యక్త మగుచున్నది. పూర్వము ఘటము మృత్తికలో ననాగతావస్థతో నుండి కులాలాది వ్యాపారానంతరము వర్తమానావస్థ నొంది దండతాడనాద్యనంతర మతీతావస్థను బడయును.

అట్టి పరమాణుసంస్థాన (పరిణామ) విశేష మగు ఘటము పార్థివభూత సూక్ష్మముల సాధారణ ధర్మమై భిన్నముగను, కారణ ధర్మభిన్న ధర్మము లేనిది గాన నభిన్నమునై జ్ఞానవ్యవహారములను ఫలములచే ననుమితమై తన కభివ్యంజకము లగు కులాలవ్యాపారాదులచే నభివ్యక్తమై తిరోధాన కారణము లేర్పడినప్పుడు అగుపడకుండ పోవును.

(సంస్థాన) పరిణామవిశేషమే యవయవి యని చెప్పబడును. దీనికే యొకటి యనియు, మహత్త (గొప్పది)నియు, చిన్నది యనియు కఠినాది స్పర్శలు గలది యనియు, జలధారణాది క్రియలు గలది యనియు, ననిత్యమనియు, నవయవిద్వారా వ్యవహారము తగియున్నది. కాన స్థూలరూప పరిణామము తుచ్ఛము లేదు, శూన్యము అని వాదించు బౌద్ధుల మతమున స్థూలవస్తువు మిథ్య గావునను, సూక్ష్మము లగు తన్మాత్రారూపము లగు కారణములు సాక్షాత్కరింపవు గావునను, పై జెప్పిన వ్యవహారములో విషయములగు మహత్త్వాదు లెచట నన్వయించును? బౌద్ధమతమున నవయవి లేదు గాన, సూక్ష్మకారణములు నిర్వికల్పసమాధిలో గోచరముగావు గాన, ఘటాదులలో దోచు నేకత్వాదులు ''అతద్రూప ప్రతిష్ఠం మిథ్యాజ్ఞానం'' అను లక్షణమునకు విషయ మగును గాన నన్నియు మిథ్యాజ్ఞానములే యగును. కాని సమ్యగ్జ్ఞాన మనునదియే యుండదు. మనకు గోచర మగునవి యన్నియు,. నవయవులుగనే గోచరించుచున్నవి. కాన సమ్యగ్ జ్ఞానమునకు విషయమే కానుపింపదు.

సమ్యగ్ జ్ఞానభంగభయముచే మహత్త్వాదివ్యవహారము గల యవయవి నంగీకరించి తీరవలయును. అట్టి యవయవియే యీ నిర్వితర్క సమాధికి లోవిషయ మగును.

అవ॥ ఇట్లు స్థూలపంచభూతములను, భౌతికపదార్థములను విషయముగా నొనర్చుకొను గ్రాహ్యసమాపత్తిని సవితర్క మనియు, నిర్వితర్క మనియు, రెండు తెరగుల నిరూపించి సూక్ష్మభూతములు పంచతన్మాత్రలు విషయముగా గల గ్రాహ్యసమాపత్తిని రెండు విధములుగ నిరూపించుచున్నారు.

## సూ॥ ఏతయైవ సవిచారా నిర్విచారా చ సూక్ష్మ విషయా వ్యాఖ్యాతా॥ 44

ఏతయా, ఏవ, సవిచారా, నిర్విచారా, చ, సూక్ష్మవిషయా, వ్యాఖ్యాతా॥

ఏతయా ఏవ = ఈ సవితర్క నిర్వితర్క సమాధి నిరూపణము చేతనే, సూక్ష్మవిషయా = సూక్ష్మభూతములు విషయముగా గల సవిచారా = సవిచారసమాధియు, నిర్విచారా చ = నిర్విచారసమాధియు, వ్యాఖ్యాతా = వివరింపబడినట్లే.

స్థూలపదార్థ విషయమున శబ్దార్థజ్ఞాన వికల్పముచే సంకీర్ణ మగు భావనను సవితర్కసమాపత్తి యనియు, తదసంకీర్ణభావనను నిర్వితర్క సమాపత్తి యనియు వేరుపరచినట్లే, భూతసూక్ష్మముల విషయమునను అభివ్యక్తధర్మము గల (ప్రత్యక్షఘటాది స్థూలపదార్థముల) భూతసూక్ష్మముల విషయముల, పార్శ్వాది దేశ, వర్తమానాది కాల, గంధతన్మాత్రాది కారణ పూర్వక భావన గలుగుటయే సవిచార సమాపత్తి యనియు, దేశకాల కారణ జ్ఞానరహితముగ సూక్ష్మభూతములను మాత్రము విషయీకరించు భావన నిర్విచార సమాపత్తి యనియు దెలియవలయును. సవితర్క సమాధి యందువలె సవిచార సమాధియందు నొకటి యను బుద్ధిచే గ్రహింపదగి వర్తమానాది ధర్మసయిత మగుచునే యాలంబన మగు భూతసూక్ష్మములు భాసించును. ఇందు కార్యకారణ విచారము గలదు. కాన సవిచార సమాపత్తి యనబడును.

సర్వవిధముల దేశ కాల నిమిత్త జ్ఞాన రహితమ్మై, భూత

భవిష్యద్వర్తమాన, ధర్మహీనమై, సర్వధర్మానుపాతియై, సర్వధర్మ రూపమగు భూతసూక్ష్మ విషయకమగు భావన నిర్విచార సమాపత్తి యనబడును. ఇందును భూతసూక్ష్మము (పరమాణువు) దేశ కాల నిమిత్తాది విచార రహితమై సమాహితచిత్తమున కాలంబనమై యాచిత్తవృత్తిని తనరూపము నొందించును. అపుడు చిత్తవృత్తియుత జ్ఞానరూపమును విడచి తనకాలంబన మగు భూతసూక్ష్మాకారమునే బొందును. అట్టి స్థితియే నిర్విచారసమాధి యనబడును.

అనగా సవిచారసమాపత్తిలో ''సూక్ష్మపృథివి గంధ తన్మాత్రప్రధాన ములగు పంచతన్మాత్రలచే నుత్పన్న మయ్యెను. గంధ మీపృథివికి ధర్మము'' అను కార్యకారణభావ విచార ముండును. నిర్విచారములో సూక్ష్మ భూతములు మాత్రము భాసించునే గాని పైవిచారము గోచరింపదు.

కాగా గ్రాహ్యసమాపత్తి స్థూలవస్తు విషయక మగుచో 1.సవితర్క, 2.నిర్వితర్కములనియు, సూక్ష్మవస్తు విషయక మగుచో 1.సవిచార, 2.నిర్విచారములనియు రెండు రెండు విధములు గాగా మొత్తముమీద నాల్గు విధము లయ్యెను.

**యోగోపాయాస్తత్ప్రభేదాః పాదేఽ స్మిన్నుపవర్ణితాః ॥**

అనగా నీయోగపాదమున యోగోద్దేశమును యోగమును నిరూపించు టయు. యోగనిరూపణమున కుపయోగించు వృత్తులును, యోగోపా యములును వాని యవాంతర భేదములును నిరూపింపబడెను.

అవ॥ సూక్ష్మవిషయక గ్రాహ్యసమాపత్తిలోని సూక్ష్మవిషయములకు హద్దును దెలుపుచున్నారు.

## సూ॥ సూక్ష్మవిషయత్వం చాలింగ పర్యవసానమ్॥ 45

సూక్ష్మవిషయత్వం, చ, అలింగపర్యవసానమ్.

సూక్ష్మవిషయత్వం చ = సూక్ష్మగ్రాహ్య సమాపత్తిలో విషయ మగు సూక్ష్మవిషయత్వము, ఆలింగపర్యవసానం-ఆలింగ = ఆలింగ మనబడు ప్రకృతియే, పర్యవసానం = హద్దు గలది.

సూక్ష్మగ్రాహ్యసమాధిలో విషయ మగు సూక్ష్మత్వము ప్రకృతివరకు జని యచట నాగిపోవును, అంతకన్న సూక్ష్మవస్తువు లేదని భావము.

పృథివీపరమాణువును, దానికి కారణభూత మగు గంధతన్మాత్రమును జలపరమాణువును, తత్కారణభూత మగు రసతన్మాత్రమును; తేజః పర మాణువును, తత్కారణ మగు రూపతన్మాత్రమును; వాయు పరమాణు వును, తత్కారణ మగు స్పర్శతన్మాత్రమును, ఆకాశ పరమాణువును; తత్కారణభూత మగు శబ్దతన్మాత్రమును - సూక్ష్మములగు విషయములు. ఇందు పరమాణువులకన్న తన్మాత్రలు సూక్ష్మములు. పంచతన్మాత్రలకన్న తత్కారణమగు నహంకారము సూక్ష్మము; అహంకారమునకన్నను దానికి కారణమగు లింగమాత్రము (మహత్తత్త్వము) ఇంకను సూక్ష్మము. మహత్తత్త్వమున కన్న తత్కారణ మగు నలింగము (మూలప్రకృతి) సూక్ష్మము. మూలప్రకృతి కన్న సూక్ష్మ మగునది యేదియును లేదు. కాన సూక్ష్మత్వము ప్రకృతితో ముగియుచున్నది.

''అవ్యక్తాత్పురుషః పరః'' అను ప్రమాణముచే ప్రకృతికన్నను పురుషుడు సూక్ష్ముడను విషయ మేర్పడుచుండగా సూక్ష్మత్వమునకు ప్రకృతియే పరమావధి యని చెప్పుట యసంగతముగా దోచవచ్చును. కాని గ్రాహ్యజడ పదార్థములయందలి సూక్ష్మత్వమునకు పరాకాష్ఠ ప్రకృతి యందే యుండును. పురుషుడు ప్రకృతికన్నను సూక్ష్మతరుడే యైనను గ్రాహ్యుడును, జడుడును గాడు గదా! అదియునుగాక మహత్తత్త్వమునకు ప్రకృతి యుపాదాన కారణము (కుండకు మట్టివలె)గాన కార్యరూప మహత్తుకన్న నుపాదాన కారణమగు ప్రకృతికి సూక్ష్మత్వము ప్రతిపాదింప బడినది. పురుషుడు నిమిత్తకారణము (కుండకు కుమ్మరివలె) మాత్రమే గాన పురుషుని సూక్ష్మత్వ మీతరతమభావములో జేర్పరాదు.

కాగా జడగ్రాహ్య పరిణామ్యుపాదాన కారణతాయుతముల సూక్ష్మత్వము ప్రకృతితోడనే ముగియును.

అవ॥గ్రాహ్యసమాపత్తులు నాల్గింటికిని నామాంతరములను నుడువు చున్నారు.

## సూ॥ తా ఏవ సబీజ స్సమాధిః॥ 46

తాః, ఏవ, సబీజః, సమాధిః.

తాః ఏవ = ముందు జెప్పిన గ్రాహ్యసమాపత్తులే, సబీజః సమాధిః = సబీజసమాధి యని చెప్పబడును.

సవితర్క నిర్వితర్క సవిచార నిర్విచార రూపములగు గ్రాహ్య సమాధులు నాలుగును సబీజసమాధు లనబడును. ఈ సమాధులలో బీజము అనగా నాలంబనము అనగా నాత్మభిన్నవస్తువునం దాత్మత్వ బుద్ధి యను నవిద్య గలదు. కాన సబీజ మనుట సార్థకము.

''తా ఏవ '' యను చోట నవధారణము 'తాః' అనుదానితో చేర్చినచో నానాలుగే సబీజసమాధు లనియు నితరములు కావనియు నర్థ మగును. అట్లగునేని గ్రహణసమాధియు గ్రహీతృసమాధియు సబీజములు (నాలంబనములు) కాకపోవును. కాన 'ఏవ' కారమును 'సబీజః' అనుచోట జేర్చి 'తాః సబీజఏవ' యని యన్వయింప వలయును. కాగా పై నాలుగు సమాపత్తులు (సమాధులును) సబీజములే గాని నిర్బీజములు గావు. తక్కిన గ్రహణ గ్రహీతృ సమాపత్తులు రెండును గూడ సబీజము లగును అని కొంద రందురు.

గ్రహణమన నింద్రియములు. గ్రహణసమాపత్తి యనగా నింద్రియ ముల యందు చిత్తము నుంచి యచట స్థిర మొనర్చుట. అందును ''శబ్దము శ్రోత్రేంద్రియమునకు విషయము, అహంకారము దీనికి కారణము'' అని యిత్విధముగ విచారయుక్త మగు భావన గలుగుచో సవిచారగ్రహణసమాపత్తి

యనియు, పై కారణ విషయాది విచారములు గోచరింపక కేవలేంద్రియ మాత్రభావన గలుగుచో నిర్విచారగ్రహణ సమాపత్తి యనియు చెప్పబడును.

అట్లే "మహత్తత్త్వమునకు కార్యము త్రిగుణాత్మకాహంకారము" అని భావనచే సవిచార గ్రహీతృసమాపత్తి (సమాధి)యు, కేవలాహంకార భావనచే నిర్వికార గ్రహీతృ సమాపత్తియు గలుగును.

కాగా స్థూలవిషయమున సవితర్కము నిర్వితర్క మనియు, సూక్ష్మవిషయమున సవిచారము నిర్విచార మనియు, సమాధి నాలుగు తెరగు లగునని భాష్యము. అనగా స్థూలగ్రాహ్య సమాపత్తి సవితర్క నిర్వితర్క భేదముచే రెండువిధములు. సూక్ష్మగ్రాహ్య సమాపత్తి సవిచార నిర్విచార రూపమున రెండు తెరంగులు కాగా గ్రాహ్యసమాపత్తి నాలుగు విధములును, గ్రహీతృగ్రహణ సమాపత్తులు సూక్ష్మ విషయములే గాన నొక్కొక్కటి సవిచార నిర్విచారభేదముచే రెండు రెండు కాగా నాలుగై గ్రాహ్యసమాపత్తులు నాల్గింటితో గలియగా సబీజసమాపత్తులు (సమాధులు) అన్నియు గలసి యెనిమిది విధము లయ్యెను. సంప్రజ్ఞాత సమాధికి 17వ సూత్రమున నాలుగు భేదములు దెలిపి, దానికే మరల 41వ సూత్రమున మూడు భేదము లేర్పరచి, దానినే మరల నీ సూత్రభాష్యమున నాలుగు తెరగుల విభాగముతో నుపసంహరించుచున్నారు. కాని యిది యవాంతర భేదములతో నెనిమిది విధము లగునని పై నెరిగింపబడినది.

అవ॥ సంప్రజ్ఞాతసమాధు లన్నిటిలో నిర్వచార సంప్రజ్ఞాత సమాధికి ఫలమును జెప్పుట ద్వారా శ్రేష్ఠత్వము నెరుకపరచుచున్నారు.

## సూ॥ నిర్విచారవైశారద్యేఽధ్యాత్మప్రసాదః॥ 47

నిర్విచారవైశారద్యే, అధ్యాత్మప్రసాదః.

నిర్విచార వైశారద్యే-నిర్విచార = నిర్విచారసమాధియందు, వైశారద్యే = నైర్మల్యము గలుగగా (యోగికి) అధ్యాత్మ ప్రసాదః = నిఖిల పదార్థవిషయక యథార్థజ్ఞానము (కలుగును)

రజస్తమోగుణముల యాధిక్యముచే గలుగు నపరిశుద్ధియు, నావరణ రూపమగు మురికియు దొలగిపోయినందున ప్రకాశస్వ రూపమగు బుద్ధికి సత్త్వగుణప్రాధాన్యముచే రజోగుణ తమోగుణములచే నతిరస్కృతమై నిర్మల మగు స్థైర్యప్రవాహము వైశారద్య మనబడును. ఇట్టి వైశారద్యము నిర్విచార సమాధివలన గలుగగనే యోగికి తటాలున సూక్ష్మభూతము లాదిగా ప్రకృతివరకు గల సకల పదార్థముల సాక్షాత్కారము గలుగును. ఇట్టి సాక్షాత్కారమునకే యాత్మప్రసాద మనియు, స్ఫుటప్రజ్ఞాలోక మనియు, ప్రజ్ఞాప్రసాద మనియు నామాంతరములు గలవు.

ఆత్మ ప్రసాదము గల యోగి శోకరహితు డగును.

**ప్రజ్ఞాప్రసాదమారుహ్య అశోచ్యః శోచతో జనాన్।**
**భూమిష్ఠానివ శైలస్థః సర్వాన్ ప్రాజ్ఞోఽనుపశ్యతి ॥**

అనగా ప్రాజ్ఞుడు ప్రజ్ఞాప్రసాదము నొంది దుఃఖరహితుడై, కొండ నెక్కిన వాడు (సమ) భూమిమీద నుండు జనులను జూచు తెఱగున నందరిని దుఃఖితులనుగా గాంచును అని భావము.

అవ॥ అధ్యాత్మప్రసాదముచే గలుగు ప్రజ్ఞకు సార్థక్యమును నిరూపించు చున్నారు.

## సూ॥ ఋతంభరా తత్ర ప్రజ్ఞా॥ 48

ఋతంభరా, తత్ర, ప్రజ్ఞా.

తత్ర= ఆ యధ్యాత్మప్రసాదమునందు, (గలుగు) ప్రజ్ఞా= బుద్ధి, ఋతంభరా= ఋతంభర యను పేరు గలది.

నిర్విచారసమాధి సంబంధ మగు వైశారద్యము గలిగిన యనంతరము సమాహితచిత్తునకు గలుగు విలక్షణమగు చిత్తవృత్తికి ఋతంభర యని పేరు. ఋతంభర యనగా సత్యమగు నర్థమును మాత్రము ధరించునది యని యర్థము. అనగా నీ ప్రజ్ఞచే భాసించు పదార్థము లెల్లను సత్యములే యగును

గాని యేమాత్రమును మిథ్యాభూతములు గావని భావము. కాన ఋతంభర యను దీనిపేరు సార్థకము. ఇందు విపర్యయజ్ఞాన సంబంధ మేమాత్రమును లేదు.

ఈప్రజ్ఞ గలిగినచో నుత్తమయోగము గలుగును. ఈ విషయమున నిట్లు తెలుపబడినది.

**ఆగమేనానుమానేన ధ్యానాభ్యాసరసేన చ ।**
**త్రిధా ప్రకల్పయన్ ప్రజ్ఞాం లభతే యోగముత్తమమ్ ॥**

అనగా శ్రవణమనన నిదిధ్యాసనములచే ముత్తెరంగుల ప్రజ్ఞను సాధించుటచే (ననగా శోధనద్వారా సూక్ష్మత్వమును సాధించుటచే ) యోగి యుత్తమయోగము నందునని భావము.

అవ॥ ఋతంభరా ప్రజ్ఞాజన్య జ్ఞానమాగమానుమాన జన్యజ్ఞానమున కన్న నుత్తమమని నిరూపించుచున్నారు.

## సూ॥ శ్రుతానుమాన ప్రజ్ఞాభ్యామన్యవిషయా విశేషార్థత్వాత్॥ 49

శ్రుతానుమాన ప్రజ్ఞాభ్యాం, అన్యవిషయావిశేషార్థత్వాత్॥

శ్రుతానుమానప్రజ్ఞాభ్యాం - శ్రుత=శాస్త్ర (ఆగమ) జన్యమైనట్టియు, అనుమాన =అనుమాన ప్రమాణజన్య మైనట్టియు, ప్రజ్ఞాభ్యాం = ప్రజ్ఞలకంటె, ఋతంభరా =(ఈ పదము పూర్వసూత్రము నుండి యనువృత్తము) ఋతంభరప్రజ్ఞ, విశేషార్థత్వాత్ =విశేషము విషయముగా గలది గాన, అన్యవిషయా = వేరగు విషయము గలది.

శ్రుత మనగా శాస్త్రజన్య జ్ఞానము. ఈ జ్ఞానమునకు సామాన్యమే విషయ మగును గాని విశేషము విషయము గాదు. (సామాన్య మనగా జాతి, విశేష మనగా నొక్కొక వ్యక్తి) అనగా ఘటశబ్ద శ్రవణముచే గలుగు జ్ఞానములో ఘటము సామాన్య విషయ మగును అనగా తోచును. కాని ఘటవిశేషము

(నల్లకుండ, తెల్లకుండ, యీకుండ, ఆకుండ ఇట్లు) విషయము గాదు. శబ్దమునకు సామాన్యార్థమునందే సంకేతము గాన శబ్దము సామాన్యార్థమును దప్ప విశేషార్థమును బోధింపజాలదు.

అట్లే యనుమానముగూడ సామాన్యమును విషయీకరించు నదియే. అనుమానమునందు నెక్కడెక్కడ పొగ యుండునో యచ్చటచ్చట నిప్పుండును. ఎక్కడ ప్రాప్తియుండనో యచ్చట గతి యుండును. ఏచోట గత్యభావము గలదో, యాచోట ప్రాప్త్యభావమును గలదు'' అని యీ విధముగ సామాన్యరూపముగ వస్తుజ్ఞానము గలుగునే గాని విశేషాకారమున గలుగదు.

కాన నాగమానుమాన జన్యజ్ఞానములు రెండును సామాన్య విషయములే గాని విశేషవిషయములు గాజాలవు.

ఆగమానుమాన జన్యజ్ఞానములకు విషయము గాని విశేషపదార్థము లేదని తలంపరాదు. సూక్ష్మమును, కుడ్యాదివ్యవహితమును, దేశకాల విప్రకృష్టము నగు వస్తువు నింద్రియ జన్యలౌకిక ప్రత్యక్షము విషయీకరింప జాలకపోయినంత మాత్రమున నట్టి వస్తువులు లేదందుమా? చంద్రరేఖయందు సూక్ష్మముగ గానుపింపకున్నంతనే యచట కళంకము లేదనుట తగునా? కాన విశేషము ప్రమాణ సిద్ధము కాదనరాదు.

భూతసూక్ష్మములయందలి విశేషమును, పురుషగత విశేషమును సమాధిజన్య మగు ఋతంభర ప్రజ్ఞకు విషయమై తీరును. కాన విశేషము ప్రామాణికమే.

కాగా నాగమానుమాన ప్రజ్ఞలచే దెలియబడని విశేషములను విషయీక రించునది గాన ఋతంభరాప్రజ్ఞ శ్రేష్ఠతమ మైనది.

అవ॥ ఇట్టి ఋతంభరప్రజ్ఞ లభించెనేని సాధకునకు క్రొత్తక్రొత్త సంస్కారములు చిత్తమున జనించి విక్షేపసంస్కారములను నివారించు నని తెలుపుచున్నారు.

## సూ॥తజ్జః సంస్కారోఽన్యసంస్కారప్రతిబన్ధీ॥ 50

తజ్జః, సంస్కారః, అన్యసంస్కార ప్రతిబన్ధీ॥

తజ్జః = ఆ ఋతంభరప్రజ్ఞచే గలిగిన, సంస్కారః = సంస్కారము, అన్యసంస్కార ప్రతిబన్ధీ, అన్యసంస్కార = చిత్తవిక్షేప సంస్కారములకు, ప్రతిబన్ధీ= ప్రతిబంధకము (నిరోధకము).

నిర్విచారసమాధిచే ఋతంభరప్రజ్ఞ గలుగగా నాఋతంభరప్రజ్ఞచే గలిగిన సంస్కారము బహిర్ముఖావస్థలోని సంస్కారముల నన్నిటిని నిరోధించును. సంస్కారనిరోధ మనగా వాసనలచే గలుగు కార్యమును గలుగనీక నిరోధించుట యని భావము. సంస్కారములు చిత్తము నశించిననే నశించును గాని యూరక నశింపవు గదా! ఋతంభర ప్రజ్ఞాజన్య మగు సంస్కారము సయిత ముద్బుద్ధము గాని ప్రాచీనసంస్కారమును బాధించునే గాని యుద్బుద్ధమై కార్యోన్ముఖ మగు సంస్కారమును బాధింపజాలదు.

ఒకవేళ ననాదికాలమునుండియు ప్రవృత్తము లగు విషయోపభోగముచే గలిగిన దృఢసంస్కారములు ఋతంభరప్రజ్ఞాద్వారా నూతనముగ గలిగిన సంస్కారములచే ప్రతిబంధింపబడుట యసంభవముగ దోచినను, బుద్ధికి సత్యవస్తువునందే పక్షపాతము గలిగి యుండుట స్వభావము కాన సత్యవస్తువు నెరుగని యపుడు సాంసారిక విషయములందు మగ్నమై యున్నను అవి యసత్యములని తెలిసి నంతటి నుండియు జిత్తము తత్త్వవిషయముననే ప్రవర్తించును గాని సాంసారిక విషయములందు బ్రవర్తింపదు. కాన ఋతంభర ప్రజ్ఞాజన్యమగు సంస్కారము బహిర్ముఖావస్థలోని నిఖిలసంస్కారములను బాధించును (తిరస్కరించును). కాననే యిట్లు చెప్పిరి.

**నిరుపద్రవభూతార్థస్వభావస్య విపర్యయైః ।**
**న బాధోఽనాదిమత్త్వేఽపి బుద్ధేస్తత్పక్షపాతతః ॥**

అనగా తత్త్వమునం దభిమానము గల చిత్తము ననాదులైనను అసత్య విషయములు బాధింపనేరవు అని భావము.

ఇట్లు బాహ్యసంస్కారములు నశించును గాన వానిచే గలుగు ప్రమాణ విపర్యయాదివృత్తులు గలుగవు. వృత్తినిరోధ మేర్పడినది గాన నిర్విచార సమాధి యేర్పడును. నిర్విచారసమాధిచే ఋతంభరప్రజ్ఞ గలుగును. ఆ ప్రజ్ఞచే విలక్షణములగు నిరోధసంస్కారములు గలుగును. ఈ సంస్కారములచే బ్రజ్ఞకు నతిశయము గలుగును. అతిశయితమగు ప్రజ్ఞచే బ్రకృష్ట సంస్కారము లుదయించును. ఇట్లు దినదినమునకు క్రొంగ్రొత్త సంస్కారము లుద్భవించుచుండును.

ప్రశ్న॥ ఋతంభరప్రజ్ఞాజనితమగు సంస్కారములు చిత్తమున నున్నవి గాదా! వాసనాజనిత సంస్కారములతో గూడిన చిత్తము జన్మమరణాది దుఃఖము గలిగింప నధికారము గలిగియుండు నను నియమము ననుసరించి సమాహిత చిత్తముగూడ జన్మాదుల నేల గలిగింపదు ?

సమా:- అవిద్యాది క్లేశజన్య మగు వాసనచే గలిగిన సంస్కార ములే చిత్తమునకు జన్మమరణాది దుఃఖములను గలిగించు నధికారమును గలిగించును గాని యీ క్లేశక్షయ కారణములగు ప్రజ్ఞాజన్య సంస్కారము చిత్తమునకు గ్రొత్త దుఃఖజననాధికారమును గలిగింప కుండుటయే గాక తద్విపరీతముగా నదివరకు చిత్తమునకున్న యధికారమును సయితము నశింపజేయును.

చిత్తమునకు వాస్తవముగ రెండధికారములు గలవు. అందొకటి పురుషునకు శబ్దాదిభోగము ననుభవింపజేయుట, రెండవది ప్రకృతిపురుష వివేకజ్ఞానమును గలిగించుట. ఇందు దొలుతటి యధికారము చిత్తమున కవిద్యాది క్లేశవాసనా జన్యమగు సంస్కారబంధముచే గలుగును. రెండవది వివేకఖ్యాతి జననాధికారము. ఇది చిత్తమున ఋతంభరా ద్వారా క్లేశసంస్కారములు నశించినందుచే గలుగును. ఇందు మొదటి యధికారము భోగహేతువు గాన దుష్ట మైనదియు వివేకఖ్యాతిజనక మగు నధికారము చిత్తమునకు గలిగెనేని పూర్వాధికారము నశించును. చిత్త మెప్పుడును వివేకఖ్యాతి గలుగువరకే చేష్టించి యావల శాంతించును.

అవ॥ ఈ ప్రజ్ఞాజన్యసంస్కారములను నిరోధించి చిత్తమును నిరాలంబనము చేయజాలిన యసంప్రజ్ఞాత యోగమునకు లక్షణము నెరింగించుచున్నారు.

## సూ॥ తస్యాఽపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజః సమాధిః॥ 51

ఇతి పాతంజలే సాంఖ్యప్రవచనే యోగశాస్త్రే యోగపాదః ప్రథమః॥

తస్య, అపి, నిరోధే, సర్వనిరోధాత్, నిర్బీజః, సమాధిః.

తస్య అపి = ఆ ప్రజ్ఞాజన్య సంస్కారమునకు సయితము, నిరోధే= నిరోధము గలుగగా, సర్వనిరోధాత్ = పురాతన నూతన సంస్కారము లన్నియు నిరోధింపబడుట వలన, నిర్బీజః = ఆలంబన రహితమైన (అవిద్యాహీనమైన) సమాధిః = సమాధి, అసంప్రజ్ఞాత సమాధి (గలుగును).

గుణములయం దభిలాష లేకుండట యను పరవైరాగ్యముచే సకల చిత్తవృత్తులను సకల సంస్కారముల నడ్డగించుటయే నిర్బీజసమాధి లేక నిర్వికల్పసమాధి, నిరవలంబనసమాధి లేక నసంప్రజ్ఞాతసమాధి యన బడును.

ఈ సర్వవృత్తినిరోధము కేవలము సమాధిజన్యమగు ఋతంభర ప్రజ్ఞను మాత్రము నిరోధించి యూరకుండదు. మరి యాప్రజ్ఞచే జనించిన సంస్కారము లన్నింటిని నిరోధించును. ఈ విషయమును బోధించుటకే సూత్రమున ''తస్యాపి'' యనుచోట సముచ్చయార్థక మగు, ''అపి'' శబ్దము గూర్చబడినది. సర్వవృత్తి నిరోధముచే గలుగు సంస్కారము సంప్రజ్ఞాతజన్య సంస్కారములను నశింపజేయుచునే యుదయించును.

సర్వవృత్తినిరోధముచే గలుగు సంస్కారమును ప్రత్యక్షీకరింప వీలుగాదు. సర్వవృత్తులును నిరోధింపబడినవి గాన యోగియు నాస్థితిని ప్రత్యక్ష మొనర్చుకొనజాలడు. అట్లే సర్వవృత్తులును నిరుద్ధము లగుటచే నా

సంస్కారములు స్మృతిని సయితము గలిగింపజాలవు.

అయినను చిత్తనిరోధావస్థయొక్క కాలక్రమము ననుసరించి చిత్తమున నిరోధింపబడిన సంస్కారముల ననుమతిజేయవచ్చును. అనగా యోగి చిత్తమున గలుగు సర్వవృత్తినిరోధము తటాలున నొకే క్షణమున గలుగదు. అది మొదట రెండుగడియల పర్యంతము, ననంతర మర్ధ యామపర్యంతమును, దరువాత యామకాలము - నిట్లభ్యాసవశమున వృద్ధిజెందుచుండును. నిర్విషయముగ చిత్తము నిలుచు కాలమునుబట్టి సంస్కారనిరోధ పరిమాణము నూహించు కొనవలయును. సర్వవృత్తులను నిరోధించు నసంప్రజ్ఞాత సమాధిలో గూడ సర్వవృత్తులను నివారించుటచే గొన్ని సంస్కారములు గలుగును గదా! అట్టి సంస్కారములు గల చిత్త మధికారయుక్తముగనే యగును గదా! యని శంకింపవచ్చును.

కాని నిరోధావస్థలో బాహ్యసంస్కారములతోడను సంప్రజ్ఞాత సమాధిజన్య మగు సంస్కారములతోడను గలిసియే చిత్తము కాష్ఠమును గాల్చిన చిచ్చు అచ్చుటనే యడగు రీతిని స్వప్రకృతిలో లీన మగును. చిత్తలయముచే జిత్తమునందలి నిరోధ సంస్కారములును లయించును. కాన నసంప్రజ్ఞాత జన్యసంస్కారములు చిత్తమునందలి యధికారమును రూపుమాపునుగాని చిత్తమును స్థాపింపనేరవు. అసంప్రజ్ఞాత సమాధిలో చిత్తము తన యధికారము ముగిసినంతనే సంస్కారములును తానును నివర్తించును గాన పురుషు డపుడు స్వరూపస్థితుడై శుద్ధముక్తు డని చెప్పబడును. (4-34)

అనగా ప్రతిబింబితములగు దుఃఖాదులు లేక పుణ్యపాప వినిర్ముక్తుడై యుపాధిసంబంధ రూపబంధము నతిక్రమించి జననమరణ ప్రవాహరూప ఘోరసంసారములో దగులుకొనని స్వస్వరూపముతోడ నుండును.

ఇందు బీజమగు ధ్యేయాలంబనము, సంసారబీజమగు నవిద్యయు లేదు గాన నిర్బీజ మనబడును. ఇట్టి యసంప్రజ్ఞాతసమాధి లభించినచో

పురుషుడు జీవన్ముక్తు డగును.

పతంజలిమహర్షి ప్రణీతమగు నీ యోగశాస్త్రము సాంఖ్యశాస్త్ర ప్రదర్శితార్థమునే వివరించి తెలుపునది. అనగా సాంఖ్యశాస్త్రమున నభ్యుపగమవాదముచే నీశ్వరుని నిరాకరించి యసంప్రజ్ఞాతయోగ మక్కర లేకయే జీవతత్త్వజ్ఞానముచేతనే మోక్షము గలుగునని నిరూపింపబడినది. ఈయోగశాస్త్రమున నన్నినో నిరుపద్రవముగ, నసందిగ్ధముగ నిచ్ఛాధీన మగు ముక్తిని నివారించుట కీశ్వరవిద్యయు శీఘ్రమోక్షసాధన మగు నసంప్రజ్ఞాత యోగమును సమ్మతింపబడినవి. కాన సాంఖ్య యోగ శాస్త్రముల కంతగ భేదము లేదు.

ఇట్లు పతంజలిమహర్షి ప్రణీతమగు, సాంఖ్యప్రవచనరూపమైన
యోగశాస్త్రమునందు దొలుతటిదగు యోగపాదము సమాప్త మయ్యెను.



ఇట్లు తిరుమలై కండ్యూర్ తిరువేంగడాచార్య విరచిత మగు
పాతంజల యోగదర్శన ''భాష్యార్థ ప్రకాశిక'' యను
నాంధ్రవివరణమున మొట్టమొదటి
యోగపాదము ముగిసెను.



శ్రీహయగ్రీవాయనమః

# పాతంజల యోగదర్శనము

## ౨ సాధనపాదము

అవ॥ ముందటిపాదమున నుత్తమసాధకులగు సమాహితచిత్తులకు నభ్యాస వైరాగ్యములచే నసంప్రజ్ఞాతసమాధిని, మధ్యమసాధకులకు సంప్రజ్ఞాత సమాధి నుపదేశించిరి. కాని విక్షిప్తచిత్తులగు మందాధికారులకే యుపాయమును దెలుపరైరి. కాన ప్రకృత సాధనపాదమున బాహ్య విషయ విక్షిప్తచిత్తుడు సయితము యోగసాధకుడగుట కుపాయము దెలుపువారై తొలుదొలుత నన్ని సాధనములకన్న సులభమగు క్రియాయోగమును దెలుపుచున్నారు.

**సూ॥ తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని క్రియాయోగః॥ 1**

తపఃస్వాధ్యాయేశ్వరప్రణిధానాని, క్రియాయోగః.

తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని- తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము (నను మూడును) క్రియాయోగః= క్రియాయోగ మనబడును.

1. తపము2. స్వాధ్యాయము 3. ఈశ్వరప్రణిధానము ననుమూడు క్రియలును యోగమునకు సాధనములు గాన క్రియాయోగ మనబడును.

తపస్వి గానివానికి యోగము సిద్ధింపదు. అనాది కర్మవాసనలచే నానా కారములు గలిగి సన్నిహిత విషయములను వలపన్ని చిత్తమును విషయోన్ముఖ మొనర్పబూను నశుద్ధియను రజస్తమోగుణ విజృంభణము తపోఽనుష్ఠానము లేకున్న నెన్ని యుపాయములచేతను శిథిలము గాదు. కాన దొలుత తపమును సూత్రకారులు నిర్దేశించిరి.

1. తపమనగా: హిత మిత మేధ్య భోజన పూర్వకముగ శీతోష్ణాది

ద్వంద్వ సహనముతోడ నింద్రియముల నిరోధించుట.

2. హితభోజన మనగా- మిక్కిలి పులుపు, మిక్కిలి కారము, మిక్కిలి యుప్పదనము, మిక్కిలి వేడియు, మిక్కిలి రూక్షమును, తీక్ష్ణమును నగు, నూవులు ఆవాలు పెరుగు మాంసము మొదలగు పదార్థములను విడనాడి, బియ్యము, గోధుమలు, ఆవుపాలు, కలకండ, నేయి, పెసలు - మొదలగు సాత్త్విక పదార్థములను భుజించుట.

3. మితభోజన మనగా- ఉదరమున రెండు భాగము లన్నముచే నిండించి మరియొక భాగమున జలము పూరించి నాల్గవ భాగమును వాయు సంచారార్థ మూరక వదలి పెట్టుట.

4. మేధ్యభోజన మనగా- మత్స్య మాంస మద్య లశునాదులను వదలిపెట్టి కంద చేమ మొదలగు గడ్డలను, అవిసె మొదలగు కూరలను, బెండ కాకర మొదలగు కాయలను భుజించుట.

పై నిరూపింపబడిన తపము సయితము మందాధికారులగు సాధకులకు చిత్తప్రసాదమునకు గారణమై శరీరేంద్రియములకు బాధ గలిగింపక యుండునదియే సేవింపదగినదని యాదిమునుల యభిమతము. అనగా స్మృతులలో,

**ఉపవాసపరాకాది కృచ్ఛ్రచాంద్రాయణాదిభిః ।**
**శరీరశోషణం ప్రాహుస్తపసాం తప ఉత్తమమ్ ॥**

అన్నట్లు ఉపవాసము, పరాకము, కృచ్ఛ్రము, చాంద్రాయణము మొదలగువానిచే శరీరశోషణము జేయుటయను తపమిచ్చుట మందాధికారికి విధింపబడలేదు. హితమితమేధ్యభోజనపూర్వకముగ ద్వంద్వసహనముతోడ నింద్రియములను నిరోధించుటయే తపముగ విధింపబడెను. స్మృతి విహితమగు తపమున నుపవాసాదులచే మరణ భయమును. జాంద్రాయ ణాద్యభ్యాసముచే వాతపిత్తాది ధాతు వైషమ్యము గలుగును, కాన నా తపము యోగమునకు విరుద్ధమైనది.

కాననే "తపసాఽనాశకేన" అని శ్రుతియందును శరీరనాశకముగాని తపముచే నాత్మజ్ఞానము గలుగునని చెప్పబడెను.

కాన నిచట తపమనగా యుక్తాహారవిహారములే.

2. స్వాధ్యాయమనగా- ప్రణవము, పురుషసూక్తము, బ్రహ్మపారాయణ మున్నగు పవిత్ర వైదిక పౌరాణిక మంత్రములను జపించుటయో, మోక్షశాస్త్రమగు నుపనిషదాదులను బఠించుచుండుటయో అగును.

3. ఈశ్వర ప్రణిధాన మనగా- భగవద్గీతలో

**యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।**
**యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥**

అన్నటుల సర్వకర్మలను గురువులకును గురువగు నీశ్వరున కర్పించుట లేదా "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన మాకర్మఫల హేతుర్భూః" యని చెప్పిన తెరగున కర్మఫలమును సన్న్యసించుట యనగా నిష్కామముగ గర్మల నాచరించుట.

పైమూడును క్రియాయోగసాధనములు గాన సాధ్యసాధనముల కభేదమును నిశ్చయించుకొని వీనినే క్రియాయోగ మనిరి.

విష్ణుపురాణములో ఖాండిక్య కేశిధ్వజ సంవాదమునందు తొలుత నీ క్రియాయోగమే యుపదేశింపబడియెను. గీతాశాస్త్రమునందు సయితము "ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే" యని యోగము నభ్యసింపగోరు ప్రథమసాధకునకు క్రియాయోగమే సాధనమని చెప్పబడెను.

అవ॥ ఇంక క్రియాయోగమునకు ఫలమును బ్రతిపాదించుచున్నారు.

**సూ॥ సమాధిభావనార్థః క్లేశతనూకరణార్థశ్చ॥ 2**

సమాధిభావనార్థః, క్లేశతనూకరణార్థః, చ.

స్మహి, క్రియాయోగః, (ఈ మూడుపదము లధ్యాహృతములు)= ఆ

క్రియాయోగము, సమాధిభావనార్థః, సమాధి = సమాధియొక్క, భావనార్థః = సిద్ధియను, ప్రయోజనము గలదియు, క్లేశతనూకరణార్థశ్చ, క్లేశ = అవిద్యాదిక్లేశము లను, తనూకరణార్థశ్చ = క్షీణింపజేయుటయే ప్రయోజనముగా గలదియు, నగును.

పైసూత్రమున వివరింపబడిన క్రియాయోగము బాగుగ ననుష్ఠించుటచే సమాధిని సిద్ధింపజేయును. మరియు నవిద్యాది క్లేశములను కుంచపరచును. ఇట్లు క్రియాయోగముచే క్షీణింపజేయబడిన యవిద్యాది క్లేశములను సాధకుడు ప్రసంఖ్యాన (వైరాగ్య)మను నగ్నిచే వేయింపబడిన విత్తనమువలె క్రియోత్పాదనాసమర్థముల నొనరించును.

అగ్నికణముల నడుమబడిన విత్తనము మొలవజాలని విధమున ప్రబలవిరోధులగు క్లేశములచే నావృతమగు నంతఃకరణమునను ప్రకృతిపురుష వివేక ముదయించుట యరుదు. కాన దొలుత క్రియా యోగానుష్ఠానముచే క్లేశములను సూక్ష్మపరచి యట్లు సూక్ష్మములగు క్లేశములను ప్రసంఖ్యాన (వైరాగ్య)మను నగ్నిచే దగ్ధతుల్యములుగా జేసినచో నాక్లేశములు తమ సంస్కారరూపమగు నహంకారమును గలిగింపజాలవు.

క్లేశములను కొంచపరచిన యంతట క్లేశములచే నేమాత్రము తిరస్కరింపబడని సత్త్వపురుషాన్యతాఖ్యాతి (ప్రకృతి పురుషవివేకము) యను సూక్ష్మప్రజ్ఞ యుదయించును. ఈ వివేకఖ్యాతియు నసంప్రజ్ఞాతసమాధిని జనింపజేసి యంతటితో దన యధికారము ముగియుటచే నా యసంప్రజ్ఞాత సమాధియందే లీనమగును.

ఇట్లు క్రియాయోగమునకు మోక్షోపయోగి జ్ఞానాదివ్యాపారమును జెప్పుటచే, కర్మము జ్ఞానాద్యంగమేగాని సాక్షాన్మోక్ష హేతువు గాదని సూచింప బడెను.

అవ॥ క్రియాయోగముచే కృశీకరింపదగిన క్లేశములను నిరూపించు చున్నారు.

**సూ॥ అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశాః పంచక్లేశాః॥**

అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశాః, పంచ, క్లేశాః.

అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశాః=అవిద్యయు, అస్మితయు, రాగము, ద్వేషము, నభినివేశమునను, పంచ=అయిదు, క్లేశాః=క్లేశములు.

1.అవిద్య, 2.అస్మిత, 3.రాగము, 4.ద్వేషము, 5.అభినివేశము నను అయిదును క్లేశములకు (కష్టములకు) కారణముగాన కార్యకారణముల కభేదమును వివక్షించుటచే క్లేశము లనబడును. ఇవియే పంచవిపర్యయ ములని గూడ చెప్పబడును. విపర్యయము లనగా యథార్థమునకు విరుద్ధము లైనవని యర్థము. మిథ్యాజ్ఞానమన్నను, విపర్యయజ్ఞానమన్నను, అవిద్యయన్న నొకే యర్థము గలదు. కాన పంచక్లేశములలో మొదటిదగు నవిద్యను విపర్యయ మనదగునుగాని తక్కిన నాల్గింటికిని విపర్యయ మను సంజ్ఞ తగదను శంక గలుగును. కాని తక్కిన నాల్గింటికిని యవిద్యామూలక స్థితియును, అవిద్యా నాశమూలక నాశమును గలదు గాన నవియు నవిద్యామూలములే గాన నవియు విపర్యయములే.

ఇట్టి క్లేశములు (లేక విపర్యయములు) వృద్ధిజెందినవై సత్త్వాది గుణము లకార్యోత్పాదనాధికారమును దృఢపరచుచు, వానివైషమ్య పరిణామము నేర్పరచుచు, నవ్యక్తమహదహంకారాది కార్యకారణ పరంపర నుద్భవింప జేయుచు,''నవిద్యచే రాగము, రాగముచే కర్మయు, గర్మచే జన్మము, జన్మముచే గ్లేశము, గ్లేశముచే మఱల కర్మ, కర్మచే పునర్జన్మ, జన్మచే మరల రాగము'' ఇట్లు పరస్పరానుగ్రహమునకు వశములై యుత్పత్తి స్థితిలయరూపములగు కర్మ ఫలములను గలిగించును.

కాన, ననర్థపరంపరకు మూలకారణములగు నీ క్లేశములు తప్పక విడువదగినవి.

అవ॥ క్లేశముల కవిద్యామూలకత్వమును దెలుపుచున్నారు.

**సూ॥ అవిద్యా క్షేత్రముత్తరేషాం ప్రసుప్తతను**

## విచ్ఛిన్నోదారాణామ్॥ 4

అవిద్యా, క్షేత్రం, ఉత్తరేషాం, ప్రసుప్తతనువిచ్ఛిన్నోదారాణామ్।

ప్రసుప్తతనువిచ్ఛిన్నోదారాణాం, = ప్రసుప్తమనియు, తనువనియు, విచ్ఛిన్న మనియు, నుదారమనియు (ననబడు), ఉత్తరేషాం = గతసూత్రమున నవిద్యకు మీదజెప్పబడిన యస్మితా రాగద్వేషాభినివేశములను క్లేశములకు, అవిద్యా= తొలుత జెప్పబడిన యవిద్యయే, క్షేత్రం = మూలకారణము.

ప్రసుప్తమనబడు నస్మితకును, తనువనంబడు రాగమునకును, విచ్ఛిన్న మనబడు ద్వేషమునకు, నుదారమనబడు నభినివేశమునకు నవిద్యయే మూలకారణము.

ప్రసుప్తి యనగా: విదేహులయొక్కయు ప్రకృతిలయుల యొక్కయు చిత్తమున నణగియున్న రాగాదిక్లేశములు వారు; ధ్యేయాకారమున లయము నొంది యుండునంతదనుక బయటికి ప్రకాశింపక కేవలసూక్ష్మ రూపముతో శక్తిమాత్రముతో (అనాగతావస్థలో) నుండును. తమ కార్యమును నెరవేర్ప జాలవు గూడ. కాన పాలలో పెరుగువలె బీజభావముతో నణగియుండి కార్యజనన సామర్థ్యము గలవిగావు. ఇవి నిదురించు చున్నవా యన్నట్లుండును గాన నీ క్లేశములస్థితి ప్రసుప్తి యనంబడెను.

కాని విదేహులలో నింద్రియచింతకులకు పది మన్వంతరములును, భూతచింతకులకు నూరుమన్వంతరములును, బ్రకృతిలయులలో నహంకార చింతకులు వేయి మన్వంతరములును, మహత్తత్త్వచింతకులు పదివేల మన్వం తరములును, ప్రకృతిచింతకులు నూరువేల సంవత్సరములును, సంసార సంబంధము లేకుందురను విధమున, తమతమ యవధి నిండినంతనే విదేహులకును ప్రకృతిలయులకు నుత్తేజకములగు విషయము ఎదురుపడగా నిదివరకు చిత్తములలో నణగియున్న క్లేశములు మరల నంకురించి తమ తమ కార్యములను నెరవేర్చును. ప్రసుప్తుడగు పురుషు డుత్తేజకముచే నుత్థితుడై తన పనిలో దగుల్కొనిన వడువున విదేహప్రకృతిలయుల క్లేశములు సయిత

ముద్బుద్ధములై కార్యకరము లగును.

కాని వివేకఖ్యాతి (ప్రకృతిపురుషవివేకము) గలయోగి యొక్క క్లేశములు ప్రసంఖ్యాన (వైరాగ్య) మను నగ్నిచే దగ్ధములయ్యెను గాన నుద్బోధకము లుపస్థితములైనను వేగినగింజ యాలవాలజలాదుల సంబంధమునను మొలువని చందమున కార్యకరములు గాజాలవు గాన వివేకఖ్యాతి యుక్తుని క్లేశములు ప్రసుప్తములని వ్యవహరింపబడవు.

కాన ప్రసంఖ్యానపరుడగు యోగి దగ్ధక్లేశుడు గాన క్షీణక్లేశుడనియు, వివేకఖ్యాతి గలవాడుగాని కుశలుడనియు, మరియు నితనికి క్లేశకృతమగు దేహ సంపర్కము లేదుగాన జరమదేహుడనియు జెప్పబడును. దగ్ధబీజభావమును నీ యైదవక్లేశావస్థ యోగికి చరమదేహమునందు గలుగునే గాని విదేహప్రకృతిలయులకును దేహాంతరమును గలుగదు.

సత్కార్యవాదమే సిద్ధాంతము గాన దదనుగుణముగ యోగి చిత్తమునందు క్లేశముల యత్యంతాభావముండ వీలుగాదు. కాన క్లేశములు బొత్తుగా లేవని యనరాదు. క్లేశము లున్నవనియే తప్పక యొప్పుకొన వలయును. కాగా యోగసామర్థ్యముచే విషయములు సన్నిహితములు గాగా ప్రసుప్తక్లేశము లుద్బుద్ధములగు విధమున దగ్ధములగు క్లేశములుగూడ ప్రబోధితములై సంసారాది కార్యమును జేయవలదా? యని శంక యుదయింపవచ్చును.

కాని యోగిచిత్తమునందు క్లేశములున్నను అవి వివేకాగ్నిచే దగ్ధబీజ సామర్థ్యములై యున్నవి. అనగా వేగిన సెనగగింజ సెనగగింజగనే యున్నను అంకురోత్పాదనశక్తి నశించుటచే పదునుగల చేనిలో నాటినను మొలవజాలని తెరగున యోగిచిత్తమునందలి క్లేశములును జన్మమరణ ప్రవాహరూప సంసారాత్మక కార్యోత్పాదన సమర్థములు గావు, వీనికి విషయసాన్నిధ్యము నందును ప్రబోధము గలుగనే గలుగదు.

2. తనుత్వమనగా-తమకు విరుద్ధము లగు (కృశింపజేయు) తపస్స్వా,

ధ్యాయాది క్రియాయో (2-1) గానుష్ఠానముచే నవిద్యాది క్లేశములకు గలుగు కృశత్వము.

లేక యవిద్యకు విరుద్ధమగు సమ్యక్జ్ఞానముచేతను, అస్మితకు విరోధి యగు వివేకజ్ఞానముచేతను, రాగమునకు పరిపంథి యగు తాటస్థ్య జ్ఞానము చేతను, ద్వేషమునకు ప్రతిబంధకమగు నహం (తా) భావముచేతను, అభినివేశమునకు వైరియగు మమత్వముచేతను అవిద్యాదులకు గలుగు క్షీణత్వము.

3. విచ్ఛేదమనగా - క్లేశములు నడుమ నడుమ లేనటులుండి మరల యథాపూర్వకముగ విజృంభించుట. అది యెట్లనగా రాగము గలిగిన సమయమున క్రోధము గనుపడదు గాన నదృశ్యమగు క్రోధము విచ్ఛిన్న మైనదని యందుము. ఇట్లే యొకవస్తువు విషయమున నత్యంతరాగ ముండు నేని యితరవస్తువు విషయమున నుండు సామాన్యరాగము గూడా విచ్ఛిన్న మనియే తలచబడును. గాఢానురాగ మొక వస్తువునందున్న దన్నంత మాత్రమున నితర వస్తువునం దనురాగ మేమాత్ర మతనికి లేదనగలమా! చైత్రుడొకతెను ప్రేమించె నన్నంతమాత్రముననే యాత డితరవనితల విషయమున విరక్తిజెందెనని యర్థము గాదు. మరి యేమన్న నతడొక వనితయం దుత్కటరాగము గలవాడు గాన రాగ మావనిత విషయమున లబ్ధవృత్తిక మయ్యెను. ఉదారము = (నాటుకొనెను) ఇతరకాంతల యందు రాగము భవిష్యద్వృత్తికము అనగా విచ్ఛిన్నముగ నున్నదన వచ్చును. తొలుత రాగప్రాదుర్భావ సమయమునందలి యనుత్కటక్రోధము తనకు విజాతీయ మగు రాగపుటుదారత్వముచే విచ్ఛిన్న మయ్యెను. రెండవది యగు నుత్కట రాగకాలీన మగు నుత్కటరాగము సజాతీయరాగపు టుదారతచే విచ్ఛిన్న మయ్యెను.

సాంఖ్య యోగమతములలో, లేని క్రొత్తవస్తు వేదియు గలుగజాలదు గాన జిత్తమునం దన్నిక్లేశములు నెల్లపుడు నుండుననియు నయితే యొకటి యుదా (పైదెలుపబడును) రావస్థలోను, మరియొకటి ప్రసుప్తావస్థలోను,

ఇంకొకటి తన్వవస్థలో నుండునని యంగీకరింపవలయును. విదేహ ప్రకృతిలీనుల చిత్తమునందన్ని క్లేశములు నవస్థాంతరములతో నణగి యుండకున్న నవధికాలానంతరము క్లేశములు పుట్టునని చెప్పవలసి వచ్చును. అట్లు చెప్పుట సత్కార్యవాదులగు యోగుల మతమునకు విరుద్ధము. కాన క్లేశము లన్నియు నెల్లప్పుడును బ్రసుప్తిలోనో, తనుత్వముననో, విచ్ఛేదము ననో, యౌదార్యముననో యుండును.

4. ఔదార్యమనగా- క్లేశము తనకు విషయమగు వస్తువునందు ప్రాప్తవృత్తి గలది గాన, నుత్కటరూపముతోడ స్పష్టముగ బయలుపడుచు కార్యతత్పర మగుట.

విచారింపగా నుదారము గల రాగాదివృత్తులే జననమరణాది క్లేశజనక ములు గాన క్లేశములని చెప్పదగి త్యాజ్యములై యున్నవి. సుప్తతను విచ్ఛిన్నము లెపుడును క్లేశజనకములు గావు గాన క్లేశము లనదగవు. దానిచే త్యాజ్యములును గావు అను నాశంక గలుగును. కాని ప్రసుప్తాదు లగురాగాదులును భవిష్యత్కాల ములో నుదారావస్థనొంది క్లేశజనకము లగును గాన కాలవ్యవధానముచే క్లేశకరములు గాన క్లేశములుగనే పరిగణింపబడెను. కాన నాల్గవస్థలును క్లేశవిషయములే.

క్లేశము లన్నియు నుదారావస్థ నొందియే కార్యకరములగు నేని క్లేశమొక్కవిధముగ నుదారమని యంగీకరించిననే చాలును గదా! ప్రసుప్తాది భేదములేల? యను శంక యుదయించును. కాని యొకపురుషునకే యవస్థా భేదమున బాలకుడనియు, తరుణుడనియు, వృద్ధుడనియు, నవస్థావిభాగము గలిగిన చందమున క్లేశమునకు సయితము విచ్ఛిన్నాదికావస్థలు గలిగినపుడు విచ్ఛిన్నాది వ్యవహారము తగియున్నది. ఇట్లు నాల్గు విధములగు క్లేశములు తమకు విరోధియగు క్రియాయోగము నభ్యసించుటచే గృశత్వము నొందునటుల క్లేశవ్యంజకములగు విషయాభిలాష విషయచింతనాదులచే యుత్తేజితములై యుదారావస్థ నొందును.

పైజెప్పిన క్లేశము లన్నియు నవిద్యాభేదములే. ఏలనన వీటి యన్నిటి యందు నవిద్య యనుగతమై యున్నది. అనగా నేయే వస్తువవిద్యా మూలముగ బుద్ధిగోచర మగునో యాయా వస్తువు విషయముననే రాగాది క్లేశములు లబ్ధవృత్తులై యుదారావస్థ నొందుచున్నవి. కాన నవిద్య యున్నచోట నెల్ల రాగాదిక ముండుటయను నన్వయవ్యాప్తియును, నవిద్య లేనిచోట రాగాది కములును లేవను వ్యతిరేక వ్యాప్తియును నుండుటచే నీ క్లేశములవిద్యా రూపములే.

అవిద్యారూపములు గాననే యీ క్లేశములు విపర్యయ జ్ఞానకాలమున దెలియ బడును. సమ్యక్‌జ్ఞానముచే విపర్యయ జ్ఞానము నశించు సమయమున నివియు నశించును.

దగ్ధబీజభావమను నైదవయవస్థ యోగిజనుల కనుభవసిద్ధముగా నున్నది గాన నా యవస్థనేల సూత్రకారుడు నిరూపింపలేదు? అని శంక గలుగవచ్చును. కాని దగ్ధబీజాభావమున కవిద్యామూలకత్వము లేనందున, నాల్గవస్థలనే వారు నిరూపించిరి.

ఇది హేయావస్థలను జెప్పు సందర్భము గాన రాగాది హేయావస్థలను సూత్రకారుడు తెలిపెనేగాని యోగిగ్రాహ్యమగు దగ్ధబీజాభావమును దెలుపలేదు. ''అవిద్యాక్షేత్రం'' అని సూత్రించుటచే నీవ్యవస్థ విద్యామూల ములును ద్యాజ్యములు నని యెరిగింపబడియెను. దగ్ధబీజభావ మవిద్యకు ప్రతిస్పర్ధిగా నుపాదేయమే గాన నా యవస్థ నిచట జెప్పకుండుటచే లోపము లేదు.

తనుత్వావస్థను సంపాదింప గ్రియాయోగము నుపదేశించుటచే తనుత్వ ముపాదేయమైనదిగదా! అట్టి తనుత్వము నీ స్థలమున వివరించి యుండుటచే నిది కేవల హేయావస్థలను దెలుపు ప్రకరణ మనుట పొసగదు గాన దగ్ధబీజభావము తెలుపకపోవుట లోపమే యని మరల శంక గలుగవచ్చును.

కాని క్లేశములకు తనుత్వమును సంపాదించుట ప్రసంఖ్యానాగ్నిచే వానికి దగ్ధబీజభావము గలిగించుటకే కాని తనుత్వము నట్లే యుంచుకొనుటకు కాదు. కాన నసంప్రజ్ఞాత యోగనిష్ఠున కిదియు త్యాజ్యమే గాని యుపాదేయము గాదు, గాన నిది హేయావస్థానిరూపణ ప్రకరణమే గాన నుపాదేయమగు దగ్ధ బీజభావమును దెలుపకుండుట యుచితమే.

సంగ్రహశ్లోకము:-

**ప్రసుప్తాస్తత్త్వలీనానాం తన్వవస్థాశ్చ యోగినామ్ ।**
**విచ్ఛిన్నోదారరూపాశ్చ క్లేశా విషయసంగినామ్ ॥**

అనగా-క్లేశములు విదేహ ప్రకృతిలీనుల చిత్తమున బ్రసుప్తములయ్యును, సంప్రజ్ఞాన సమాధినిష్ఠుల చిత్తమున తనుత్వము నొందియు, విషయ లోలువుల చిత్తమున విచ్ఛిన్నములు నుదారములునై యుండును అని భావము.

అవ॥ ఈ పంచక్లేశములలోని యవిద్యకు దొలుత స్వరూపమును దెలుపుచున్నారు.

**సూ॥ అనిత్యాశుచిదుఃఖానాత్మసు**
**నిత్యశుచిసుఖాత్మఖ్యాతి రవిద్యా ॥ 5**

అనిత్యాశుచిదుఃఖానాత్మసు, నిత్యశుచిసుఖాత్మఖ్యాతిః, అవిద్యా.

అనిత్యాశుచిదుఃఖానాత్మసు= అనిత్యము నశుచియు, దుఃఖరూపము, ననాత్మస్వరూపము నగు వస్తువుల విషయమున (క్రమముగా), నిత్యశుచిసుఖాత్మఖ్యాతిః= నిత్యము, శుచి, సుఖరూపము, నాత్మస్వరూపముననుజ్ఞానము, అవిద్యా= అవిద్య యనబడును.

అనిత్యవస్తువును నిత్యవస్తు వనుకొనుటయు, నపరిశుద్ధవస్తువును పరిశుద్ధవస్తు వనుకొనుటయు, దుఃఖకరమగు వస్తువును సుఖకరమనుకొనుటయు, నాత్మ భిన్నవస్తువునే యాత్మ యనుకొనుటయు- నను నీనాల్గి

తెరగులగు విపర్యయభ్రమజ్ఞానమే యవిద్య యనబడును.

1. జన్యకార్యము లెల్లను నశించును గాన పృథివి ధ్రువమనియు, చంద్ర నక్షత్రాది యుతమగు నాకాశము (లేక స్వర్గము) నిత్యమనియు స్వర్గనివాసు లగు దేవతలు మరణరహితు లనియు తలచుట యను భ్రాంతిరూపమగు నవిద్యయందు ననిత్యము విషయమున నిత్యములను తలంపు గలదు.

కాన మనుజుడు పంచభూతములు సత్యములని తలచి వాయు రూపము నొందుట, యాకసములో లీనమగుట మొదలగు ఫలముల నపేక్షించి పంచభూతోపాసన చేసినను, చంద్రలోకము స్వర్గలోకము మొదలగు వాని బొందగోరి ధూమమార్గానుకూలమగు సువాసన యొనర్చినను, దేవతలు మరణరహితులని తలచి దేవత్వము కొరకు సామాది యాగముల ననుష్ఠించి నను నివి యన్నియు ననిత్యమున నిత్యత్వబుద్ధియను నవిద్యావిజృంభితము లని యెరుగవలెను.

2. ఇట్లే,

**స్థానాద్బీజాదుపష్టంభాన్నిష్యందాన్నిధనాదపి ।**
**కాయమాధేయశౌచత్వాత్పండితా హ్యశుచిం విదుః ॥**

అన్నటుల శరీరమున కుత్పత్తిస్థానమగు తల్లిగర్భకోశము మల మూత్రాది దుర్గంధవస్తు పూరితముగాన నందుండి వెడలినది గావునను, మిక్కిలి మలినములగు తల్లిదండ్రుల శుక్ల శోణితము లుపాదాన కారణము గావునను, భోజనపానాద్యుపయుక్తాన్నపానాదుల పరిపాకముచే గలిగి రక్తాది రూపము నొందిన రసముచే నుపష్టబ్ధము (నిలుపంబడినది) గావునను, మలమూత్రస్వేదాదులను గార్చుచుండును గావునను, ప్రాణవియోగానంతర మస్పృశ్యము గావునను, స్నానాంగ రాగాది సంస్కారము లొనర్పకున్న దుర్గంధయుక్త మగును గావునను, పండితులు శరీరము నపరిశుద్ధ మనిరి. కాన పరమబీభత్సమగు (ఏవగించుకొనదగు) శరీరమున శుద్ధమైనదను బుద్ధియు నవిద్యయే.

చీమునెత్తురులతో నిండిన తోలుతిత్తి యగు స్త్రీ శరీరమును గాంచి ''యీకన్య నవచంద్రకళవలె మనోహర మైనది. మరియు నీ పడుచు మధుసుధావయవనిర్మితయో? చంద్రునుండి యూడిపడెనో? యనదగి యున్నది. నీలోత్పలపత్రాయతాక్షి యగు నీమె తన హావభావ గర్భితములగు లోచనములచే జీవలోకము నోదార్చుచున్నట్లున్నది.'' ఇట్టి యసంబద్ధపు తలంపులే యశుద్ధశరీరమున శుద్ధతాబుద్ధి గాన నిది రెండవ యవిద్య.

ఇట్లే యపుణ్యములగు హింసాదుల విషయమున మీమాంసకులకు గలుగు పుణ్యబుద్ధియు, ఆర్జనపాలనాద్యనర్థములకు హేతువగు ధనమునం దర్థమను బుద్ధియు, అశుద్ధవస్తువునందు శుద్ధమను బుద్ధియు, నవిద్య లోనే చేరునని యెరుంగవలయును.

విషయభోగరూప దుఃఖమునందు సుఖమను జ్ఞానము గూడ నవిద్యయే, **''పరిణామతాపసంస్కారదుఃఖైర్గుణవృత్తినిరోధాచ్చదుఃఖమేవ సర్వవివేకినః''** (2పాదము 15సూత్రము) అను సూత్రమున పరిణామదుఃఖ, తాపదుఃఖ, సంస్కారదుఃఖములచేతను గుణవృత్తి విరోధమువలనను యోగికి విషయసుఖము లన్నియు దుఃఖరూపములే యని సూత్రకారులే ముందు తెలుపగలరు. అట్టి దుఃఖరూపములగు శబ్దాదివిషయములయందు సుఖ బుద్ధియు నవిద్యయే. ఇది మూడవ యవిద్య.

4. అట్లే యాత్మభిన్నమగు వస్తువునందాత్మ యను తలంపు నవిద్యయే, ఆత్మభిన్నములును బాహ్యోపకరణములగు పశు పత్నీ భృత్య సుతాదిచేతన వస్తువులందును. శయ్యాసన స్థానాద్యచేతన వస్తువులయందును. భోగాయతన మగు శరీరమునందుగాని. భోగోపకరణమగు నంతఃకరణము నందుగాని యాత్మ (అహం) బుద్ధి యీ విభాగమున జేరును.

సాంఖ్య ప్రవర్తకుడగు పంచశిఖాచార్యుడును **''వ్యక్తమవ్యక్తం వా సత్త్వమాత్మత్వేనాభి ప్రతీత్య తస్య సంపదమనునందత్యాత్మ సంపదం మన్వానః తస్య వ్యాపదమనుశోచత్యాత్మవ్యాపదం మన్వాన, స్ససర్వోఽప్రతిబుద్ధః''** అను

సూత్రముచే ''చేతనవస్తువు నేని జడవస్తువునేని తానుగనో తనవిగనో దలచి యాచేతనాచేతనములకు గలుగుమేలు తన మేలుగ నెంచి యానందపడుచు వానికి గలుగు హానిని తన హానినిగ భావించి దురపిల్లు పురుషుడెల్ల నప్రతిబుద్ధుడు అజ్ఞాని లేక యవిద్యాధీనుడు'' అని తెలిపెను.

ఈ యవిద్య పై దెలిపినవిధమున (చతుష్పదయై) నాల్గు తెరగులై రాగద్వేషాది క్లేశప్రవాహమునకును, రాగద్వేషాదిజన్య ధర్మాధర్మాది కర్మకును, ధర్మాధర్మాదిజన్య సుఖదుఃఖాది విపాకమునకును మూలకారణ మగును.

'అవిద్య' యను పదము న+విద్య, యను రెండు పదముల చేరికచే గలిగి నఞ్సమాస మనబడుచున్నది.

ఈ నఞ్ సమాసము ''అమాక్షికం'' అన్నచోటునవలె పూర్వ పదార్థ ప్రధాన మన్నచో నక్కడివలె (విద్యాయాఃఅభావః = విద్య యొక్క యభావము) అనునర్థమేర్పడి యీ యవిద్య క్లేశకారణము గాకపోవును. ''రాజపురుషః'' అన్నస్థలమునందువలె నుత్తరపదార్థ ప్రాధాన్యము జెప్పుద మన్నను (''యత్కించిదభావవిశిష్టా విద్యా-అవిద్యా) ఏదియో యొక యభావముగల విద్య అవిద్యయని యర్థమేర్పడును. కాన నిది క్లేశాదులకు విరోధి యగునే గాని తత్కారణము గాకపోవును. ''అమాక్షికః (దేశః)'' అన్నటుల నన్యపదార్థ ప్రధానముగ జెప్పుద మన్నను [(న విద్యతే విద్యా యస్యాం సా (బుద్ధిః)] అను వ్యుత్పత్తిచే ''విద్యలేనిది'' యను నర్థము లభింపగా విశేష్యముగా బుద్ధిని బెట్టుకొనినను విద్యారహితమగు బుద్ధి క్లేశకారణము గాదు గాన నసంగతమే యగును. లేనిచో నిరుద్ధావస్థలో నుండు బుద్ధి సయితము క్లేశకారణము గావలసివచ్చును. మరియు.

**తత్సాదృశ్యమభావశ్చ తదన్యత్వం తదల్పతా ।**
**అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థాష్షట్ప్రకీర్తితాః ॥**

అని యుండుటవలన నఞన్‌కు 1.సాదృశ్యము, 2.అభావము, 3. అన్యత్వము, 4.అల్పత్వము, 5.అప్రాశస్త్యము, 6.విరోధమునను

నానార్థములు గలవు. అవిద్యాపదములోని నఞ్‌కు నీ యర్థములు చెప్పితిమేని. 1.విద్యాసాదృశ్యము, 2.విద్యాభావము, 3.విద్యాభిన్నము, 4.అల్పవిద్య, 5.అప్రశస్తమగు విద్య, 6. విద్యావిరుద్ధము అను నర్థములు వచ్చును.

ఇందలి ''న'' యను శబ్దమున కిట తక్కిన యైదర్థములు సరిపడవు గాన నమిత్రాగోష్పద శబ్దములయందు వలెనే విరోధమను నర్థము గ్రహింపబడును. కాన నవిద్య యనగా విద్యయొక్క యభావము గాదనియు, విద్యకు విరుద్ధమగు విపర్యయజ్ఞాన మనియు నెరుంగ వలయును. కాన నవిద్య భావరూపమేగాని యభావరూపము గాదు. అమిత్రశబ్దమునందలి ''నఞ్'' (నకారము) విరోధార్థకము గాన మిత్రవిరుద్ధుడు అనగా శత్రువు అనియే బోధగలుగునే గాన మిత్రాభావమనిగాని మిత్రుడనిగాని ప్రతీతి గలుగదు. అట్టి యగోష్పద మను పదమునందలి నఞ్గూడ విరోధార్థకమే గాన (గోష్పద) గోవుపాదముకన్న విరుద్ధమగు విపులప్రదేశము బోధిత మగునే గాని గోష్పదాభావముగాని గోష్పదమాత్రముగాని ప్రతీతము గాదు. కాగా నమిత్రాగోష్పదశబ్దములచే వస్త్వంతరమే బోధిత మగుచున్నది గాని తొలుతటి వస్తువుగాని తదభావముగాని బోధిత మగుట లేదు.

ఇట్లే ''యవిద్య'' యను పదముచే తత్త్వజ్ఞానమని గాని తత్త్వజ్ఞానాభావ మనిగాని ప్రతీతి గలుగదు. కాని తత్త్వజ్ఞాన విరుద్ధమగు విపర్యయజ్ఞానము లేక మిథ్యాజ్ఞానము అని ప్రతీతి మాత్రము గలుగును.

అవ॥ ఇట్లవిద్యను నిరూపించి తత్కార్యమును రెండవదియు నగుటచే క్రమప్రాప్తము నగు నస్మితకు లక్షణము నెరింగించుచున్నారు.

## సూ॥ దృగ్దర్శనశక్త్యో రేకాత్మతేవాస్మితా॥ 6

దృగ్దర్శనశక్త్యోః, ఏకాత్మతా, ఇవ, అస్మితా॥

దృగ్దర్శనశక్త్యోః= దృక్ఛక్తి యనబడు పురుషునకును, దర్శన శక్తి యనబడు

బుద్ధికిని, ఏకాత్మతా ఇవ= అభేదమువలె నుండుట, అస్మితా= అస్మిత యను క్లేశము.

సర్వమును దర్శించు వాడుగాన పురుషుడు దృక్ఛక్తి యనియు, విషయాకారముగ పరిణమించి దృశ్య విషయ రూపము నొందునదిగాన బుద్ధి దర్శనశక్తి యనియు వ్యవహరింపబడును. ఈ పురుషుడును బుద్ధియు వేరువేరు వస్తువులే యైనను అవిద్యాబలముచే పై రెండు పదార్థములకును తాదాత్మ్య మున్నటుల దోచుటయు అస్మిత యనంబడును.

ఈ యస్మితాక్లేశమున్ననే 'అహమస్మి' 'అహం సుఖీ అస్మి' ఇత్యాది వ్యవహారములు జరుగుచుండును.

బుద్ధితత్త్వము పరిణామశీలమును, మలినమును, జడము గావునను, పురుషుడు కూటస్థుడును, శుద్ధుడును, చేతనుడును, గావునను పరస్పర విరుద్ధరూపముచే నీ యిరువురికి నభేదము గలుగుట యసంభవమే యయినను వివేకము లేకుండుటచే నేకత్వ మున్నటుల దోచును. ఈ విషయమునే సూత్రములోని 'ఇవ' శబ్దము స్పష్టపరచుచున్నది.

పై చెప్పిన విధమున నొండొరులకన్న భిన్నములై యసంకీర్ణములగు భోక్తృశక్తిరూప పురుషుడును, భోగ్యశక్తిరూపబుద్ధి (అంతఃకరణ)యు నవివేకమూలమున నేకమువలె దోచుట గలుగగా నా యస్మితచేతనే పురుషుడు తానే భోక్తయని తలచును.

ప్రకృతిపురుష వివేకఖ్యాతి గలిగినంతనే యస్మిత నశించును. కాన పురుషునకు స్వస్వరూప సాక్షాత్కారము గలుగును గాన తాను భిన్నుడ ననియు, బుద్ధి భిన్నమనియు నెరుగుటచే నా స్థితిలో భోగమున కవకాశము లేదు. ఈ విషయమునే పంచశిఖాచార్యులు **''బుద్ధితః పరం పురుషమాకార శీలవిద్యాదిభిర్విభక్తమపశ్యన్ కుర్యాత్తత్రాత్మ బుద్ధిం మోహేన''** అని తెలిపిరి. అనగా స్వరూపస్వభావ చైతన్యాదులచే బుద్ధికన్న విలక్షణుడగు పురుషుని బుద్ధి భిన్నుడని తలపక యనాత్మను నాత్మజ్ఞానరూప మోహవశమున బుద్ధియందే యాత్మయను తలపును నిలుపును అని భావము.

నిత్యశుద్ధబుద్ధకూటస్థుడగు పురుషునికిని మలినజడపరిణామిని యగు బుద్ధికిని భేదము నెరుగజాలక చేతనుడు నేను కర్తను, నేను భోక్తనని తలంచును. అస్మితాసంజ్ఞక మగు నీ చిజ్జడావివేకమునే వేదాంతులు చిజ్జడగ్రంథియని వ్యవహరింతురు. గ్రంథి (ముడి)వలె పురుషబుద్ధుల యభేద మవివేకమూలమున పెనగొనియున్నది. కాన దీనికి చిజ్జడగ్రంథి నామము సార్థకమే. చిజ్జడగ్రంథియే

**భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః ।**
**క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥**

అను ముండకోపనిషత్తునందు హృదయగ్రంథి శబ్దముచే వ్యవహరింప బడినది. పరమాత్మ సాక్షాత్కారము గలిగినంతనే హృదయ గ్రంథి వీడును. అవివేకజనితములగు సంశయము లన్నియును తీరును. కర్మ లన్నియు నశించును అని పై శ్రుతికి తాత్పర్యము.

అవ॥అవివేక (అస్మితకు) మునకు కార్యమును, క్రమప్రాప్తము నగురాగమునకు లక్షణమును దెలుపుచున్నారు.

## సూ॥ సుఖానుశయీ రాగః॥ 7

సుఖానుశయీ, రాగః॥

సుఖానుశయీ=సుఖానుభవానంతర మంతఃకరణమున గలుగు నభిలాష, రాగః =రాగము అనబడును.

ఇంతకుముందు విషయసుఖముల ననుభవించిన పురుషు డాసుఖములు తలపునకు వచ్చుటచే దత్సజాతీయములగు సుఖముల విషయమున గాని, యాసుఖములకు సాధనములగు ధనాదులమీద గాని, యత్యాసక్తి గలిగియుండుట రాగ మనబడును. గర్ధము, తృష్ణ, లోభము అనునవి రాగమునకు పర్యాయపదములు.

ఇంతకు ముందు సుఖము ననుభవింపని యాతనికి సుఖస్మృతియే గలుగదు. కాన సుఖానుభవము తప్పక ముందుండవలయును. మరియు సుఖసాధన స్మరణానుభములచే సుఖస్మరణము గలిగి యంతటను సుఖేచ్ఛా రూపమగు రాగ ముదయించును. ఒక సుఖసాధనము కంటబడెనేని యిది యట్టి యితర సాధనములను స్మరింపజేసి తజ్జన్యములగు సుఖములయం దభిలాష గలిగించును. మరియు సుఖము ననుసరించి యుండునదియే రాగము అనియు చెప్పవచ్చును.

అవ॥ రాగ ప్రతిరోధముచే గలుగునది గాన రాగనిరూపణానంతరము ద్వేషలక్షణమును నిరూపించుచున్నారు.

## సూ॥ దుఃఖానుశయీ ద్వేషః॥ 8

దుఃఖానుశయీ, ద్వేషః॥

దుఃఖానుశయీ = దుఃఖానుభవానంతర మంతఃకరణమున గలుగు దుఃఖవిషయకమగు క్రోధము, ద్వేషః = ద్వేష మనబడును.

దుఃఖము ననుభవించిన పురుషున కాయనుభూత దుఃఖములు తలంపునకు వచ్చుటచే నా దుఃఖముల విషయమునను, దుఃఖకారణముల విషయమునను గలుగు క్రోధమే ద్వేషమని చెప్పబడును. పురుషునకు దుఃఖానుభవము గలుగునప్పు డతని చిత్తమున నొకవిధమగు సంస్కారము జనించును. ఆ సంస్కారమే యపుడపు డుద్బోధకసామగ్రి యేర్పడి నప్పుడు పురుషునకు పూర్వానుభూత దుఃఖస్మరణమును గలిగించును. ఆ స్మరణ ముచే పురుషున కనుభూత దుఃఖములయందే గాక తత్సమాన జాతీయము లగు దుఃఖములయందు సయితము క్రోధము గలుగును. అట్లే దుఃఖ సాధనములయందును గ్రోధము గలుగును. ఇట్లే సుఖస్మరణ పూర్వకముగా సుఖ తత్సాధనముల యందభిలాష గలుగు విధము నూహించునది. ఈ ద్వేషమునకు దుఃఖప్రతిఘాతము, మన్యువు, జిఘాంస, క్రోధము అనునవి పర్యాయపదములు.

అవ॥ ద్వేషమూలకము గావునను పరిశేషన్యాయముచేతను అభినివేశము నకు లక్షణమును నిరూపించుచున్నారు.

## సూ॥ స్వరసవాహీ విదుషోఽపి తథాఽఽరూఢోఽభినివేశః॥ 9

స్వరసవాహీ, విదుషః, అపి, తథా, ఆరూఢః, అభినివేశః॥

స్వరసవాహీ= స్వభావసిద్ధముగనే, విదుషః అపి = విద్వాంసునకు గూడ (చిత్తమున) తథా = మూర్ఖుల చిత్తమున గలుగు నట్లుగనే, ఆరూఢః = నాటుకొనిన (మరణభయము), అభినివేశః = అభినివేశ మనబడును.

పూర్వజన్మములయందు గలిగిన మరణదుఃఖానుభవ వాసనచేత సకల ప్రాణులకును ''నాయభావము లేకుండుగాక! అనగా నాశరీరేంద్రియవిషయముల కెడబాటు గలుగకుండుగాక! నే నెల్లవేళల నుందును గాక'' యను నాత్మవిషయక ప్రార్థన తప్పక కలుగును. పూర్వము మరణధర్మము ననుభవింపకున్న నీమరణభయము గలుగుట యసంభవము గాన పూర్వజన్మ మరణానుభవ మిందుచే వెల్లడియగుచున్నది. కాన నీమరణ భయరూపమగు నభినివేశ మనేక జన్మ పరంపరాగతము గాన బూర్వమరణానుభవవాసనా జన్యమును, స్వాభావికమునై యున్నది. మరియు నీమరణ భయము ప్రత్యక్షానుమానాగమ ప్రమాణ సహాయము బనిలేకయే తత్కాలోత్పన్నమగు కీటమునకుగూడ గలుగుచున్నది. కీటము పుట్టుటతోడనే గలుగు 'చచ్చెద' మను బుద్ధియే యాప్రాణులకు గలిగిన పూర్వమరణానుభవములను వివరించుచున్నది. ఆ ప్రాణులకు పూర్వమరణానుభవ వాసనయే లేనిచో తమకిక మరణము గలుగునను విషయము నవి ప్రత్యక్షముగ జూచెనా! యనుమితి జేసెనా? ఆగమముచే నెరిగెనా? ఏదియు లేదుగదా?

ఈ మరణభయమను నభినివేశ మత్యంత మూఢములగు కీటముల చిత్తముల యందును నాటుకొని యున్నయటులే యాగమాను మానాదులచే బూర్వకోటి యగు సంసారమును, ఉత్తరకోటి యగు కైవల్యము నెరిగిన

విద్వాంసుని చిత్తమునగూడ హత్తుకొనియే యున్నది. పూర్వజన్మానుభూత మగు మరణ దుఃఖానుభవముచే జనించిన వాసన క్షుద్రజీవుల హృదయమునందువలె విద్వాంసుని చిత్తమున సయిత మలముకొనియే యున్నది గదా!

ఈసూత్రమున విద్వచ్ఛబ్దముచే శాస్త్రజ్ఞానము గలవాడగు నర్థమునే గ్రహింపవలయును. కాని సంప్రజ్ఞాతయోగి యనిగాని, యోగి యనిగాని గ్రహింపరాదు. లేనిచో **''విద్వాన్ న బిభేతి కదాచన''** యను తైత్తిరీయక శ్రుతియందు యోగియగు నాతని కెపుడుగాని భయము లేదను నర్థమునకు విరోధము సంభవించును. ఇంతియగాక **''తజ్జః సంస్కారోఽన్యసంస్కార ప్రతిబంధీ''** (1పాద 50చూ) యను సూత్రమున సమాధిసంస్కారము లన్యసంస్కారముల నణచివేయునని తెలిపి యుండుటచే యోగికి పూర్వజన్మ సంస్కారము లుండవు గదా! కాన నీ సూత్రమునందలి విద్వచ్ఛబ్దమునకు నాగమానుమానప్రమాణ విచక్షణుడనియే యర్థము.

కాగా మూఢులకువలె నాగమానుమాన విచక్షణుండగు విద్వాంసునకు గూడ నవశ్యముండు మరణభయమే యభినివేశ మనంబడునని భావము.

అవ॥ క్లేశవిభాగలక్షణములు, క్లేశావస్థలు, క్లేశతనూకరణమును జెప్పిరి గావున నింక తనూకృతములై ప్రసంఖ్యానాగ్నిచే దగ్ధ బీజములగు క్లేశములకు నివర్తనోపాయమును దెలుపుచున్నారు.

## సూ॥ తే ప్రతిప్రసవహేయాః సూక్ష్మాః ॥ 10

తే, ప్రతిప్రసవహేయాః, సూక్ష్మాః.

తే = ఆ పంచక్లేశములు, సూక్ష్మాః = క్రియాయోగముచే సూక్ష్మములును ప్రసంఖ్యానాగ్నిచే దగ్ధబీజకల్పములై, ప్రతిప్రసవహేయాః- ప్రతిప్రసవ = చిత్తప్రలయరూపమగు నసంప్రజ్ఞాత సమాధిచే, హేయాః = త్యజింప దగును.

క్రియాయోగముచే సూక్ష్మత నొందిన క్లేశములు ప్రసంఖ్యాన

వైరాగ్యమను నగ్నిచే దగ్ధబీజతుల్యములుగనయి స్వాధికారము సమాప్తము కాగా యోగిచిత్తము ప్రకృతిలీన మగు సమయమున దానితోడ తాము లయము నొందును. కాన నసంప్రజ్ఞాత సమాధియే క్లేశనాశమునకు నుత్తమసాధనమని భావము. కొందరు ప్రతిప్రసవశబ్దమునకు ప్రతిలోమము (వెనుకనుండి ముందునకు) అని యర్థము జెప్పిరి. ఆపక్షమున బంచక్లేశములును ప్రతిలోమ ముగా వెనుకనుండి యొకటొకటిగా త్యజింపదగినవని యర్థ మగును. అనగా తొట్టతొలుత నభినివేశము విడువవలయును. తదనంతరము ద్వేషమును, దానితరువాత రాగము, నావల యస్మితను, తుద కవిద్యను విడువవలయు నని భావ మగును.

అవ॥ మరియు క్లేశములకు ప్రకారాంతముల హేయత్వము నెరింగించుచున్నారు.

## సూ॥ ధ్యానహేయా స్తద్వృత్తయః॥ 11

ధ్యానహేయాః, తద్వృత్తయః,

(స్థితానాం, తు, బీజభావోపగతానాం, అను మూడు పదములు భాష్యకారునిచే నీసూత్రములోని కధ్యాహారము చేయబడెను.) స్థితానాం = చిత్తమున స్థూలరూపమున నున్నవి గావుననే, బీజభావోపగతానాం = బీజభావమును (కార్యోత్పాదనశక్తిని) పొందిన (క్లేశములయొక్క) తద్వృత్తయః = ఆ వృత్తులు, ధ్యానహేయాః = ప్రసంఖ్యాన సంజ్ఞకధ్యానముచే నిరాకరింపదగినవి.

అవిద్యాది క్లేశవృత్తులు స్థూలములుగ నుండి క్రియాయోగముచే గ్రమముగ సూక్ష్మములుగ నొనర్పబడి యంతట ప్రసంఖ్యాన మనబడు ధ్యానముచే దగ్ధబీజకల్పములుగ నొనర్పదగి యున్నవి. ఇట్లు క్లేశవృత్తులను తగ్గించుకొనుటయును, తగ్గినవానిని కార్యకరణమునకు నసమర్థములుగా జేసికొనుటయు పురుషున కధీనమై యున్నది.

వస్త్రమున కంటిన స్థూలమలము విదలించిన రాలిపోవును, సూక్ష్మమలము మరక మొదలగునదిట్లు వదలక యుదుకుట, చవుడు

మొదలగు వానితో నుడకబెట్టుట, యెండలో నారవేయుట, నీరుజల్లుట మొదలగు నుపాయములచేతగాని వస్త్రమును వదలిపోదు. అట్లే స్థూలము లగు క్లేశవృత్తులు స్వల్పప్రతిక్రియ యగు క్రియాయోగముచేతనే తొలగి పోవును. కాని క్రియాయోగముచే సూక్ష్మభావము నొందిన క్లేశవృత్తులు ప్రసంఖ్యాన రూపధ్యానమను మహాప్రయత్నముచేతగాని దగ్ధబీజభావమును బొందవు. అట్లు దగ్ధబీజభావము నొందుటచే సూక్ష్మతరములగు క్లేశవృత్తులు మహత్తరమగు నసంప్రజ్ఞాత సమాధిచేగాని పూర్తిగ నివర్తింపవు.

కాగా స్థూలక్లేశవృత్తులను క్రియావృత్తులచేత సూక్ష్మీకరించి, వానిని ప్రసంఖ్యానమగు ధ్యానముచే దగ్ధబీజకల్పములుగ నొనర్చి, యట్టివాని నసంప్రజ్ఞాత సమాధిచే నిర్మూల మొనర్పవలయునని తాత్పర్యము.

అవ॥ సుఖదుఃఖహేతువులగు ధర్మాధర్మములనే క్లేశములని వ్యవహరింపదగియుండ నవిద్యాదులను క్లేశము లననేల? యను శంకను నివారించుచున్నారు.

## సూ॥ క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్ట జన్మవేదనీయః॥ 12

క్లేశమూలః, కర్మాశయః, దృష్టాదృష్టజన్మవేదనీయః.

కర్మాశయః = పుణ్యపాపరూప కర్మసంస్కారము, క్లేశమూలః = అవిద్యాది క్లేశములు మూలకారణముగా గలదియును, దృష్టాదృష్ట జన్మవేదనీయః = ఈజన్మమునందే ఫలము నొసంగు నదియును. దేహత్యాగానంతరము ఫలమొసంగు నదియు నగును.

పుణ్యపాపరూపమగు కర్మాశయము(సంస్కారము, లేక అదృష్టము) కామలోభమోహక్రోధముల మూలముననే గలుగును. ఇచట కామమనగా రాగము, క్రోధమనగా ద్వేషము, లోభమనగా నభినివేశము. మోహమనగా నవిద్యయు నస్మితయు గ్రహింపబడును. కాన పుణ్యపాపములు, లేక

ధర్మాధర్మములు అవిద్యాది మూలకము లయ్యెను. కాన జన్మమరణాదులకు మూలములగు నవిద్యాదులనే క్లేశములని వ్యవహరించుట యెంతయు తగియున్నది.

మరియు నవిద్యాపూర్వకముగ నాచరించిన పుణ్యాపాపకర్మలే జన్మాదులకు కారణము లగును గాని నిష్కామబుద్ధితో నాచరించిన పుణ్యాపాపములు జన్మాదులకు కారణములు కావు. కాన పుణ్యాపాపములవిద్యాది ద్వారా జన్మాది కారణములగునే గాని స్వతంత్రముగా కారణములు గావు. కానను ముఖ్యకారణములగు నవిద్యాదులకు క్లేశములను వ్యవహార మసంగతమై యున్నది.

ఆ పుణ్యాపాప సంస్కారము దృష్టజన్మ వేదనీయము, అదృష్టజన్మ వేదనీయము నని యిరుతెరగులు. దృష్టజన్మవేదనీయ మనగా నత్యుగ్ర వేగముగా ననుష్ఠింపబడిన మంత్రజపముచేనేని; తపముచేనేని; సమాధిచేనేని; ఈశ్వర, దేవతా, మహర్షి, మహానుభావుల, నతితీవ్రముగా నారాధించుటచే నేని యుత్పన్నమై యప్పటి కప్పుడే ఫలప్రదాన సన్నద్ధమగు పుణ్యకర్మాశయము. (పుణ్యాసంస్కారము) అట్లే నమ్మినవారికిని, భీతిజెందినవారికిని, వ్యాధిపీడితులకును, దీనులకును, మహానుభావులకుగాని, తపస్సులకుగాని చేసిన యపకారము సయితి మప్పటికప్పుడు పరిపక్వమై పాపఫలము నొసగ సిద్ధముగ నుండును గాన నట్టి పాపకర్మాశయమున్ను (పాపసంస్కారము) దృష్టజన్మ వేదనీయ మన బడును.

ఇందు దొలుతటి దృష్టజన్మ వేదనీయమగు పుణ్యకర్మాశయమునకు శిలాదుని పుత్రుడగు నందీశ్వరుని చరిత ముదాహరణము. అతడు బాల్యమున తీక్ష్ణమగు తపముచే నీజన్మముననే మనుష్యత్వమును దిగవిడచి దేవత్వము నొందెనుగదా!

రెండవదియగు దృష్టజన్మ వేదనీయ పాపకర్మాశయమునకు నహుషు డుదాహరణము. నహుషుడు దేవరాజయ్యు నగస్త్యుని నధిక్షేపించుటయను

పాపకర్మాశయముచే నింద్రత్వమును బోగొట్టుకొనుటయే గాక యజగరమై క్రింద బడియెను గదా!

అదృష్టజన్మ వేదనీయములగు ధర్మాధర్మములు ప్రసిద్ధములే. యజ్ఞాదులచే గలుగు స్వర్గాదికము అదృష్టజన్మ వేదనీయ ధర్మకర్మాశయములు. అట్లె పాపక్రియలచే గలుగు నరకబాధ అదృష్టజన్మ వేదనీయ పాపకర్మాశయములు.

ఇచ్చుట నీమాత్రము నెరుగవలయును. నరకమున బడినవారలకు సాధనసంపత్తి లేదు గాన దృష్టజన్మ వేదనీయ మగు కర్మాశయము లేదు. క్లేశక్షయము నొందిన యోగుల కదృష్టజన్మ వేదనీయ మగు కర్మాశయము లేదు.

అవ॥ పుణ్యాపాపము లవిద్యామూలకములే గాన విద్యాప్రాదుర్భావముచే నవిద్య నశించును. కాన గ్రొత్తకర్మాశయము గలుగకుండిన నుండుగాక, ఇంతకు ముందే యున్న పుణ్యాపాపకర్మాశయ పరంపర యట్లే నిలిచి యుండుటచే, జన్మాదులు గలుగవలసియే యున్నవిగదా! కాన యోగులకును సంసార మెడతెగక యనువర్తించు చుండవలసినదే గదా? యను శంకకు సమాధానము నిచ్చుచున్నారు.

## సూ॥సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః॥ 13

సతి, మూలే, తద్విపాకః, జాత్యాయుర్భోగాః.

మూలే=ధర్మాధర్మాదులకు మూలకారణమగు నవిద్యాక్లేశములు, సతి= ఉండిననే, జాత్యాయుర్భోగాః, జాతి=జన్మ, లేక దేవమనుష్యాద్యుత్తమ జాతియు, ఆయుః=జీవనకాలము, భోగాః=ఇంద్రియాదిద్వారా సుఖదుఃఖాదుల ననుభవించు చిత్తవృత్తియు నను, తద్విపాకః =ఆ ధర్మాధర్మరూప కర్మాశయమునకు ఫలము గలుగును.

అవిద్యాదిక్లేశములు ధర్మాధర్మములకు మూలకారణములు గాన

నవిద్యాదు లున్ననే ధర్మాధర్మములు తమఫలములను గలిగింపజాలునుగాని యవిద్యాదిసహాయము లేక ధర్మాధర్మములు ఫలింపజాలవు.

పై పొట్టూడ్వబడక, యుడికింపబడకయున్న వడ్లలోని బియ్యపు గింజలే మొలకలెత్తజాలియుండునుగాని పొట్టు తీయబడినవిగాని; పొట్టుండియు, నుడుక బెట్టబడినవిగాని మొలవవు గదా! అట్లే యవిద్యాది క్లేశావృతమైనచో ధర్మాధర్మరూప కర్మాశయము జాత్యాయుర్భోగరూప విపాకములను మొలకెత్తునుగాని క్లేశవిరహితమైనను, ప్రసంఖ్యానముచే దగ్ధబీజభావము నొందినను జన్మాది విపాకముల నొసగజాలదు.

వివేకజ్ఞానముచే క్లేశములు నశించునుగాన, పొట్టులేక బియ్యము మొలవని చందమున క్లేశసహాయములేక ధర్మాధర్మములు జన్మాది కారణములు గావు గావునను, ధర్మాధర్మాది కర్మాశయము ప్రసంఖ్యా నాగ్నిచే దగ్ధబీజభావము నొందెను గాన ననాదికాల ప్రవృత్తమయ్యు వేయించిన విత్తనము నేలలో విత్తబడియు నంకురింపని చందమున నది జన్మాది సంసారప్రదము గాదని భావము.

కర్మాశయముయొక్క విపాకము (ఫలము) జాతి యనియు, నాయు వనియు, భోగ మనియు మూడు తెరగులు.

ప్రసంగవశమున నిట్లు విత్కరింతుము. 1. ఒకకర్మ యొకే జన్మమునకు కారణమా? 2. ఒకేకర్మ యనేకజన్మములకు కారణ మగునా? 3. అనేకకర్మ లనేకజన్మలకు కారణమగునా? 4. అనేకకర్మ లొకజన్మకు కారణమగునా యని నాల్గు వికల్పములు.

ఇందు దొలుతటి వికల్పము ప్రకార మొకకర్మ యొకజన్మకు కారణ మంటిమేని యనాదికాల సంచితము నసంఖ్యాకమును భుక్తావశిష్టము నగు కర్మకును, వర్తమాన కాలకర్మకును ఫలక్రమనియమము సరిపడదు. (అనగా ప్రాచీనకర్మములకే ఫలము లేకుండును గాన వర్తమాన కర్మఫలము అనుభవమునకు రావలయునను నియమము చెడిపోవును.) దానిచే

కర్మానుష్ఠానముపై విశ్వాసము గలుగదు. కాన కర్మలయందు ప్రవృత్తియు గలుగక పోవలసివచ్చును. కర్మానుష్ఠానమునం దప్రవృత్తి గలిగిన గలుగుగాక యని దానిని సమ్మతింప రాదు. శాస్త్రము జీవితపర్యంతము సత్కర్మాను ష్ఠానమును విధించు చున్నది గదా!

కర్మలు 1.సంచితములు, 2.ప్రారబ్ధములు, 3.ఆగాములు అని మూడువిధముల నున్నవి. ఇందు సంచితమనగా ననేకజన్మార్జితమై యింకను ఫలము నివ్వక యట్లే యుండునది. ప్రారబ్ధమనగా సంచితములోనుండి వర్తమానశరీర భోగాదులకు గారణమగు కర్మము. ఆగామి కర్మమనగా వర్తమాన శరీరముచే ననుష్ఠింపబడి రాబోవు ఫలమునకు కారణ మగునది.

ఇట్లుండగా నొకకర్మ యొకజన్మమునకు గారణమను సిద్ధాంతము నంగీకరింతుమేని యీకర్మ యీ ఫలము నిచ్చునను నిశ్చయము లేదు గావునను, సంచిత కర్మములలో నొక్కటియే యుత్తరజన్మకు కారణము గాన పూర్వజన్మమున నేమాత్రమేని పాపానుష్ఠానముండిన నా పాపాచరణము వర్తమానకాలిక పుణ్యాచరణమును వ్యర్థముచేసి తన దుష్ఫలితమునే యిచ్చును. కాన మనము పుణ్యకర్మ లేల యాచరింపవలయును? అని పుణ్యకార్యముల యందు ప్రవృత్తియే గలుగకుండ బోవును.

ఒక కర్మయే రాబోవు ననేకజన్మలకు కారణమను రెండవ వికల్పమును సరిగాదు. అట్లంగీకరించితిమేని యనేకకర్మలలో నేదేని యొక్కకర్మ చేతనే బహుజన్మములు గలుగుచుండగా తక్కిన కర్మలకు ప్రయోజనమే మున్నది? అవి వ్యర్థము లగునుగదా! కాన పురుషునకు పుణ్యకార్యాచరణమునందు విశ్వాసము గలుగదు. అనగా చేసిన కర్మము వ్యర్థమగును గాన నేల చేయ వలయును? అని బుద్ధి యుదయించుటచే పురుషుడు కర్మప్రవృత్తుడు గానోపడు.

అనేక కర్మలనేకజన్మలకు కారణము లగునను మూడవ వికల్పము నంగీకరింతుమేని యనేకజన్మల నొక్కతూరి గలిగించుట యసంగతము.

కాన క్రమముగా ననేక జన్మములను గలిగించుననని గదా యంగీకరింప వలయును? అట్లంటిమేని యొక్కొక కర్మచే నొక్కొక జన్మము గలుగునని తొలుతటి పక్షములోనికి చేరినదిగాన నాదోషము లన్నియు మరల సంప్రాప్తించును. కాన నీ పక్షమును సమంజసము గాదు.

కాన నాల్గవపక్షమే సిద్ధాంతము. అనగా పుట్టినది మొదలు గిట్టువరకు నొనర్పబడి విచిత్రమై గుణప్రధానభావమున నుండిన పుణ్యాపుణ్య కర్మాశయ సంచయము మరణకాలమున నభివ్యక్తమై యొకటిగా చేరి మరణమును గలిగించి ప్రవృద్ధవేగము గలదై యొకే జన్మమును గలిగించును.

అనగా మరణమునకు ముందు ప్రారబ్ధకర్మము ఫలప్రద మగుచున్నది గాన సంచితకర్మల కవకాశము గలుగలేదు. అందుచే నవి మరణ పర్యంతము తూష్ణీంభావముతో నుండినవి. ప్రారబ్ధమంతయు ననుభవించుటచే ప్రారబ్ధ మను ప్రతిబంధకము మరణకాలమున తనంతట తొలగిపోగా సంచితము లన్నియు నదత్తఫలములు గాన నభివ్యక్తములై ప్రధానగౌణ భావముతో నొండొరులగూడి యుత్తర కాలమున రాబోవు నొకేజన్మను గలిగించును. కాన ననేకకర్మలొక జన్మకు కారణములు. అనేకకర్మలు కలసి యొకజన్మకు కారణము లగుటయేగాక యా కర్మలే మనుష్యాదిజన్మములో జన్మించినవా రాయువుతోడ నుండుటకును, నాయుష్మంతులు సుఖదుఃఖాది భోగము లనుభవించుటకు సయితము కారణము లగును. కావుననే యీ కర్మాశయము జాతికి, నాయువునకును, భోగమునకును కారణము గాన ద్రివిపాకమని చెప్పబడుచున్నది. మరియు నీకారణమువలననే కర్మాశయ మేకభవికము. అనగా నొక్కజన్మమునకు మాత్రము సంబంధించినది (ఒకజన్మమును మాత్రము కలిగింపజాలినది) అని చెప్పబడును.

ఈయేకభవికమతము (కర్మములొకే జన్మమునే గలిగించిపోవునను వాదము) సర్వసమ్మతము గాదు. ఏలనన నొకడు స్వర్గసాధనమగు జ్యోతిష్టో మాది పుణ్యకర్మమును, నరకసాధనమగు బ్రహ్మహత్యాది పాపకర్మము నాచరించి యుండుచో నా రెండు నేకకాలముననే విరుద్ధఫల ద్వయము

నీయజాలవుగాన మధ్యమజన్మము నీయవలసి వచ్చును. ఇట్లంగీకరించుట ఛాందోగ్యశ్రుతివిరుద్ధము. ఛాందోగ్యములో ''నిష్టాపూర్త మును నమష్ఠించిన వారు ధూమాది మార్గముగుండా జంద్రలోకమునకు జని యచట ఫలము ననుభవించిన యనంతరము మరల సంచితకర్మవశమున మనుష్యలోకమున జన్మమెత్తుదు రనియు, నందునను సంచితపుణ్యావశేషము గలవారు బ్రాహ్మ ణాది జన్మలను, సంచిత పాపశేషము గలవారలు శూద్రాది జన్మల నెత్తుదురని'' యున్నది. పై యేకభవికమతము నొప్పుకొంటిమేని యన్నికర్మలు చంద్ర లోకములో ఫలము లనుభవింప జేయుటతో ముగియవలయును గాని మరల జన్మించుటకు సంచితము మిగుల గూడదుగదా! కాన నీమతము శ్రుతివిరుద్ధముగా నుండును.

''వర్ణశ్చాశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః ప్రేత్య కర్మఫల మనుభూయ తతః శేషేణ విశిష్ట దేశజాతికుల రూపాయుః శ్రుతవృత్తవిత్త సుఖమేధసో జన్మ ప్రతిపద్యంతే'' యను నాపస్తంబవచనముచే స్వకర్మనిష్ఠులగు బ్రాహ్మణాదు లును బ్రహ్మచర్యాదులును పరలోకమున దమతమకర్మ ఫలముల ననుభవించి యంతట సంచితశేషముచే విశేషయుక్తమగు దేశజాతికుల రూపాయుర్విద్యా చార ధనసుఖబుద్ధులు గలవారుగ జనింతురను నర్థము తెలియుటచే నేకభవిక వాదముతీరున బరలోక సుఖానుభవముతోడ సకలకర్మలు క్షీణించి పునర్జన్మ గలుగగూడదుగాన నీ యేకభవికవాదము స్మృతులకును విరుద్ధమైనది.

అయినను పై యేకభవికమతము అదృష్టజన్మ వేదనీయనియత విపాకస్థలమున మాత్రమంగీకరింపబడును. ఈ విషయము పైన వివరింప బడును.

దృష్టజన్మ వేదనీయమగు కర్మాశయము కొన్ని చోటులలో భోగమునకు మాత్రము హేతువగునుగాన నేకవిపాకారంభకము (ఏకఫల ప్రదము) ను, కొన్నియెడల నాయుర్భోగములకు రెంటికిని గారణ మగునుగాన విపాకద్వయారంభకము (ఫలద్వయదాయియు)ను అగును. శిలాదుని పుత్రుడగు నందియను బ్రాహ్మణుడు తానెనిమిది సంవత్సరముల

యాయువు గలవాడని యెరిగియు మహాదేవారాధన రూపపుణ్యకర్మముచే జిరాయువును, దేవభోగమునుగూడ సాధించెను. కాన నిది విపాకద్వ యారంభక కర్మాశయము. మరియు నహుషుడగస్త్యు నవమానించుటయను పాపకర్మచే సర్పరూపము నందలి దుఃఖము లనుభవింపవలసివచ్చెను. కాన నిది యేకవిపాకారంభక కర్మాశయము.

కాగా నదృష్టజన్మ వేదనీయ కర్మాశయము జాత్యాయుర్భోగ జనక మగును గాన త్రివిపాక మగునుగాని యీాదృష్టజన్మవేదనీయ కర్మాశయ మొండుచో భోగమాత్రైక విపాకమును, మరికొన్నియెడల ఆయుర్భోగ మాత్ర విపాకద్వయప్రదము నగునని తెలియవలయును.

ధర్మాధర్మ(రూప)కర్మాశయ మేకభవికమని చెప్పినట్లు వాసనయు, నేకభవికమని తలంపరాదు. అట్లేకభవికత్వ మంగీకరించినచో మనుష్య జన్మానంతర మొకప్రాణికి పశుజన్మము గలిగినచో పశుభోగముల వాసన యతని కింతకుముందు లేదు గాన పశుజన్మమున పశుభోగములయందు ప్రవృత్తి కలుగరాదు. మొదట ననుభవము, దానిచే వాసన, లేక సంస్కారము, తదనంతరము స్మరణము, తదనంతరము ప్రవృత్తి యనునవి క్రమముగా గలుగవలయును. పూర్వజన్మవాసనలు పూర్వజన్మముననే ముగిసిపోయినచో నీ జన్మమున స్మరణప్రవృత్తులు గలుగగూడదు గదా!

కాన నిటు లంగీకరింపవలయును. క్లేశానుభవమునకును, కర్మాను భవమునకును, ఫలానుభవమునకును నిమిత్తములగు వాసనచే ననంత కాలమునుండియు వ్యాప్తమగు నీచిత్తము చిత్రితమై యన్నివైపులను ముడులు వేయబడి పారబట్టబడిన వలవలె నున్నది గాన వాసనలనేక భవపూర్వికలు అనగా ననంతజన్మ ప్రాప్తములు.

ఇటుల వాసనల కనేకజన్మప్రాప్తత్వము నంగీకరించితిమేని యొక్కొక్క జన్మమునందును సకలవిధవాసనలు నుండునుగాన నాయా జన్మాను గుణవాసన యుద్బుద్ధమై స్మరణ మేర్పడి దానిచే తత్తద్భోగములయందు

ప్రవృత్తి గలుగునని సమాధానమివ్వవచ్చునుగాన పై యా శంక కవకాశ ముండదు. వాసన లనాదు లగుటచే ''తొట్టితొలుతటి జన్మమున వాసనయే లేకుండుటచే భోగప్రవృత్తి యెట్లు గలిగె'' నని శంకయే గలుగదు. ఆ ప్రథమజన్మమున గూడ వాసనలుండియే తీరును.

కర్మాశయ మంతయు నేకభవికము గాదు. అందును నియత విపాకముగల కర్మాశయమే యేకభవికము. కర్మాశయము నియత విపాకము గలదియనియు, ననియత విపాకము గలది యనియు రెండు విధములు. నియతవిపాకము గలది యనగా తప్పక ఫలమును గలిగించి తీరునది. అనియత విపాకమనగా ప్రతిబంధకాదులు లేకున్న ఫలమును గల్గింపజాలినది. ఏదేని ప్రతిబంధకము ఫలమును కలిగింపకుండునది. కాగా నదృష్ట జన్మ వేదనీయ మగు నియతవిపాక కర్మాశయము మాత్రమే యేకభవికము. అనగా నీకర్మాశయము తప్పక ఫలము గల్గింపవలసి యున్నది గావునను, అదృష్టజన్మ వేదనీయము గాన, నుత్తరజన్మ సాధనము గాన, నిట్టి కర్మలన్నియు మరణకాలమున నొకటిగగూడి యుత్తరకాలికమగు నొక్క జన్మమును మాత్రము గలిగించి తాము క్షీణించును.

అదృష్టజన్మ వేదనీయమునందును అనియతవిపాక కర్మాశయమునను నేకభవికత్వ నియమము వర్తింపదు. అదృష్టజన్మ వేదనీయానియత విపాక కర్మాశయమును మూడుతెరగుల విభజింపవచ్చును. 1.ఫలము నీయకయే నశించు కర్మాశయము. 2. ప్రధానకర్మతోడ గలిసియే ఫలప్రదము గాజాలిన కర్మాశయము. 3. నియతవిపాకముగల ప్రధాన కర్మచే నిరోధింపబడి ఫలము నీయజాలక చాలకాలమట్లె యుండు కర్మాశయము, ఇందు మొదటి దానికుదాహరణము తపోవేదాధ్యయనాది శుక్లపుణ్యకర్మలచే నంతకుముందే చేయబడిన కృష్ణ (పాప) కర్మ తన యశుభఫలము నొసంగకయే నశించును గాన నిది తొలుతటి యనియత విపాకకర్మాశయము.

**''ద్వే ద్వే హ వై కర్మణీ వేదితవ్యే పాపకస్యైకో రాశిః పుణ్యకృతోఽపహన్తి తదిచ్ఛస్వ కర్మాణి సుకృతాని కర్తు మిహైవ తే కర్మ కవయో వేదయన్తే॥''**

అని యిట్లు శ్రుతియందును పురుషులు పుణ్యపాప రూపమున ద్వివిధములగు కర్మలు గలవని యెరుగవలయు ననియు, నందు పుణ్యకర్మ సంచయము పాపసంచయము నణచి వేయుననియు, నందుచే నీలోకమే కర్మార్హమని విజ్ఞానులు తెలుపుచుండిరి గాన నీలోకముననే సుకృతకర్మలనే యాచరింప బూనుము అని తెలుపబడెను. కాగా నీశ్రుతిచే పుణ్యశుక్లకర్మ యుత్పన్నమైనంత మాత్రముననే పాప (కృష్ణ) కర్మమును పుణ్యాపాప మిశ్రితకర్మమును నశించిపోవునని తెలుపబడియెను.

రెండవది యనియతవిపాకము, యజ్ఞములోజేయు పశువిశసనము మొదలగునవి. తనంతట తాను దుఃఖరూపఫలము నొసగజాలక యజ్ఞ జన్యస్వర్గాది సంబంధముగనే ఫలము నొసంగును. జ్యోతిష్టోమాది కర్మలచే లభించు స్వర్గమున సయితము హింసాపాప జన్యమగు దుఃఖముగూడ వెన్నంటియే యుండును. ఈ విషయమునకై సాంఖ్యాచార్యుడగు పంచశిఖాచార్యుని వాక్యమును భాష్యకారు లుదాహరించిరి.

**''స్యాత్ స్వల్పస్సంకరః స పరిహారః స ప్రత్యవమర్షః,**
**కుశలస్యనాపకర్షా యాలం కస్మాత్? కుశలం హి మే బహ్వన్యదస్తి**
**యత్రాయమావాపం గతః స్వర్గేఽపి అపవర్గ మల్పం కరిష్యతి॥''**

ఇది పంచశిఖాచార్యుని వాక్యము. అనగా జ్యోతిష్టోమాది జన్యమగు ధర్మము హింసాజన్యమగు కొద్దిపాపముచే మిశ్రిత మైనదియు గాన స్వల్ప సంకర మనంబడును. ఆపాపసాంకర్యము ప్రాయశ్చిత్తముచే నివర్తించును గాన సపరిహార మనబడును. మఱియు నా ప్రాయశ్చిత్తము ప్రమాదవశమున సరిగా జేయబడకున్న నాపాపమునకు ఫలమగు దుఃఖము స్వర్గముననను సహింప వలసి యుండును గాన ప్రత్యవమర్ష మనియు చెప్పబడును. ఈ హింసాజన్య పాపఫలము కొద్దిది గాన నత్యధికమగు యజ్ఞఫలమును బొత్తుగ తగ్గింప జాలదు. ప్రధానమగు స్వర్గరూప ఫలములో నీ హింసా జన్యపాపఫలము కలసి స్వర్గఫలములో గొంతకొంత దుఃఖానుభవమును గలిగించియే తీరును అని భావము.

మూడవదియగు ననియత విపాకమెట్లన్న- ప్రబలమగు పుణ్యకర్మజన్య భోగము జరుగు సమయమున పాపకర్మ యూరకయుండుట లేక ప్రబలమగు పాపకర్మజన్య ఫలానుభవము జరుగుచుండు సమయమున పుణ్యకర్మమూరక యుండుట, అదృష్టకర్మ వేదనీయ నియతవిపాక కర్మలకే మరణ మభివ్యంజక మనియు, నపుడన్ని కర్మలు నభివ్యక్తములై యుత్తరజన్మ రూపఫలమును గలిగించునని చెప్పియుంటిమి. అదృష్ట జన్మ వేదనీయ మగు ననియత విపాక కర్మాశయమునకు మరణ మభివ్యంజకము గాదు. ఏలనన ననియత విపాకకర్మ ప్రబలమగు నితరకర్మచే నశింపనైన నశించును. ప్రధానకర్మతో నా పాపము నొంది యస్వతంత్ర మైయేని పోవును. నియతఫలప్రదమగు ప్రబలకర్మచే నిరోధింపబడి యేనియు స్వసమానమై యభివ్యంజకమను మరియొక కర్మ తనకు సహాయపడు నంతవరకు నట్లే యుండిపోవును. కాని యేకర్మము ఏదేశమున, నేకాలమున, నేకర్మవిరోధము లేక, యే కర్మసహాయమున ఫలించునో తెలియరానిది కాన కర్మగతి విచిత్రమైనదనియు దుర్విజ్ఞేయ మైనదనియు జెప్పబడును.

కాగా సర్వకర్మలును కలసి యొక జన్మను గలిగింపజాలవు. కాన నేకభవికమతము నియతవిపాక స్థలముననే గ్రహింపబడుటచే ననియత విపాకస్థలమున సంభవింపదు గావునను, సామాన్య విశేషన్యాయముచే నేకభవిక మతముగూడ నంగీకరింపవలయును. ఇచట నేకభవికమతము సామాన్యము. అయ్యది యనియత విపాకస్థలములలో సంభవింప కుండుటచే విడువబడి యనేకభవిక మతము గ్రహింపబడెను. కాన నియతవిపాక స్థలమున నేకభవి కత్వము సమ్మతమే.

అవ- ఇంతవరకును క్లేశములు కర్మలకు మూలము లనియు, కర్మలు విపాకములకు మూలకారణము లనియు చెప్పబడినది. కాన నింక విపాకములు వేనికి మూలకారణము లగునదియు దెలుపబడుచున్నది.

**సూ॥ తే హ్లాదపరితాపఫలాః**

**పుణ్యాపుణ్యహేతుత్వాత్॥ 14**

తే, హ్లాద పరితాప ఫలాః, పుణ్యాపుణ్య హేతుత్వాత్.

తే=ఆ జన్మము, ఆయువు, భోగమునను మూడు విపాకములును, పుణ్యాపుణ్య హేతుత్వాత్=పుణ్యాపుణ్యములవలన గలిగినవి గాన, హ్లాదపరితాప ఫలాః=సంతోషదుఃఖములే ఫలముగా గలవి.

జన్మాయుర్భోగ రూపవిపాకములు ఈ పుణ్యకర్మలచే కొన్నియు పాపకర్మలచే మరికొన్నియు గలుగును గాన నిందు పుణ్యకర్మలచే నేర్పడిన విపాక మానంద దాయకముగ నుండును. పాపకర్మలచే నేర్పడిన జన్మాది విపాకము దుఃఖరూపమగు ఫలము నొసగును. పాపకర్మజన్యమగు జన్మాదివిపాకము దుఃఖప్రదము గాన నెవ్వరున్ను పాపకర్మలు చేయరు. అట్లే యోగి యగువాడు విషయసుఖము ననుభవించు సమయముననే యా సుఖములలో సయితము సుఖప్రతికూలమగు దుఃఖ మనుభవగోచర మగును గాన సుఖఫలప్రదమగు జన్మాదికములు గూడ విసర్జించును.

అవ-విషయసుఖముల ననుభవించు సమయముననే దుఃఖాను సంధాన మెట్లు గలుగును? అను శంకానిరాసమునకై విషయసుఖములకు దుఃఖరూపత్వమును దెలుపుచున్నారు.

## సూ॥ పరిణామతాపసంస్కారదుఃఖైర్గుణ వృత్తివిరోధాచ్చ దుఃఖమేవ సర్వం వివేకినః॥ 15

పరిణామతాప సంస్కార దుఃఖైః, గుణవృత్తివిరోధాత్, చ, దుఃఖం, ఏవ, సర్వం, వివేకినః॥

వివేకినః=ప్రకృతిపురుషవివేకము గల యోగికి, పరిణామతాప సంసార దుఃఖైః=పరిణామదుఃఖముచేతను, తాపదుఃఖముచేతను, సంస్కార దుఃఖము చేతను, గుణవృత్తివిరోధాత్ చ= సత్త్వాదిగుణ నిష్ఠము లగు సుఖదుఃఖాది రూప వృత్తులకు పరస్పర విరోధమువలనను సర్వం= సకల విషయసుఖమును గూడ, దుఃఖమేవ=దుఃఖరూపమే.

పరిణామ దుఃఖాదులచే మిళితము గావునను, సత్త్వాదిగుణ వృత్తులకు పరస్పరవిరోధమువలనను, విషయసుఖము లన్నింటిని వివేకవంతుడు దుఃఖములుగనే తలంచును.

పరిణామదుఃఖ మనగా అందరికిని పత్నీపుత్ర గృహారామాది రూప చేతనాచేతనములద్వారా సుఖానుభవము గలుగుచుండును గదా! కాన సుఖప్రదములగు వానియం దన్నింటియందును రాగ మవశ్యముండి తీరవలయును. కాన నీపై సుఖానుభవము రాగానువిద్ధము, అనగా రాగ సహితమే. రాగమనునది రజోగుణపు కార్యము గాన సుఖసాధనములగు పుణ్య పాపములందు పురుషుని తప్పక ప్రవర్తింపజేయును. కాగా సుఖానుభవ సమయమునందు సయితము రాగము పుణ్యపాప ప్రవర్తకము గాన పుణ్యపాపహేతు వయ్యెను.

ఇట్లే సుఖానుభవ సమయమున దుఃఖసాధనముల యందు ద్వేషము కలుగును. కాన ద్వేషము సయితము అకార్యమున పురుషుని ప్రవర్తింప జేయుచు పాపకారణ మగును. అట్లే దుఃఖసాధనములను దొలగించుకొన జాలనిదగు మోహము కర్తావ్యాకర్తవ్యములను మరపించి యనర్థప్రవృత్తు నొనర్చును గాన మోహము గూడ పాపహేతువే యగును. మరియు ప్రాణిహింసనము నొనర్పక దృశ్యప్రపంచ భోగము సంభవింపదు గాన హింసయు కాయిక పాపహేతు వయ్యెను.

సుఖానుభవకాలమునందు రాగద్వేషమోహ హింసాదు లుండుటచే తప్పక గలుగుబోవు పాపజన్మదుఃఖమునే పరిణామదుఃఖమని యనవలసి యున్నను, ఈపరిణామదుఃఖమునకు కారణమగు విషయసుఖమునే కార్య కారణముల కభేదోపచారవశమున పరిణామ దుఃఖమని వివేకవంతులు తలతురు, కావుననే యీపాదమునే అయిదవ సూత్రమున విషయ సుఖమును సుఖమని తలచుట యవిద్య యని తెలుపబడి యున్నది.

ఎల్లరకును సుఖరూపముగ గోచరించు విషయసుఖమును సుఖము

కాదని తలచుట యోగికి తగినదే యైనను అవిచారిత రమణీయమగు విషయసుఖము నందతని కాదర మిసుమంతయు లేదు గాన నతడు దానిని దుఃఖమనియే తలచును. తేనెయు విషము గలిసిన భక్ష్యము దినుట కందరకును రుచిగనే యుండినను ఆ రహస్యము నెరిగిన వివేకు లద్దానిని పరిణామమున దుఃఖప్రదమని యెరింగి త్యజించు విధమున యోగియు తత్కాల రమణీయములగు విషయసుఖముల నాగామి ధర్మాధర్మోత్పాదనము గుండ దుఃఖకరములు గాన హేయములుగ నెంచును.

ఈ విషయమే భగవద్గీతలో-

**విషయేంద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥** (18-38)

అని విషయేంద్రియ సంసర్గమువలన తొలుత నమృతమువలె దోచి కడకు విషపరిణామము నొందునది రాజససుఖము అని చెప్పబడెను.

ఓయీ! విషయోపభోగమే సుఖమన్నచో మీరు పైజెప్పిన శంకలు రావచ్చును. కాన విషయోపభోగ విషయమున నింద్రియములకు గలుగు తృష్ణ యుపశమించుటచే నింద్రియములు విషయములయందు బ్రవర్తింప కుండుటయే (శాంతియే)సుఖమనియు, విషయోపభోగ విషయమున నిద్రియములకు దృప్తి గలుగకుండుటచే నింద్రియములు లోలములై విషయములకు బారుటయే దుఃఖము అని నిర్వచించితిమేని యిపుడు భోగవిషయకమగు తృష్ణయే దుఃఖమని తేలును. కాన విషయ భోగము తృష్ణను (దుఃఖమును) శాంతి నొందించుటకు సాధనము మాత్రమగును. కాన నిట్టి తృష్ణాశాంతి పరిణామమున దుఃఖజనకము గాజాలదు గదా! యని శంకింపకుడు.

విషయోపభోగములు తృష్ణాశాంతికి కారణము లనుచో పైవిషయము నంగీకరింపవచ్చును. కాని భోగముల నభ్యసించుకొలదియు విషయతృష యింద్రియముల కతిశయించుటయే గాక వానికి లోలుపత్వమును గూడ

పెరుగును. కావుననే-

**న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।**
**హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥**

అందురు. అనగా నభీష్టవస్తువుల ననుభవించుటచే నెన్నటికిని విషయతృష్ణ చల్లారదు. మరియేమన నాజ్యము హవిస్సుచే నగ్ని హోత్ర మంతకంతకు పెద్దదగు నట్టులది మేరమీరి పెరుగుచుండును అని భావము. కాన విషయోపభోగము తృష్ణను హెచ్చించునే గాని తగ్గింపదు. కాన భోగాభ్యాసము సుఖసంపాదనోపాయము గాదు. కాన విషయభోగముల నభ్యసించి విషయతృష్ణ నడచివేయదలచిన యతడు తేలుపోటునకు భయపడి పాముకాటున కెర యగునటుల నపారమగు దుఃఖపంకమున దగుల్కొనును.

ఈ పరిణామదుఃఖము యోగికే విషయసుఖానుభవకాలమున గూడ ప్రతికూలముగనుండి దుఃఖప్రద మగును. ఏలనన నతడు విషయ సుఖానుభవ సమయమునందు గూడ నీ సుఖము ననుభవించిన తరువాత దుఃఖము తప్పక రాగలదని విచారించుచునే యుండును. ఇతరుల కావిచారములేదు. కాన వానికి సుఖానుభవ సమయమున దుఃఖమును గలుగదు. తాపదుఃఖము అనగా- విష యానుభవ కాలముననే సుఖసాధనములు పూర్ణముగా లేకుండుటచే జిత్తమున గలుగు పరితాపము అనగా తహతహపాటు.

సుఖానుభవ కాలమున రాగోరిన సుఖములు సమృద్ధిగ లేవని సుఖవిరోధులగు పదార్థములపై ద్వేషము గలుగును గాన జిత్తమున గలుగు భేదమే తాపదుఃఖము కాన నిందు ద్వేషముచే నకార్య ప్రవృత్తి యేర్పడును. కాన నధర్మ మేర్పడును. మరియు సుఖసాధనములను సేకరింప గోరుచు కాయిక వాచిక మానసిక చేష్టల మూలమున గొందరి ననుగ్రహించుటచేతను, మరికొందరిని హింసించుట చేతను ధర్మా ధర్మముల సంపాదించును. ఇందు ననుకూలజనులను సుఖలోభముచే ననుగ్రహించును గావునను, విరోధులను మోహముచే హింసించును గావునను లోభమోహములచే సయిత మీ

తాపదుఃఖము గలుగునని యెంచునది.

పరిణామదుఃఖము వివేకవంతునకు మాత్ర మెరుకబడునంత సూక్ష్మముగా నుండును. తాపదుఃఖ మన్ననో సామాన్య భోగపురుషునకు సయితము భోగకాలమున దెలియదు. ఇదియే యీరెండు దుఃఖములకును వైలక్షణ్యము. మరియు దాపదుఃఖములో పరిణామదుఃఖ మనువర్తించియే యుండునని యెరుంగునది.

సంస్కార దుఃఖమనగా సుఖానుభవముచే సుఖసంస్కారమును, దానిచే సుఖస్మరణమును, దానిచే సుఖమునందు రాగమును, రాగముచే కాయిక చేష్టాదుల మూలమున పుణ్యాపాపకర్మలయందు ప్రవృత్తియు, ప్రవృత్తిచే పుణ్యాపాపకర్మలు, వీనిచే పునర్జన్మద్వారా సుఖాద్యనుభవము, అనుభవముచే మరల సంస్కారము మొదలగునవి గలుగును. ఈ విధమున సుఖానుభవముచే గలిగిన సుఖస్మరణాదికము సుఖసంస్కార దుఃఖమనియు, నిట్లే దుఃఖాను భవముచే దుఃఖసంస్కారమును, తత్సంస్కారముచే దుఃఖస్మృతియును తత్స్మృతిచే దుఃఖమునందు ద్వేషమును, ద్వేషముచే కాయికచేష్టాదుల ద్వారా పుణ్యాపాప కర్మవృత్తియు, తత్ప్రవృత్తిచే తత్తత్కార్తలు, వీనిచే పునర్జన్మద్వారా మరల దుఃఖాద్యనుభవము, దుఃఖానుభవముచే మరల సంస్కారము మొదలగునవియు గలుగును. కాననిది దుఃఖసంస్కారమని చెప్పబడెను.

కాగా సంస్కార దుఃఖము సుఖసంస్కారదుఃఖము, దుఃఖసంస్కార దుఃఖమునని రెండు విధములుగా నుండును. ఇట్లు పుణ్య పాప కర్మలవలన సుఖదుఃఖవిపాకము లనుభూతములగు కొలదియు గర్మాశయ మంతకంతకు వృద్ధి జెందుచుండును.

ఈ సంస్కారదుఃఖము, పరిణామ దుఃఖమునం దంతర్భూతము గావలసియున్నను గోబలీవర్దన్యాయమున ననగా నెద్దుసయితము గోవులలో చేరియే యున్నను ఇవి గోవులు; ఇది యెద్దు అని విశేష ధర్మమును పురస్కరించుకొని వ్యవహరించు విధమున నీ దుఃఖమునందును సంస్కార

పరంపరచే ననంతదుఃఖములను ప్రతిపాదించుటకై వేరుపరచబడెను.

ఇట్లనాది కాలప్రస్పృమర మగు దుఃఖప్రవాహము వివేకయుక్తులగు యోగులకే ప్రతికూల మగుటచే వారినే పీడించును; భోగులను పీడింప జాలదు. తత్త్వవేత్తయగు యోగి యక్షిపాత్రకల్పుడు. అనగా నేత్రగోళమువలె సూక్ష్మ జ్ఞానము గలవాడు. మిగుల సన్ననిదగు సాలీనిదార మేనియు నేత్రగోళము చొచ్చెనేని దాని స్పర్శము నేనియు నేత్రగోళము సహింపజాలదు. ఇతరావయవములయం దది పడినచో నేమాత్రము వ్యథ లేకుండుట యటుండ తత్స్పర్శజ్ఞానము సయిత మేర్పడదు. ఇట్లే పైముప్విధములగు దుఃఖములు నక్షిగోళతుల్య సూక్ష్మగ్రాహియగు యోగినే పీడించును గాని భోగిని పీడింపవు. భోగియగు మనుజున కాధ్యాత్మాది స్థూలదుఃఖములే దుఃఖములుగా నెరుకపడును గాని విషయోపభోగ కాలమున సయితమున్న సూక్ష్మ దుఃఖములు మాత్రము గోచరింపవు. స్వకర్మార్జితములై పలుమరు ప్రాప్తము లగువానిని విడచుచు, పలుమరు విడచి వానిని మరల గ్రహించుచు, ననాదివాసనా విచిత్రమగు నవిద్యారూప చిత్తవృత్తిచే చుట్టుముట్టబడి, హేయమగు నాత్మభిన్నవస్తువునం దహంకార మమకార ములు పాదుకొలిపి, పలుమరు పుట్టుచుండు భోగి నాధ్యాత్మి కాధిభౌతి కాధిదైవికరూప త్రిపర్వములగు స్థూలతాపములు మాత్రమే పీడించును.

కాన నిట్లనాది దుఃఖప్రవాహమున గొట్టుకొనిపోవుచున్న తన్ను ప్రాణి జాతమును జూచి యోగి సకల దుఃఖనాశకమగు సమ్యక్జ్ఞానమును శరణము నొందును

పై విధమున పరిణామ దుఃఖాదులతో గలసియున్నందుచే విషయ సుఖము దుఃఖరూపమైన విధముగనే గుణవృత్తులు పరస్పర విరుద్ధములు గావునను విషయసుఖము దుఃఖరూపమే. ప్రఖ్యారూపమగు సత్త్వమున కును, ప్రవృత్తిరూప రజస్సునకును, స్థితిరూపమగు తమోగుణమునకును వరుసగా కార్యములగు శాంత, ఘోర, మూఢ, చిత్తవృత్తు లొక్కొక్కటియు త్రిగుణా త్మకమే యగును. కాని శాంతవృత్తియందు సత్త్వగుణ మధికము గావునను,

రజస్తమములు సహాయకారులుగా మాత్రమున్నందునను, శాంతవృత్తి సత్త్వమునకు కార్యమని వ్యవహరింపబడుచున్నది. ఇటులే ఘోరమూఢ వృత్తుల యందును రాజసతామస వ్యవహారము తత్తత్ప్రాధాన్యముచేతనే గాని యందును దక్కిన రెండుగుణముల యనుగ్రహ ముండితీరినది. కాగా సుఖోపభోగరూపమగు శాంత చిత్తవృత్తియందును దుఃఖవిషాదములును గలసియున్నవని యంగీకరింప వలయును. కాగా సత్త్వగుణ ప్రధానమగు శాంతరూప సుఖవృత్తియందు సయితము రాజసమగు దుఃఖము తామసమగు విషాదము గలసియున్నచో విషయ సుఖమంతయు సహజముగ దుఃఖరూప మని నిరూపింపకయే తెలియుచున్నదిగదా!

శాంతవృత్తి కొంతకాలమని వర్తించియుండెడి పక్షమున దానిని సుఖరూపమున దాని గుణవృత్తులు దీపశిఖలవలె చంచలములు గాన చిత్తము వే వేగముగ మారుచుండును. కావునను శాంతవృత్తికి స్థిరత్వమే గలుగదు గాన దుఃఖవిషాదసంబంధ మనివార్యము.

రూపాతిశయము లనబడుచు బుద్ధిధర్మములగు ధర్మాధర్మాదులును వృత్త్యతిశయములును పరస్పరము విరోధభావము నొందును. కాని సామాన్య ముగ నుండునని యతిశయముగ నుండువానితో విరోధము నొందక యప్రధానముగ వానితో గలసియే యుండును. అనగా నొక యుదారా వస్థాపన్నమగు విశేషధర్మము మరియొక యుదార విజాతీయ విశేషధర్మముతో గలసియుండుట విరోధించును గాని సామాన్యావస్థలో నుండు ధర్మముతో గలసియుండుట విరుద్ధము గాదు. ఎట్లనగా ఫలోన్ముఖముగ నుండుటచే ప్రబలమగు నొకధర్మము అట్టి తుల్యబలము గల యధర్మముతో గలసియుండుట విరోధించునే గాని ఫలోన్ముఖము గాని యధర్మముతో గలసియుండిన నెట్టి విరోధమును లేదు. ఇట్లే సుఖానుభవ కాలమునందు సాత్త్వికి శాంతివృత్తి యుదారావస్థ నొందిన దుఃఖవృత్తికి విరోధి యగునేగాని సూక్ష్మముగనేని విచ్ఛిన్నావస్థ నొందియేని యున్న దుఃఖవృత్తితో విరోధ భావము నొందదు. అనగా పరస్పరము అట్టి వృత్తులు కలసియుండుట

సమంజసమే యగును.

ఈ విధమున నీసత్త్వాదిగుణములు పరస్పరము కలసియే యుండును గాన తత్తత్కార్యము లన్నియు సుఖదుఃఖ మోహస్వరూపములుగనే యుండును. కాని యింతమాత్రము వానిలో భేదముండును. సుఖభోగ సమయమున దుఃఖమోహములు గౌణములు. అనగా నప్రధానములుగ నుండును. సుఖము ప్రధానముగ నుండును. ఇట్లే దుఃఖభోగ సమయమున సుఖమోహములు గౌణములుగను, దుఃఖము ప్రధానముగ నుండును. ఇట్లన్నియు సుఖదుఃఖ మోహాత్మకములేయై గుణప్రధాన భావమును విశేషమును మాత్రము గలిగియుండును. కావున వివేకవంతుడగు వానికి విషయసుఖములు గూడ దుఃఖరూపములే యనుట సుస్పష్టము. కాన పూర్వము చెప్పినరీతిని పరిణామతాప సంస్కారదుఃఖముతో గూడినది గాన నౌపాధిక దుఃఖశబలితమై గుణవృత్తుల పరస్పర వైరుద్ధ్యమువలన స్వాభావిక దుఃఖసంవృతమగు విషయసుఖమును యోగి వదలిపెట్టవలయును.

దుఃఖసముదాయరూపమై విషయసుఖమను పెనుదుఃఖమున కవిద్యయే మూలకారణము గాన నవిద్యయే తొలుత నశింపవలయును. అట్లవిద్య సమూలముగ నశించుటకు తత్త్వజ్ఞానమే సాధనము, తత్త్వజ్ఞానము యోగాంగముల ననుష్ఠించినచో గలుగును గావునను, ఆ యోగాంగ పరిజ్ఞానము యోగశాస్త్రముచే గలుగును. కాన పరమోపకారియగు యోగశాస్త్రము ముముక్షువుల కుపాదేయము.

ఇట్లు పరమోపకారక మగు యోగశాస్త్ర మాయుర్వేదశాస్త్రమువలె నాల్గువిభాగములు గలిగియుండును. అనగా నాయుర్వేద శాస్త్రమున 1.రోగము,2. రోగనిదానము, 3.రోగనివృత్తిరూపమగు నారోగ్యము, 4.రోగనివృత్తి సాధనమగు నౌషధము నను నాల్గుభాగము లున్నటుల నీ యోగశాస్త్రమునందుగూడ, 1.సంసారము (హేయము) 2.సంసార కారణము (హేయహేతువు). 3. మోక్షము (హానము), 4.మోక్షోపాయము (హానహేతువు) నను నాల్గు విభాగము లున్నవి.

ఇందు దుఃఖబహుళమగు సంసారము హేయము. ప్రకృతిపురుష సంయోగ మీహేయమునకు గారణము. ప్రకృతి పురుషసంయోగము బొత్తుగ లేకుండ నివర్తించుట హానమనబడును. ఇదియే మోక్షము. హానమునకు (మోక్షమునకు) ఉపాయము తత్త్వజ్ఞానము (సమ్యగ్దర్శనము).

ఇందు ప్రకృతి పురుషసంయోగ నివృత్తిరూపమై కైవల్య మని చెప్పబడు హానము ప్రకృతి పురుషసంయోగాభావరూపము గావునను, యోగమతమున నభావము పదార్థాంతరము గాక యధికరణ స్వరూపముగాన నీహానము సంసారహానము నొనర్చు పురుషుని స్వరూపమే గాని వేరొండు గాదు. కాన కైవల్య ముపాదేయముగాని హేయము గానిగాదు. తనకన్న భిన్నమగు వస్తువు గ్రహణత్యాగములకు దగియుండును గాని తనస్వరూప మేమాత్రమును గ్రహణ పరిత్యాగములకు ననువుపడదు గదా!

ఆత్మస్వరూపము హేయమని యంగీకరించితిమేని యోగాచార మతమునందువలె నాత్మాభావమే మోక్షము గావలసివచ్చును. కాన నాత్మోచ్ఛేద వాదము ప్రసక్త మగును. యోగాచార మతస్థులు నీలపీతాది రూపములచే విలక్షణములును, క్షణికములునగు జ్ఞానముల పరంపరయే బంధమనియు, నా జ్ఞానప్రవాహము దీపము చల్లారిన విధమున నశించుటయే మోక్షమనియు క్షణికవిజ్ఞానమే యాత్మ యనియు చెప్పుదురు.

ఆత్మస్వరూప ముపాదేయమని యంటిమేని మాధ్యమికుల మతము నందువలె హేతువాదము ప్రసక్తమగును. మాధ్యమికులు నీలరూపాది జ్ఞానప్రవాహాభ్యాసముచే నివృత్తిపూర్వక విజ్ఞాన ప్రవాహము గలుగు ననియు నా విజ్ఞానప్రవాహమే మోక్షమనియు చెప్పుదురు. వీరి మతమున క్రొత్త ప్రవాహ మొకటి కారణపూర్వకముగ నుదయించునని చెప్పుటచే నిది హేతువాద మనబడును.

ఇందు ఆత్మోచ్ఛేద వాదమున త్యాగము భేదాధీనము గాన, నాత్మయందు భేదము పొసగదు గావునను, స్వనాశము పురుషార్థము గాదు గావునను

మరణింపదలచిన యతడు సయితము దుఃఖనాశమునకై యగ్ని ప్రవేశాదుల యందు ప్రవర్తించునేగాని యాత్మనాశనమునకు ప్రవర్తింపడు గానను, యోగాచారుల యాత్మోచ్ఛేదవాదము మంచిది కాదు. అట్లే నీలరూపాది జ్ఞానప్రవాహాభ్యాసముచే గలుగు విజ్ఞాన ప్రవాహమే మోక్ష మను మాధ్యమిక మతమునందు సయితము మోక్షము జన్యమగుటచే నశ్వరమగును గాన హేతువాదము సయితము నిరాకరణీయమే.

కావున నాత్మస్వరూపము హేయోపాదేయము కాదంటిమేని శాశ్వత వాదము సిద్ధించును. ఇదియే సమ్యగ్దర్శనము.

అవ॥ ఇట్లీశాస్త్రము చతుర్భాగయుతమని చెప్పి తద్విభాగములను క్రమముగ దెలుపబోవుచు నందు తొలుత హేయమును నిరూపించు చున్నారు.

## సూ॥ హేయం దుఃఖమనాగతమ్ ॥ 16

హేయం, దుఃఖం, అనాగతమ్.

అనాగతం= రాబోవు, దుఃఖం= దుఃఖము, హేయం= త్యజింప దగినది.

గడచిపోయిన దుఃఖము అనుభవించుటచేతనే నశించునది గాన నట్టి గతదుఃఖము హేయదుఃఖములలో చేరదు. మరియు వర్తమాన కాలపు దుఃఖము ప్రకృత క్షణమున భోగారూఢ మైనది. కాన పైక్షణమున నశించునుగాన నదియు హేయకోటిలో చేరదు. ఉండినదానినే త్యజింప వలయును. కాని నశించిన దానిని ద్యజించుట యెట్లు సరిపడును?

కావున ననాగతమగు (భూతవర్తమాన భిన్నమగు) దుఃఖము మాత్రమే నేత్రగోళమువలె సూక్ష్మ జ్ఞానముగల యోగిని పీడించునేగాని సామాన్యజనుని పీడింపజాలదు. కాన వివేకవంతునకు ననాగత దుఃఖమే హేయమైనది.

అవ॥ ఇట్లుహేయమును నిరూపించి యట్టి హేయమునకు గారణ మును దెలుపుచున్నారు.

## సూ॥ ద్రష్టృదృశ్యయోః సంయోగో హేయహేతుః॥

ద్రష్టృదృశ్యయోః, సంయోగః, హేయహేతుః.

ద్రష్టృ దృశ్యయోః = ద్రష్టయగు పురుషునియొక్కయు, దృశ్య మగు ప్రకృతి యొక్కయు, సంయోగః = అవివేకకృత పరస్పర సంబంధము, హేయహేతుః = హేయమగు సంసారమునకు గారణము.

అవివేకముచే ననాదిగా దలపబడుచున్న ప్రకృతిపురుషుల పరస్పర సంబంధమే సంసారము. లేక సంసార దుఃఖమునకు ముఖ్యకారణము. పైసూత్రమున ద్రష్టయనగా బుద్ధిప్రతిసంవేదియగు పురుషుడు. పురుషుడు బుద్ధియందు ప్రతిబింబించి బుద్ధ్యాకారమును ధరించును గావునను, లేక తన ప్రతిబింబవశమున బుద్ధిని చేతనతుల్యముగ నొనర్చును గావునను బుద్ధి ప్రతిసంవేది యనంబడును. దృశ్యము లనగా బుద్ధిసత్త్వోపారూఢములగు నిఖిలధర్మములు, ఇంద్రియములగుండా బుద్ధిగ్రహించు పదార్థము లన్నియు, లేక అహంకారమూలమున బుద్ధినుండి యుత్పన్నములగు నఖిలతత్త్వము లును బుద్ధితత్త్వోపారూఢములని చెప్పబడును, కాగా బుద్ధికి విషయములు గాకయు బుద్ధితత్త్వమునకు కార్యములు గాకయు నుండు పదార్థమే లేదుగాన దృశ్యపదముచే నిఖిల ప్రకృతికార్యములును గ్రహింపబడును.

ఇట్టి దృశ్యపదార్థము సూదంటురాయి సామీప్యమాత్రముననే యినుపముక్క నాకర్షించు విధమున సన్నికర్షమాత్రముననే జ్ఞానరూపుడై స్వామియగు పురుషునకు, దృశ్యముగాన స్వమ(ధనము)గుచు నుపకార మొనర్చును. అనగా పురుషుని భోక్తగా నొనర్చి తాను భోగ్యముగా నేర్పడును. మరియు పురషుని యనుభవమునకు, కర్మకును విషయమ్మై చైతన్యభిన్నమగు స్వరూపమున లబ్ధస్థితిక మగు నీ దృశ్యము స్వతంత్రమయ్యు పురుషుని ప్రయోజనము నొడగూర్చునుగాన పరతంత్ర మగును.

కాగా పురుషార్థప్రయోజకమగు ప్రకృతిపురుషుల స్వస్వామిభావము లేక దృగ్దృశ్యభావము, లేక భోగ్యభోక్తృభావ మనబడు ననాది సంబంధమే

సంసారమునకు లేక సంసార దుఃఖమునకు కారణము.

ఇట్లే పంచశిఖాచార్యులును ''తత్సంయోగ వివర్జనాత్స్యాదయ మాత్యన్తికో దుఃఖప్రతీకారః'' అనగా ప్రకృతిపురుష సంయోగమును వర్జించి నచో దుఃఖమున కత్యంత ప్రతీకార మేర్పడును అని చెప్పిరి. ఇచ్చట ప్రకృతి పురుష సంయోగమును దుఃఖహేతువుగను, వర్జించుట దుఃఖ ప్రతిక్రియగా జెప్పుటచే ప్రకృతి పురుష సంయోగమే దుఃఖకారణమని తేలుచున్నది. లోకమున దుఃఖహేతువగు వస్తువునకు ప్రతిక్రియ గనుగొను విధమున నిచట దుఃఖహేతువగు ప్రకృతిపురుష సంయోగమునకును ప్రతిక్రియను గమనింప వలయును. అనగా అరికాలు భేద్యము. ముల్లు అరికాలిని భేదించునది. ముల్లుపై కాలుంచకుండుట గాని, చెప్పులు తొడిగికొని ముల్లుపై కాలుంచుట యేని తద్దుఃఖమునకు ప్రతీకారము. ఇట్లు భేద్యభేదక భేదన ప్రతీకారములను మూడింటి నెరింగి ప్రతిక్రియ నారంభించు నతడు త్రిత్వవేది గాన కాలున ముల్లు గ్రుచ్చుకొనుటవలని దుఃఖము నొందుడు. అట్లే పరమార్థ విషయ మున గూడ సత్త్వగుణ ప్రధానమగు బుద్ధి తాప్యము, రజోగుణము బుద్ధికి తాపజనకము, ప్రకృతిపురుష సంయోగ వివర్జనము, లేక వివేక ఖ్యాతి తాపమునకు ప్రతీకారము, కాగా తాప్యతాపకతాప ప్రతీకారములను మూడింటి నెరిగి వివేకఖ్యాతి రూపమగు తాపప్రతీకారము నభ్యసించు నాతడు ప్రకృతి పురుష సంయోగజన్యమగు దుఃఖమును బొందడు.

తాప మనునది క్రియ గాన తనకు (తాపక్రియకు) కర్మ యగు బుద్ధియందే యుండును. కాని పరణామ రహితుడును క్రియారహితు డునగు పురుషుని యందుండదు. పురుషుడు దర్శితవిషయుడు మాత్రమే. ఇంద్రియముల మూలమున విషయములను గ్రహించి వానిని ప్రతిబింబ రూపుడగు చేతనుని యందర్పించుట బుద్ధికి స్వభావము, దీనినే విషయ సమర్పణము, లేక విషయనివేదనము అందురు. ఇట్లు బుద్ధిచే విషయ సమర్పణ మొనర్పబడును. కాన పురుషుడు దర్శితవిషయు డనబడును. ఈ విషయము సమాధిపాదము నాల్గవసూత్రమున వివరింపబడినది. బుద్ధియే

నిజముగ దపింపబడుచున్నను దర్శిత విషయత్వమను నుపాధిచే బుద్ధ్యా కారమున దోచు పురుషుడు తాను తపించుచున్నటుల దలచును.

కాగా బుద్ధిరూపమగు నుపాధివశమున పురుషుడు తాప్యుడు. ప్రకృతి పురుషసంయోగము తాపకము. వివేకఖ్యాతి యిందులకు బ్రతీకారము అని తేలినది.

అవ॥ నిఖిల దుఃఖములకు కారణమగు దృగ్దృశ్య సంయోగమునందలి దృశ్యవస్తు స్వరూపమును దెలుపుచున్నారు.

## సూ॥ ప్రకాశక్రియాస్థితిశీలం భూతేంద్రి యాత్మకం భోగాపవర్గార్థం దృశ్యమ్॥ 18

ప్రకాశక్రియాస్థితిశీలం, భూతేంద్రియాత్మకం, భోగాపవర్గార్థం, దృశ్యమ్.

ప్రకాశక్రియాస్థితిశీలం= ప్రకాశశీలమును, క్రియాశీలమును, స్థితిశీలమును, భూతేంద్రియాత్మకం= భూతములు నింద్రియములును కార్యముగా గలదియు, భోగాపవర్గార్థం= భోగమోక్షములు ప్రయోజనముగా గలదియు నగు గుణత్రయమే, దృశ్యమ్= దృశ్యమని చెప్పబడు చున్నది.

గుణత్రయము దృశ్యము. ఇందు సత్త్వగుణము ప్రకాశశీలము, రజోగుణము క్రియాశీలము, తమోగుణము స్థితిశీలము. ఇది గుణ స్వరూపము, పురుషునకు భోగమోక్షములు గలిగించుట కాభూతేంద్రియ రూపమున బరిణమించిన సత్వరజస్తమో గుణములే దృశ్య మనబడును.

ప్రకాశస్వభావము గల సత్త్వగుణమును, క్రియాశీలమగు రజో గుణమును, స్థితిశీలమగు తమోగుణమును వివేకఖ్యాతి యుదయింపని పురుషునితో సంయుక్తము లగును గావునను, వివేకఖ్యాతి యుదయించిన పురుషుని నుండి విభక్తము లగును గావునను, సంయోగ విభాగధర్మ శీలములై, భిన్నధర్మములు గలవయ్యు నొండొకటి నాశ్రయించి లబ్ధసత్తాకములైన దాన నొకటి యంగిగ నున్నప్పుడు తక్కినవి యంగము లగుచు, నిట్లంగాంగ

భావము గలిగి యుండియు వేరువేరు శక్తులు గలిగి ప్రధాన గుణమునకు దుల్యజాతీయవమును, అప్రధాన గుణముల కతుల్యజాతీయయము నగు శక్తిభేదము ననుసరించి, తమతమ ప్రాధాన్యసమయయము నందుదూద్భూత వృత్తికములై యప్రధానకాలమున సహకారిరూపమున ప్రధానమునం దంతర్గతములై యనుదూద్భూతవృత్తికము లగును గాన ననుమేయములై, పురుషార్థ కర్తవ్యత్వముచే నేర్పడిన సామర్థ్యము గలవియై సన్నిధి మాత్రముచేతనే పురుషున కుపకారకములుగాన నయస్కాంతమణి సదృశ ములై, యొక్క ప్రధాన గుణమును తక్కినవి యనువర్తించుచు ప్రధానమను శబ్దముచే వ్యవహరింపబడును. ఇట్లు త్రిగుణాత్మకమగు ప్రధానము దృశ్య మనబడును

ఈ దృశ్యము స్థూలభూతములగు పృథివ్యప్తేజో వాయ్వాకాశ రూపముగను, సూక్ష్మ భూతములగు పృథివ్యాది తన్మాత్రారూపముగను స్థూలేంద్రియములగు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణ వాక్పాణి పాదపాయూపస్థ మనోరూపముగను, సూక్ష్మేంద్రియములగు మహదహంకార రూపముగను పరిణమించును. కాన నీ ప్రకృతి భూతేంద్రియాత్మక మయ్యెను.

ఇట్లు ప్రకృతి భూతేంద్రియ రూపమున పరిణమించుట నిష్ప్రయోజనము గాదు. పురుషునకు భోగమోక్షములు లభింపజేయుటయే యీ ప్రకృతి పరిణామమునకు ప్రయోజనము. పురుషుడు తాను గుణములకన్న భిన్నుడనని యెన్నక గుణాత్మకమగు బుద్ధియందలి సుఖ దుఃఖములను, నిష్టానిష్టధర్మములను తనవి యని నిశ్చయించుకొనుట భోగ మనబడును. గుణములకన్న వేరుగ తనస్వరూపము నేర్పరచు కొనుటయే మోక్షము. పై భోగాపవర్గములు దప్ప వేరొండు ప్రయోజన మీప్రకృతి పరిణామమునకు గలుగదు.

పంచశిఖాచార్యులును **"అయం తు ఖలు త్రిషు గుణేషు కర్తృషు, అకర్తరి చ పురుషె తుల్యాతుల్యజాతీయె చతుర్థే తత్క్రియాసాక్షి ణ్యుపనీయమానాన్ సర్వభావానుపన్నానుపశ్యన్నదర్శన మన్యచ్ఛంకతే"** అనగా నీమూఢమానవుడు

యథార్థముగ త్రిగుణాత్మకమగు బుద్ధి కర్త యగుచుండగా త్రిగుణభిన్నుడు గాన నాల్గవవాడై కర్తృత్వము లేకయు నవివేకముచే కర్తననుకొనును గాన ప్రకృతికి తుల్యజాతీయుడై, పరిణామరహితుడు గాన ప్రకృతికి నతుల్యజాతీయుడై, క్రియాసాక్షి యగు నాత్మయందు బుద్ధి సమర్పితములగు సుఖదుఃఖాది సర్వభావములను స్వాభావికములుగ దలచి జ్ఞానమాత్రుడగు చేతనుడు బుద్ధికన్న భిన్నుడని తలంపడు అని చెప్పిరి. దీనిచే గుణస్వరూపముగ పురుషు నెంచుటయే భోగమని యేర్పడినది.

భోగాపవర్గములు బుద్ధికృతములు గాన బుద్ధియందుండుట యుచితమే గాని పురుషునియందు వ్యవహరించుట యనుచితముగ దోచినను, జయపరాజయములు యోధులవియే యైనను ఫలభోక్త గావున స్వామియగు రాజునకు జయము గలిగినదనియ, పరాజయము గలిగినదనియు వ్యవహరించు విధముననే ఫలభోక్త గాన స్వామి యగు చేతనునియందు బుద్ధిగతములగు బంధమోక్షములు సయితము వ్యవహరింపబడును. భోగాపవర్గరూపమగు పురుషార్థము పరిసమాప్తము కాకుండుటయును బంధమును, పరిసమాప్త మగుటయను మోక్షమును, బుద్ధికే గలుగును గాని పురుషునికి యథార్థమున బంధమోక్షములు లేవు. ఇట్లనుటచే గ్రహణ ధారణోహాపోహ తత్త్వజ్ఞానాభినివేశములు బుద్ధినిష్ఠములే యయ్యు దత్ఫల భోక్త యని పురుషుని యందారోపింపబడునే గాని యథార్థముగ లేవు.

అవ॥దృశ్యగుణముల స్వరూపమునం దవాంతర భేదములను తెలుపు చున్నారు.

## సూ॥విశేషావిశేషలింగమాత్రాలింగాని గుణపర్వాణి॥

విశేషావిశేషలింగమాత్రాలింగాని, గుణపర్వాణి॥

విశేషావిశేషలింగమాత్రాలింగాని = విశేషము, అవిశేషము, లింగమాత్రము, అలింగము ననునవి, గుణ పర్వాణి = గుణములకు పర్వములు, అనగా చెరకునకు గణుపులవలె గుణముల యవస్థా విశేషములు.

1. విశేషము, 2. అవిశేషము 3. లింగమాత్రము, 4. అలింగముననునాలుగును చెఱకునకు విభాగ ప్రదర్శకములగు గణుపుల వలె గుణముల విభాగమును దెలుపు నవస్థా విశేషములు.

అందు (1)విశేషములు: 1.ఆకాశము, 2.వాయువు, 3.అగ్ని, 4.ఉదకము, 5.భూమి యను భూతము లైదును అవిశేషము లనబడు పంచతన్మాత్రలకు విశేషములు. అట్లే 1.శ్రోత్రము, 2.త్వక్కు, 3.చక్షుస్సు, 4. జిహ్వ 5. ఘ్రాణముననను జ్ఞానేంద్రియము లైదును. 1.వాక్కు, 2.పాణి. 3.పాదము, 4.పాయువు, 5. ఉపస్థ యను కర్మేంద్రియములైదును ఉభయేంద్రియమగు మనస్సును మొత్తము పదునొకండింద్రియములును అవిశేష మనబడు నస్మిత (యహంకారమున)కు విశేషములు. ఇట్లు పంచభూతములు, నేకాదశేంద్రియములును గలసి పదునారును శాంత, ఘోర, మూఢ,రూప, విశేషధర్మములతోడ గూడి గుణముల విశేషపరిణామములు గాన విశేషము లనబడును.

(2)అవిశేషములు: 1.ఏకలక్షణమగు శబ్దతన్మాత్రము, 2.ద్విలక్షణమగు స్పర్శతన్మాత్రము. 3.త్రిలక్షణమగు రూపతన్మాత్రము, 4.చతుర్లక్షణమగు రసతన్మాత్రము, 5.పంచలక్షణమగు గంధతన్మాత్రము అను పంచ తన్మాత్రలును, ఈ తన్మాత్రలకు గారణమగు నస్మిత (యహంకారము) యు గలసి యారు నవిశేషములు. ఇందు తన్మాత్రలలో పూర్వపూర్వ తన్మాత్రలలో గలసియే యుత్తరోత్తర తన్మాత్ర లుండును గాన, శబ్దతన్మాత్ర మొంటరిగా నుండును గాన నేకలక్షణమనియు. శబ్దతన్మాత్రానుగతముగనే స్పర్శతన్మాత్ర ముండును. కాన స్పర్శతన్మాత్ర ద్విలక్షణమనియు., నిట్లు త్రిలక్షణ చతుర్లక్షణ పంచలక్షణములు చెప్పబడెను. ఇట్లు పంచతన్మాత్రలు నహంకారమును, శాంతాది ధర్మ విశేషములు లేనివిగాన నవిశేషము లనబడును. తన్మాత్ర శబ్దములోని మాత్రపదము శాంతాది ధర్మవిశేషములనే వ్యవచ్ఛేదించుచున్నది. ఇట్లే విష్ణు పురాణములో

**తన్మాత్రాణ్యవిశేషాణి అవిశేషాస్తతో హి తే ।**

**న శాంతా నాపి ఘోరాస్తే న మూఢాశ్చావిశేషిణః ॥**

అనగా శాంతఘోరమూఢావస్థలను విశేషధర్మములు లేనివి గావుననే పంచతన్మాత్రలు అవిశేషములని చెప్పబడును అని తెలుపబడెను. ఈ యారును భోగాపవర్గ రూపపురుషార్థ క్రియాసమర్థ మగుటచే సత్తా మాత్రమగు మహత్తత్త్వమున కవిశేషరూప పరిణామములు. మహత్తత్త్వ మీ యవిశేషములకు పరమై కారణమాత్రమై యుండును. శబ్దతన్మాత్రాద్య విశేషము లారును సత్తామాత్రమగు మహత్తత్త్వమున సూక్ష్మరూపమున నణగియుండి పంచభూతాది కార్యోత్పాదన ద్వారమున స్థూలరూపముచే నత్యంతాభివృద్ధి ననుభవించును.

మరియు లయోన్ముఖావస్థలో సయితము సత్తామాత్రమగు మహత్తత్త్వమునందే సూక్ష్మరూపమున నణగినవియై సత్తారహితమయ్యు (సత్తయనగా పురుషార్థసంపాదనము, అదిలేనిది యయ్యు) అసత్తారహితమై (అసత్తయనగా శూన్యత్వము, అదియు లేనిదై) సత్తుగాకయు నసత్తుగాకయు (సత్తనగా స్థూలకార్యము, అసత్తనగా సూక్ష్మ కారణము కాగా కార్యకారణ భావరహితమై) నిరసత్తై(భావపదార్థవిశేషమై) యవ్యక్తమై కారణహితము గాన నలింగమైన ప్రధానమున లీన మగును.

3. లింగమాత్రము ఈ విశేషషట్కమునకు కారణభూతమై మూల ప్రకృతికి తొలుతటి పరిణామమగు మహత్తత్త్వము లింగమాత్రమని చెప్పబడును.

4. అలింగము మహత్తత్త్వమునకు గారణభూతమై నిస్సత్తాసత్త పదవాచ్యమై గుణసామ్యావస్థారూపమగు ప్రధాన పరిణామమే యలింగ మనబడును. గుణముల సామ్యావస్థ గుణములకన్న భిన్నముగా నిరూపింప శక్యమగును గాన, ప్రధానమును అలింగ పరిణామమని యనిరి గాని యథార్థముగా నిది గుణకార్యము గాదు. కాననే యీ యవస్థను నిత్యమని భాష్యకారులు తెలిపిరి. మరియు కపిలమునియు **సూ॥ మూలే**

**మూలాభావాదమూలం మూలమ్॥ (అ.1.సూ.67)** మూలప్రకృతికి మరియొక కారణము లేదు గాన నది యజన్యము అని తెలిపిరి.

గుణముల యలింగావస్థయందు పురుషార్థము కారణము గాదు. కాన నజన్యమగు నాయవస్థ (మూలప్రకృతి) నిత్యము, మరియు విశేషావిశేష లింగమాత్రములను నవస్థాత్రయము పురుషార్థకృతము గాన ననిత్యము.

అనగా శబ్దాది స్థూలవిషయము లుత్పన్నము లైననే పురుషునకు భోగము గలుగునను నియమము లేదు. స్థూలవిషయములు మహదాది తత్త్వముల మూలమున నుత్పన్నము లగును గాన విశేషావిశేషలింగ మాత్రములు మూడును పురుషార్థ ప్రయుక్తములే గాన (మహదాదు లేర్పడిన యంతనే పురుషునకు భోగార్హత గలదు గాన నవియన్నియు) ననిత్యములే. అలింగమను ప్రధానము మాత్రము పురుషార్థ ప్రయుక్తము గాదు గాన నిత్యము.

పై నాల్గు విధములగు పరిణామములలో ననుగతమగు గుణములు మూడును గూడ యథార్థమున నశింపవు. అట్లే జనింపవు. కాని యతీతానాగత నాశోత్పత్తి శీలము లగుచు గుణాన్వితములగు మహత్తత్త్వాది వ్యక్తుల ద్వారా యుత్పత్తివినాశశీలములుగ గోచరించుచుండును. దేవదత్తుని యధీనమున నున్న యావులు జచ్చినచో దేవదత్తుని దరిద్రు డందుము. ఆవులు చచ్చిన దాన దేవదత్తునియందు దారిద్ర్యము నారోపింతుము గాని యతనికి నిజముగా స్వరూపహాని యేమాత్రమును గలుగలేదు గదా! అట్లే మహత్తత్త్వాదుల యుత్పత్తి నాశములనుబట్టి గుణములయం దుత్పత్తినాశముల నారోపింతుమేగాని యథార్థముగ నవి జన్యములు గాని నశ్వరములు గాని కావనుట సంగతమే.

ఈశాస్త్రమున సత్కార్యవాదము గ్రహింపబడినది గాన నిదివరకున్న వస్తువే ప్రకాశ మగునని వీరి తాత్పర్యము గావునను, ప్రథమ కార్యమగు లింగమాత్రము (మహత్తత్త్వము) ఉత్పన్నమగుటకు పూర్వమే యలింగ మన

బడు ప్రధానములో సూక్ష్మరూపమున నణగియుండి సృష్టికాలమున ప్రధానము (మూలప్రకృతి)నుండి విడివడును. ఇంతియేగాని యిది తొలుత లేకుండి క్రొత్తగా గలిగినది గాదు. ఇట్లే యవిశేషము లారును లింగమాత్రము (మహత్తత్త్వము)న సూక్ష్మరూపమున నంతకుముం దణగియే పరిణామ క్రమమున నభివ్యక్తము లగును. అట్లే విశేషములగు భూతేంద్రియ రూపషోడశ వికారములును, అవిశేషము లారింట నంతకుముందు సూక్ష్మరూపమున నణగియుండియే బయలుపడును. ఈ విషయ మీసూత్రవివరణ ప్రారంభము ననే దెలుపబడెను.

ఈ షోడశ వికారములును పూర్వతత్త్వ విలక్షణములగు తత్త్వాంతము లను గలిగింపవు గాన వీనియం దెవ్వియు నణగియుండలేదు. వీనినుండి యేవియు నభివ్యక్తములు గావు.

వానికి తత్త్వాంతర పరిణామము లేకున్నను. 1.ధర్మము, 2.లక్షణము, 3.అవస్థ యను మూడు పరిణామములు మాత్రము గలవని విభూతి పాదమున పదమూడవ సూత్రమున నెరిగింపబడును.

అవ॥ ఇట్లింతపట్టు దృశ్యమును నిరూపించి యిక ద్రష్టృ స్వరూపనిశ్చయమున కారంభించుచున్నారు

## సూ॥ ద్రష్టా దృశిమాత్రః శుద్ధోఽపి ప్రత్యయానుపశ్యః ॥ 20

ద్రష్టా, దృశిమాత్రః, శుద్ధః, అపి, ప్రత్యయానుపశ్యః॥

దృశిమాత్రః = చేతనమాత్రుడు అనగా జ్ఞానస్వరూపుడగు పురుషుడు, ద్రష్టా = ద్రష్ట యనబడును, (అతడు) శుద్ధః అపి = జ్ఞానాధారుడుగాన శుద్ధుడే యైనను, ప్రత్యయానుపశ్యః = బుద్ధిధర్మమగు జ్ఞానము ననుసరించి జ్ఞానాధారుడని చెప్పబడును.

పురుషుడు జ్ఞానస్వరూపుడే యైనను తాను బుద్ధిదర్పణ ప్రతిబింబి

తుడై యాబుద్ధికి ధర్మమగు జ్ఞానమున కాధారమయిన వాడువలె దోచును. చైతన్యప్రతిబింబమును గ్రహించు బుద్ధి విషయాకారమున పరిణతమై జ్ఞానాధార మగును గాన నా బుద్ధితో నేకీభవించిన పురుషుడుగూడ జ్ఞానమున కాధార మయినట్లు తోచును.

పురుషుడు లయోదయ శీలములను విశేషణముతో గూడని కేవలచైతన్యమే. మరియు నతడు బుద్ధిదర్పణమున ప్రతిబింబించిన వాడేగాన బుద్ధికి సమానరూపుడును మిగుల విభిన్న రూపుడును గాదు గాన బుద్ధికన్న విలక్షణుడు. బుద్ధికి విషయములగు ఘటాదు లొకసమయమున జ్ఞాతము లగును. మరియు నొకపు డజ్ఞాతము లగును గాన బుద్ధిజ్ఞాతాజ్ఞాత విషయ మగునుగాన పరిణామశీలము. పురుషునకు విషయమగు బుద్ధితత్త్వము పురుషున కెల్లయపుడు జ్ఞాత మగుచునే యుండును. కాన పురుషుడు జ్ఞాతవిషయు డగుచు నపరిణామి యగును. మరియు ప్రలయాదులయందు పురుషునకు విషయమగు బుద్ధివృత్తియే లేనందున, పురుషుడు సదా జ్ఞాతవిషయుడు కాని యట్లు తోచినను, శబ్దాదికము లొకే సమయమున బుద్ధికి జ్ఞాతాజ్ఞాతము లగు విధమున గాక కాలభేదమున ననగా ప్రలయాదు లందజ్ఞాత విషయు డైనను పురుషుడు విషయ మున్నంతవరకును, జ్ఞాతవిషయుడే గాన నపరిణామి యగును.

మరియు క్లేశకర్మవాసనా విషయేంద్రియాదులతో గలసియే భోగాప వర్గములకు సాధన మగును గాన బుద్ధి పరార్థ మైనది. పురుషు డన్ననో స్వార్థ పరుడు, మరియు బుద్ధి శాంతఘోర మూఢాకారమున బరిణతమై శాంతఘోర మూఢపదార్థ విషయ కాధ్యవసాయశీల మగుటచే త్రిగుణము నచేతనము నగును. పురుషుడో గుణముల కుపద్రష్ట మాత్రముగాన గుణాతీతుడును చేతనుడు నగును. ఇట్లు బుద్ధియు పురుషుడును విలక్షణులుగా నుందురు. కాన పురుషుడు బుద్ధికి సమానరూపుడు గాడు.

సమానరూపుడు గాకున్న బుద్ధికన్న మిగుల విరుద్ధమగు రూపము గల వాడని తలపరాదు. ఇతడు జ్ఞానాధారుడుగాక యుండియు, బుద్ధివృత్తి

రూపమగు జ్ఞానమును ఉపద్రష్ట యగుచు ప్రకాశింపజేయుచు బుద్ధివృత్తి రూపుడు గాకున్నను బుద్ధివృత్తిరూపమున దోచును. ఈ విషయమును పంచశిఖాచార్యులును

''అపరిణామినీ హి భోక్తృశక్తిరప్రతి సంక్రమా చ పరిణామిన్యర్థే ప్రతిసంక్రాన్తేవ తద్వృత్తిమనుపతతి తస్యాశ్చ ప్రాప్తచైతన్యోప గ్రహరూపయోః బుద్ధివృత్తే రనుకారమాత్రతయా బుద్ధివృత్త్యవిశిష్టా హి జ్ఞానవృత్తిరిత్యాఖ్యాయతే''

'అనగా' ''పరిణామ రహితుడగు భోక్తృశక్తిసంజ్ఞక పురుషుడు ఏ విషయముతోడను సంబంధింపడు గాన నిర్లిప్తుడుగనే యుండినను పరిణామ శీలమగు బుద్ధియందు ప్రతిబింబితుడై తదాకారమును బొందుటచే నాబుద్ధి వృత్తి ననుసరించును, మరియు చైతన్య ప్రతిబింబమును గ్రహించు నాబుద్ధి వృత్తి ననుకరించుటచే బుద్ధివృత్తితో నేకమగు చేతనుడే జ్ఞానవృత్తియని చెప్పబడును'' అని చెప్పిరి.

అవ॥ ఇట్లు దృశ్యద్రష్టలను తెలిపినపిదప స్వస్వామిభావ సంబంధమున కుపయోగించు దృశ్యనిష్ఠ పురుషార్థత్వమును దెలుపు చున్నారు.

## సూ॥ తదర్థ ఏవ దృశ్యస్యాత్మా ॥ 21

తదర్థః, ఏవ, దృశ్యస్య, ఆత్మా॥

దృశ్యస్య = పూర్వము చెప్పిన దృశ్యముయొక్క, ఆత్మా = స్వరూపము, తదర్థః ఏవ = ఆద్రష్టృభూత పురుషునికొరకే యగును.

జ్ఞానస్వరూపుడగు పురషునకు విషయమగు బుద్ధ్యాది దృశ్యముల స్వరూపము స్వార్థముకొరకు గాదు. పురుషునకు భోగాపవర్గరూప పురుషార్థ మును సంపాదించునుగాన పరార్థ మైనదియు శయ్యాసనాదుల వలె జడమగు నీదృశ్యము భోగాపవర్గములను పురుషున కొడగూర్చుటకే యేర్పడినది. మరియు తాజేయవలసిన భోగాపవర్గ రూపమగు ప్రయోజనము నొడగూర్చిన

యీదృశ్యము వివేకియగు పురుషున కదృశ్య మగును. అనగా సుఖాద్యనుభవ రూపభోగము, వివేకఖ్యాతిరూపమగు నపవర్గము నను రెండే దృశ్యమునకు బ్రయోజనములు గాన పురుషునకు స్వస్వరూపజ్ఞానము గలిగినతరి దనకు ప్రయోజనము లేదుగాన దృశ్యము లయమునొందును. ఏలనన, వివేకఖ్యాతి (అపవర్గము)యను కడపటి ప్రయోజనమును సాధించిన మీదట నింకొక ప్రయోజనము లేదు గాన దృశ్యవృత్తి యసంభవము.

అయినను వివేకిదృష్టికే దృశ్యము నష్టమయినట్లు దోచును గాన నవివేకుల దృష్టిచొప్పున దృశ్యముండితీరును గావునను వివేకిభిన్నులకు భోగాపవర్గములు గలుగుచుండుట వింత గాదు.

అవ॥ ఈ విషయమునే నిరూపించుచున్నారు.

## సూ॥ కృతార్థం ప్రతి నష్టమప్యనష్టం తదన్యసాధారణత్వాత్ ॥ 22

కృతార్థం, ప్రతి, నష్టం, అపి, అనష్టం, తత్, అన్యసాధారణత్వాత్॥

కృతార్థం ప్రతి= వివేకఖ్యాతి మూలమున కృతార్థుడగు పురుషునిగూర్చి, తత్= ఆదృశ్యము, నష్టమపి = నాశము నొందినదే యైనను, అన్యసాధారణత్వాత్ = వివేకిభిన్ను లందరికి సాధారణమైనది గాన, అనష్టం = అవివేకులకు నష్టము కానిది యగును. అనగా నుండియే తీరును.

దృశ్యమునకు భోగాపవర్గములే ప్రయోజనములు గావున నాభోగాప వర్గముల లొక్క పురుషునికొరకు మాత్రము గాక సకల పురుషులకొరకును ప్రవర్తించును గాన నొకనికి వివేకము గలిగి యాతని దృష్టిలో కృతకార్యమగు దృశ్యము నష్టమైనను, వివేకరహితులగు నితర పురుషుల దృష్టిలో దృశ్యము కృతార్థము గాదు గాన నష్టముగాక యట్లే యుండును. అనగా గ్రుడ్డివానికి రూపము గనబడని యంత మాత్రమున రూపమే నశించినదని చెప్పవీలుగాక చూపుగల వారందరికిని రూపము ప్రత్యక్ష మగుచునే యుండు విధమున

వివేకికి దృశ్య మనుపలబ్ధ మైనను వివేకహీనుల దృష్టిలో దృశ్యముపలబ్ధమే యగును. ఈ విషయమున శ్రుతియు-

**అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాస్సరూపాః।**
**అజో హ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః॥**

అనగా సత్త్వరజస్తమోరూపమై యనాదియై సమానరూపులగు బహుప్రజలను సృజించు నొక్కప్రకృతిని (దృశ్యమును) ఒకడగు బద్ధ పురుషుడు సేవించుచు సుఖదుఃఖాద్యనుభవము నొందును. ఇంకొకడగు వివేకి కృతార్థమగు ప్రకృతిని త్యజించును అని పురుషబహుత్వమును దృశ్యమునకు నిత్యత్వమును దెలుపుచున్నది. కాన దృశ్యము వివేక రహితులగు పురుషులకు విషయ మగుచు నాత్మచైతన్యముచే లబ్ధసత్తాక మగును. కాని బొత్తిగా నభావస్థితి నొందదు. కావుననే ప్రకృతి పురుషు లిరువురును నిత్యులు గాన వీరిరువురి సంబంధము సయిత మనాది యని చెప్పబడెను. ఇట్లే పంచ శిఖాచార్యులును **''ధర్మిణామనాది సంయోగాత్ ధర్మమాత్రాణామప్యనాది సంయోగః''** అనగా ధర్ములగు సత్త్వాది గుణములకు క్షేత్రజ్ఞులగు పురుషులతోడ ననాదిసంయోగ ముండుటం బట్టి ధర్మమాత్రములగు మహదాది తత్త్వములకును పురుషునితోడ సంయోగము నిత్యమే యని చెప్పిరి.

అవ॥ ఇట్లు స్వస్వామిభావ సంబంధమును నిరూపించి యిక దానిచే నేర్పడిన సంయోగమునకు స్వరూపమును దెలుపుచున్నారు.

## సూ॥ స్వస్వామిశక్త్యోః స్వరూపోపలబ్ధిహేతు స్సంయోగః ॥ 23

స్వస్వామిశక్త్యోః, స్వరూపోలబ్ధిహేతుః, సంయోగః.

స్వస్వామిశక్త్యోః=స్వశక్తి యనబడు బుద్ధికిని, స్వామిశక్తియనబడు పురుషునకును, స్వరూపోపలబ్ధిహేతుః, స్వరూపోపలబ్ధి=(ద్రష్టృ)దృశ్యముల స్వరూపము సిద్ధించుటకు, హేతుః=కారణభూతమగు సంబంధము, సంయోగః= సంయోగ

మనబడును.

పురుషునికొరకే ప్రవర్తించునది గాన దృశ్యము స్వశక్తి యని వ్యవహరింపబడును. దృశ్యముచే నొనగూడిన భోగాపవర్గములకు బాత్రుడు గాన పురుషుడు స్వామిశక్తి యనబడను. ఈ రెండింటికిని స్వస్వామి భావముచే నేర్పడిన యనాదిసంయోగముచే నవివేక మూలమున దృశ్యస్వరూపోపలబ్ధి యనగా సుఖదుఃఖాది విషయానుభవము భోగమనబడును. అట్లే వివేకముచే దృశ్యమునకన్న వేరగు ద్రష్టు స్వరూపము నెరుగుట యపవర్గ మనంబడెను. కాగా భోగాపవర్గములకు గారణమగు స్వస్వామిభావ సంబంధమే సంయోగమని యేర్పడినది.

ఈప్రకృతి పురుష సంయోగ మనాదియే గాని యనంతము మాత్రము గాదు. ఈసంయోగము వివేకఖ్యాతి యుదయించు నంతవరకే యుండును గాని యటు పిమ్మట నిలువదు. కావుననే వివేకదర్శనము (జ్ఞానము) వియోగమునకు గారణమని యెరిగింపబడెను. వివేకజ్ఞాన మవివేకమునకు విరోధిగాన నవివేకము ప్రకృతిపురుష సంయోగమునకు గారణమని చెప్పబడెను.

వివేక మవివేకమునకు విరోధి యని చెప్పుటచే వివేకజ్ఞాన మవివేకమును నశింపజేయునేగాని సుఖాది భోగరూపబంధ మోక్షమును గలుగజేయజాలదు. కాబట్టి జ్ఞానము సాక్షాత్తుగా మోక్షకారణము గాదు. మరి యజ్ఞానమును నివర్తింపజేసి దానిచే బంధనివృత్తి గలుగగా పరంపరా సంబంధముచే మోక్షకారణ మగును. అనగా అజ్ఞానము వదలిననే బంధము వదలును. అదియే మోక్షము. జ్ఞానము గలిగిననే బంధకారణ మగు నజ్ఞానము నశించును. కాన నీ పరంపరా సంబంధముచే కైవల్య కారణమని యోచించియే జ్ఞానము కైవల్యకారణమని చెప్పుదురు.

అదర్శనము (అజ్ఞానము, లేక అవిద్య అవివేకము) అనగా నేమి?

1.గుణముల కార్యారంభణ సామర్థ్యమా?

2.దృష్టిరూపుడును స్వామియు నగు పురుషునకు భోగాపవర్గములను సమర్పణ మొనర్చి నివృత్తాధికారమైన చిత్తమునకు పునరుత్థానము లేకుండుటయా? అనగా చిత్తమున భోగాపవర్గము లుండియు కనబడుటయే యదర్శనమా?

3.గుణములకు ప్రయోజనములగు భోగాపవర్గములు చిత్తమున సూక్ష్మావస్థతో నుండుటయా?

4. చిత్తోత్పత్తికి బీజభూతమై ప్రళయకాలమున చిత్తముతోడ గూడియే ప్రకృతిలో లీనమగు విపర్యయ జ్ఞానవాసనయా?

5.ప్రధానమునందలి ప్రళయకాలమునందు సామ్యావస్థకు కారణమగు స్థితి సంస్కారము నశింపగా సృష్టి కాలమున మహత్తత్త్వాద్యారంభకమగు గతి సంస్కారముయొక్క యభివ్యక్తియా? ప్రధానము నందలి సంస్కార ద్వయమును గూర్చి పంచశిఖాచార్యులును-

**ప్రధానం స్థిత్యైవ వర్తమానం వికారాకరణాదప్రధానం స్యాత్,**
**తథాగత్యైవ వర్తమానం వికారనిత్యత్వాదప్రధానం స్యాత్,**
**ఉభయథాచాస్య ప్రవృత్తిః ప్రధానవ్యవహారం లభతే నాన్యథా,**
**కారణాంతరేష్వపి కల్పితేష్వేవ సమానశ్చర్చః ॥**

అనగా-ప్రధానమనగా దేనిలో సూక్ష్మరూపమున నణగియుండి యుత్పన్నము లగునో, దేనిలో స్థూలవస్తువులు సూక్ష్మరూపమున నణగి పోవునోయది ప్రధాన మనబడును, ప్రధానము(ప్రకృతి)నందు స్థితిరూప సంస్కారమును మాత్రమంగీకరింతుమేని మహదాది వికారములను గలిగింప జాలదు. కాన ప్రధానము గాకపోవలసివచ్చును. అట్టని గతి సంస్కారమును మాత్రమంగీరించితిమా యెల్లపుడును వికారము లుండవలసివచ్చి ప్రళయమే లేకపోవును గాన నా పక్షమునను, ప్రధాన మప్రధానమే గావలసివచ్చును. కాన రెండు సంస్కారముల నంగీకరించితిమేని సూక్ష్మరూపమున నున్నవానిని సృష్టికాలమున బయలుపరచుటయు, స్థూలరూపమున నున్నవానిని ప్రళయ

కాలమున దనలో లయము చేసికొనుటయు సంభవించును గాన ప్రధానమను వ్యవహారము తగియుండును. కాని వేరొండు విధమున గుదరదు. కారణాంతరములగు బ్రహ్మపరమాణ్వాదులయందును సయిత మీరీతిగనే వితర్కింపవలయును. ఏతావతా ప్రధాన నిష్ఠమగు గతిసంస్కార వశమున మహదాది కార్యారంభమే యదర్శన మనబడునా? యని యైదవవికల్పము.

6.''ప్రధానస్యాత్మఖ్యాపనార్థా ప్రవృత్తిః'' యను శ్రుతిచే ప్రధానము కార్యారంభ ప్రవృత్త మగుట తన స్వరూపమును బోధించుటకే, నిఖిలపదార్థ జ్ఞానమునందు పురుషుడు సమర్థుడే యైనను ప్రధాన కార్యారంభము ప్రవృత్తము గాకముందు ప్రధానమును దెలిసికొనజాలడు. సర్వకార్యకరణ సమర్థమగు దృశ్య మతనికి గోచరము గాదు గాన ప్రధానము తానున్నటుల దెలియపరచుకొనుటకే కార్యారంభక మగునను నర్థము స్ఫురించుటచే ప్రధాన ప్రవృత్తిచే నేర్పడు పురుషుని దర్శనశక్తియే యదర్శనము,లేక యవిద్య, లేక యవివేకమని చెప్పబడునని యందుమా?

7.ప్రకృతి పురుషుల ధర్మమే (పరస్పర దర్శనశక్తియే) యదర్శనమని కొందరందురు. వాస్తవముగా దృశ్యము జడము గావునను, పురుషు డసంగుడు గావునను వీరిరువురికిని దర్శనము(జ్ఞానము) ధర్మముగా నుండజాలదు. అయినను చేతనుని ప్రతిబింబముచే దృశ్యము చేతనచ్ఛా యాపన్న మగును గాన దర్శనరూప చేతన ధర్మము గల దగును. బుద్ధిరూప దృశ్యమును బట్టి దర్శనము పురుష ధర్మమువలె గూడ నగును. అనగా ప్రకృతి పురుషులకు పరస్పరావివేకముచే దర్శన మనునది యిరువురకు ధర్మమగును అని వారి మతము. ఇది సరియా?

8.శబ్దాది విషయజ్ఞానమే యదర్శనము, లేక యవిద్య, లేక యవివేకమని యందురు.

ఇట్లే విద్యాస్వరూప నిరూపణ విషయమున ననేక విధముల శాస్త్రములయందు వికల్పింపబడెను. కాని యిందు నాల్గవది దప్ప యీ

వికల్పము లన్నియు సర్వపురుషులకును ప్రకృతి సంయోగమునకు గారణము లగును గాన నవిద్యకు సామాన్య లక్షణములు. అనగా నీ లక్షణములు ప్రకృతిపురుష సంయోగవశమున నిఖిల ప్రపంచకారణమగు నవిద్య యందుండినను ఒక్కొక పురుషునకు ప్రకృతి సంయోగ మూలమున సుఖదుఃఖభోగ వైచిత్ర్యమునకు గారణమగు నవిద్యా విశేషమునకు లక్షణములు గావు గాన, సామాన్య లక్షణములు మాత్రమే.

అవ॥ ఇంక సుఖదుఃఖాది హేతుభూతమగు ప్రత్యేక పురుష ప్రకృతి సంయోగమునకు కారణమగు నవిద్యను దెలుపుచున్నారు.

## సూ॥ తస్య హేతు రవిద్యా॥ 24

తస్య, హేతుః, అవిద్యా॥

తస్య=ఆ దుఃఖహేతువగు ప్రకృతి పురుష సంయోగమునకు, హేతుః=కారణ మగునది, అవిద్యా=విపర్యయజ్ఞానజన్యవాసన.

అనాదియగు విపర్యయ జ్ఞానజన్య వాసనయే యవిద్య యని చెప్పబడుచు విచిత్రసుఖదుఃఖాది హేతుభూతమగు ప్రకృతి పురుష సంయోగ విశేషమునకు గారణ మగును. బుద్ధివిపర్యయజ్ఞాన వాసనా వాసితమైన యపుడు వివేకఖ్యాతి యను నంతిమ కార్యావసానత్వమును బొందజాలదు గాన సాధికారమై ప్రకృతిలో లీనమయ్యును దన యధికార మును నెరవేర్చుకొనుటకు పునరావృత్తి గలది యగును. అట్లుగాక యా బుద్ధియే వివేకము గలుగుటచే విపర్యయజ్ఞానవాసన లేకున్నందున, పురుషఖ్యాతి పర్యవసానమై తనయంతిమ కర్తవ్యమును నెరవేర్చినది గాన సమాప్తాధికారమై యజ్ఞాన రహితమై బంధ (సంసార)కారణ మగు నజ్ఞానము లేనందున పునరావృత్తి గాదు.

ఇట్లు విపర్యయజ్ఞాన వాసనను నిరాకరించు వివేకజ్ఞాన ముదయించి నచో జ్ఞానప్రసాదమాత్రమగు పరవైరాగ్యము గలుగును. అపుడు పరవైరాగ్యముచే వివేకఖ్యాతిని నిరోధించుట మూలమున చిత్తనివృత్తి

రూపమగు మోక్షము లభించును. కావుననే విపర్యయజ్ఞాన నాశానంతరము బుద్ధి పునరావృత్తిరహిత మగునని చెప్పబడినది.

పై విషయమును గూర్చి నాస్తికు డొకడు నపుంసకుని వృత్తాంతము నుదాహరించి ఖండింపబూనును. ఒక ముద్దరాలు నపుంసకుడగు తన భర్తను ప్రశ్నించెను. ''ఆర్య పుత్రా! నాసోదరి బిడ్డల గనినదే! నేనేల గనకున్నాను?'' నపుంసకుడు నేను చచ్చిన తరువాత నీకు బిడ్డలను గలిగింతును'' అనియెను. ఇట్లే తా నుండినపుడే చిత్తవృత్తి నొనర్పజాలని వివేకఖ్యాతి(జ్ఞానము) పరవైరాగ్యముచే దాను నష్టమై చిత్తనివృత్తి రూపమోక్షమును గలిగించు ననుట యెంత యసంగతము కాన వివేకఖ్యాతి నష్టమై మోక్షమును గలిగించుట కల్ల యని నాస్తికవాదము.

ఈనాస్తికుని యాక్షేపమునకు సమాధానము నాచార్యకల్పు లొకరిట్లు జెప్పిరి. చిత్తనివృత్తి యనగా చిత్తమునకు భోగము వివేకఖ్యాతియు నను పరిణామములు గలుగకుండుటయే, అదియే మోక్షము. అనగా బంధకారణ మగు నజ్ఞానము లేకుండుటచే బుద్ధికి పరిణామములు గలుగకుండుటయే మోక్షమని భావము. బంధకారణమగు నజ్ఞానము తొలగి పోవలయు నన్నచో జ్ఞాన ముండవలయును. కాగా జ్ఞానముచే నజ్ఞాన నిరోధము, అజ్ఞాననివృత్తిచే బుద్ధికి భోగ వివేకఖ్యాతి రూపమగు పరిణామము గలుగకుండుట యను మోక్షము సిద్ధించును. కాన జ్ఞానము సాక్షాత్తుగా చిత్త పరిణామ నివృత్తికి గారణము గాదు. కాబట్టి నిరుద్ధమగు జ్ఞానము చిత్త నివృత్తికి కారణమని తలచి శంకించుట నాస్తికుల చిత్త విభ్రాంతి మాత్రమే.

ఇచట నాచార్యకల్పులు, బుద్ధి, లయము నొందకున్నను శబ్దాద్యా కారమున నది పరిణమింప కుండుటయే మోక్షమని తలంతురు. కాని సిద్ధాంతమున బుద్ధి విలయము నొందుటయే మోక్షము. ఈసిద్ధాంతమున గూడ జ్ఞానము మోక్షమునకు సాక్షాత్కారణము గాదు గాన తానున్నపుడే మోక్షమును గలిగింపజాలని జ్ఞానము నిరుద్ధమై యెట్లు సాధించునను శంకకే తావులేదు. మరి వివేకజ్ఞానము పరాకాష్ఠ నొంది నిరోధసమాధి భావనా

ప్రకర్షక్రమముగ చిత్తనివృత్తి మంతుడగు పురుషుని స్వరూపావస్థానమున కుపయోగించును.

అవ॥ఇంతవరకును హేయదుఃఖమును హేయకారణమగు ప్రకృతి పురుష సంయోగమును సకారణముగ వివరించి యింక హానమను మూడవవ్యూహమును నిరూపించుచున్నారు.

## సూ॥ తదభావాత్ సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యమ్॥ 25

తదభావాత్, సంయోగాభావః, హానం, తత్, దృశేః, కైవల్యమ్.

తదభావాత్ = ఆ యజ్ఞానము లేకుండుటవలన, సంయోగాభావః = ప్రకృతి పురుష సంయోగాభావము, హానం=హానమని చెప్పబడును, తత్ = అట్టి హానమే, దృశేః = జ్ఞాన రూపుడగు పురుషునకు, కైవల్యమ్ = కేవలరూపమగు మోక్షము.

అజ్ఞానము లేకపోవుటచే ప్రకృతి పురుష సంయోగరూప బంధనము బొత్తిగా లేకుండుటయే హానము. ప్రళయకాలమున ప్రకృతి పురుషులకు సంయోగము భగ్నమైనను సృష్టికాలమున మరల నుద్భూత మగును గాన నది పురుషార్థము గాదు. కావుననే బంధనము బొత్తుగా లేకుండుటయే హానమని చెప్పబడెను. ఇట్టి హానమే పురుషునకు కైవల్యము, కైవల్యమనగా పురుషుడు. గుణములతో సంయోగము నొందక కేవల మొంటరిగా నుండుట, కాగా దుఃఖకారణమగు సంయోగము నివర్తించినంతనే దుఃఖములు ఉపరతము లగును. అట్టి సమయమున బురుషుడు కేవలుడై స్వరూప ప్రతిష్ఠితు డగును.

అవ॥ఇంక హానప్రాప్త్యుపాయము నెరుకపరచుచున్నారు.

## సూ॥ వివేకఖ్యాతిరవిప్లవా హానోపాయః॥ 26

వివేకఖ్యాతిః, అవిప్లవా, హానోపాయః॥

అవిప్లవా = మిథ్యాజ్ఞాన రూపమగు నుపద్రవములేని, వివేకఖ్యాతిః = ప్రకృతి

భిన్నునిగా పురుషుని సాక్షాత్కరించుట, హానోపాయః = హానకారణమగు నవిద్యానివృత్తికి నుపాయము.

బుద్ధిసత్త్వము పురుషుడును వేర్వేరను ననుభవమే వివేకఖ్యాతి. వివేక ఖ్యాతియు మిథ్యాజ్ఞానముతోడ గలసియే యుండెనేని తత్కలుషిత మగును. అట్లుగాక మిథ్యాజ్ఞానము దగ్ధబీజభావము నొంది వంధ్యప్రసవమై కార్యకరణా సమర్థమగునేని క్లేశరూపపరాగము దులిపివేయబడి బుద్ధిసత్త్వమునకు మిగుల వైశారద్యము గలుగగా అనగా పరవశీకారసంజ్ఞ(యోగ 40-47)లోనున్న బుద్ధి సత్త్వమునకు వివేక జ్ఞానప్రవాహము కాలుష్య రహితముగ నగును. ఆగమాను మానముల మూలమున వివేకజ్ఞాన ముత్పన్న మైనను మిథ్యాజ్ఞాన జనితవ్యుత్థాన సంస్కారములను నివర్తింపజేయజాలదు.. శాస్త్రానుమానజన్య జ్ఞానశీలుని చిత్తమున మిథ్యాజ్ఞాన మూలకములగు బహిర్ముఖావస్థాజన్య సంస్కారములు నాటుకొనియే యుండును. కాన నట్టి యాగమాది జన్యవివేకము మిథ్యాజ్ఞాన మిశ్రితము గాన కలుషితము. ఆగమాది మూలమున వివేకమును గ్రహించి దీర్ఘకాలము నిరంతర భావనావశమున ప్రకృష్ట సమాధియందు సాక్షాత్కరించు ఋతంభరా ప్రజ్ఞయే మిథ్యాజ్ఞాన శూన్యమై యకలుషిత మైనది.

ఇట్లు వికృతమగు వివేకఖ్యాతి యవిద్యానివృత్తి ద్వారా హానమునకు ఉయమగును. అనగా వివేకఖ్యాతిచే మిథ్యాజ్ఞానము దగ్ధబీజ భావము నొంది కార్యకరణాసమర్థ మగును, గాన వివేకఖ్యాతి మోక్షమార్గమై హానమునకు వ్యవహితోపాయ మగును.

అవ॥ వివేకఖ్యాతినిష్ఠుడగు యోగికి లభించు ప్రజ్ఞనెరుక పరచుచున్నారు.

## సూ॥ తస్య సప్తధా ప్రాన్తభూమిః ప్రజ్ఞా॥ 27

తస్య, సప్తధా, ప్రాన్తభూమిః, ప్రజ్ఞా॥

తస్య = ఆ వివేకఖ్యాతిగల యోగికి, ప్రాన్తభూమిః = సర్వాధికమైన, సప్తధా =

ఏడు తెరగులగు, ప్రజ్ఞా = ప్రజ్ఞ లభించును.

రజస్తమోగుణ ప్రాబల్యమువలన నశుద్ధి సంజ్ఞకమై యావరణ రూపమగు మలము చిత్తమునకు సంభవించును, అట్టి యశుద్ధ్యావరణమల ముడుగుటచే రాజస తామస గుణ ప్రయుక్తములగు వ్యుత్థాన ప్రత్యయములు గలుగకుండగా నకలుషిత వివేకఖ్యాతి నిష్ఠుడగు యోగికి నేడు విధములగు ప్రజ్ఞలు గలుగును.

1. అందు దొలుతటి ప్రజ్ఞ:- **''పరిజ్ఞాతం జ్ఞేయం, నాస్య పునః పరిజ్ఞేయ మస్తి''** యని, అనగా హేయసంజ్ఞక సంస్కార మంతయు పరిణామ దుఃఖాదులతో గూడినది యని తెలియదగిన విషయమును చక్కగా దెలిసి కొంటిని, ఇక నీ హేయవిషయమున దెలిసికొనవలసిన దింకేదియు లేదు. అను భావము.

2. **''క్షీణాః హేయహేతవో న పునరేషాం క్షేతవ్యమ్''** అనియు, ననగా ''హేయమగు సంసారమునకు గారణములగు నవిద్యాది క్లేశము లన్నియు నశించినవి. కావుననే నిక వేటిని నశింపజేయ బనిలేదు.'' అను భావము.

3. **''సాక్షాత్కృతో నిరోధ సమాధినా హానం''** అనియు, అనగా ''నేనసంప్రజ్ఞాత సమాధిచే హానరూపమగు కైవల్యమును సాక్షాత్కరించితిని కనుక నింకొక దానిని నిశ్చయింపబనిలేదు'' అను భావము.

4. **''భావితో వివేకఖ్యాతిరూపహానోపాయః''** అనియు అనగా ''హానమను కైవల్యమున కుపాయమగు వివేకఖ్యాతిని నిష్పాదించితిని, కాన నింక నాకు నిష్పాదింపవలసిన దేదియును లేదు'' అను భావము.

ఇంతవరకు నీ నాలుగు తలంపులును కార్యములు అనగా ప్రయత్న సాధ్యములై ప్రజ్ఞకు గర్తవ్యపరిసమాప్తిని దెలుపును. మరియు నీ నాలుగు తెరగులగు ప్రజ్ఞలు లభించినంతనే తమంతట తామే ప్రయత్నము లేకయే చిత్తవిముక్తి రూపములగు తక్కిన మూడు ప్రజ్ఞలు లభించును. అనగా వెంటనే చిత్తపుటధికారము ముగిసిపోవును. ఇందు

1.భోగాపవర్గరూప పురుషార్థమును గలిగించినది గావు నా బుద్ధి సమాప్తాధికార మైనది. కాన దాని కిం కేమియు పనిలేదు అనుతలంపు. ఇది పరవైరాగ్యనాశమునకు తొలుతటి యవస్థ.

2.పర్వతశిఖరమునుండి దొరలిన రాళ్ళు నుగ్గుచందమున గుణములు సయితము చిత్తరూపమగు నాశ్రయము లేకుండుటచే నిరాధారములై కారణ ప్రకృతిలో లయము నొందబోవునవియై చిత్తము తోడగూడి యస్తమించెను. లయము నొందిన వీటిచే నేమియు ప్రయోజనము లేదు గాన నివి మరల నుద్భవింపవు అనుతలంపు. ఇది లింగశరీర విపశ్యదవస్థ యను రెండవ భూమిక.

3.ఈ యవస్థలో గుణసంబంధ విరహితుడై నిర్విషయచిజ్జ్యోతి స్వరూపుడై యౌపాధిక తమోమాలిన్యరహితుడై పురుషుడు కేవలుడు, జీవన్ముక్తుడు నగును. ఇయ్యది యాత్యంతిక లయనిష్పత్తి రూపమగు చరమభూమిక.

ఇట్లేడు విధములగు సర్వాధిక ప్రజ్ఞలను సాక్షిభావమున దర్శించు పురుషుడు కుశలు (లేక జీవన్ముక్తు) డనబడును. మరియు నసంప్రజ్ఞాత సమాధి మూలమున జిత్తమును ప్రధానమున లయింప జేసిన పురుషుడు గూడ కుశలుడు (ముక్తుడు) అనబడును. వీరిరువురును గుణాతీతులే గదా! కాని యసంప్రజ్ఞాత సమాధి మూలమున జిత్తలయము గల యోగిని విదేహముక్తు డందురు. ప్రజ్ఞాద్వారమున సమాప్తాధికారము గల చిత్తము గల యోగిని జీవన్ముక్తు డందురు. వీరిరువురకు నింతమాత్రము భేదము గలదు.

అవ॥ కైవల్యమునకు వివేకఖ్యాతి యుపాయము గాన నావివేకఖ్యాతి సిద్ధించుటకు సాధనమును దెలుపుచున్నారు.

**సూ॥ యోగాంగానుష్ఠానా దశుద్ధిక్షయే**
**జ్ఞానదీప్తిరావివేకఖ్యాతేః॥** **28**

యోగాంగానుష్ఠానాత్, అశుద్ధిక్షయే, జ్ఞానదీప్తిః, ఆవివేకఖ్యాతేః॥

యోగాంగానుష్ఠానాత్=యోగ = యోగమునకు, అంగ = అంగములగు యమనియమాదులయొక్క, అనుష్ఠానాత్ = అనుష్ఠించుటవలన, అశుద్ధిక్షయే = రజస్తమః ప్రయుక్తవిపర్యయ జ్ఞానరూపమలము నశింపగా, ఆవివేకఖ్యాతేః = వివేకఖ్యాతి గలుగువరకును, జ్ఞానదీప్తిః = సమ్యగ్జ్ఞాన మభివ్యక్త మగును.

యోగమునకు యమాద్యష్టాంగములు ముందు జెప్పబడును. వాని ననుష్ఠించు కొలదియు పంచపర్వమై యశుద్ధిరూపమగు విపర్యయజ్ఞానము తరుగుచుండును. విపర్యయజ్ఞానము తరుగు కొలదియు క్రమక్రమముగా సమ్యగ్జ్ఞానము పెరుగుచుండును. ఇట్లు జ్ఞానమంతకంతకు ప్రదీప్త మగుచు ప్రకృతి పురుషవివేకము గలుగుదనుక వృద్ధిజెందును. ఇచట యోగాంగానుష్ఠానము ఛేద్యమగు కాష్ఠపు వియోగమునకు గొడ్డలివలె విపర్యయ రూపాశుద్ధి వియోగమునకు గారణము. ఆ యోగాంగానుష్ఠానమే, ధర్మానుష్ఠానము సుఖప్రాప్తికింబలె వివేకఖ్యాతిప్రాప్తికి కారణము నగును. అంతియే గాని వేరు విధముగా కారణము గాదు.

శాస్త్రములయందు గారణము తొమ్మిది విధములుగా నిరూపింపబడి యున్నది.

ఃః।

**వియోగాన్యత్వ ధృతయః కారణం నవధా స్మృతమ్ ॥**

అనగా (1)ఉత్పత్తికారణము, (2)స్థితికారణము, (3)అభివ్యక్తి కారణము, (4) వికారకారణము, (5)ప్రత్యయకారణము, (6)ఆప్తి కారణము, (7)వియోగకారణము, (8)అన్యత్వకారణము. (9)ధృతి కారణము అని కారణములు తొమ్మిది.

1.ఇందుత్పత్తికారణమునకు ఉదా:-విజ్ఞానోత్పత్తికి కారణము మనస్సు. ఈ సత్కార్య వాదమతమున వర్తమానావస్థను వస్తువునకు గలిగించుటయే యుత్పత్తి చేయుట. కాగా మనస్సే జ్ఞానమున కతీతావస్థను

మాన్ని వర్తమానావస్థను గలిగించును గాన మనసు జ్ఞానమున కుత్పత్తి కారణము.

2. స్థితికారణమున కుదా:- పురుషార్థత మనస్సుయొక్క స్థితికి గారణము భోగాపవర్గరూప పురుషార్థము సంపాదితము కానంతవరకే మనస్సు స్థితమగును. పురుషార్థము సంపాదితమై సమాప్త మగుచో మనస్సు సమాప్తాధికార మై లీనమైపోవును. కాన పురుషార్థతయే మనస్సుస్థితికి కారణము. మరియు నన్నపాన రూపాహారము శరీరస్థితికి గారణము. అన్నపానములు లేక శరీరస్థితి యుండదుగదా?

3. అభివ్యక్తి కారణమునకు ఉదా:- దీపాద్యాలోకము రూపపు టభివ్యక్తికి గారణము. అలోకము (ప్రకాశము) లేకున్న రూపమున్నను అభివ్యక్తము గాదు. అట్లే రూపజ్ఞానము ప్రాతిస్విక (ప్రత్యేక) రూపాభివ్యక్తికి గారణము.

4. వికారకారణమున కుదా:- వనితాది విషయాంతరములు మనస్సు నకు వికారకారణము, మృకండు మహర్షిచిత్తము సమాధి నిష్ఠమయ్యు నుల్లోచానావ కాప్సరోవాదిత వీణాపంచమస్వర శ్రవణమున వ్యుత్థానా (బహిర్ముఖా)వస్థ నొందినదై కాంతాసక్త మయ్యెను, మరియు పచనార్హమగు తండులాదికమున కగ్ని వికారకారణము, అగ్నిచే పక్వమై తండులాదికము మృదుత్వాది వికారమును బొందును గదా?

5. ప్రత్యయకారణమున కుదా:- ధూమజ్ఞానము అగ్నియొక్క ప్రత్యయ (జ్ఞాన)మునకు గారణ మగును. పర్వతమున పొగను దెలిసికొని దానిచే వహ్నిని దెలుసుకొందుముగాదా!

6. ప్రాప్తికారణమున కుదా:- పూర్వము చెప్పిన విధమున యోగాంగా నుష్ఠానము వివేకఖ్యాతి ప్రాప్తికి గారణము.

7. వియోగకారణమున కుదా:- పూర్వము చెప్పిన యోగాంగా నుష్ఠానము విపర్యయ జ్ఞానరూపాశుద్ధి వియుక్త మగుటకు గారణము.

8. అన్యత్వ కారణమున కుదా:- స్వర్ణకారుని స్వర్ణపుట అన్యత్వమునకు గారణము. అనగా స్వర్ణకారుడు బంగారమును కుండలాద్యన్యరూపమున మార్చును గాన, నన్యత్వకారణ మయ్యెను. మరియు నటులే కామినీ విషయక జ్ఞానము ఒక్కదానిచే పరపురుషునకు గలుగు మనోహరతాజ్ఞాన రూపవిద్య మోహరూపముగాను, సపత్నికి గలుగు ద్వేషము దుఃఖరూపముగాను, ప్రియునికి గలుగు రాగము సుఖరూపము గాను, వివేకవంతులకు గలుగు తత్త్వజ్ఞానము మోహద్వేష రాగరహితమై యుదాసీనముగా నొనర్చును! కాన నవిద్యాద్వేషరాగ తత్త్వజ్ఞానములు స్త్రీ ప్రత్యయమున కన్యతాకారణములు.

9. ధృతికారణమున కుదా:-శరీర మింద్రియములను ధరించుటకు గారణము, శరీరములేక యింద్రియములు నిలువవుగదా! మరియు నటులే యింద్రియములు (పంచప్రాణములు) శరీరమునకు ధారకములు. ప్రాణములు లేనిచో శరీరపాతము సంభవించును గదా! ఇట్లే పృథివ్యాది పంచ భూతములు మనుష్యాది సకలశరీరములకు ధారకములు. ఆ పృథివ్యాది భూతములు నొకటి కొకటి ధార్యము ధారకము నగును. ఆకాశము వాయువునకు ధారకము. సుడిగాడ్పు ఛిద్రాకాశమునకు ధారకము. ఇట్లే యొండొంటిక ధార్యధారక భావము గలదు. ఇట్లే తిర్యఙ్మనుష్య దేవతలకును పరస్పరాశ్రయాశ్రయి భావము లేకున్నను నుపకార్యోపకారకత్వరూప ధార్యధారకత్వములు గలవు. **''దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః''** అను విధమున తిర్యగాది సాధనమున యజ్ఞము లొనర్చి మనుజులు దేవతల కుపకరింపగా వారు వృష్టి ద్వారమున తిర్యక్కులకు మనుజుల కుపకార మొనర్తురు గదా!

ఇట్లు తొమ్మిది విధములగు కారణములను యథా సంభవముగ నితర పదార్థములయందును సమన్వయించుకొనవలయును. ప్రకృతమున యోగాంగానుష్ఠానము మాత్రము వివేకఖ్యాతికి ప్రాప్తికారణమును, విపర్యయజ్ఞాన రూపాశుద్ధికి వియోగకారణము నగును. కాన రెండు విధములుగనే కారణ మగును.

అవ॥న్యూనాధికసంఖ్యానివారణార్థము యోగాంగములను నిర్ధారణము చేయుచున్నారు.

**సూ॥యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహార ధారణధ్యానసమాధయోఽష్టా వంగాని॥ 29**

యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధయః, అష్టౌ, అంగాని.

యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధారణధ్యాన సమాధయః = యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధి యను, అష్టౌ= ఎనిమిదియు, అంగాని = యోగాంగములు.

వివేకఖ్యాతిని గడింపదలచిన యాతడు 1.యమము, 2.నియమము, 3.ఆసనము, 4.ప్రాణాయామము, 5.ప్రత్యాహారము, 6.ధారణము. 7.ధ్యానము, 8. సమాధియను నెనిమిది యోగాంగములను వరుస దప్పక యనుష్ఠింపవలయును. అభ్యాసవైరాగ్యవీర్యాదులు గూడ నీయెనిమిదింటిలో ననే యంతర్భవించి పోవును. ఈ యంగముల యందు తొలుతటి యేడును బహిరంగములు. కడపటి సమాధియను నంగము మాత్రము యోగమున కంతరంగము. పంచాంగములు గల ప్రాణమునకు దొలుతటి యంగమును ప్రాణమని నిర్దేశించిన విధమున, నష్టాంగమగు సమాధికిని గడపటి యంగము సమాధి యని చెప్పుట యంతరంగత్వద్యోతకము.

అవ॥ క్రమముగా వీనికి లక్షణము దెలుపబోవుచు దొలుత యమము నకు స్వరూపమును నిరూపించుచున్నారు.

**సూ॥ అహింసా సత్యమస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః॥ 30**

అహింసా, సత్యం, అస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహాః, యమాః॥

అహింసా = త్రికరణశుద్ధిగ నెప్పుడుగాని యే ప్రాణికిగాని ద్రోహము నొనర్పకుండుట, సత్యం = సత్యము, అస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహాః = అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము ననునవి, యమాః = యమము లనబడును.

1.అహింసయు, 2.సత్యము, 3.అస్తేయము, 4.బ్రహ్మచర్యము, 5. అపరిగ్రహము ననునవి యైదును యమము లనబడును. మనో వాక్కాయ కర్మలలో నొకదాని మూలముననగాని, యొకవేళనేని, యొక ప్రాణికేని ద్రోహము చేయకుండుట యహింస యనబడును.

సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహములను యమములును పైన జెప్పబడు శౌచ, సంతోష, తప, స్వాధ్యాయేశ్వర ప్రణిధానములను నియ మములు కలసి తొమ్మిదియు నహింసా మూలములే గాన యమనియమము లన్నియు నహింసాసిద్ధి కొరకును, సిద్ధించిన యహింసను విశదముగ నొనర్చి పుష్టి నొందించుటకును నిరూపింపబడెను. ఇట్లే పంచశిఖాచార్యులును

**''స ఖల్వయం బ్రాహ్మణో యథా యథా వ్రతాని బహూని**
**సమాదిత్సతే తథా తథాప్రమాదకృతేభ్యో హింసానిదానేభ్యో**

నివర్తమాన స్తామేవ అవదాతరూపామహింసాం కరోతి'' అనిరి. అనగా నీమోక్షేచ్ఛువగు నెవడు యమనియమాది బహువ్రతముల ననుష్ఠించు కొలదియు ప్రమాద కృతములును హింసాకారణములు నగు నసత్య భాషణాదుల నుండి నివృత్తుడై యా యహింసనే యంతకంతకు నిర్మల మొనర్చునో ఆతడే బ్రాహ్మణుడని భావము.

2. సత్యమనగా యథార్థమగు వాఙ్మనస్సుల నెట్లు చూచెనో, యెట్లు ఊహాపోహలతో ననుమితి చేసెనో, యెట్లు వినెనో, యా విధముగనే మనస్సును, మనోఽనుగుణముగా వాక్కునుండుట అనగా తనచిత్తమున హత్తుకొని యున్న జ్ఞానమునకు సమానమగు జ్ఞానమును ఇతరుని చిత్తమున గలిగించు నుద్దేశముతో బల్కిన పలుకు మాత్రమే వంచనా రహితమై

భ్రాంతిజన్యమును బోధాజనకమును గాకుండును గాన నట్టి పలుకు సత్యమైనది. అట్లుగాక మనసున నొకటి యుంచుకొని వంచనార్థము భ్రాంతిచే గలిగినదియు, బోధ గలుగుకుండునట్లు వంచింపబడి నదియునగు పలుకు యథార్థమైనది గాదు కాన నది నసత్యమే. ''అశ్వత్థామా హతః'' అను యుధిష్ఠిరునివాక్యము ద్రోణవంచకమైనది గాన నసత్య మయ్యెను, విషయ గ్రహణ సమయమున గాని వివక్షా సమయమునగాని భ్రాంతివశమున నుచ్చరింపబడి నదియు నసత్యమే. అట్లే తాను మాటలాడు భాష నెరుగని వారిని గూర్చి యుచ్చరింపబడు నజ్ఞాతవచనము సయిత మెదుటివారికి బోధగలిగింప జాలదు గాన నసత్యమే యగును.

పైజెప్పిన సత్యలక్షణములు గలిగియున్న వచనము సయితము సర్వభూతోపకారకమై యేప్రాణికిని గష్టము గలిగింప కుండిననే సత్య మనబడును. కాని యట్టి వచన మేప్రాణికి గాని యనిష్టము నొనగూర్చునది యగునేని పాపజనకమే యగును. కాన మిథ్యావచనమే యగును. అనగా ప్రాణులకు గష్టమును గలిగించు సత్యవచనము పాపజనకముగాన, పుణ్యమువలె దోచు పుణ్యాభాసముగాన, వక్తకు మిక్కుటమగు కష్టమునే గలిగించును కాననే.

**సత్యం బ్రూయాత్ప్రియంబ్రూయాన్నబ్రూయాత్సత్యమప్రియమ్ ।**
**ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః ॥**

అనగా సత్యమే పలుకవలయును గాని యది భూతప్రియంకరముగ నుండవలయునేగాని యప్రియముగ నుండరాదు. అట్లని ప్రియమని యసత్యము పలుకరాదు. ఇదియే సనాతన ధర్మమని సత్యరహస్య మెరుకపరుపబడినది. కాన పై విషయము లన్నియు పరీక్షించి సర్వభూత హితమగు సత్యమును వచింపవలయును.

3. అస్తేయము:- శాస్త్రోక్తప్రకారమునగాక శాస్త్రవిరుద్ధముగ నితరుల నుండి ద్రవ్యమును గ్రహించుట స్తేయమనబడును. కాన నట్లు గ్రహింప

కుండుటయే యస్తేయము. ఇందు గ్రహింపకుండుట యనునది చేతితో గ్రహింపకుండుట మాత్రముగాదు. చిత్తమునం దేమాత్రము గాని యట్టి యశాస్త్రీయ వస్తువునందు స్పృహ లేకుండుటయే ముఖ్యముగా నస్తేయ మనబడును. కావుననే భాష్యకారులును **"అస్పృహారూప మస్తేయమ్"** అనిరి. అనగా నిచ్ఛ లేకుండుటయే యస్తేయము అని భావము.

4. బ్రహ్మచర్యము:- ఇతరేంద్రియనిరోధ పూర్వకముగ గుహ్యేంద్రియ మును నియమించుట బ్రహ్మచర్యము. అనగా-

**స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణమ్ ।**
**సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియా నిర్వృత్తిరేవ చ ॥**

**ఏతన్మైథునమష్టాంగం ప్రవదన్తి మనీషిణః ।**
**విపరీతం బ్రహ్మచర్య మేతదేవాష్టలక్షణమ్ ॥**

అని దక్షసంహితలో జెప్పిన తెరగున నష్టాంగ మైథునములు లేకుండుటయే బ్రహ్మచర్యము. అది 1. అస్మరణము, 2. అకీర్తనము, 3. అకేళి, 4. అప్రేక్షణము, 5. అగుహ్యభాషణము, 6. అసంకల్పము 7. అధ్యవసాయా భావము, 8. క్రియానిర్వృత్త్యభావమునని బ్రహ్మచర్య మెనిమిది విధముల బరిగణింపబడును.

5. అపరిగ్రహము:- విషయోపభోగముల నార్జించుట, యార్జించిన వానిని గాపాడుకొనుట, కాపాడుచున్న నవి నశించుటయు వానియందు సంగము, **"నానుపహత్య భూతాన్యుపభోగస్సంభవతి"** అన్నటుల నితర ప్రాణులకు హింస గలిగింపక తనకు భోగము గలుగదు గాన హింసయు నను దోషములు గలుగును. కాన తమంతట తామె లభించిన విషయములను సయితము స్వీకరింపకుండుట యపరిగ్రహము, మూడవది యగు నస్తేయమును నిరూపించిన దానిచేతనే విషయముల యపరిగ్రహము సిద్ధించినట్లు తోచును. కాన నిచట మరల నపరిగ్రహము చెప్పుట వ్యర్థమని తోచవచ్చును. కాని యస్తేయ పదముచే నచట నశాస్త్రీయమగు

పరిగ్రహమును మాత్రము నిషేధించుటచే శాస్త్రీయములగు విషయములను గ్రహించుట దోషము కాదని ఏర్పడును. ఇచట నపరిగ్రహ మన్ననో శాస్త్రవిధిచే ప్రాప్తములగు పదార్థములయందు సయితము రక్షణాదిదోషములు గలవు. కావున నవియు దుష్టములే గాన పరిగ్రహార్హములు గావని తెలుపబడెను.

ఈ యహింసాదు లైదును హింసాభావ, మిథ్యాభావ, స్తేయాభావ, మైథునాభావ, పరిగ్రహాభావరూపములు అనగా నభావరూపములు గాన యమము లనబడును. యమశబ్దము ''యమ=ఉపరమే'' యను ధాతువుచే నిష్పన్నమైనదిగాన యమము లనగా నభావములని యర్థము.

అవ॥ ఇట్లు సామాన్యముగా యమములను నిరూపించి యోగుల కుపాదేయములగు వానిని నిరూపించుచున్నారు.

## సూ॥ జాతిదేశకాలసమయానవచ్ఛిన్నాః సార్వభౌమా మహావ్రతమ్॥ 31

పద॥జాతిదేశకాలసమయానవచ్ఛిన్నాః, సార్వభౌమాః, మహావ్రతమ్॥

అర్థము॥ తే తు (అధ్యాహృతము) = ఆ యమములు, జాతిదేశకాలసమయానవచ్ఛిన్నాః = జాతి, దేశము, కాలము సంకేతమునను విభాగములేనివై, సార్వభౌమాః = సర్వావస్థలయందును ఏవిధమునను వ్యభిచరింపని (తప్పిపోని)వై, మహావ్రతమ్ = మహావ్రతమని పరిభాషింపబడును.

సామాన్యముగ అహింసాదులు కొన్ని జాతులయందును,కొన్ని దేశములయందును, కొన్ని కాలములయందును కొన్ని సంకేతముల యందును మాత్రముండునుగాన నవి జాత్యాద్యవచ్ఛిన్నము లగును. అట్లుగాక దేశకాలాదులచే విభక్తములు గాకుండ నహింసాదులను సర్వవిషయముల యందును పరిపాలించుటయే మహావ్రతమని చెప్పబడును.

ఒక హింసను గూర్చి వివరింతుము. పల్లెవాడు మత్స్యములను మాత్రము జంపునుగాని యన్యముల జంపను అని యెంచుచో

మత్స్యజాతియందు మాత్రము హింసయగును గాన మత్స్యభిన్న జాతులయం దహింస యగును. కాన నా యహింస జాత్యవచ్ఛిన్నమగును. వీడే పుణ్య తీర్థమున మత్స్యములను బట్టి వధింపనని యెంచెనేని యీ జాత్యవచ్ఛిన్నా హింసయే దేశావచ్ఛిన్న మయ్యెను. అతడే చతుర్దశినాడును బుణ్యదినము లందును జంపనని సంకల్పించెనేని యాయహింసయే సమయావచ్ఛిన్నము గూడ నయ్యెను. పై నిరూపించిన మూడు విధములగు హింసలలో బ్రవర్తింపని యాతడు ''దేవబ్రాహ్మణుల కొరకే నేను హింసచేయుదునే గాని మరియొక ప్రయోజనమున్కై హింసజేయను'' అని తలచుచో నిది సమయా (సంకేతా) వచ్ఛిన్నమగు నహింస. ఇట్లే క్షత్రియుల మగుటచే యుద్ధమునందే హింస చేయుదుము గాని మరియొక చోట హింసను జేయము అనుకొనినచో నిదియు సమయా (సంకేతా) వచ్ఛిన్న మగునదియే, ఇట్లు జాతి దేశ కాల సంకేతములను విభాగములకు లోనుగాక యన్ని విధముల, నన్నిజాతుల యందును, సర్వదేశములందును, సర్వకాలముల యందును, సర్వ సంకేతములను విడనాడి యహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహములను నెరవేర్పవలయును.

ఇట్లు సర్వజాతి సర్వదేశ సర్వకాల సర్వసంకేతములయందును దప్పిపోకుండ నహింసాదుల ననుష్ఠించుటయే మహావ్రతమని యీ శాస్త్రమునందు వ్యవహరింపబడును. మహాయోగులచే మాత్రమాచరింప శక్యమగును గాన దీనికి మహావ్రత సంజ్ఞ యన్వర్థము.

అవ॥ ఇంక నియమముల నెరుకపరచుచున్నారు.

**సూ॥ శౌచసంతోషతపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః॥ 32**

శౌచసంతోషతపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని, నియమాః.

శౌచసంతోషతపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని=శౌచము, సంతోషము,

తపము, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము ననునవి, నియమాః=నియమము లనబడును.

శౌచాదు లైదును నియమములని వ్యవహరింపబడును. ఇందు-

1.శౌచము:-మన్ను నీరు గోమయము మొదలగు వానిచే శరీరమల నిరాసమును, హితమిత మేధ్య భోజనముచే నుదరమును శోధించు కొనుటయు, బాహ్యశౌచము. మైత్ర్యాదులచే రాగ ద్వేషాది చిత్తముల నున్మూలించుట యాభ్యంతరశౌచము.

2.సంతోషము:- శరీరయాత్రకు (బ్రతుకుటకు) మాత్రము సాధన ములై యున్నవస్తువులతోడ మాత్రము ప్రాణముల నిలువబెట్టుకొని యితరములగు వస్తువుల నభిలషింపకుండుట.

3.తపము:-ద్వంద్వముల నోర్చుకొనుట. అనగా నాకలి దప్పులను, చలి వేడుములను, నిల్చుండుట కూర్చొనుటలను, కాష్ఠమౌనము (సంజ్ఞగూడ జేయకుండుట) ఆకారమౌనము (వాక్కును మాత్రము నిరోధించుట) యను ద్వంద్వములను శాస్త్ర ప్రతిపాదిత వ్రతరూపమున సహించుటయే తపము. ఆవ్రతములు కృచ్ఛ్రచాంద్రాయణసాంతపనాదులు.

కృచ్ఛ్రమనగా:-మూడుదినములు ప్రొద్దుటివేళ మాత్రము కుక్కు టాండ పరిమాణముగల యన్నకబళముల నిరువది యారింటిని మాత్రము భుజించి,/యంత మరల మూడురోజులు సాయంకాలమున మాత్రము ముప్పదిరెండు కబళములను మాత్రము భుజించి, తదనంతరము మూడు దినములు ఆయాచితముగ లభించిన యిరువది నాల్గు కబళములను దిని, మరల మూడు దినములు శుష్కోపవాసము చేయుట యొక కృచ్ఛ్రవ్రతము.

చాంద్రాయణము:- శుక్లపక్షప్రతిపత్తునుండియు మొదలిడి మయూ రాండ ప్రమాణమగు నొక్కొక కబళమును హెచ్చించుచు పూర్ణిమ నాడు పదునేను కబళములను భుజించి కృష్ణపక్షపాడ్యమినుండి యొక్కొక కబళమును తగ్గించుచు నమావాస్యనాడు శుష్కోపవాస మొనర్చినచో నిది

యంతయు నొక చాంద్రాయణవ్రతము.

సాంతపనము:-తొలుతటినా డెనిమిది మాషముల యెత్తు నెఱ్ఱని యావుపంచితమును, తెల్లయావు గోమయము పదువారుమాషములును, బంగారుఛాయగల యావుపాలు పన్నెండుమాషములును, నల్లని యావునేయి పదిమాషముల యెత్తును, వీని యన్నింటి పరిమాణములో సగము కుశ జలములను (పంచగవ్యమును) గలిపి త్రాగవలయును. మరుసటి దిన ముపవాసము చేయవలయును, ఇది సాంతపనము. ఈ విషయము మనుస్మృతిలో విశదీకరింప బడియున్నది.

4.స్వాధ్యాయము:- మోక్షప్రతిపాదకములగు శాస్త్రములను, వేదము లను పఠించుటయు, నోంకారాదులను జపించుటయు స్వాధ్యాయ మనబడును.

5.ఈశ్వర ప్రణిధానము:-సర్వగురువగు పరమేశ్వరుని యందే సర్వకర్మలను సమర్పించుట. ఈ యీశ్వర ప్రణిధానముచే గలుగు ప్రయోజనమునుగూర్చి శ్రీవేదవ్యాస భగవానులే యిట్లు చెప్పిరి.

**శయ్యాసనస్థోఽపి పథి వ్రజఞవా స్వస్థః పరిక్షీణ వితర్కజాలః।**
**సంసార బీజక్షయ మీక్షమాణః స్యాన్నిత్యముక్తోఽ మృతభోగభాగీ॥**

అనగా ఏ యోగి పడుకొనియేనియు, కూర్చొనియేనియు, త్రోవ నడచుచునేనియు, నేకాంత స్థితుడయి యేనియు హింసాది వితర్కమును నశింపజేసి యీశ్వర ప్రణిధానము నొనర్చునో యాతడు దినదినమునకు సంసార బీజములగు రాగాదు లడుగంటుచుండుటను గమనించుచు నమృతతుల్యమగు జీవన్ముక్తి ననుభవించుచు, నిత్యముక్తుడగును అని భావము. సూత్రకారులును యోగపాదమున "**తతః ప్రత్యక్చేతనాధి గమోఽప్యంతరాయాభావశ్చ**" అను 29వ సూత్రముచే నీశ్వర ప్రణిధానముచే సమాధి లభించుట మాత్రమే గాక నిర్విఘ్నముగ స్వస్వరూప సాక్షాత్కారము సయితము గలుగునని నిరూపించి యుండిరి.

అవ॥ "**శ్రేయాంసి బహువిఘ్నాని**" యన్నటుల యమములకు

విఘ్నములు గలుగవచ్చునని తలచి విఘ్ననివారణోపాయమును జూపుచున్నారు.

## సూ॥ వితర్కబాధనే ప్రతిపక్షభావనమ్॥ 33

వితర్కబాధనే, ప్రతిపక్షభావనమ్.

ఏతేషాం, యమనియమానాం = (ఈ రెండుపదములు నధ్యాహృతములు) ఈ యమనియమములకు, వితర్కబాధనే = విరుద్ధతర్కరూపములగు హింసాదులచే బాధ ప్రాప్తించినచో, ప్రతిపక్ష,బావనం-ప్రతిపక్ష = అహింసాదులకు విరుద్ధములగు విచారాదులను, భావనం =సేవింపవలయును.

ఏసమయమున, బ్రహ్మజ్ఞాన సాధకుని చిత్తమున నహింసాదులకు విరుద్ధములుగ ''అపకారిని వధింతును'' అని, హింసారూప వితర్కమును ''ఇతనికి కష్టము గలిగింప నసత్యమునేని వచింతును'' అని యసత్యరూప వితర్కమును, ''ఇతని ద్రవ్యము నపహరింతును'' అని స్తేయరూపమగు వితర్కమును, ''వీని భార్యను చెరతును'' అని యబ్రహ్మచర్య (మైథున) రూపవితర్కమును, ''ఇతని పరిగ్రహమునకు నేనే యజమానుడ నగుదును'' అని పరిగ్రహరూప వితర్కములు గలుగగా నెపుడు మిగులదీప్తమై వెల్లివిరియుచు, దుర్మార్గములోనికి గొంపోవు వితర్కము లను జ్వరముచే బీడ యేర్పడునో, యపుడే యాబ్రహ్మజ్ఞాన సాధకుడు ''అయ్యో ఈఘోరము లగు సంసారపు టగ్నులయందు కాలి యుడుకుచున్న నేను సర్వభూతముల కభయ ప్రదానము జేయుటకుగా నెట్లెట్లో యహింసాదిరూపమగు యోగధర్మమును శరణు బొందితిని. అట్టి నేను మరల నహింసాది వ్రతములను వదలి ముందు విడిచివైచిన హింసాది వితర్కములను స్వీకరింతునేని కుక్క నడతకును నా నడతకు భేదమేముండును? కుక్క కక్కిన కూడును మఱల గతుకును గాని అట్లే నేను పరిత్యజించిన హింసాది వితర్కములను మరల స్వీకరింపవచ్చునా? యని యిట్లు హింసాదులకు విరుద్ధవిచారములను తలపోయవలయును, ఈ మొదలగు విశేషములను

(ఆసనప్రాణాయామ) సూత్రాంతరముల యందును జేర్చుకొన వలయును.

అవ॥ ఇక వితర్కములకు స్వరూప ప్రకార కారణ ధర్మ ఫలభేదముల దెలుపుచు బ్రతిపక్షభావనా స్వరూపము నెరింగించుచున్నారు.

**సూ॥ వితర్కా హింసాదయఃకృతకారితానుమోదితా లోభక్రోధమోహపూర్వ కా మృదు మధ్యాధి మాత్రా దుఃఖాజ్ఞానానన్తఫలా ఇతి ప్రతిపక్ష భావనమ్॥ 34**

వితర్కాః, హింసాదయః, కృతకారితానుమోదితాః, లోభక్రోధమోహ పూర్వకాః, మృదుమధ్యాధిమాత్రాః, దుఃఖాజ్ఞానానన్తఫలాః, ఇతి, ప్రతిపక్ష భావనమ్.

హింసాదయః = హింస మొదలగు, వితర్కాః =అహింసాది విరుద్ధ తర్కములు, కృతకారితానుమోదితాః-కృత = తనచే జేయబడి నవియు, కారిత = తాను ప్రేరేపించి యితరులచే జేయింపబడినవియు, అనుమోదితాః = ఎవడో చేయుచున్నను చూచి ''బాగుబాగ''ని యనుమోదింపబడినవియునై, లోభమోహ క్రోధపూర్వకాః = లోభపూర్వకములును,మోహపూర్వకములును, క్రోధపూర్వక ములునై, మృదుమధ్యాధిమాత్రాః = మృదుమధ్య తీవ్రములను భేదము గలవై, దుఃఖాజ్ఞానానన్తఫలాః = దుఃఖము, అజ్ఞానము నను నపరిమేయ ఫలము నొసగునవి, ఇతి = అనునది, ప్రతి పక్షభావనమ్ = ప్రతిపక్షభావన మనబడును.

''హింసామిథ్యాభాషణాది వితర్కరములు అనంతదుఃఖాజ్ఞాన రూపమగు ఫలము నిచ్చునే గాని సుఖజ్ఞానముల నేమాత్ర మీయవు'' అని విచారించుటయే ప్రతిపక్షభావనము. మరియు నీ హింసాది వితర్కములు ఆచరించిన వానికే దుఃఖాది ఫలప్రదములగు నను నదియు లేదు. చేయ నాజ్ఞాపించినను చేయువానిని జూచి యనుమోదించినను గూడ దుఃఖాది ఫలము నిచ్చియే తీరును. ఈ హింసాదికము కొన్నియెడల మాంసచర్మాదుల

యందు లోభముచే నేర్పడును. మఱికొన్నియెడల నపకార స్మరణాదిజన్య క్రోధముచే గలుగును. అట్లే కొన్నిచోటుల బలమొసగినచో బుణ్యము గలుగు నను మోహముచే (అవిద్యచే) నుత్పన్న మగును. కాన నీ వితర్కములు లోభ క్రోధ మోహజన్యము లగును, లోభాదులకు మందమధ్యాధికత్వములచే ముివ్విధము లగును.

అనగా హింస తొలుత కృతమనియు, కారితమనియు, అను మోదితమనియు మూడు తెరగులు. కృతాదు లొక్కొక్కటియు లోభక్రోధ మోహజన్యము లగును గాన తొమ్మిది విధములు. ఇందొక్కొక్కటియు లోభాదికముల మృదుమధ్యతీవ్రావస్థలచే మరల ముివ్విధములు కాగా నిరువది యేడు విధములు. మృదుత్వాదులలో నొక్కటొక్కటిలో మృదుత్వాదు లంతర్భవించి యుండుటచే ననగా మృదుమృదుత్వము, మధ్యమృదుత్వము తీవ్రమృదుత్వము నని యిట్టి ధర్మత్రయముచే హింస యెనుబదిఒక్క విధము లగును. వాస్తవముగ నియమ వికల్ప సముచ్చయ భేదముచే నసంఖ్యాక మగును. మరియు ప్రాణు లసంఖ్యములు గాన తద్విషయకమగు హింసయు ననంత మగును. ఇట్లే మిథ్యాభాషణాదులకును భేదము లూహింప వలయును. ఈ హింసాది వికల్పములు దుఃఖాజ్ఞాన రూపదుష్ఫలము ననంతముగ నిచ్చునని భావించుటయే ప్రతిపక్ష భావనము.

అనగా హింసకుడు దొలుత దా వధింపదలచిన జంతువునకు గల పలాయనాది సామర్థ్యమును గుంజకు గట్టివైచుట మొదలగు దానిచే బోగొట్టును. తరువాత దానిని ఖడ్గనిపాతనాదులచే దుఃఖపెట్టును. అటు తరువాత జీవప్రాణమును గూడ దీయును.

ఇందు వధ్యప్రాణియొక్క సామర్థ్యములను జెడగొట్టుటచే హింసకుని పుత్రకళత్రక్షేత్రాది రూప చేతనాచేతన రూపోకరణములు నిర్వీర్యములై తనకు ననుభవింపరానివిగ నగును. ఖడ్గనిపాతనాదుల మూలమున వధ్య జంతువునకు దుఃఖము గలిగించినందున హింసకుడు నరకతిర్యక్ప్రేతాది యోనులలో దుఃఖము ననుభవించును. మరియు ప్రాణము దీసినవాడు గాన హింసకుడు

దుస్సాధ్యమగు రోగమున బడియు, చావుబ్రతుకులలో బడియు, బాధ లనుభవింపజాలక వెంటనే ప్రాణము పోయిన బాగుండునని యెంచియు, దుఃఖరూపఫల మవశ్య మనుభోక్తవ్య మగుటచే నెట్లెట్లో ప్రాణములు పెట్టుకొనియే యుండును. మరియు ప్రధాన భూతమగు పుణ్యము ననుష్ఠించుటచే హింసాజన్యపాపము కొంతకు గొంత నివర్తించినను, పుణ్యఫలమగు స్వర్గాదికము లభించినను, ఆ హింసకుడు అల్పాయుష్కుడే యగును. ఇట్లే మిథ్యాసంభాషణాది వితర్కములయందు సయితము దుఃఖఫల ప్రదత్వమును దగిన విధమున నూహించుకొనునది. ఇట్లు వితర్కము లన్నియు ననిష్టఫలమునే గలిగించు నని భావించుచు వితర్కములను మనసునకు రాకుండ జేసికొన వలయును. మరియు నొకవేళ వితర్కములు మనసునకు వచ్చినను పై జెప్పిన విధమున ప్రతిపక్ష భావనావశమున వానిని దొలగద్రోయవలయును.

అవ॥ ఇట్లు ప్రతిపక్ష భావనా వశమున హింసాది వితర్కములు దగ్ధబీజభావము నొందెనేని. యమాదిసిద్ధిని సూచించుచు యోగికి గలుగు నైశ్వర్యమును వివరించుచు నందు తొలుత నహింసా జన్యైశ్వర్యము దెలుపుచున్నారు.

## సూ॥అహింసాప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః ॥

అహింసా ప్రతిష్ఠాయాం, తత్సన్నిధౌ, వైరత్యాగః॥

అహింసాప్రతిష్ఠాయాం=యోగికి నహింసా విషయమున నత్యుత్తమస్థితి యబ్బెనేని, తత్సన్నిధౌ=ఆ యహింసాపూర్ణుని సన్నిధానమున, వైరత్యాగః=సహజ విరోధులకు గూడ వైరముండదు.

జాత్యాద్యనవచ్ఛిన్నమగు నహింసలో నిష్ణాతుడైన యోగిసామీప్య మాత్రముననే శాశ్వతవిరోధము గల యశ్వమహిష, మార్జాలమూషిక సర్పనకుల, గజసింహాది సర్వప్రాణులును తమ సహజవైరమును విడనాడి మిత్రభావమున మెలగును. కాగా సహజ విరోధము గల జంతువులు సయిత

మేయోగి సాన్నిధ్య మాత్రమున విరోధమును విడచి మిత్రభావము నొందునో, యా యోగి యహింసా రూప యమమునం దుత్తీర్ణు డయ్యెనని యెరుగవచ్చును.

అవ॥ సత్యనిష్ఠకు సూచకమగు నైశ్వర్యము నెరింగించుచున్నారు.

## సూ॥ సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్॥36

సత్యప్రతిష్ఠాయాం, క్రియాఫలాశ్రయత్వమ్॥

సత్యప్రతిష్ఠాయాం = సత్యవచనాభ్యాసమున నుత్తమస్థితి యేర్పడెనేని, (సర్వప్రాణినాం = సర్వజీవులకు - అధ్యాహార్యమ్) క్రియాఫలాశ్రయత్వమ్- క్రియా= ధర్మాధర్మములకు, ఫల = ఫలములగు స్వర్గనరకాదులకు, ఆశ్రయత్వమ్= ఆశ్రయ మగుట గలుగును.

సత్యభాషణమున నారితేరిన యోగి యెంతటి పాపి నేనియు, ''నీ పాపము నశించినది నీవు ధార్మికుడవైతివి'' యని యన్నంతమాత్రముననే పాపియు ధార్మికు డగును. అట్లే ''స్వర్గమును బొందుదువుగాక'' యని యుచ్చరించెనేని యతడు స్వర్గమును బొందియే తీరును. అట్లే తుల్య న్యాయమున ధార్మికుని సయితము''నీవు పాపివగుదువు. నీవు నరకము నొందుదువు గాత'' యని నుడివెనేని ధార్మికుడును తప్పక యా ఫలముల నొందునని కొందరు వ్యాఖ్యాత లభిప్రాయపడిరి. ఇట్లు సత్యనిష్ఠాతుని వాక్కు-(సంకల్పము సయితము) వ్యర్థము గాక నెరవేరును గాన, నతడు నిగ్రహానుగ్రహసమర్థు డగును. ఇట్టి శక్తి గలిగిన యాతడు సత్యనిష్ఠాతు డయ్యెనని నిర్ణయింపవచ్చును.

అవ॥ అస్తేయనిష్ఠా సూచకమగు నైశ్వర్యము నెరుకపరచుచున్నారు.

## సూ॥అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్॥ 37

అస్తేయ ప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్॥

అస్తేయప్రతిష్ఠాయాం = అస్తేయమను యమమున నుత్తీర్ణత గలిగెనేని,

సర్వరత్నోపస్థానమ్ = సర్వరత్నములును ప్రాప్తించును

అస్తేయమును మిక్కుటముగ నభ్యసించిన యోగికి నన్నిదిక్కుల యందు నన్ని దేశములయందు నున్న యనర్ఘరత్నములు, లేదా యొక్కొక్క జాతియం దుత్కృష్టములగు వస్తువులు వాటంతట అవియే లభించును.

అవ॥ బ్రహ్మచర్యజన్యమగు నైశ్వర్యమును నిరూపించుచున్నారు.

## సూ॥బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః॥ 38

బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం, వీర్యలాభః॥

బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం = బ్రహ్మచర్యనిష్ఠ యేర్పడె నేని, వీర్య లాభః- వీర్య = సామర్థ్యవిశేషముయొక్క (బ్రహ్మ వర్చస్సు యొక్క) లాభః= ప్రాప్తి కలుగును.

బ్రహ్మచర్య నిష్ఠుడగు యోగికి నిరర్గళములగు నణిమాది సిద్ధులను (లేక జ్ఞానక్రియశక్తులను) వృద్ధినొందించు సామర్థ్య విశేషము లేక బ్రహ్మవర్చస్సు గలుగును. ఆసామర్థ్య విశేషముచే సిద్ధుడగు నా యోగి తానేగాక తన్నాశ్రయించిన వారిని సయితము విజ్ఞానులుగను సమాధి నిష్ఠులుగను జేయజాలియుండును.

అవ॥ అపరిగ్రహనిష్ఠచే గలుగు నైశ్వర్యమును దెలుపుచున్నారు.

## సూ॥ అపరిగ్రహస్థైర్యే జన్మకథన్తాసంబోధః॥ 39

అపరిగ్రహస్థైర్యే, జన్మకథన్తా సంబోధః॥

అపరిగ్రహస్థైర్యే= అపరిగ్రహవ్రతమున స్థిరాభ్యాస మేర్పడెనేని, జన్మకథన్తా సంబోధః= ఏ జన్మమెట్టిది యను విషయము బాగుగా నెరుకపడును.

అపరిగ్రహవ్రతమును దప్పక యాచరించిన యోగికి ''నేనింతకు ముందటి జన్మలలో నేయే రూపములనుంటిని? ఏయే విధముగ నుంటిని? ఇప్పటి జన్మ మేది? ఈ జన్మమెట్లు గడచుచున్నది? రాబోవు జన్మము లేవి?

ఆ జన్మములలో నెట్లెట్లుందును? అను విమర్శచే నతీతానాగత వర్తమాన జన్మములయందలి విషయము లెరుకపడును. ఇట్లతీతాది జన్మలయందు శరీరసంబంధ జిజ్ఞాస యుదయించి, యది స్వరూప జ్ఞానమును గలిగించి తీరును. ఇట్లింతవరకు నైదు విధములగు యమములును దృఢపడినచో గలుగు నైదు సిద్ధులును వివరింపబడినవి.

అవ॥ ఇక నియమ పంచకమునకు గ్రమముగా సిద్ధులు నిరూపింప బడును. అందు బాహ్యశౌచమునకు సూచకమును దెలుపుచున్నారు.

## సూ॥ శౌచాత్ స్వాంగజుగుప్సా పరైరసంసర్గః॥ 40

శౌచాత్, స్వాంగజుగుప్సా, పరైః, అసంసర్గః॥

శౌచాత్ = దృఢానుష్ఠితమగు శౌచము వలన, స్వాంగజుగుప్సా. స్వాంగ = తన శరీర విషయముననే, జుగుప్సా = ఏవగింపును, పరైః = ఇతరులగు నశుద్ధపురుషులతోడ, అసంసర్గః = కలియ కుండుటయు గలుగును.

తన శరీరమునందు పారిశుద్ధ్యమువలన గలిగిన మాలిన్యమును గమనించి శౌచము నారంభించును. అట్టి శౌచ ప్రవృత్తుడగు యోగి శరీరము మలమూత్రచర్మ భస్త్రికలో నుదయించిన దనియు, శుక్రశోణిత సంఘాత రూపమైన దనియు నీ మొదలగు విమర్శనములచే శరీర దోషములను గమనించి శరీరముపై ప్రీతిలేనివాడగును. మరియు శరీర మెంతపాటుబడి మృజ్జలాదులచే శోధించుచున్నను, మలినమే యగునని యెంచును. కాన తానా యశుద్ధ శరీరమును విడువదలచి యతడత్యంత మపరిశుద్ధములగు నితర శరీరముల నెట్లు స్పృశించును? కాన నతడితర సంసర్గమును విడనాడి యేకాంతవాసము చేయును.

అవ ॥ఇక నాభ్యంతర శౌచమునకు సూచకము నెరిగించుచున్నారు.

## సూ॥ సత్త్వశుద్ధిసౌమనస్యైకాగ్ర్యేన్ద్రియ । జయాత్మదర్శనయోగ్యత్వాని చ ॥ 41

సత్త్వశుద్ధి సౌమనస్యైకాగ్ర్యేంద్రియజయాత్మదర్శన యోగ్యత్వాని, చ॥

సత్త్వశుద్ధిసౌమనస్యైకాగ్ర్యేంద్రియజయాత్మదర్శన యోగ్యత్వాని చ-సత్త్వ= చిత్తసత్త్వమునకు, శుద్ధి = నైర్మల్యము, సౌమనస్య = స్ఫటికమునకువలె చిత్తమునకు స్వచ్ఛత్వము, ఏకాగ్ర్య = ఐకాగ్రత్వము, ఇంద్రియజయ = ఇంద్రియ వశీకరణము, ఆత్మదర్శన యోగ్యత్వాని చ = ఆత్మసాక్షాత్కార యోగ్యతయు, గలుగును.

మైత్ర్యాదిభావనావశమున రాగాది చిత్తమల శోధన రూపమగు నాభ్యంతర శౌచముచే తొలుత చిత్తము నిర్మల మగును. దానిచే జిత్తమున స్ఫటికమునందువలె స్వచ్ఛతయు, దానిచే నేకాగ్రతయు, దానిచే నింద్రియ వశీకారమును, దానిచే నాత్మసాక్షాత్కార యోగ్యతయు, నొకటి వెంట నొకటిగ గలుగును. ఇవి గలిగినచో శౌచము స్థిరమైనదని యెంచవచ్చును.

అవ॥సంతోష స్థైర్యసూచకమును దెలుపుచున్నారు.

## సూ॥ సంతోషాదనుత్తమః సుఖలాభః॥ 42

సంతోషాత్, అనుత్తమః, సుఖలాభః॥

సంతోషాత్= దృఢమగు సంతోషమువలన, అనుత్తమః= అత్యుత్తమమగు, సుఖలాభః= సుఖప్రాప్తి యేర్పడును.

సంతోషనిష్ఠ యేర్పడెనేని ఉత్తమోత్తమమగు సుఖము లభించును. ఈ విషయమున,

**యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్।**
**తృష్ణాక్షయసుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్॥**

అనగా లోకమునందలి స్రక్చందనవనితాది రూపమగు కామ సుఖమును, అమృతాప్సరః ప్రభృతి ప్రయుక్తమైన గొప్ప స్వర్గసౌఖ్యమును, తృష్ణాక్షయమను దృఢ సంతోషనిష్ఠవలన గలుగు నానందమునకు పదునారవ యంశమునకు గాని తులదూగవు అని భావము.

అవ॥తపోనిష్ఠకు సూచనను దెలుపుచున్నారు.

**సూ॥ కాయేన్ద్రియసిద్ధిరశుద్ధిక్షయాత్తపసః॥ 43**

కాయేన్ద్రియసిద్ధిః, అశుద్ధిక్షయాత్, తపసః॥

తపసః = దృఢమగు తపోఽనుష్ఠానమువలన, అశుద్ధిక్షయాత్ = అశుద్ధి సంజ్ఞకమై యావరణరూపమగు రాజసతామస మాలిన్యము నశించుట మూలమున, కాయేన్ద్రియసిద్ధిః = కాయసిద్ధియు నింద్రియ సిద్ధియు కలుగును.

కృచ్ఛ్రచాంద్రాయణాది తపములకు ననవరతము నొనర్చుచుండినచో చిత్తమున రజస్తమఃప్రాచుర్యముచే నావరించియున్న యశుద్ధిరూప మలము దొలగిపోవును. దానిచే శరీరసంబంధ మగు నణిమాద్యష్ట సిద్ధులును, ఇంద్రియ సంబంధమగు దూరశ్రవణ దూరదర్శనాది సిద్ధులును లభించును.

అవ॥ స్వాధ్యాయనిష్ఠాసూచన నెరింగించుచున్నారు.

**సూ॥ స్వాధ్యాయా దిష్టదేవతాసంప్రయోగః॥ 44**

స్వాధ్యాయాత్, ఇష్టదేవతాసంప్రయోగః॥

స్వాధ్యాయాత్ = అనవరతము ననుష్ఠింపబడు మోక్షప్రతిపాదకమగు నధ్యాత్మశాస్త్రపఠనము వలనగాని, వేదమంత్రాధ్యయనమువలనగాని, ప్రణవోపాసన వలనగాని, ఇష్టదేవతాసంప్రయోగః = ఇష్టదేవతా సాక్షాత్కారము లభించును.

మోక్షప్రతిపాదకమగు వేదాంతశాస్త్రమును, వేదమంత్రములను, ప్రణవాదులను పఠించుట స్వాధ్యాయ మనబడును. కాన నట్టి స్వాధ్యాయ మనవరతము ననుష్ఠింపబడునేని యందుచే, తా గోరిన దేవతలును, తాగోరిన ఋషులును, తాదలచిన సిద్ధులును దనకు సాక్షాత్కరింతురు. మరియును వారు స్వాధ్యాయశీలుని కోరిక చొప్పున బనుల నెరవేర్తురు.

అవ॥ ఈశ్వరప్రణిధాననిష్ఠకు సూచన నెరింగించుచున్నారు.

**సూ॥ సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్॥ 45**

సమాధిసిద్ధిః, ఈశ్వరప్రణిధానాత్॥

ఈశ్వర ప్రణిధానాత్ = ఈశ్వరునియందు సర్వకర్మల సమర్పణము వలన, లేదా భక్తి విశేషమువలన, సమాధిసిద్ధిః = సంప్రజ్ఞాతసమాధి సిద్ధించును.

సర్వకర్మలను భగవంతునకు సమర్పించిన లేక భక్తివిశేషమును, ప్రణిధానమును దృఢముగ నలవరచుకొనిన యోగికి సంప్రజ్ఞాత సమాధి సిద్ధించును. ఆ సంప్రజ్ఞాత సమాధిచే నాయోగి దేశాంతరమున దేహాంతర మున కాలాంతరమున నున్న యన్ని యిష్టవస్తువుల నున్నవి యున్న యటుల నెరుంగును. కాన నితని ప్రజ్ఞ **'యథాభూతం ప్రజానాతి'** యను వ్యుత్పత్తిచే సార్థకమగును. ఈశ్వరప్రణిధాన మాత్రముననే సంప్రజ్ఞాత సమాధి సిద్ధించుటచే తక్కిన ఏడంగములు వ్యర్థములుగ దలపరాదు. ఆ యంగము లుండిననే యీశ్వర ప్రణిధానము గలుగును గాన నవియు నీశ్వర ప్రణిధాన జనన ద్వారమున సమాధికి నంగములే.

అవ॥ ఇట్లు వాటి వాటి సిద్ధులతో గూడ యమనియమము లను నిరూపించి యిక నాసనమును దెలుపుచున్నారు.

## సూ॥ స్థిరసుఖ మాసనమ్॥ 46

స్థిరసుఖం, ఆసనమ్॥

స్థిరసుఖం = నిశ్చలమై, సుఖకర మగునది: ఆసనమ్ = ఆసన మనబడును

నిశ్చలమై యాసీనునకు సుఖావహ మగునది యాసన మనబడును. ''ఆస్తే అత్ర'' దీనిపై యోగి కూర్చొనును,' ఆస్తే అనేన' దీని సాధనమున సాధకుడు నిలిచి యుండును. అను వ్యుత్పత్తి ద్వయముచే నాసనశబ్దము సార్థకము. ఈ యాసనములు బాహ్యాసనములు, శారీరాసనములని రెండు విధములు, అందు బాహ్యాసనములు-వస్త్రము, మృగచర్మము, దర్భ, కంబలి, మొదలగునవి. శారీరాసనములు - పద్మాసనాదులు. అవి యెనుబది నాలుగు, వానిలో కొన్ని మాత్రము వివరింతుము.

1.పద్మాసనము:-ఎడమతొడపై కుడిపాదమును, కుడితొడపై నెడమ పాదము నుంచి వెనుకవైపునుండి కుడిచేతితో కుడికాలిబొటన వ్రేలును, ఎడమచేతితో నెడమకాలి బొటన వ్రేలును బట్టుకొని రొమ్మునందు గడ్డమునుంచి కనుబొమల నడుమ దృష్టిని నిలుపుట.

2. వీరాసనము:-కుడియెడమ తొడలపై నెడమకుడి పాదములను జేర్చి నిట్టువగ గూర్చొనుట, కొందరు ఒక కాలిని మడిచి నేలమీద మోపి యట్లాకుంచిత జానువగు నా కాలిపై రెండవకాలి నుంచుట వీరాసనమని యందురు.

3. భద్రాసనము:-అండకోశములకు దిగువ చీలమండలమునుంచి పార్శ్వపాదములను జేతులతో బిగ్గబట్టి కదలకుండుట. దీనినే గోరక్షాసన మనియు నందురు.

4.స్వస్తికాసనము:-పిక్కలకును దొడలకును నడువు పాదముల నిరికించి చక్కగ గూర్చొనుట.

5.సిద్ధాసనము:-ఎడమకాలి మడమను మూలాధారమునను, కుడి కాలి మడమను లింగస్థానమునందు నుంచి శిరః కంఠాంసములను చక్కగా నిక్కించి భ్రూమధ్యమును జూచుట. కొందరు లింగముమీద నెడమ మడమనుంచి, దానిపై గుడిమడమ నుంచి నాసాగ్రమున దృష్టి నుంచుట సిద్ధాసన మందురు. దీనినే వజ్రాసన, ముక్తాసన, గుల్ఫాసన సంజ్ఞలచే వ్యవహరింతురు.

6.కపాలాసనము:-తలక్రిందుగ నిలచి భ్రూమధ్యము నందలి చిద్బిందువును జూచుచుండుట.

7.స్థిరసుఖాసనము:-ఎట్లు గూర్చొనిన నాసీనునకు స్థైర్యమును సుఖమును గలుగునో యదియే స్థిర సుఖాసనము, ఇయ్యది సూత్రము నందు బ్రతిపాదింపబడియెను గాన సూత్రకారున కిది యభిమతమైనది.

8.పశ్చిమతానమాసనము:-భూమియందు దండాకారముగ రెండు గుదికాళ్ళను జేర్చి, కాళ్ళను చక్కగా చాచి, రెండుకాళ్ళ బొటన వ్రేళ్ళను రెండుచేతుల బొటన వ్రేళ్ళతో (మోకాళ్ళ క్రిందిభాగము నేలమీద ఆనునట్లు దృఢముగా)పట్టుకొని మోకాళ్ళమీద లలాటము నుంచుట పశ్చిమతానమాసనము.

ఫలము:-శ్రేష్ఠమైన పశ్చిమతానము ప్రాణమును పశ్చిమ మనెడి సుషుమ్నా మార్గముగ పోవునటుల జేయుచున్నది. జఠరాగ్నిని వృద్ధిజేయుచున్నది. ఉదరమునందు కృశత్వమును ఆరోగ్యమును జేయుచున్నది.

9.మయూరాసనము:- చేతివ్రేళ్ళను విరళముజేసి రెండు చేతులను నేలయందూని, మోచేతులను నాభికి ఇరుప్రక్కల నునిచి ముఖమును పైకెత్తి కాళ్ళను నెమలితోకవలె చాచి దండమువలె పైకెత్తి యుండుట మయూరాసనము.

ఫలము:- మయూరాసనము గుల్మము, జలోదరము మొదలగు సకల రోగములను పోగొట్టును. వాత, పిత్త, కఫములను ఆలస్యమును కలుగజేయు దోషముల నివృత్తి జేయును. అధికముగ భుజించిన మాడిన యన్నముల నంతయు భస్మము జేయును. జఠరాగ్నిని కలుగజేయును. కాలకూటమువలె అపకారమును చేయునట్టి అన్నముల నంతయు జీర్ణమగునటుల జేయును.

10. శవాసనము:- మృతశరీరము నందువలె వీపు భూమియందు ఆనునటులజేసి నిద్రయందువలె ఇమిడికయ్యె యుండుట శవాసనము.

ఫలము:- శవాసనము ఆయాసమును పోగొట్టునదియును, చిత్తవిశ్రాంతిని గలుగజేయునదియును నైయున్నది.

11.సర్వాంగాసనము:-శరీరమును బాగుగా చక్కగా పైకి లేపి

మెడపైన భారమంతయు నిలుపులాగున జేసుకొని రెండు హస్తములతో నడుమును పట్టుకొని, గడ్డముచే గొంతును అణచుకొని ఉండుట సర్వాంగాసనము, దీనివలన గుండెబలము బాగుగ గలుగుటయే గాక ఉదరములో గల వ్యాధు లన్నిటిని రహిత మొనర్చును.

ఇట్లు నానావిధాసనములు గలవు. కాన యోగి తన కేది చిత్తస్థైర్యశరీర స్థైర్యకరమో, సుఖావహమో దానినే యవలంబింపవలయును.

మరియు నిందు గృహస్థులకు పద్మాసన సిద్ధాసనము లుత్తమములు. అందును పద్మాసన ముత్తమోత్తమము. తక్కిన యాశ్రమములవారికి సిద్ధాసనము మేలు, సిద్ధాసనము వలన నింద్రియనిరోధము, శరీర దార్ఢ్యము, నిర్మల చిత్తవృత్తియు గలుగును. మతాంతరమున సిద్ధాసన మన్ని యాసనములకన్న మిన్న, ఇయ్యది మోక్షద్వారమును తెరచును. కపాలాసనమును దినమున కొక జాము చొప్పున దప్పక మూడు నెల లభ్యసించుచున్న జరామరణములు దరిజేరవు.

అవ॥ ఆసనసిద్ధికి నుపాయమును దెలుపుచున్నారు.

## సూ॥ ప్రయత్నశైథిల్యానంతసమాపత్తిభ్యామ్॥ 47

ప్రయత్నాశైథిల్యానంతసమాపత్తిభ్యామ్॥

ప్రయత్నశైథిల్యానంత సమాపత్తిభ్యాం- ప్రయత్న= స్వాభావిక శరీరచేష్ట యొక్క, శైథిల్య=కొంచపరచుటచేతను, అనంతసమాపత్తిభ్యాం -అనంత= ఆదిశేషుని విషయమున, సమాపత్తిభ్యాం=చిత్తము నేకాగ్రము నొనర్చుటచేతను, ఆసనం= (పూర్వసూత్రానువృత్తము) ఆసనము, భవతి (అధ్యాహృతము) సిద్ధించును.

స్వాభావికమగు శరీరచేష్టను ప్రయత్నమందురు. అట్టి స్వాభావిక శరీరచేష్ట నుడుగుటచే సంగకంపనము గలుగ కుండును గాన నాసనము సిద్ధించును. మరియు ప్రయత్న నిరోధము జేయకున్నను ఫణాధృత

బ్రహ్మాండుడై కదలి మెదలని శేషాహియందు నేకాగ్రముగ చిత్తము నిలిపినను ఆసనసిద్ధి యబ్బును. ఈ యాసనసిద్ధి శేషాహియను గ్రహామునవా? సజాతీయ భావనా బలమునవా? అనంతసమాపత్తి జన్యమగు నదృష్టమునవా? యని వితర్కింప బనిలేదు. అన్ని విధముల నొనగూడ వచ్చును.

అవ॥ ఆసనసిద్ధి సూచితమగు విధము నెరుక పరచుచున్నారు.

## సూ॥ తతో ద్వంద్వానభిఘాతః॥ 48

తతః, ద్వంద్వానభిఘాతః,

తతః = ఆ యాసనసిద్ధివలన, ద్వంద్వానభిఘాతః = శీతోష్ణాది ద్వంద్వములచే బాధ గలుగకుండును.

తాను గోరిన యాసనము సిద్ధించెనేని శీత ద్వంద్వములవలన యోగికి నేమాత్రము పీడ గలుగదు. దానిచే నాసనము సిద్ధించినటుల నెంచవలయును.

అవ॥ ఇంక క్రమప్రాప్తమగు ప్రాణాయామమునకు సామాన్యలక్షణమును వచించుచున్నారు.

## సూ॥ తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణాయామః॥ 49

తస్మిన్, సతి, శ్వాసప్రశ్వాసయోః, గతివిచ్ఛేదః, ప్రాణాయామః॥

తస్మిన్ = ఆయాసనసిద్ధి, సతి = కలుగగా, శ్వాస ప్రశ్వాసయోః - శ్వాస = వెలుపటి వాయువును లోనికి పీల్చుకొనుటయను శ్వాసయొక్కయు, ప్రశ్వాస = కోష్ఠమునందున్న వాయువును బయలుపరచుటయను ప్రశ్వాస యొక్కయు, గతి విచ్ఛేదః = స్వాభావిక గమన మాగిపోవుట, ప్రాణాయామః = ప్రాణాయామ మనబడును.

పురుషుడు స్వభావముగనే వెలుపలి గాలిని పీల్చుకొనుటయను

శ్వాసమును, లోనివాయువును వెలువరించుట యను ప్రశ్వాసయును తమంతటనే వ్యాపారగమనము చేయుచునే యుండును. కాని యాసనము సిద్ధించినతరువాత పై యుచ్ఛ్వాస నిశ్శ్వాసముల వ్యాపారమును నిరోధించుటయే ప్రాణాయామ మనంబడును. ప్రాణాయామ లక్షణము, రేచక, పూరక, కుంభకముల మూడింట ననుగత మగును. కాన సామాన్యలక్షణము. ఇందు రేచకమున నుదరగతమగు వాయువు బయటికి త్రోయబడి బయటనే నిలువబడును గాన, శ్వాస ప్రశ్వాసల వ్యాపారముండదు గాన రేచకమున నన్వయించెను. అట్లే పూరకమున బాహ్యావాయువులోనికి బీల్వబడి లోననే నిలుపబడును. కాన శ్వాసప్రశ్వాసగతి విచ్ఛేదము గలదు గాన పూరకము నందును, లక్షణము సమన్విత మయ్యెను. ఈ విధముననే కుంభకమున వెలుపలి గాలిని లోనికి బీల్వక, లోనిగాలిని వెలువరింపక లోనివాయువును నాసాపుటముననే స్తంభింపజేయుట కుంభక మనబడును గాన నందును శ్వాసప్రశ్వాసగతి విహతి యుండనే యున్నది. కాగా నిది సామాన్యలక్షణము. **''ప్రాణాయామస్తు విజ్ఞేయోరేచ(క)పూరక కుంభకైః'** యను వచనము ప్రధానభూమికలో రేచకాదులను మూడింటిని గలసియే యనుష్ఠింపవలయునని బోధించునే గాని, రేచక పూరక కుంభకములు మూడు గలసిననే ప్రాణాయామ మనునర్థమును బోధింపదు. అందొక్కొక్క టియు ప్రాణాయామమే. కావుననే,

**రేచకం పూరకం త్యక్త్వా సుఖం యద్వాయుధారణమ్।**
**ప్రాణాయామోఽయమిత్యుక్తః స వై కేవలకుంభకః॥**

అను వసిష్ఠసంహితా వచనము సంగత మగును. రేచక పూరకములు లేకుండగనే సుఖముగ వాయునిరోధము జేయుట కేవల కుంభకమును ప్రాణాయామ మని చెప్పబడినది యని శ్లోకభావము. కాగా రేచకాదిత్రయము నకే ప్రాణాయామసంజ్ఞ యని యంగీకరించినచో కేవలకుంభకమును ప్రాణాయామ మనుట పొసగదు గదా! కాన రేచకాదు లొక్కటొక్కటియు ప్రాణాయామములే. వాని యన్నిటియందు వ్యాపించినది గాన నిది

ప్రాణాయామ సామాన్యలక్షణము.

అవ॥ఇక ప్రాణాయామ విశేష లక్షణములను దెలుపుచున్నారు.

**సూ॥ బాహ్యాభ్యన్తరస్తంభవృత్తిర్దేశకాలసంఖ్యాభిః పరిదృష్టో దీర్ఘసూక్ష్మః॥ 50**

బాహ్యాభ్యన్తర స్తంభవృత్తిః, దేశకాలసంఖ్యాభిః, పరిదృష్టః, దీర్ఘసూక్ష్మః॥

స,తు, (ఈరెండుపదము లధ్యాహృతములు) = ఆప్రాణాయామమైతే, బాహ్యాభ్యన్తర స్తంభవృత్తిః = బాహ్యావృత్తియు, నాభ్యంతరవృత్తియు, స్తంభవృత్తి యున్నై, దేశకాలసంఖ్యాభిః = దేశము, కాలము, సంఖ్యయను మూడింటి మూలమున, పరిదృష్టః = అభ్యాసముగుండా పరీక్షింపబడినదై, విభజింపబడి నదియై దీర్ఘ సూక్ష్మః = దీర్ఘ సూక్ష్మము నగును.

ఉదరస్థితమగు వాయువును బయలుపరచుటచే స్వాభావికవాయు గమనాగమన నిరోధము బాహ్యావృత్తి యనబడును. అదియే రేచక ప్రాణాయామము వెలుపలివాయువును లోనికి బీల్చికొని స్వాభావిక వాయుగమనాగమనములను నిలుపుట యాభ్యంతరవృత్తి యనబడును. ఇదియే పూరకము.

ఎట్లుగా గాలిన రాతిపై బోసిన యుదకమంతయు నొకేతూరి పీల్చికొనిపోవు విధమున నొక్కపరి ప్రయత్నవశమున రేచకపూరకములు రెండును లేక నాసాపుటమునందున్న వాయువు నచటనే స్తంభింపజేయుట స్తంభవృత్తి యనబడును. ఇదియే కుంభకము. ఇట్లు రేచక పూరక కుంభకములని స్థూలముగ ముప్విధములగు ప్రాణాయామములను దేశావచ్ఛిన్నమును, కాలావచ్ఛిన్నమును, సంఖ్యావచ్ఛిన్నము నగును.

ఇందు దేశావచ్ఛిన్నమనగా నింతప్రదేశమును వాయువు వ్యాపించినదని యెరుగుట. అది యెట్లనిన రేచక ప్రాణాయామమున దన నాసికాగ్రమున కభీష్టదూరమున దూదిని వ్రేలాడగట్టి తాను రేచించు వాయువుచే నాదూది

కదలకుండుటవలన నింతటి రేచకము చేసితినని యెరుగవలయును. పూరకప్రాణాయామ మునకు బాధతలము మొదలు శీర్షము వరకును విషయమగును గాన తాను లోనికి బీల్చినవాయువు తన శరీరమున నెంతవరకు చీమలు ప్రాకిన విధమున దగులుచున్నట్లు దోచునో నంతవరకు జేరినదని నిర్ణయింపవలయును. ఇట్లే కుంభకమునకు బాహ్యాభ్యంతర దేశములు రెండును విషయములగును గాన దూది కదలకుండుటయు, శరీరమున బిపీలికా సదృశ స్పర్శము లేకుండుట చేతను నిశ్చయింపవలయును.

కాలావచ్ఛిన్నమనగా రేచకాదు లిన్నిక్షణముల పర్యంత మనుష్ఠింప బడినవని యెరుగుట, ఇచట క్షణమనగా రెప్పపాటులో నాల్గవభాగము. సంఖ్యావచ్ఛిన్నత్వ మనగా నిన్ని శ్వాసప్రశ్వాసలచే ప్రథమోద్ఘాతము (రేచకము), నిన్నిటిచే ద్వితీయోద్ఘాతము (పూరకము), మరియు నిన్నింటిచే దృతీయోద్ఘాతము (కుంభకము) అని యెరుంగుట. బయలు పడుచున్న ప్రాణవాయువు అపానమును పీడించుచు స్థిరమగుట యుద్ఘాత మనబడును. ఒకశ్వాసప్రశ్వాసకాలము లేక తన మోకాలిని మూడుమారులు తడివి (నిమిరి) చిటికెవేసిన నగు కాలము మాత్రాకాల మనబడును.

**మార్కండేయమహర్షి మాత్రము:-**

**నిమేషోన్మేషణే మాత్రా కాలో లఘ్వక్షరం తథా।**
**ప్రాణాయామస్య సంఖ్యార్థం స్మృతో ద్వాదశమాత్రికః॥**

అని చెప్పిరి. అనగా నున్మేష నిమేషములు చేయుచరచుట, లఘువగు హ్రస్వాక్షరము - ఇవి మాత్రాకాలమునకు ప్రమాపకములు. ఇట్టి మాత్రలు పన్నెండు ప్రాణాయామమును లెక్కించుట కుపయోగపడునని చెప్పిరి.

2. ఈ మాత్రాసంఖ్యాప్రయుక్త విభాగము కాలవిభాగము లోనే చేరునది యైనను క్షణపరిమితికాల మనియు, శ్వాసప్రశ్వాసరూపమగు మాత్రా పరిమితిసంఖ్య యనియు భేదము కల్పింపబడెను. నాసికాగ్రమునుండి ప్రాదేశ ద్వాదశాంగుల హస్తాది పరిమితి రేచకమునకు విషయము, పాదమునుండి

శిరముదాక నాభ్యంతరభాగము పూరకమునకును, రెండును, కుంభకమున కును విషయములు. ఇది దేశపరిదృష్టి.

3. పదునారుమాత్రల కాలము రేచకమును, ముప్పది రెండుమాత్రల కాలము పూరకమును, అరువదినాల్గుమాత్రల కాలము కుంభకమును జేయుట కాలపరిదృష్టి, ఇదియే సంఖ్యాపరిదృష్టియు నగును.

ఇట్లు రేచకాదులు మూడును మరియొక విధమున గూడ సంఖ్యాపరి దృష్టము లగును. ఎట్లనగా.

**మాత్రాద్వాదశకో మందః చతుర్వింశతి మాత్రకః।**
**మధ్యమః ప్రాణసంరోధః షట్త్రింశ న్మాత్రికో ఽంతిమః॥**

**అనగా-**

4. ద్వాదశమాత్రాకాల మాచరింపబడిన ప్రాణాయామము మంద మన బడును. ఇబ్బడి యగునది యనగా నిరువదినాల్గు మాత్రలకాల మాచరింపబడినది మధ్యమము. ముబ్బడిగ ననగా ముప్పదియారు మాత్రల కాల మాచరింపబడినది యంతిమము, లేక తీవ్రము ననబడును.

5. అని కూర్మపురాణమున జెప్పిన విధమున రేచకాదుల కన్నింటికి నొకేవిధమున మంద మధ్య తీవ్ర భేదములు కొందరికి సమ్మతములు. మరియు నీ ప్రాణాయామము దేశకాలసంఖ్యాపరివృద్ధితోడ దివస పక్ష మాసాది దీర్ఘకాలాభ్యస్త మగునేని దీర్ఘసూక్ష్మ మగును. అనగా దీర్ఘకాల్యాపి యగును. కాన దీర్ఘమును పరనైపుణ్యసమధిగమ్యము గాన సూక్ష్మము నగును. అనగా నేకు కొలదియు దూది విడివడి దీర్ఘమై సూక్ష్మమగు విధమున ప్రాణాయామము సయితము ఆచరించుకొలది దీర్ఘసూక్ష్మ మగును. సూత్రమున రేచక పూరక కుంభకములు క్రమముగా జెప్పియున్నను, పూరక కుంభక రేచకములను క్రమమే యనుష్ఠాన సిద్ధమును పురాణ ప్రసిద్ధమునై యున్నది గాన నాదర్తవ్యము.

అవ॥ ఇట్లు ప్రాణాయామత్రయమును నిరూపించి నాల్గవ ప్రాణాయామమునకు లక్షణమును దెలుపుచున్నారు.

## సూ॥బాహ్యాభ్యన్తరవిషయాక్షేపీ చతుర్థః॥ 51

బాహ్యాభ్యన్తర విషయాక్షేపీ, చతుర్థః॥

బాహ్యాభ్యన్తర విషయాక్షేపీ-బాహ్య = రేచకమును, అభ్యన్తర విషయ = పూరక ప్రాణాయామమును, ఆక్షేపీ =అపేక్షింపనిది. ప్రాణాయామః = (ఈ పదము 49నుండి యనువృత్తము) ప్రాణాయామము, చతుర్థః =నాల్గవది.

కుంభకము సహితకుంభక మనియు కేవల కుంభకమనియు రెండు విధములు. సహిత కుంభకమనగా పూరకమునకు గాని రేచకమునకుగాని తరువాత జేయు ప్రాణనిరోధము. ఇందు పూర్వకాద్యపేక్ష యున్నది. కాన సహిత కుంభకమని యందురు. కావుననే **"ఆరేచ్యాపూర్య వాకుర్యాత్ స హి సహితకుంభ్యకః"** యని స్మృతులయందు జెప్పబడెను. 49-వ సూత్ర తాత్పర్యమునందు జెప్పిన వసిష్ఠ సంహితావచనానుసారముగ పూరకాద్యపేక్ష లేక తొలుదొలుతయే ప్రాణనిరోధము చేయుట కేవల కుంభకము. దేశకాల సంఖ్యాపరిచ్ఛిన్న మగు రేచకమును అట్టి పూరకము నతిక్రమించి సహితకుంభకము సకృత్ ప్రయత్న సాధ్యమై దీర్ఘసూక్ష్మ మగును. వీనిని గ్రమముగ నభ్యసించుటచే పూర్వభూమికలను జయించి శ్వాసప్రశ్వాసల గమనమును నిరోధించుట కేవలకుంభకము.

ఆక్షేపీ శబ్దమునకు విచార పూర్వక వర్తన మనియు నర్థము గలదు. కాన రేచక పూరక సంబంధమగు దేశకాల సంఖ్యలను విచారింపకయే, పరీక్షింప కయే, సకృత్ప్రయత్న నిర్వర్తితమై, దేశకాల సంఖ్యాపరిచ్ఛిన్నమై దీర్ఘ సూక్ష్మమగు శ్వాసప్రశ్వాసగత్యభావము సహితకుంభకము. రేచక పూరకముల దేశకాలాది విషయముల నాలోచించియే క్రమముగ నభ్యాసమువలన పూర్వభూమికలను జయించిన, కడకు రేచకపూరాకా ద్యపేక్ష లేకయే గలుగు శ్వాస ప్రశ్వాసగతి నిరోధము కేవల కుంభకమను చతుర్థ ప్రాణాయామము,

కాన కేవల కుంభకము సులువుగా గలుగునది కాదు. అభ్యాస వశమున బూర్వపూర్వ భూమికలను గడచిన క్రమముగా లభించును.

కాగా సకృత్ప్రయత్నముచే బ్రాణవాయునిరోధము సహితకుంభకము, అభ్యాస నైపుణ్యవశమున బూర్వభూమికలను గడచి సూక్ష్మీభూతము లగు ప్రాణములను నిరోధించుట కేవలకుంభకమని యీ రెంటికిని భేదము నెరుంగవలయును. ఈ కేవల కుంభకము రేచకాది దేశకాలాది నియమముల నతిక్రమించినది గాన వ్యాపకము. కావుననే విష్ణుపురాణమున ధ్రువు డీప్రాణాయామముచే ప్రాణనిరోధము చేసినందున సకల జీవప్రాణనిరోధము గలిగెనని ప్రతిపాదింపబడి యున్నది. వసిష్ఠసంహితలో నీ కేవలకుంభక ప్రాణాయామమును గురించి యిట్లు చెప్పబడియున్నది.

**ప్రస్వేదం జనయేద్యస్తు ప్రాణాయామో హి సోఽధమః।**
**మధ్యమః కంపనాత్ప్రోక్త ఉత్థానం చోత్తమో భవేత్॥**

దిగ చెమటలు పోయునేని యది యధమకుంభకము, శరీరకంపము గలిగెనేని మధ్యమము, శరీరోత్థతి గలిగెనేని యది యుత్తమ ప్రాణాయామము.

**పూర్వం పూర్వం ప్రకుర్వీత యావదుత్తర సంభవః।**

ఇందు తొలుతటి కుంభకముల నభ్యసించుచు పైపై కుంభకములు గలుగు దనుక ప్రయత్నింపవలయును.

**నిశ్వాసోచ్ఛ్వాసకౌ దేహే స్వాభావికగుణావుభౌ।**
**తథాఽపి నశ్యత స్తేన ప్రాణాయామోత్తమేన హి॥**

శ్వాస ప్రశ్వాసలు శరీరమున సహజములయ్యు నుత్తమ ప్రాణాయామముచే నశించును.

**తయోర్నాశే సమర్థస్స్యా త్కర్తుం కేవలకుంభకమ్॥**

ఆ రెండును నశించెనేని కేవలకుంభకమును జేయజాలును.

**రేచకం పూరకం త్యక్త్వా ముఖ్యం యద్వాయుధారణమ్।**
**ప్రాణాయామోఽయమిత్యుక్తః స వై కేవలకుంభకః॥**

రేచక పూరకములను దిగవిడచి ముఖ్యముగ వాయునిరోధ మొనర్చుటయే కేవల కుంభక ప్రాణాయామము.

**సహితం కేవలం వాఽపి కుంభకం నిత్యమభ్యసేత్।**
**యావత్కేవలసిద్ధిస్స్యాత్తావత్సహితమభ్యసేత్॥**

సహితకుంభకమును గాని కేవలకుంభకమునుగాని ప్రతిదినము నభ్యసింపవలయును. కేవలకుంభకము సిద్ధించువరకే తత్సాధనముగ సహితకుంభకము నభ్యసింపవలయును.

**కేవలే కుంభకే సిద్ధే రేచపూరకవర్జితే।**
**న తస్య దుర్లభం కించిత్ త్రిషు లోకేషు విద్యతే॥**

రేచక పూరకాపేక్షలేని కేవలకుంభకము సిద్ధించెనేని యట్టివానికి మూడు లోకములయందును దుర్లభ మగునది యుండదు.

మరియు బాహ్యకుంభకమనియు ఆంతర కుంభకమనియు, భేదము గలదు. ఇంకను ప్రణవముతో గూడినది సగర్భప్రాణాయామ మనియు, కానిది అగర్భప్రాణాయామ మనియు పేరుగలిగియున్నది. ప్రణవమేగాక గాయత్ర్యాది ఇష్టదేవతామంత్ర దేవతా భావములతో గూడినది వైదిక ప్రాణాయామమనియు, అట్లు కానిది ఐతిహప్రాణాయామ మనియు, సంజ్ఞగలిగియున్నది. అచంచలమగు పరబ్రహ్మభావము సదా గలిగి యుండునది బ్రహ్మప్రాణాయామ మనియు విఖ్యాతి గలిగినది. కట్టకడకు అందరున్ను ఇట్టి స్థితికి వచ్చినప్పుడే కృతార్థులు.

అవ॥ ప్రాణాయామమున కవాంతర ఫలమును దెలుపుచున్నారు.

**సూ॥ తతః క్షీయతే ప్రకాశావరణమ్॥ 52**

తతః, క్షీయతే, ప్రకాశావరణమ్॥

తతః = ఆప్రాణాయామానుష్ఠానమువలన ప్రకాశావరణం, ప్రకాశ= ప్రకాశరూపమగు వివేకజ్ఞానమునకు, ఆవరణం = ఆచ్ఛాదకమగు నజ్ఞానము, క్షీయతే = క్షీణించును.

బుద్ధినిష్ఠమగు వివేక జ్ఞానరూప ప్రకాశమును బయలు పడకుండ కప్పుకొనియుండు నవిద్యాది క్లేశములును, అజ్ఞానజన్య పాపమును, ప్రకాశావరణ మనబడును. ఈ విషయమున బంచశిఖాచార్యులును **''మహామోహ మయేంద్రజాలేన ప్రకాశశీలం సత్త్వమావృత్య తదేవాకార్యే నియుంక్తే''** అనిరి. అనగా నింద్రజాల తుల్యమైన మహామోహ సంజ్ఞాక మగు రాగముచేతను, తదవినాభావియగు నవిద్యచేతను, ప్రకాశస్వభావ మగు బుద్ధిసత్త్వమును గప్పికొని యా యవిద్యా జన్యమగు నధర్మమే సంసార కారణమగు నకార్యమున బురుషుని బురికొల్పును అని భావము.

ఇట్లు ప్రకాశావరకమై సంసారకారణభూతమై యజ్ఞాన జన్యమగు పాపరూపకర్మ ప్రాణాయామాభ్యాసము చేయుకొలదియు దుర్బల మగును. మరియు క్షణక్షణమునకును క్షీణించును. ఈ విషయమున బంచ శిఖాచార్యులును -

**తపో న పరం ప్రాణాయామాత్ తతో విశుద్ధిర్మలానాం దీప్తిశ్చ జ్ఞానస్య॥**

యనిరి. అనగా ప్రాణాయామమునకన్న మిన్నయగు తపము వేరొండు లేదు. ఆ ప్రాణాయామమువలన రాగాది చిత్తములకు శోధనమును, జ్ఞానదీప్తియు గలుగును అని భావము. మనువు సయితము.

**దహ్యన్తే ధ్మాయమానానాం ధాతూనాం హి యథా మలాః।**
**తథేంద్రియాణాం దహ్యన్తే దోషాః ప్రాణస్య నిగ్రహాత్॥**

కొలిమిలో నుంచి యూదిన సువర్ణాది ధాతువుల మలము లుడుగు పగిది ప్రాణాయామమువలన మానసాదీంద్రియగతములగు దోషములు దగ్ధమగును

**ప్రాణాయామైర్దహేద్దోషాన్, ధారణాభిశ్చ కిల్బిషమ్।**
**ప్రత్యాహారేణ సంసర్గాన్ ధ్యానేనానీశ్వరాన్ గుణాన్॥**

ప్రాణాయామములచే రాగాది చిత్తదోషములను గాల్పవలయును. ధారణావశమున పాపమును, ప్రత్యాహారముచే నింద్రియములకు గలుగు విషయ సంసర్గములను, ధ్యానముచే ననీశ్వర గుణములగు లోభాదులను కాల్చివేయవలయును అని నుడివిరి.

అవ॥ ఇంక ప్రాణాయామమునకు బ్రధాన ప్రయోజనమును నుడువుచున్నారు.

## సూ॥ ధారణాసు చ యోగ్యతా మనసః॥ 53

ధారణాసు, చ, యోగ్యతా, మనసః॥

తతః (పూర్వసూత్రమునుండి యనువృత్తము) = ఆప్రాణాయామాభ్యాసమువలననే, మనసః = మనస్సునకు, ధారణాసు = చెప్పబోవు ధారణలయందు, యోగ్యతా = అర్హత గలుగును.

ప్రాణాయామాభ్యాసమువలన ముఖ్యముగా చిత్తము, పై జెప్పబోవు చిత్తబంధనకారులగు ధారణలకు యోగ్యముగ నగును. ఈ విషయ మింతకు ముందే యోగపాదము ముప్పదినాల్గవదియగు " **ప్రచ్ఛర్దనవిధారణాభ్యాం వా ప్రాణస్య**" యను సూత్రముననే దెలుపబడెను. కాన నా సూత్రమునగూడ రేచకాదిత్రయాత్మక మగును, ప్రాణాయామమే వివక్షింపబడెనని యెరుంగునది.

అవ॥ ఇంక బ్రత్యాహారమునకు లక్షణమును నుడువుచున్నారు.

## సూ॥ స్వవిషయాసంప్రయోగే చిత్తస్య స్వరూపానుకార ఇవేన్ద్రియాణాం ప్రత్యాహారః॥ 54

స్వవిషయాసంప్రయోగే, చిత్తస్య, స్వరూపానుకారః, ఇవ, ఇన్ద్రియాణాం,

ప్రత్యాహారః॥

ఇంద్రియాణాం = చక్షురాదివాగాదీంద్రియములకు, స్వవిషయా సంప్రయోగే, స్వవిషయ = తమతమ విషయముల తోడ, అసంప్రయోగో = సన్నికర్షము లేకపోవుటచే, చిత్తస్య = మనస్సుయొక్క, స్వరూపానుకారః ఇవ = స్వరూపసదృశ స్వరూపము గలవివలె (ఇంద్రియములు) నుండుట, ప్రత్యాహారః = ప్రత్యాహారమను యోగాంగ మగును.

విజితేంద్రియుడు గానివాని యింద్రియములు మనస్సుతోడ గలసి రూపాదివిషయములపైకి బారును గాన నచట నింద్రియములు విషయాకారము నొందగా జిత్త మింద్రియాకారము నొందియుండును.

జితేంద్రియునకన్ననో యింద్రియములకు దమతమ విషయముల తోడ సన్నికర్షము (సంయోగ, సంయుక్త సమవాయాదులు) ఉండదు గాన నింద్రియములే ధ్యేయవస్త్వాకారమున నున్న చిత్తపుటాకారమున నున్నటు లుండును. అనగా నా యింద్రియములు స్వతంత్రముగా విషయాంతర మునకు బ్రసరింపజాలవు. కాన చిత్తము నిరోధింపబడెనేని యింద్రియములు గూడ నిరర్థములై వ్యాపార రహితము లగును. రాబోవు సూత్రవివరణమున దెలుపబోవు నితరేంద్రియ జయముల కుపాయాంతరము కావలసి యున్నటులు నీ యింద్రియములకు జిత్తనిరోధేతరమగు నుపాయ మపేక్షితము గాదు. తేనెటీగలలోని పోతుటీగ వెంబడియున్న తేనెటీగ లన్నియు నది యెగిరినచో నెగురుచు నది వ్రాలినచోట వ్రాలుచుండు విధమున, నింద్రియములు సయితము చిత్తము విషయాసక్త మగునేని దామును విషయ ప్రవణములగుచు, చిత్తము నిరుద్ధ మయ్యెనేని తామును నిరుద్ధములై పోవును. కాగా చిత్త నిరోధమూలమున గలిగిన స్వతస్సిద్ధమగు నింద్రియ నిరోధము ప్రత్యాహార మనబడను. విష్ణుపురాణముననను-

**శబ్దాదిష్వనుషక్తాని నిగృహ్యాక్షాణి యోగవిత్।**

**కుర్యాచ్చిత్తానుకారీణి ప్రత్యాహార పరాయణః॥** అని చెప్పబడెను, అనగా - ప్రత్యాహారమును సాధింప నెంచిన యోగి విషయసక్తములగు

నింద్రియములను వానినుండి తొలగించి చిత్తాకారమున నుండునవిగ నొనర్పవలయునని భావము.

అవ॥ ఇంక బ్రత్యాహారమునకు ఫలమును నిరూపించుచున్నారు.

## సూ॥ తతః పరమా వశ్యతేన్ద్రియాణామ్ ॥ 55

**ఇతి పాతంజలే సాంఖ్య ప్రవచనే యోగశాస్త్రే సాధనపాదః ద్వితీయః॥**

తతః, పరమా, వశ్యతా, ఇంద్రియాణామ్॥

తతః = ఆప్రత్యాహారమువలన, ఇంద్రియాణాం = ఇంద్రియముల యొక్క, పరమా = ఉత్కృష్టమగు, వశ్యతా = వశీకరణము గలుగును.

ప్రత్యాహారమూలమున నింద్రియపర వశీకారము గలుగును. సామాన్యేంద్రియ జయములకన్న నిది యుత్తమ మైనది గాన దీనిని పరవశీకార మందురు. శబ్దాది విషయముల యందాసక్తి లేకుండుట ఇంద్రియ జయమని కొందరందురు. శాస్త్రావిరుద్ధమగు శబ్దాది విషయసేవనము, నిషిద్ధవిషయ పరిత్యాగము, నింద్రియజయమని మరికొందరు, రాగద్వేషములను విడనాడి సుఖదుఃఖ దూరముగ శబ్దాదుల నెరుగుట యింద్రియ జయమని మరికొందరి మతము. ఇవి యన్నియు సామాన్యేంద్రియ వశీకారములు.

జైగీషవ్యుడను యోగి ''జిత్తమేకాగ్ర మగుటచే నింద్రియములు శబ్దాది విషయములయందు బ్రవృత్తములు గాకుండుటయే'' యింద్రియవశీకార మని చెప్పిరి. ఇదియే సూత్రకర్త యుపదేశించిన పరమవశీకారము. ఇందు చిత్తము నిరుద్ధమైన మాత్రముననే యింద్రియము లన్నియు తమంతటనే నిరుద్ధము లగును గాని పై యింద్రియజయములకువలె నుపాయాంతర మవసరము గాదు. కావుననే దీని కింద్రియ వశీకారములలో పరత్వము.

యతమాననామక వైరాగ్యము లభించినను అన్యేంద్రియములను జయించుటకే కేంద్రీయసంజ్ఞక వైరాగ్య మవశ్యాపేక్షితమగు విధమున, ప్రాణాయామవశమున జిత్త విరోధ మేర్పడినచో బాహ్యేంద్రియ నిరోధమున

కుగా ప్రయత్నాంతర మవసరము లేకయే స్వయముగనే పరవశీకారము సిద్ధించును. ఇది ప్రత్యాహారమునకు ఫలము.

ఈ సాధనపాదమున నెనిమిది యోగాంగములలో బాహ్య సాధనములైన యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారములను నైదంగములు మాత్రము తెలుపబడెను.

ఆంతర సాధనములగు తక్కిన మూడును, విభూతిపాదమున దెలుపబడును.

సంగ్రహ శ్లోకము-

**క్రియాయోగం జగౌ క్లేశాన్ విపాకాన్ కర్మణామిహ।**
**తద్దుఃఖత్వం తథా వ్యూహాన్ పాదే యోగస్య పంచకమ్॥**

క్రియాయోగము, క్లేశములు, కర్మవిపాకములు, తద్దుఃఖత్వము, వ్యూహములు ననునైదు విషయములు సాధనపాదమునందు దెలుపబడెను.

ఇట్లు పతంజలిమహర్షి ప్రణీతమగు 'సాంఖ్యప్రవచనరూపమైన
యోగశాస్త్రము' నందు రెండవది యగు సాధనపాదము ముగిసినది.

ఇట్లు, తిరుమలై కండ్యూర్ తిరువేంగడాచార్య విరచితమగు
పాతంజల యోగదర్శన 'భాష్యార్థ ప్రకాశిక' యను
నాంధ్రవివరణమున రెండవది యగు
సాధనపాదము ముగిసెను.



1. దీని వివరణము యోగపాదాంతమున వ్రాయబడినది.

శ్రీహయగ్రీవాయ నమః

# పాతంజల యోగదర్శనము

## 3 విభూతిపాదము

అవ॥ ప్రథమపాదమున యోగము, ద్వితీయపాదమున నాయోగమునకు సాధనములు నిరూపింపబడెను. ఇక నీ తృతీయపాదమున యోగ సాధనముల ననుష్ఠించుటలో శ్రద్ధను గలిగించుటకు విభూతులు దెలుపవలసి యున్నవి. వక్ష్యమాణములగు నా విభూతులు సంయమ సాధ్యములు. సంయమము ధారణాధ్యాన సమాధి సమూహమే గాన నింతకు ముందు నిరూపించిన యైదంగములును బహిరంగములై, ధారణాదులు మూడు నంతరంగము లగును. కాన నీ విశేషమును దెలుపుట కీ పాదమున వాని నిరూపించు చున్నారు. కావుననే భాష్యకారు లగు వ్యాసభగవాను లీపాదారంభమున "**ఉక్తాని పంచ బహిరంగాణి సాధనాని ధారణా వక్తవ్యా**" యనిరి. అనగా బహిరంగమగు సాధన పంచకము గతపాదమున నిరూపింపబడెను. అంతరంగ సాధనములు మూడింటిని ఈపాదమున నింక దెలుపవలయును. అందును గ్రమప్రాప్తము నియతపూర్వభావియు నగు ధారణను దొలుత నిరూపింప వలసియున్నది యని భావము.

**సూ॥ దేశబంధశ్చిత్తస్య ధారణా॥** **1**

దేశబంధః, చిత్తస్య, ధారణా॥

చిత్తస్య = చిత్తమునకు, దేశబంధః = ఏదియేని ఒక ప్రదేశము తోడ సంబంధము, ధారణా = ధారణయను యోగాంగము.

నాభిచక్రము, హృత్పుండరీకము, మూర్ధజ్యోతిస్సు, నాసికాగ్రము, జిహ్వాగ్రము, తాలువులు - మొదలగు నాధ్యాత్మిక దేశరూప విషయముల యందును, హిరణ్యగర్భవాసవ ప్రజాపతి చంద్రసూర్య ప్రభృతి బాహ్య విషయమునందేని చిత్తమునకు వృత్తి(జ్ఞాన) మాత్రముచే సంబంధము ధారణ యనబడును. స్థూలముగాని, సూక్ష్మముగాని యుండి, బాహ్యమై

గాని అభ్యంతరమై గాని యుండిన ఏదియో ఒకవస్తు వునందు జిత్తము నేకాగ్రముగ నిలుపుట ధారణ యనబడును.

గరుడపురాణమున ధారణలు పది చెప్పబడెను.

**ప్రాజ్నాభ్యాం హృదయే వాఽథ తృతీయే చ తథోరసి।**
**కంఠే ముఖే నాసికాగ్రే నేత్ర భ్రూమధ్య మూర్ధసు।**
**కించిత్తస్మాత్పరస్మింశ్చ ధారణా దశ కీర్తితాః॥**

1.నాభిచక్రము, 2. హృత్పుండరీకము, 3.వక్షఃస్థలము, 4.కంఠము, 5.జిహ్వాగ్రము, 6.నాసాగ్రము. 7.నేత్రములు, 8.భ్రూమధ్యము, 9.మూర్ధము. 10.మూర్ధమునకు పైన ద్వాదశాంగుళ పర్యంత ముండు జ్యోతిస్సనునవి పది యాలంబనములు గాగా ధారణలు పది యయ్యెను. రాజునకు సింహాసనమువలె నీ నాభ్యాదులు జీవేశ్వరులకు ముఖ్యస్థానములు గాన నివి ధారణకు తగిన యాధ్యాత్మిక దేశములు.

మరియు గారుడముననే-

**ప్రాణాయామైర్ద్వాదశభిర్యావత్కాలః కృతో భవేత్।**
**స తావత్కాలపర్యంతం మనో బ్రహ్మణి యోజయేత్॥**

అనగా-సాధకుడు పన్నెండు ప్రాణాయామములను ష్ఠించునంత పట్టును చిత్తమును ఈశ్వరునియందేకాగ్ర మొనర్పవలయునని చెప్పబడినది. కాన ద్వాదశ ప్రాణాయామకాలము ధారణను నిలిపి తీరవలయునేగాని క్షణకాలము మాత్రము చేసిన ధారణ, ధారణ కాజాలదు.

విష్ణుపురాణమునందు-

**ప్రాణాయామేన పవనం ప్రత్యాహారేణ చేంద్రియమ్।**
**వశీకృత్య తతః కుర్యాచ్చిత్తస్థానం శుభాశ్రయే॥**

అని చెప్పబడి యుండుటచే ప్రాణాయామముచే వాయువును నిరోధించి ప్రత్యాహారముచే నింద్రియములను నిరోధించి పరవశీకారము

కలిగిన యనంతరము చిత్తమును శుభాశ్రయమగు చతుర్భుజాది విష్ణు మూర్తియం దేకాగ్ర మొనర్పవలయును.

అవ॥ఇంక ధారణాసాధ్యమగు ధ్యానమునకు లక్షణము నెరుక పరచుచున్నారు.

## సూ॥ తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్॥ 2

తత్ర, ప్రత్యయైకతానతా, ధ్యానమ్॥

తత్ర = పూర్వోక్తదేశమునందు, ప్రత్యయైకతానతా- ప్రత్యయధ్యేయా లంబనమగు చిత్తవృత్తికి, ఏకతానతా = ఏకాగ్రతయే, ధ్యానమ్ = ధ్యానమను యోగాంగము.

ధారణా లక్షణ ప్రతిపాదక సూత్రమున దెలుపబడిన యేదేనొక దేశమునందు ధ్యేయవస్తువు నవలంబించియుండు చిత్తవృత్తికి తైలధారవలె నవిచ్ఛిన్న సదృశ ప్రవాహము విషయాంతర సంబంధరహిత మయ్యేనేని ధ్యానమనబడును.

**తద్రూపప్రత్యయైకాగ్ర్య సంతతిశ్చాన్య నిస్పృహా।**
**తద్ధ్యానం షడ్భిరఙ్గైః ప్రథమై ర్నిష్పాద్యతే నృప!॥**

అను పురాణవచనము సయితము ధ్యేయాకారము నొందిన చిత్తవృత్తికి విజాతీయవృత్తికి సంబంధశూన్యమైన సజాతీయైకాగ్రతా ప్రవాహమే ధ్యాన మనియు, నది తొలుతటి యారంగములచే నేర్పడు ననియు దెలుపుచున్నది.

గరుడపురాణమున-"**తస్యైవ బ్రహ్మణి ప్రోక్తం ధ్యానం ద్వాదశ ధారణా,**" యను వచనముచే ద్వాదశ ధారణలు చేయుట కనువుపడు కాలము భగవంతునియందు చిత్తమవిచ్ఛిన్నముగ నిలుపుట ధ్యానమగునని కాలనియమము విధింపబడినది.

అవ॥ ఇంక ధ్యాననిష్పాద్యమగు సమాధి నెరింగించుచున్నారు.

**సూ॥ తదేవార్థమాత్రానిర్భాసం**
**స్వరూపశూన్యమివ సమాధిః॥ 3**

తత్, ఏవ, అర్థమాత్రానిర్భాసం, స్వరూపశూన్యం, ఇవ, సమాధిః।

తత్ ఏవ = పూర్వోక్తజ్ఞానమే, అర్థమాత్రానిర్భాసం, అర్థమాత్రా = ధ్యేయాకారమాత్రమైన, నిర్భాసం = నిరంతర ప్రతీతి గలదియై, స్వరూపశూన్యం ఇవ = తనరూపమగు ధ్యానాకారము లేనిదివలె (నగునేని) సమాధిః = సమాధి యను యోగాంగ మగును.

ధ్యానము నిరంతరాభ్యాసవశమున ధ్యేయాకారమున బరిణమించి తన ధ్యానరూపమును దోపనీయక నీటిలో బడిన లవణము నీరుగా బరిణమించి లవణాకారమును గనుపరుపని చందమున నుండునేని యట్టిధ్యానమే సమాధి యనబడును. కాని ధ్యానమునందు ధ్యాతృధ్యాన ధ్యేయములు గలసిన త్రిపుటి భాసించును. సమాధి యందన్ననో ధ్యేయము మాత్రము భాసించును. ఇంత మాత్రమే ధ్యానసమాధులకు భేదము. ధ్యానమునందును ధ్యేయము భాసించును గాన దాని యందతిప్రసక్తము గాకుండుటకు మాత్రశబ్దమును, సమాధియందు ధ్యానస్వరూపమే లేకున్న ధ్యేయము భాసించుట పొసగదు గాన నవ్యాప్తినిరాసమునకై 'ఇవ' శబ్దమును సమాధి లక్షణమున నుపయోగింప బడెను.

**ధ్యానం ద్వాదశపర్యన్తం మనో బ్రహ్మణి యోజయేత్।**
**తిష్ఠేత్తల్లయతో యుక్తః సమాధి స్సోఽభిధీయతే॥**

అను గారుడవచనముచే ద్వాదశధ్యానము లొనర్చువరకును మనసు పరబ్రహ్మమున లీనమై ధ్యేయాకారమున నుండెనేని సమాధి యగునని తెలియుచున్నది.

అవ॥ లాఘవముకొరకు ధారణధ్యానసమాధులు మూడింటికిని తాంత్రిక భాషను దెలుపుచున్నారు.

**సూ॥ త్రయమేకత్ర సంయమః॥** **4**

త్రయం, ఏకత్ర, సంయమః,

ఏకత్ర = ఏకవిషయకమగు, త్రయం = ధారణాధ్యాన సమాధులు మూడును, సంయమః = సంయమమని చెప్పబడును.

ఏకవిషయకమగు ధారణాధ్యాన సమాధులు మూడును కలసి యోగశాస్త్రపరిభాషచే సంయమమని వ్యవహరింపబడును. అనగా నేవిషయమున ధారణ యొనర్పబడెనో యావిషయముననే ధ్యానమును సమాధియు గలిగెనేని సంయమ మగును గాని యొక విషయమున ధారణ యును, తదన్య విషయమున ధ్యానమును, తదన్యవిషయమున సమాధియు గలిగెనేని యీత్రయము సంయమ మనబడదు.

అవ॥ సంయమాభ్యాసమునకు ఫలమును దెలుపుచున్నారు.

**సూ॥ తజ్జయాత్ప్రజ్ఞాలోకః॥** **5**

తజ్జయాత్, ప్రజ్ఞాలోకః॥

తజ్జయాత్= ఆసంయమమును స్థిరమొనర్చుకొనుట వలన, ప్రజ్ఞాలోకః- ప్రజ్ఞా=సమాధిప్రజ్ఞ యొక్క, ఆలోకః= దీప్తివృద్ధి గలుగును.

సంయమము నభ్యసించుచు నందు దార్ఢ్యమును సంపాదించిన యోగికి సంయమము దృఢత నొందుకొలదియు సమాధిప్రజ్ఞ యంత కంతకు విశదమగుచుండును. అనగా నతిసూక్ష్మవ్యవహితాద్యర్థములకు పరప్రత్యక్షీకరణసామర్థ్యము వృద్ధి జెందుచుండును. అనగా ఏ వస్తువు గూడ అడ్డు లేక గోచర మగును.

అవ॥ ప్రజ్ఞాలోకమను ఫలము గలుగవలయునన్న సంయమమునే విషయమున వినియోగింపవలయునో తెలుపుచున్నారు.

**సూ॥తస్య భూమిషు వినియోగః॥** **6**

తస్య, భూమిషు, వినియోగః॥

తస్య= ఆ సంయమమునకు, భూమిషు= సవితర్కాది యోగావస్థల యందు, వినియోగః= నియోజనము (చేయవలయును).

ఇంతకుముందు తెలిపియున్న స్థూలవిషయములను విషయీకరించు సవితర్క నిర్వితర్క సమాపత్తులును, సూక్ష్మ భూతములు విషయముగా గల సవిచారనిర్విచార సమాపత్తులును నను యోగభూమికలలో పూర్వపూర్వ భూమికలను జయించును. వాని వెన్వెంటనుండు నుత్తరోత్తర భూమికల యందు సంయమమును వినియోగించినచో ప్రజ్ఞాలోకరూపమగు ఫలము లభించును. కాని క్రిందిభూమికను జయింపకయే యా భూమికను దాటి యుత్తర భూమికయందు సంయమమును బొందజాలడు. ధనురభ్యాసి స్థూల లక్ష్యవేధమున సిద్ధహస్తుడు గాక సూక్ష్మ లక్ష్యవేధమున సమర్థుడు గాజాలడు. మరియు ప్రాసాదాధిరోహణము జేయునతడు పూర్వాపూర్వ సోపానములయందు గాలూనకయే పై మెట్టున కాలుంచెనేని పతితుడే యగును గదా! కాన పూర్వభూమికయం దుత్తీర్ణుడు గాక యుత్తరభూమిక యందు సంయమసిద్ధియే లేదు గాన తత్ఫలమగు ప్రజ్ఞాలోకము బొత్తుగా గలుగ వీలులేదు.

కాననే విష్ణుపురాణమున.

**తతశ్శంఖగదాచక్రశార్ఙ్గాదిసహితం బుధః।**
**చింతయేద్భగవద్రూపం ప్రశాంతం సాక్షసూత్రకమ్।**

**యదా చ ధారణా తస్మిన్నవస్థానవతీ తతః।**
**కిరీట కేయూరముఖై ర్భూషణై రహితం స్మరేత్।**

**తదైకావయవం దేవం సోఽహం చేతి పునర్బుధః।**
**కుర్యాత్తతోహ్యహమితి ప్రణిధానపరో భవేత్॥**

అని చెప్పబడెను. అనగా- తొలుదొలుత శంఖచక్రాద్యాయుధాది విశిష్టమై సాక్షసూత్రమై ప్రశాంతమగు భగవద్వ్యక్తిని ధ్యానించుటకు దొరకొని యచట

ధారణ నిలకడజెందిన యనంతరము శంఖచక్రాదులను విడచి కేవలము కేయూరాది సహితునిగ ధ్యానించుచు, నట్లు ధ్యానము స్థిరపడినతరువాత కేయూరాద్యాభరణ రహితునిగ ధ్యానించుచు, నట్లు ధ్యానము గుదురుకొనిన తరువాత ముఖపాదాదులలో నొకేయవయవమును భావించుట, నదియు నిలిచిన యనంతరము సోఽహంభావనయు, నది సిద్ధించిన తరువాత 'అహమస్మి' యను భావనమును చేయువలయునని భావము. కాగా స్థూలభావనతో ప్రారంభించి క్రమముగ సూక్ష్మభావనలలోనికి ప్రవేశింప వలయునే గాని యొకేతూరి సూక్ష్మమునకు బోరాదని పురాణములోని యభిప్రాయము. కాని యీశ్వరానుగ్రహమున సంయమ ముతో బనిలేకయే యుత్తరభూమికాజయము సిద్ధించెనేని యంతకు ముందటి భూమికలు సాధింపవలసిన పనిలేదు. కాన నట్టి యధికారి పరచిత్తజ్ఞానాదుల (2-19సూ॥) యందుగాని, విరాడాది స్థూలరూపముల యందుగాని సంయమము నభ్యసింపకయే సూక్ష్మ రూపమున సంయమసిద్ధి నొంద గలుగును.

మరియు పూర్వపూర్వ భూమికలకు ఫలమగు నుత్తర భూమికలు భగవత్ప్రసాదముననే లభించెను గాన, పూర్వభూమికాభ్యాసము పనిలేదనునది సువిదితమే. పూర్వజన్మమున కొన్ని భూమికలను సాధించిన యోగి ఉత్తర భూమికలు మాత్రమే సాధింపవలసియుండును. సంయ మాభ్యాసశీలుడగు పురుషుడుత్తర భూమికలో దన చిత్తమును పరీక్షించి యందుత్తీర్ణు డయ్యెనని తలచెనేని యంతకు లోనున్న భూమికలను జయింప యత్నింప బనిలేదు.

కాగా నివ్విధమున నధికారభేదమున భూమికల క్రమము వేరగును గాన యోగబలమువలననే 'యీభూమికలో నాచిత్తము నిశ్చలమై యున్నది. ఇక నీ భూమికను జయింపవలయును' అని యెరుగవలయును. కావుననే

**యోగేన యోగో జ్ఞాతవ్యో యోగో యోగాత్ప్రవర్తతే ।**
**యోఽప్రమత్తస్తు యోగేన స యోగే రమతే చిరమ్ ॥**

అనగా నే యోగభూమికలో చిత్తము సమాయత్తమై యున్నదో యుత్తర భూమిక యెయ్యదియో యా విషయము యోగబలమువలననే యెరుగబడును. మరియు పూర్వపూర్వ యోగభూమికాజయమువలన తనంతటనే యుత్తరభూమికాప్రాప్తి గలుగును. యోగసిద్ధియందు మెలకువ గలిగిన యధికారి యనంత కాలము యోగమున నానందించును అని చెప్పబడెను.

అవ॥ యోగాంగములగు యమాద్యష్టకములో నైదింటిని విడచి ధారణాధ్యానసమాధులను మూడింటినే, సమాధియందు ముఖ్యముగా వినియోగించుటకు కారణమును దెలుపుచున్నారు.

## సూ॥ త్రయమంతరంగం పూర్వేభ్యః॥ 7

త్రయం, అంతరంగం, పూర్వేభ్యః॥

పూర్వేభ్యః = తొలుతటివగు యమాదులకన్న, త్రయం = కడపటివగు ధారణాద్యంగత్రయము, అంతరంగం = అంతరంగమైనది.

సంప్రజ్ఞాతసమాధికి యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారము లేనును బహిరంగములు, అనగా నప్రధానాంగములు. ధారణా ,ధ్యాన సమాధులు మూడు మాత్ర మంతరంగములు. అంతరంగములగు నంగములు రెండు విధములు. అందొకటి తనయనంతరము తప్పక సాధ్యమును గలిగించి తీరునది. సాధ్యమునకు విషయ మగునదియే తనకును విషయముగా గల సాధనము రెండవ యంతరంగసాధనము. ఇందు ధారణాది త్రయము సంప్రజ్ఞాత సమాధికి మొదటి విధమున నంతరంగము కాదు. ఏలనన, సూత్రకారుడు ఈ విభూతిపాదమున 54వ సూత్రమున నీశ్వర ప్రణిధానమును సంప్రజ్ఞాత సాధనముగ జెప్పబోవుచు నిచట ధారణాదిత్రయమును మాత్రము అంతరంగముగ జెప్పెను. కాన నీశ్వరప్రణిధానము సూత్రకారుని మతముచొప్పున బహిరంగమేకదా! తొలుతటి యంతరంగత్వ మీసూత్రకారు డంగీకరించెనని మనమంగీక రించితిమేని యీశ్వర

ప్రణిధానము తన యంతరము సంప్రజ్ఞాత సమాధిని గలిగించి తీరును. కాన నదియు నంతరంగమే కావలసివచ్చును గదా! కాన నా పక్షమున ధారణాది త్రయమే యంతరంగసాధనమను నీ సూత్రము సరిపడక పోవును.

కాన ద్వితీయపక్షమే సూత్రకారున కభిమతమని మనము తలంప వలయును. కాగా సంయమమునందును, తత్సాధమగు సంప్రజ్ఞాత సమాధి యందును ధ్యేయవస్తు వొక్కటియే విషయముగా నుండును. కాన నిట్టి యంతరంగత్వ మీ ధారణాదిత్రయమునకు గలదు గాని యమాది పంచకమునకు గలుగదు. కాన యమాదులు బహిరంగములు.

*కావుననే గరుడ పురాణమున-*

**ఆసనవిధయో న యోగస్య ప్రసాధకాః ।**
**విలంబజననా స్సర్వే విస్తరాః పరికీర్తితాః ।**
**శిశుపాలస్సిద్ధి మాప స్మరణాభ్యాస గౌరవాత్॥**

అనగా- యమనియమాసనాదులు యోగసిద్ధి కంతరంగ సాధనములు గావు. అవి విస్తృతములగును గాన కేవలము యోగసిద్ధికి విలంబమును గలిగించును. ఇవి లేకయే స్మరణాభ్యాసమాత్రముననే శిశుపాలుడు సిద్ధినందెను గాన ధారణాదులే యంతరంగ సాధనములని చెప్పబడెను. ధారణాదిత్రయము సయితము సంప్రజ్ఞాత సమాధికి మాత్రమే యంతరంగ మగును, గాని యసంప్రజ్ఞాతసమాధి నిర్విషయ మగును గాన నందు పైయిరు తెరంగుల యంతరంగత్వమును ధారణాది త్రయమునకు గలుగదు. అందు జ్ఞాన ప్రసాదరూప పరవైరాగ్య మొక్కటియే యంతరంగము

అవ॥ ధారణాదిత్రయ మసంప్రజ్ఞాతసమాధి కెట్టి సాధనమో నిరూపించుచున్నారు.

**సూ॥ తదపి బహిరంగం నిర్బీజస్య॥ 8**

తత్, అపి, బహిరంగం, నిర్బీజస్య.

తత్ అపి= సంప్రజ్ఞాతయోగమున కంతరంగకారణ మగు ధారణాది త్రయము సయితము, నిర్బీజస్య=అసంప్రజ్ఞాత యోగమునకు, బహిరంగం= బహిరంగసాధనమే యగును.

ధారణాదిత్రయము సంప్రజ్ఞాత సమాధి కంతరంగసాధన మగునే గాని యసంప్రజ్ఞాత సమాధికి మాత్ర మంతరంగసాధనము కాదు. మరియది బహిరంగ సాధనము మాత్రమే యగును. జ్ఞానప్రసాదరూపమగు పర వైరాగ్యముచే ధారణాధ్యాన సమాధులు నిరోధింపబడిననే యసంప్రజ్ఞాత సమాధి యుదయించును గాన నసంప్రజ్ఞాత సమాధికి పరవైరాగ్యము మాత్రమే యంతరంగసాధనము. ధారణాదిత్రయము బహిరంగము మాత్రమే.

అవ॥ గుణముల స్వభావము చంచలమైనదిగాన గుణములు పరిణామ శీలములని యింతకుముందే నిరూపింప బడియెను. కాన నిరోధ సమయ మున సయితము చిత్తమునకు ప్రతిక్షణమును పరిణామము గలుగవలసి యున్నది. ఏలనన-చిత్తమొక్క క్షణమేని పరిణామము నొందక స్థిరముగా నుండజాలదు. కాని నిరోధావస్థయందు చిత్తమెట్టి పరిణామ మును జెందునను అంశమును నిరూపించుచున్నారు.

## సూ॥ వ్యుత్థాన నిరోధ సంస్కారయో రభిభవ - ప్రాదుర్భావౌ నిరోధక్షణ చిత్తాన్వయో నిరోధ పరిణామః॥ 9

వ్యుత్థాననిరోధసంస్కారయోః, అభిభవ ప్రాదుర్భావౌ, నిరోధక్షణ చిత్తాన్వయః, నిరోధపరిణామః.

వ్యుత్థాననిరోధ సంస్కారయోః-వ్యుత్థాన = క్షిప్రమూఢ విక్షిప్త భూమికలను బహిర్ముఖసంస్కారము యొక్కయు, నిరోధ సంస్కారయోః = జ్ఞాన ప్రసాదనామకమగు పరవైరాగ్యరూప నిరోధ సంస్కారముయొక్కయు అభిభవ ప్రాదుర్భావౌ = తిరస్కారమును, ఉదయమును, అనగా బహిర్ముఖ సంస్కారము

యొక్క తిరోభావమును, పరవైరాగ్యోదయమును అను, నిరోధక్షణ చిత్తాన్వయః- నిరోధక్షణ = నిరోధకాలమునందు, చిత్త = చిత్తము యొక్క, అన్వయః = వ్యుత్థాననిరోధ సంస్కార సంబంధము. నిరోధ పరిణామః = నిరోధ పరిణామ మనబడును.

నిరోధసంస్కారకాలమున బహిర్ముఖావస్థలో గలుగు సంస్కారముల యతీతావస్థయు, పరవైరాగ్య నామకమగు నిరోధ సంస్కారముల వర్తమానా వస్థయు గలుగును. అనగా-నాకాలమున బాహ్యసంస్కారయులు నశించి పరవైరాగ్య జన్యసంస్కారము లుదయించును. కాగా చిత్తము ద్వివిధ సంస్కారములకును నెలవగును గాన ధర్మిభూతమై ద్వివిధావస్థలచే ననుగత మగును. కాన నట్టి నిరోధస్థితిలో వ్యుత్థాన సంస్కారములు క్షీణించుచుండ నిరోధ సంస్కారవములు వెలయుచుండును. ఇట్లు క్షణక్షణవమునను జరుగుచుండును. కాన వ్యుత్థాన సంస్కారహీన నిరోధసంస్కారాధానములే చిత్తమునకు నిరోధకాలమున గలుగు పరిణామము అనగా నసంప్రజ్ఞాత కాలము నందు చిత్తమున క్షణక్షణవమున నొకేవిధమున వ్యుత్థాన సంస్కారములు నశించుచు, నిరోధసంస్కారములు పొడసూపుచుండునుగాన చిత్తమునకు స్థిరత్వ మేర్పడును.

కారణము నశించెనేని కార్యము తనంతటనే నశించును. ఈన్యాయము ననుసరించి కారణమగు నవిద్య నశించినచో తత్కార్యములగు తదనంతర క్లేశము లన్నియు తమంతటనే తొలగిపోవునని యంగీకరించిన విధమున నీచోట సయితము కారణమగు వ్యుత్థానవృత్తి నివర్తించినచో వ్యుత్థానవృత్తి జన్యసంస్కారములు తమంతటనే నశించునుగదా! అట్లుండగా వ్యుత్థాన సంస్కారములను దొలగ ద్రోయుటకు నిరోధ సంస్కారముల యావశ్యకత యేల? యను శంక గలుగవచ్చును.

కాని సామాన్యముగ కారణము నశించినంతనే కార్యము నశింపదు. అట్లగుచో సాలెవాడు చనిపోయినచో వస్త్ర మంతరింపవలసినదేగదా! కాన నేదియోయొక కారణము నశించినమాత్రమున కార్యము నశింపదు.

ఉపాదానకారణము నశించిననే కార్యము నశించును, కాగా తంతువులు నశించిననే వస్త్రము నశించిన సాలెవాడు నిమిత్తకారణముగాన నాకారణము నశించును. వస్త్రమునకు నాశము గలుగదు. అట్లే యవిద్య తదనంతర క్లేశముల కుపాదానకారణము గాన నవిద్యానాశమువలన సకల క్లేశనాశము గలుగుననుట సమంజసమే. అట్లే ప్రకృతమున వ్యుత్థానసంస్కారముల కుపాదానకారణము చిత్తమే గాన నది నశింపలేదు గావునను వ్యుత్థానవృత్తులు నిమిత్తకారణ మాత్రములు గాన నవి నశించినను వ్యుత్థాన సంస్కారములు నశింపవు.

కాన వ్యుత్థానసంస్కారములను దొలగద్రోయుకొరకు నిరోధసంస్కారములను వర్ధిల్లజేయవలయును. దానిచే చిత్తము సంస్కారమాత్రశేష మగును. ఈ విషయము ప్రథమపాదమున నసంప్రజ్ఞాత లక్షణమున వివరింపబడెను.

అవ॥ ఇంక నీ నిరోధసంస్కారములకు ఫలభూతమగు పరిణామమును దెలుపుచున్నారు.

## సూ॥తస్య ప్రశాన్తవాహితా సంస్కారాత్ ॥ 10

తస్య, ప్రశాన్తవాహితా, సంస్కారాత్॥

సంస్కారాత్= నిరోధసంస్కారమువలన, తస్య= అట్టి చిత్తమునకు, ప్రశాన్తవాహితా= నిర్మలనిరోధ సంస్కార ధారారూపమగు స్థితి గలుగును.

నిరోధసంస్కారముల నభ్యసించు కొలదియు చిత్తమునకు విక్షేపములు గలుగక నిర్మలమగు నిరోధ సంస్కారధారారూప స్థితి గలుగును. సూత్రమునందు ప్రశాంత వాహిత్వ మనగా వ్యుత్థాన సంస్కారరహితమై యుత్తరోత్తరాభివృద్ధమగు నిరోధసంస్కార పరంపర యని యర్థము కాగా వ్యుత్థాన సంస్కారములను దిరస్కరించి తమంతటనే వెలయు నైపుణ్యము నిరోధ సంస్కారములకు గలుగునట్లు వాని నభ్యసింపవలయును. అట్లుగాక నిరోధసంస్కారములు దుర్బలము లయ్యెనేని వీనిని వ్యుత్థాన సంస్కారములే

యడచివైచి తామే ప్రధానము లగును.

అవ॥ ఇట్లు సంప్రజ్ఞాతసమాధి కాలమున గలుగు నిరోధపరిణామ మునకు లక్షణఫలములను నిరూపించి యింక సంప్రజ్ఞాత సమాధిలో గలుగు సమాధిపరిణామమును దెలుపుచున్నారు.

**సూ॥సర్వార్థతైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధిపరిణామః॥ 11**

సర్వార్థతైకాగ్రతయోః, క్షయోదయౌ, చిత్తస్య, సమాధి పరిణామః॥

చిత్తస్య=చిత్తమునకు, సర్వార్థతైకార్థతయోః, సర్వార్థతా = విక్షిప్తత్వము యొక్కయు, అనగా చంచలమగుట వలన నానావిధార్థములను గ్రహించుట యొక్కయు, ఏకాగ్రతయోః = ఏకవస్తుమాత్ర విషయత్వము యొక్కయు, క్షయోదయౌ = తిరోభావమును, ఆవిర్భావమును, అనగా చిత్తమునకు నానార్థగ్రహణశక్తి తిరోభూతమై, యేకార్థ మాత్రగ్రహణ మావిర్భవించుటయు, సమాధి పరిణామః = సమాధిపరిణామ మని చెప్పబడును.

క్షణ క్షణమునను వివిధ విషయములపై జొరబారుటయే సర్వార్థత యనబడును. అది చిత్తమునకు ధర్మము. ఏదేనొక యాలంబనమునందే నిశ్చలవృత్తిప్రవాహముతోడ చిత్తము నిలకడ గలిగి యుండుట ఏకాగ్రత యనబడును. ఇదియు చిత్తధర్మమే. సంప్రజ్ఞాత సమాధికాలమున సర్వార్థత తిరోభూతమై యేకాగ్రత యావిర్భవించును, కాన ధర్మిభూతమగు చిత్తము సర్వార్థతైకాగ్రతల రెంటి ననుగమించి యుండును. కాన చిత్తము స్వకీయధర్మములగు సర్వార్థతా తిరోభావమునందును, ఏకాగ్రతోపజననము నందు ననుగతమై యుండుటయే సమాధిపరిణామము. నిరోధ పరిణా మమునకును సమాధిపరిణామమునకు నింతమాత్రము భేద ముండును. సంప్రజ్ఞాతసమాధిలో వ్యుత్థానతకు క్షయము, నేకాగ్రతకు నుదయము గలుగును. ఇదియే సమాధిపరిణామము, తదనంతర మసంప్రజ్ఞాత సమాధియందు తజ్జన్యములగు వ్యుత్థాన సంస్కారములకు క్షయమును,

నిరోధసంస్కారముల కావిర్భావమును గలుగును. ఇదియే నిరోధ సంస్కారము. కాగా సమాధిపరిణామమున తత్తత్సంస్కార జనకములగు వ్యుత్థానైకాగ్రతల క్షయోదయములు గలుగును. నిరోధ పరిణామమున వ్యుత్థానైకాగ్రతాజన్య సంస్కారజనకములకు క్షయోదయము గలుగును.

అవ॥ సంప్రజ్ఞాతసమాధిదార్ఢ్యమును దెలుపదలచి తత్కాలముననే గలుగు మరియొక పరిణామము నెరింగించుచున్నారు.

## సూ॥తతః పునః శాంతోదితౌ తుల్యప్రత్యయౌ చిత్తస్యైకాగ్రతాపరిణామః॥ 12.

తతః, పునః, శాంతోదితౌ, తుల్యప్రత్యయౌ, చిత్తస్య ఏకాగ్రతాపరిణామః॥

తతః = విక్షిప్తత యంతరించిన తరువాత, చిత్తస్య = చిత్తమునకు, పునః = మరల, శాంతోదితౌ = అతీతవర్తమానములగు, తుల్యప్రత్యయౌ = ఏకాలంబనము గలవగుటవలన, పరస్పరసదృశములగు వృత్తులు, ఏకాగ్రతా పరిణామః = ఏకాగ్రతా పరిణామ మనబడును.

సంప్రజ్ఞాతసమాధియందు చిత్తవిక్షేప మంతరించిన తరువాత నేకాలంబనకములగు వృత్తు లుపశమించుచు నుదయించుచుండును. అనగా దొలుత నెట్టి వృత్తి యుదయించి యుపశమించెనో తత్తుల్యమగు వృత్తియే యనుపదము గలుగును గాని తద్విలక్షణవృత్తి గలుగదు. కాగా చిత్తరూపమగు ధర్మిసమాధి ముగియు దనుకను శాంతమగువృత్తి( అతీతవృత్తి) యందు, నుదితమగువృత్తి (వర్తమానవృత్తి) యందును రెంటియందు ననుగతమై యుండును. కాన నావృత్తులు పరస్పరతుల్యము లయ్యెను. ఇది యేకాగ్రతా పరిణామము. మరియు సంప్రజ్ఞాతసమాధిలో తొలుదొలుత వ్యుత్థాన వృత్తులు మాటి మాటికి నుత్పన్నము లగుచు శాంతించును. మరుపటి క్షణము నేకాగ్రతా రూపవృత్తి యావిర్భవించును. కాన సంప్రజ్ఞాత సమాధియందు పూర్వావస్థలో పూర్వవృత్తి విక్షేపరూపము గావునను, తదనంతర వృత్తి నిరోధరూపము గావునను, పరస్పర విలక్షణములుగా

నుండును. కాని తుల్యములు గావు. దీనినే పూర్వ సూత్రమున సమాధి పరిణామ మని వివరించిరి.

ఇట్లే సంప్రజ్ఞాత సమాధి యందభ్యాసము దృఢమయ్యెనేని విక్షేపము బొత్తుగా నశించి నిరంతరముగ నిరోధరూపమగు ప్రత్యయమే (వృత్తియే) యుదయించుచుండును. కాగా నట్టితరి తొలుత జనించిన నిరోధవృత్తి శమించి వెన్వెంటనే తత్సదృశ మగు నిరోధవృత్తియే యుదయించును. కాన శాంతోదితములగు వృత్తులు రెండును నిరోధరూపములే గాన విలక్షణములు గాక సదృశములే యయ్యెను. ఇట్లేకాలంబనముగ గలుగుచుండు వృత్తిధారయే యేకాగ్రతా పరిణామ మనబడును.

ఈ యేకాగ్రతా ప్రత్యయము సయితము సాధకుడు సమాధినిష్ఠుడై యుండునంతవరకే యనువర్తించును. కాని యతడు సమాధినుండి యుత్థితుడయిన వెంటనే విక్షేపవృత్తు లుదయించును.

కాన బహిర్ముఖావస్థలో విక్షేపవృత్తులు నివర్తించుటకొరకు అసంప్రజ్ఞాతయోగ సాధనము నొనర్పవలయును. కాని సంప్రజ్ఞాత సమాధి లాభమాత్రమున దాను కృతార్థుడ నైతినని సాధకు డేమరుపాటు జెందరాదు.

అవ॥ చిత్తము పరిణామశీలమగు విధమున నితర వస్తువులు సయితము పరిణామశీలములను విషయమును బోధింప నెంచి భూతాదికములయందు పరిణామత్రయమును సూచించుచున్నారు -

## సూ॥ఏతేన భూతేన్ద్రియేషు ధర్మలక్షణావస్థా పరిణామా వ్యాఖ్యాతాః॥ 13

ఏతేన, భూతేన్ద్రియేషు, ధర్మలక్షణావస్థాపరిణామాః, వ్యాఖ్యాతాః॥-

ఏతేన= ఇట్లు చిత్తమునకు పరిణామములను నిరూపించుటచేత, భూతేన్ద్రియేషు= స్థూలసూక్ష్మభూతముల యందును, బుద్ధి కర్మేంద్రియముల యందును, ధర్మలక్షణావస్థా పరిణామాః= ధర్మపరిణామము, లక్షణ పరిణామము,

అవస్థాపరిణామమును, వ్యాఖ్యాతాః వివరింపబడి నట్లయ్యెను.

చిత్తమునకు నిరోధపరిణామము, సమాధిపరిణామము, నేకాగ్రతా పరిణామమునను పరిణామత్రయము నిరూపించినదాన స్థూలసూక్ష్మ భూతములయందును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల యందును ధర్మపరిణామము, లక్షణపరిణామము, నవస్థాపరిణామమునను పరిణామ త్రయ ముండుసను విషయము తెలుపకున్నను తనంతటనే వెల్లడి యగుచున్నది. అవస్థితమగు ధర్మికి పూర్వధర్మనివృత్తి గలిగి ధర్మాంతరము ప్రాప్తించుట ధర్మపరిణామ మనబడును. చిత్తమున ధర్మపరిణామ మనగా చిత్తరూపమగు ధర్మి చెడకుండగనే వ్యుత్థాన సంస్కారరూపధర్మములు తిరోభూతములై, నిరోధసంస్కార రూప ధర్మములు ప్రాదుర్భవించుట యను నిరోధ పరిణామము. విద్యమానధర్మములకు నతీతాదికాల త్యాగపూర్వకముగ వర్తమానాది కాలప్రాప్తియే లక్షణపరిణామము.

ఒక వస్తువు నశించెనేని యావస్తువు నతీతలక్షణవంతముగను నది వర్తమాన మగునేని వర్తమాన లక్షణవంత మగును. అదియే కలుగబోవునేని యనాగత లక్షణవంతముగను వ్యవహరింతురు. కాన సాధకుడు సమాధినిష్ఠ డయ్యెనేని వ్యుత్థాన వృత్తులు తమ వర్తమానలక్షణమును విడనాడి యతీతలక్షణమును బొందును. నిరోధవృత్తు లనాగతలక్షణమును విడచి వర్తమాన లక్షణమును లభించును. ఇట్లే మరల గలుగబోవు వ్యుత్థానవృత్తులు తమ యనాగత లక్షణమును దొలగద్రోసిన వర్తమాన లక్షణము నధిగ మించును. ఇట్లు ధర్మములకు గలుగు లక్షణభేదము లక్షణపరిణామ మనబడును. కాగా వ్యుత్థానమునకు వర్తమాన దశయందలి (బహిర్ముఖా వస్థలో) నిరోధపు టనాగతదశయు, వ్యుత్థానపు టనాగత దశయందలి (బహిర్ముఖావస్థలోనియపుడు) నిరోధపు వర్తమానపు దశయు రెండును లక్షణపరిణామములే.

ఇట్లే నిరోధపు వర్తమానదశలో నిరోధసంస్కారముల ప్రాబల్యమును, వ్యుత్థానసంస్కారముల దౌర్బల్యమును, అవస్థాపరిణామ మనబడు చున్నది.

పై త్రివిధ పరిణామములలో చిత్తరూపధర్మి యట్లే యుండగనే వ్యుత్థానతిరోభావమును, నిరోధప్రాదుర్భావమును గలుగుట ధర్మపరిణామ మనబడెను. నిరోధరూప ధర్మమునం దనాగత లక్షణ తిరోహితమై, వర్తమాన లక్షణము ప్రాదుర్భవించుట నిరోధరూప ధర్మమునకు లక్షణపరిణామ మనబడెను. నిరోధపు వర్తమానలక్షణ ప్రాబల్యమే లక్షణమున కవస్థాపరిణామ మనబడెను. కాగా ధర్మికి ధర్మపరిణామమును, ధర్మములకు లక్షణ పరిణామమును, లక్షణముల కవస్థా పరిణామమును గలుగునని యేర్పడినది. గుణస్వభావము చంచలము గాన గుణవృత్తి( వ్యాపారము) యొక్క క్షణమున నేనియు ధర్మలక్షణావస్థాపరిణామ శూన్యముగ నొకేవిధముగ నుండజాలదు.

సర్వవస్తువులును త్రిగుణాత్మకములు గాన నన్ని వస్తువులును ధర్మాది త్రివిధపరిణామ శూన్యములు గావు గాన నన్నియు పరిణామశీలములే. కాగా చిత్తమున త్రివిధపరిణామమున్న విధముననే స్థూలసూక్ష్మ భూతముల యందును జ్ఞానకర్మేంద్రియములయందును ధర్మధర్మి భావముచే పరిణామ త్రయము గలదని యెరుగవలయును.

పృథ్వీరూపధర్మికి గలుగు ఘటరూపవికారము ధర్మపరిణామము. మృత్తికయందంతకు ముందున్న పిండాకార రూపధర్మము తిరోహితమై కంబుగ్రీవాద్యాకార ముద్భవించెను గాన నిది ధర్మపరిణామము. ఘటము అనాగతలక్షణమును విడనాడి వర్తమాన లక్షణము నొందుట ఘటరూప ధర్మమునకు లక్షణపరిణామము. మరియు వర్తమాన లక్షణము గల ఘటమునకు గ్రొత్తదనమును క్షణాన్తరముల యందు గలుగు ప్రాతదనమును అవస్థాపరిణామములు. ఇట్లు భూతలములకు నన్నిటికి పరిణామత్రయము నూహించునది. ఇట్లె యింద్రియములకు గలుగు నీలాది విషయకజ్ఞానము ధర్మపరిణామము. నీలాదులు వర్తమాన లక్షణము లగుట లక్షణ పరిణా మము. వర్తమానదశలో స్ఫుటత్వాస్ఫుటత్వాదు లవస్థాపరిణామములు.

ఇంతవరకు నీ పరిణామమునకు త్రివిధత్వము ధర్మధర్ములకు భేదమున్నదని యేర్పరచుకొని వివరించితిమి. యథార్థముగ సాంఖ్య

యోగమతమున సత్కార్యవాదమును, పరిణామవాదమును నంగీకరింతురు గాన ధర్మమునకు ధర్మికిని భేదమే లేదు. కాన ధర్మిపరిణామ మొక్కటియే యుండును. కాని యితరములు లేవు. ఏలనన ధర్మమనునది ధర్మియొక్క స్వరూపమాత్రమే గాన ధర్మియొక్క వికారములే ధర్మలక్షణావస్థా పరిణామశబ్దముచే వ్యవహరింపబడెను, గాని యవి ధర్మాది వికృతులు గానేరవు. కాగా ధర్మద్వారమున ధర్మివికారముల వివరణమే చేయబడెనని యెరుగునది.

ప్రతిక్షణపరిణామమును త్రైవిధమున నంగీకరించినచో క్షణికత్వము ప్రసంగించునను శంకను నిరాకరించుటకై పరిణామత్రయమును బరీక్షింప వలయును. కాన దొలుత ధర్మపరిణామమును బరీక్షింతము. మృత్తికారూప ధర్మియం దనాగతావస్థలో నున్న ఘటరూపధర్మమునకే యతీత కాలమునను అనాగతకాలమునను, వర్తమానకాలమునను, అన్యథాత్వము (పరిణామము) గలుగును. కాని మృత్తికారూపధర్మి కన్యథాత్వము గలుగదు. అనగా సత్కార్యవాదము ననుసరించి యుండిన వస్తువే ప్రకట మగును గాన మృత్తికలో ఘట మంతకుముందే యున్నదనియు, కాని యది యనాగతా వస్థలో నున్నదనియు, ఘటము గలిగినచో నది వర్తమానావస్థలో నున్న దనియు, నది పగిలినచో నతీతావస్థలో నున్నదనియు నంగీకరితురు. కాన నతీతాది కాలమున పరిణామము ధర్మమగు ఘటమునకు గలుగునే గాని ధర్మియగు మృత్తికకు గలుగదు. ఘటపు టతీతానాగత వర్తమానావస్థల యందన్నిటను 'మృత్తిక'యను ననుగత వ్యవహారమునకు భంగము గలుగదు గదా! అట్లే బంగారుపాత్రను కరగించి భూషణాకారముగ నొనర్చితిమేని పూర్వమున్న పాత్రమను వ్యవహారము పోయి కటకము, తాటంకము మొదలగు ధర్మవ్యవహారములు భేదించునే గాని ధర్మియగు సువర్ణ మేసమయమునను సువర్ణేతరము గాదు గదా! కాగా పరిణామము ధర్మమునకేగాని ధర్మికి లేదు.

ఇట్టి విషయమున వైశేషికులు మాత్రము సువర్ణపాత్రాదులకు

కటకాదిరూప పరిణతి కలిగినచో పూర్వావయవ సంయోగము నష్టమయ్యేను. కాన పూర్వసువర్ణవ్యక్తి నశించితీరును. కాని యీ సువర్ణము ముందటి సువర్ణమేయను ప్రత్యభిజ్ఞమాత్రము జాత్యభిప్రాయమున సంగత మగును. అనగా పూర్వసువర్ణమునందును దదనంతర సువర్ణము నందునున్నది. సువర్ణత్వ జాతి యొక్కటియే గాన, ఆ సువర్ణమే యీసువర్ణమను వ్యవహారము నందున్నది. ఏసువర్ణత్వ జాతి విశిష్ట మయ్యేనో యా సువర్ణత్వ విశిష్టమైన యీ సువర్ణముగూడ నను నభిప్రాయముచే ప్రత్యభిజ్ఞ సంగత మగును గాన ధర్మికిని బరిణామము గలదందురు. కాని యిట్లంగీకరించినచో క్షణక్షణమున కవయువములు తరుగుచు పెరుగుచు నుండుటవలన నవయువసంయోగ విభాగము లావశ్యకము లగుటచే శరీరాద్యఖిల వస్తువులకును క్షణికత్వము ప్రసంగించుటయే గాక, జాత్యభిప్రాయముననే ప్రత్యభిజ్ఞ సంగతమగును గాన ''ప్రత్యభిజ్ఞచే ఘటాది స్థైర్యము సాధింపబడు '' నను వైశేషిక సిద్ధాంతము సయితము భగ్నమగును. కావున నవయవ సంయోగ నాశము ద్రవ్యనాశ కారణమని చెప్పరాదు. మరి వహ్న్యాది విషయమున తృణారణి మణ్యాదులకు గారణత్వ మంగీకరించు రీతిని ఫలానుసారముగ వ్యవస్థిమగు కారణమును గల్పింపవలయును.

మరియు నేకాంతవాదు లిట్లు శంకింతురు. **''(ధర్మానభ్యధికో, ధర్మీపూర్వతత్త్వానతిక్రమాత్''** అన్నటుల) ధర్మీ = సువర్ణాదిధర్మి, ధర్మానభ్యధికః = కటకతాటంకాది ధర్మమునకన్న వేరుగలేదు. ధర్మరూపమే. ధర్మియని చెప్పబడునది యంతయు ధర్మరూపమేగాని, ధర్మములకంటె భిన్నము ధర్మియనునది లేదు. ఒకవేళ ధర్మములు నశించినను వాటియందు సువర్ణాదిధర్మి యనుగతమై కానవచ్చుచున్నది, గాన ధర్మిని భిన్నముగా నంగీకరింపవలయు నందురేని, యెపుడు ''పూర్వతత్త్వానతిక్రమాత్ = పూర్వతత్త్వమగు ధర్మికి అనతిక్రమము అనగా కూటస్థ నిత్యత గలుగవలసివచ్చును గాన ధర్మి నంగీకరింపరాదు- అని ఏకాంతుల మతము కాన ధర్మికి సర్వకాల సర్వావస్థలయందును ధర్మములయం దన్వయ ముండెనేని

మృత్తికాదిధర్మి యెల్ల సమయముల యందుండును గాన, ధర్మి కూటస్థనిత్యము గావలసివచ్చును. కాని యోగమతమున కూటస్థనిత్యత చితిశక్తిరూప పురుషునకు దప్ప మరియొక వస్తువునకు లేదు గదా!

ఇందులకు సమాధానము-కూటస్థనిత్యత పురుషునకు మాత్రమే, కూటస్థనిత్యత యనగా నేకాంతముగ నన్నివిధముల, స్వరూపవశముునను ధర్మవశముునను నిత్యమగుట. అట్టి నిత్యత చితిశక్తిరూప పురుషునకు మాత్రమే గలదు. స్వరూపవశమున నిత్యముగ నున్నను ధర్మవశమున ననిత్యమగు (అనగా ధర్మములు మారుచుండు) ధర్మికి ప్రపంచమునకే కూటస్థనిత్యత లేదు. మృత్తికాదికమును మనము చేతనునివలె నేకాంత నిత్యముగా నెంచము. మరియది యత్యంత నిత్యమును గాదు. అత్యంతానిత్యమును గాదు. ఒక విధమున నిత్యమును, మరియొక విధమున ననిత్యమును నగును. కాన మృత్తికాదిధర్మి యేకాంతనిత్యము గాదు. అనగా కూటస్థ నిత్యము గాదు.

కార్యసామాన్యము తానపాయమునొంది తీరును. అనగా దనవర్తమానావస్థను విడనాడి యతీతావస్థను బొందును. కాన కార్యమెప్పుడుగాని యత్యంతనిత్యము గాజాలదు. మరియు ఘటాదికము (కార్యము) పగిలిపోయిన యనంతరము ఘటాత్యంతాభావ మేర్పడెననియు తలపరాదు. ఆ ఘటమతీతావస్థనొంది యామట్టి పెంకుల లోనుండి తీరినది. కార్యమున కత్యంతాభావమును యోగమతమున నంగీకరింపరు. కాన నతీతావస్థాపన్నమగు ఘటము స్వకారణములో లీనమై సూక్ష్మావస్థనొంది యుండుటంబట్టి దర్శనాయోగ్యమై యుపలబ్ధము గాకున్నది.

ఇంక లక్షణపరిణామమును పరీక్షింతము. ఘటరూపధర్మము భూతభవిష్యద్వర్తమాన కాలముల మూడింటను మృత్తికారూపధర్మమున నుండును. ఘటము పగిలి యతీతావస్థలోనుండు సమయముననే సూక్ష్మములగు ననాగతవర్తమానావస్థలతో గూడియే యుండును.- ఇట్లే యనాగతావస్థలోనుండు ఘటము సయితము వర్తమానాతీతావస్థలతో

గూడియే యుండును. కాని తద్రహితము గాదు. అట్లే వర్తమానావస్థలో నుండు ఘటముగూడ నతీతానాగతావస్థ (లక్షణ)లతో గూడియే యుండును. కాగా నెట్లొకకాంతయం దనురక్తుడగు పురుషుడు తక్కిన స్త్రీలయందు విరక్తుడయ్యెనని తలపదగడో, ప్రకృతస్త్రీ విషయమున రాగము వర్తమానావస్థలోనున్నదనియు, నన్యస్త్రీవిషయమునను రాగము అతీతావస్థలో లేక యనాగతావస్థలో నున్నదనియు తలతుమో, (2-4) అట్లే ఘటము వర్తమాన లక్షణవంత మగునపుడు నన్యలక్షణముల యభావమును దలపరాదు. అతీతానాగత లక్షణములును సామాన్య రూపముగ నందను గతములై యుండుననియే యెంచవలయును.

లక్షణ పరిణామమున నన్ని వస్తువులకు నన్ని లక్షణములును సంభవించునట్లేర్పడినది. అనగా పరస్పర విరుద్ధములగు నతీతానాగత వర్తమానావస్థలొక వస్తువున కొకే సమయమున గలుగునని చెప్పి నట్లయినది. ఇది యసంగతము, ఏలనన-నొకఘటము 'ముందు సమయమున ఘటము వర్తమాన మగుచున్నది' యను ప్రతీతి గలుగుట తోడ 'ఘటమతీత మయ్యెను. ఘటమనాగతము'నను ప్రతీతులు గూడ గలుగవలయునుగదా! అట్టి ప్రతీతులు గలుగుట లేదుగాన పరస్పర విరుద్ధ లక్షణముల కేకత్ర సమావేశ మసంగతమే యని కొందరు తర్కింతురు.

ధర్మములకు ధర్మత్వము ముందే నిరూపింపబడెను గాన, నిచట సాధింపబనిలేదు. ధర్మత్వము సిద్ధమయినచో లక్షణబహుత్వము సయితము స్వీకరింపవలయును. వర్తమాన కాలమున మాత్రము ధర్మమునకు ధర్మత్వము నంగీకరించిన జాలదు, అట్లు వర్తమానకాలమున నుండు ధర్మమునకే ధర్మత్వము నంగీకరించితిమేని క్రోధకాలము దాటిన తరువాత చిత్తమున ననురాగము గలుగగూడదు. క్రోధకాలమున ననురాగరూపధర్మ మనాగత రూపమున చిత్తమున నుండక పోవును, గాన విద్యమానమగు పదార్థము గలుగుట యసంభవము గాన, క్రోధకాలమున సయిత మనురాగ మనాగతావస్థలో చిత్తమున నున్నదని యంగీకరింపవలయును. కాన

ధర్మములయందు లక్షణత్రయమును సంభవించును.

పై లక్షణత్రయమున కొకే వ్యక్తియందొకే క్షణమున నభివ్యక్తి గలుగదు. ఘటమునకు దండచక్రాదికమువలె, స్వాభివ్యంజకమగు కారణముచే నభివ్యక్తమగు లక్షణమునకు మాత్రమే యభివ్యక్తి గలుగును, గాన నభివ్యక్తి విషయమున లక్షణత్రయమునకు సాంకర్యము గలుగదు. వ్యక్తములు గాక యడగియున్న లక్షణములకు వ్యక్తమగు లక్షణముతోడ నేమాత్రమును విరోధ ముండదు.

ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యాధర్మాజ్ఞానావైరాగ్యానైశ్వర్యములను రూపాష్ట కమును, శాంతాది నామకములగు వృత్తులును, విశేషాకారముగ నుండునొకటి విశేషాకారమున నుండు మరియొక దానితో విరోధించునే గాని సామాన్యా కారముగ నుండునవి యేవియు విశేషాకారముగ నుండుదానితో విరోధింపవు. ఒక ధర్మియందు సామాన్యాకారముగ సర్వధర్మములును, విశేషాకారముగ నందొకధర్మము నుండినను విరోధము లేదు. విశేషాకారమున రెండు ధర్మము లొకచోట నుండుటయే విరుద్ధమని భావము. ఈ విషయ మింతకు ముందే సాధనపాదమున పదమూడవసూత్ర వివరణమున దెలుపబడెను. కాన నతీతాది లక్షణములలో నొకటి విశేషాకారముగను, తక్కినవి రెండును సామాన్యాకారమున నుండును గాన నెట్టి విరోధమును లేదు. మరియు విశేషలక్షణము ననుసరించియే ''ఇదివర్తమానము'' ''ఇది యతీతము'' ఇయ్యది యనాగతము'' అని వ్యవహారము జరుగుచుండెను. కాన వ్యవహార సాంకర్యము సయితము గలుగదు. రాగమనునది యొక విషయమున విశేషముగ నున్నచో నా కాలమున నారాగము మరియొక విషయమున సామాన్యాకారముగ లేదని యనరాదు. కాని యారాగము సామాన్యాకారముగ సర్వవిషయములయందు నుండును. కాన నేవిషయమునను రాగాత్యంతా భావము లేదు. అట్లే యతీతాది లక్షణములలో నొకటి యొక ధర్మమున విశేషించియున్నను, ఆ లక్షణ మన్ని ధర్మములయందును సామాన్యాకారమున నుండియే తీరును.

పైచెప్పిన లక్షణ పరిణామము ఘటాదిరూప ధర్మమునకే గాని మృత్తికాది రూపధర్మికి గలుగదు. కావుననే ఘటరూపధర్మమే యతీతా ద్యవస్థలను బొందినచో, దానికనుగుణముగా వేర్వేరు వ్యవహారముల నొందు చున్నది. కాని మృత్తికారూపమగు ధర్మి యన్నియవస్థలయందు నొకే విధముగా వ్యవహరింపబడుచున్నది. కాన త్రివిధమగు లక్షణపరిణామము ధర్మమునకే గాని ధర్మికి లేదు.

ఇంక నవస్థాపరిణామమును బరీక్షింతము. లక్షితములై యనగా వర్తమానములై, యలక్షితములై యనగా నతీతానాగతములై యుండు నా ధర్మములే నూతనత్వ పూరాణత్వ బాల్య యౌవనాద్యవస్థలను బొందు చున్నవియై, యిది ప్రాచీనము, ఇది నూతనము - అను మొదలగు నవస్థాంతరములతోడ వ్యవహారము నొందుచున్నది. కాని ద్రవ్యాంతరములుగ వ్యవహరింపబడుట లేదు. ఏక సంఖ్యాభివ్యంజకమగు నొక రేఖయే నూర్లస్థానమున వ్రాయబడినచో నూరుగా నగును. పదుల స్థానమున నుంచబడినచో పదులుగా నగును. ఒకటవ స్థానమున నుంచబడినచో నొకటిగా నగును. వాస్తవముగా నది యొకటి మాత్రమే. మరియు నట్లే యొకస్త్రీయే, సంబంధిభేదమువలన దల్లియు, సోదరియు, పుత్రికయు నగును, కాని స్త్రీయొక్కతెయేగదా! అట్లే ధర్మియొక్కటియే యయ్యు నాయా యవస్థావశమున భిన్నభిన్నముగ గోచరించుచుండును, గాని వాస్తవముగ ధర్మి యొక్కటియే గాన దానికి పరిణామము లేదు.

ఈ యవస్థాపరిణామ విషయమున కొందరిట్లు దూషణము చేయుదురు. అతీతాద్యవస్థలు వ్యాపారవ్యవహితము లగుటవలన ధర్మియు, ధర్మములును, లక్షణములును, అవస్థలు నన్నియు గూటస్థ నిత్యములు గావలసివచ్చును. వ్యాపార వ్యవహితము లగుట యనగా స్వవ్యాపారము కారణముగా, 'నిది యతీత మిది వర్తమాన, మిది యనాగతమ'ని భేదమెరుక పడుట, ఘటమను ధర్మము, జలాహరణాది కార్యము నొనర్పక మృత్పిండమునం దడగియున్న యపుడు అనాగత మనబడును. ఆ ఘటమే

జలాహరణాది కార్యములను చేయుచున్నపుడు వర్తమానమని చెప్పబడును. ఆ ఘటమే జలాహరణాది కార్యముచే యాకార్యమునుండి నివృత్తమై కారణమున సూక్ష్మరూపమున లీనమగునపుడు అతీతమని చెప్పబడును అని యోగమతము, గాన ఘటాది రూపధర్మము సకలసమయములయందు నుండునది గాన, చేతనుని విధమున ధర్మధర్మి లక్షణావస్థల కన్నింటికిని కూటస్థనిత్యత ప్రాప్తించును.

ఇందులకు సమాధానము- కూటస్థనిత్యత యనగా నిత్యత్వము మాత్రము కాదు. మరి యేకాంతనిత్యత్వమే కౌటస్థ్యమని ముందే నిరూపింప బడెను. ధర్మిలు నిత్యములుగా నున్నను వాని ధర్మములకు వికారావిర్భావ తిరోభావరూపమగు విమర్దవైచిత్ర్యమువలన పరిణామ శీలతయేగాని చేతనునికివలె నేకాంతనిత్యంత లేదు. కూటస్థ నిత్యత మహత్తత్త్వము మొదలుగా కార్యభూతముల యందన్నింటను బాధితమే. మహదాదులు సర్వదా విద్యమానములే యైనను ఆయా రూపములతో నావిర్భవించుచు తిరోభూతము లగుచు నుండుటవలన నవి యన్నియు పరిణామము నొందునవియే గాన గుణియగు ప్రధానము (ప్రకృతి) మాత్రము నిత్యమే యైనను గుణముల విమర్దవైచిత్ర్యము అనగా న్యూనాధికభావ సమ్మేళనముచే నదియు పరిణామము గలదియేగాన చేతనుడు దప్ప నేదియు గూటస్థనిత్యము గాదు.

ఆకాశాది పంచభూతములును శబ్దాది పంచతన్మాత్రలకు గార్యములు గాన, స్వకార్యనాశము గలిగినను నశింపని తన్మాత్రలకు ధర్మములును జన్యములు గాన నశ్వరములు నగును. అట్లే మహత్తత్త్వము సయితము మూలప్రకృతికి గార్యముగాన స్వకార్యమగు మహత్తు నశించినను నశింపని మూలప్రకృతికి ధర్మమును జన్యముగాన నశ్వరము నగును. కావుననే మహదాదులకు వికార సంజ్ఞ గలిగెను. ఇట్లే సర్వస్థలములయందును కారణమునకు గార్యాపేక్షచే స్థిరత్వమే గాని, యేకాంతనిత్యత లేదు. చూడుడు, మృత్తికా రూపమగు ధర్మికి తొలుత పిండాకారధర్మ పరిణామము

గలుగుచున్నది. తదనంతరము ఘటాకారధర్మ పరిణామము గలుగుచున్నది. కాని యీరెండు ధర్మములయందును మృత్తిక యనువర్తించియే యున్నది. గాన నామృత్తిక ధర్మి యనబడుచున్నది. అట్లే ఘటము సయిత మనాగత లక్షణమును విడిచి వర్తమాన లక్షణమును బొందెనేని లక్షణ పరిణామము నొందుచున్నది. ఆఘటమే పూర్వక్షణమున నవత్వము, నుత్తరక్షణమున బురాణత్వము నొందుచు నవస్థాపరిణామము నొందుచున్నది. ఇట్లు ధర్మికి పరిణామనిత్యతయే గాని యేకాంతనిత్యత లేదు.

ధర్మికి ధర్మాంతర మొక యవస్థ, ధర్మమునకు లక్షణాంతర మొక యవస్థ, లక్షణమునకు నూతనత్వాదిక మొక యవస్థ, కాన సూత్రకారుడు నుడివిన పరిణామత్రయమును యథార్థముగ నవస్థారూపమై యొకే పరిణామముగా జెప్పదగియున్నను, గోబలీవర్దన్యాయమున భిన్నముగ నిర్దేశింపబడెను. ఇట్లే పదార్థాంతరములయందును సమన్వయ మొనర్చు కొనవలయును.

పైధర్మలక్షణావస్థా పరిణామములు మూడును ధర్మిస్వరూపము నతిక్రమింప కుండుటచే, ధర్మిధర్ముల కభేదముచే నొక్క ధర్మపరిణామమే యంగీకరించిన నది త్రివిధపరిణామముల యందును వ్యాపించును. అనగా సామాన్యాకారముగ ధర్మపరిణామము నంగీకరించిన జాలునని భాష్యకారుని యభిప్రాయము. దానిలోని యవాంతరభేదములను దెలుప సమకట్టి సూత్రకారుడు పరిణామములను మూడుగా నిరూపించెను. పరిణామ మనగా నవస్థితమగు ధర్మికి పూర్వధర్మనివృత్తి గలిగి ధర్మాంతరము గలుగుట.

అవ॥ పైసూత్రమున పరిణామాశ్రయముగా బ్రసక్తమైన ధర్మికి లక్షణమును దెలుపుచున్నారు.

## సూ॥ శాన్తోదితావ్యపదేశ్యధర్మానుపాతీ ధర్మీ॥14

శాన్తోదితావ్యపదేశ్యధర్మానుపాతీ, ధర్మీ॥

తత్ర = (అధ్యాహృతము) ఆ ధర్మిధర్మల నడుమ, శాన్తోదితావ్యప దేశ్య ధర్మానుపాతీ, శాంత = భూతమైనట్టియు, ఉదిత = వర్తమాన మైనట్టియు, అవ్యపదేశ్య = ఆగామి యగునట్టియు, ధర్మ = ధర్మముల యందు, అనుపాతీ = అనుగతమై యుండునది, ధర్మీ = ధర్మి యనబడును.

అతీతానాగత వర్తమానరూపముగల ఘటాది ధర్మముల యందెల్ల వేళలను అనుగతమై యుండు మృత్తికాదిరూపకారణమే ధర్మియని చెప్పబడును. మృత్తికాదిరూపద్రవ్యములయందు పిండఘటాద్యుత్పత్తి యోగ్యతావచ్ఛిన్నమగు శక్తియే ధర్మ మనబడును. మృత్తికయందు ఘటోత్పత్తియోగ్యతా రూపమగు శక్తి ప్రత్యక్షముగ మనకు గనబడకున్నను ఘటము మృత్తిక వలననే గలుగుచుండుటయు, నిసుకవలన గలుగక యుండుటయు గమనించితిమేని ఘటోత్పత్తి యోగ్యత మృత్తికయందే గలదని తేటతెల్లమగును. ఇట్లే తంతువులచే మాత్రమే పటమేర్పడుటయు, మృత్తికవలన జనింపకుండుటయు గమనించితి మేనియు, ననుమాన ప్రమాణముచే ఘటోత్పత్తి యోగ్యతారూపశక్తి మృత్తికయందే గలదు గాని తదితరమునందు లేదనియు, పటోత్పత్తి యోగ్యతా రూపమగు శక్తి తంతువు నందు దప్ప మరి దేనియందును లేదనియు నెరుకపడును. ఒక్కొక్క మృత్తికాదిరూప ధర్మలకును చూర్ణరూప, పిండరూప, ఘటరూపాద్యనేక రూపములు గలుగుచుండుటచే ధర్మిగతమగు యోగ్యతారూప ధర్మము సయితమొకవిధము గాక పలువిధముల నుండునని యంగీకరింపవలయును.

మృత్తికారూపమగు ద్రవ్యమునుండి తొలుత చూర్ణరూపమగు వికారము గలుగును. అంతట పిండరూప వికారము గలుగును. తదనంతరము ఘటరూప వికారము గలుగును. ఇందు చూర్ణముచే పిండరూప వికారము గలుగు సమయమునందు పిండము వర్తమానావస్థలో నుండును. ఆ వర్తమాన పిండమతీత మగు చూర్ణము కన్నను అనాగతమగు ఘటమున కన్నను భిన్నముగ నున్నది. కాని మృత్తిక కన్నమాత్రము

భిన్నముగ లేదుగదా! ఏలనన, మృత్తికయను ధర్మి చూర్ణపిండ ఘటముల యందన్నిట ననుగతమై యుండును గాన పిండమునందు సయితము మృత్తిక యనువర్తించియే యున్నది. యథార్థముగ పిండ మనునది యవ్యక్త రూపమున మృత్తికయే గదా! ఇట్లే చూర్ణము, పిండము, ఘటము ననునవి పరస్పర భిన్నములుగ నున్నను, వానియం దభిన్నరూపముతోడ ననుగమించి యుండు మృత్తికారూప ద్రవ్యము ధర్మి యనబడును.

మృత్తికాదిరూపధర్మికి, 1.శాంతము, 2.ఉదితము. 3.అవ్యపదేశ్యము నను మూడు ధర్మములు గలవు. అందు 1.శాంతధర్మ మనగా - తనవ్యాపారమును నెరవేర్చి స్వకారణమున లీనమయిన ధర్మము. 2.ఉదిత (వర్తమాన) ధర్మమనగా తన వ్యాపారము నింక ననుష్ఠించుచున్న ధర్మము. ఈ యుదిత (వర్తమాన) ధర్మము అనాగత ధర్మమనకు దరువాత వ్యక్త మగును. వర్తమానధర్మమునకు తరువాతనే యతీత (శాంత) ధర్మము ప్రకట మగును. కాని యతీతధర్మానంతరము వర్తమాన ధర్మము గలుగదు. అనుభవ మందనాగత మగునది పూర్వమును తదనంతరము వర్తమాన ధర్మము నగుపడుచున్నవిగాని, యతీతమగు ధర్మమునకును వర్తమాన ధర్మమునకును, పూర్వాపరభావము (అనగా నతీతమయిన తరువాత నది మరల వర్తమాన మగుట) గనబడుట లేదు. కాన నతీతధర్మమునకు ననంతరమున నే ధర్మమును సంభావ్యము గాదు. మరియు వర్తమాన ధర్మమునకు నవ్యవహిత పూర్వకాలమున ననాగత ధర్మముండియే తీరును.

3.అవ్యపదేశ్య ధర్మమనగా, గారణమున సూక్ష్మరూపమున నడగి యుండు ధర్మము. (ఇదియే యనాగత ధర్మమనియు జెప్పబడును.) సర్వవస్తువులయందును సర్వవికారములను గలిగింపదగు యోగ్యతా రూపశక్తులే సూక్ష్మరూపమున వస్తువునందణగి యుండి యవ్యపదేశ్యములని చెప్పబడును. ఇట్లే యాచార్యులును

**''జలభూమ్యోః పారిణామికం రసాది వైశ్వరూప్యం స్థావరేషు దృష్టం, తథా స్థావరాణాం జంగమేషు జంగమానాం స్థావరేషు''**

అనిరి. అనగా జలభూముల పరిణామ కారణమున స్థావరములగు వృక్షాదులయందు, రసగంధాది భేదము గనబడుచున్నది. అట్లే స్థావరముల పరిణామ నిమిత్తమున జంగమములగు మనుష్యాదులయందును రూపాది భేద మేర్పడుచున్నది. జంగమములగు పశ్వాదుల పరిణామములగు గోమయ దుగ్ధాదుల మూలమున ధాన్యచంపకాది స్థావరములకును రూపగంధాది భేదము గలుగుచున్నది యనిభావము.

అది యెట్లన, వృక్షలతా గుల్మాదుల పుష్పఫల మూలములలో రసగంధాదులు వేరువేరుగా నుండును. ఈ భేదమునకు జలభూముల పరిణామమే కారణము. అట్లంగీకరింపమేని యసత్తగునది యావిర్భవింప రాదు. కాన భిన్నభిన్న రసగంధాదులు గలుగుట విరుద్ధ మగును. కాగా జలభూములయందు సూక్ష్మరూపమున నణగియుండి, ఫలాదులయందు రసాది వికారములను గలిగించు శక్తియును యోగ్యతయే యవ్యపదేశ్య మనబడును. ఇట్లే నారింజ, చీనీ, సీమబాదముపప్పు, మొదలగు స్థావర పదార్థములను భక్షించుటచే పురుషునకు (జంగమమునకు) విలక్షణ రూపాద్యావిర్భావము గలుగుచున్నది. అట్లే మేషరుధిరసేకముచే (మేకనెత్తురు చల్లుటచే) దానిమ్మచెట్టు తాటికాయ లంత ఫలములను కాచును. కాననిచట జంగమ పరిణామ వశమున స్థావరములకు విచిత్రరూపత యేర్పడినది.

కాన సర్వవస్తువులును సర్వశక్తిమంతములే. కాని తత్తద్వస్తుగతజాతి మాత్రము వేర్వేరుగనే యుండును గాని సంకీర్ణము గాదు. ఇట్లన్ని వస్తువులు నన్నిశక్తులును గలిగియుండినందున నన్నివేళల నన్నిచోటుల నన్నియు నుత్పన్నములు గావలసియుండినను దేశము, కాలము ఆకారము, నిమిత్తము మొదలుగాగల సహకారి కారణములు లేకుండుటచే నన్నిచోటుల నన్నివేళల నన్నియు నన్నివిధముల నభివ్యక్తములు గాకున్నవి. అనగా దేశకాలాది సహకారి కారణవశమున నాయా కాలముల యందాయా స్థలముల యందాయా రూపమున నాయా వస్తువులే యభివ్యక్తము లగును. కాని యన్నియు నభివ్యక్తములు గావు. ఉదాహరణము - భూమియందు కుంకుమపూవును

గలిగించుశక్తి యున్నను కాశ్మీరదేశమే సహకారి కారణము గాన నాకాశ్మీర దేశమునందే కుంకుమపువ్వు గలుగుచున్నది. అట్లే మామిడిచెట్టునందు నామ్రఫల జనన సామర్థ్య మున్నను వసంతకాలరూప సహకారి కారణవశమున వసంతముననే కాయుచున్నది, ఇట్లు సర్వవస్తువుల యందును సూక్ష్మ రూపమున నడగియున్న ధర్మమే యవ్యపదేశ్యధర్మ మనబడును. ఇట్లు శాంతోదితావ్యపదేశ్యరూపములగు నభివ్యక్తానభివ్యక్త ధర్మముల యందన్ని టను మృత్తికాది సామాన్యరూపముననను, చూర్ణపిండాది విశేషాకార మునను అనువర్తించి యుండు మృత్తికాది ద్రవ్యమే ధర్మి యనబడను.

క్షణికవిజ్ఞానవాదులు ధర్మధర్మిభావము నొప్పుకొనక నీ విశ్వ మంతయు ధర్మిసంబంధరహితమగు (నిర్ధర్మికమగు) ధర్మమాత్రమే యని యందురు. అట్లు క్షణికత్వము నంగీకరించి నిర్ధర్మికత్వమును సమ్మతింతు మేని విజ్ఞానము సయితము క్షణికము గాన వారి మతమున నొక విజ్ఞానముచే నాచరింపబడిన కర్మకన్యము భోక్తగా నగును. అది పొసగదు గాన వారి మతమున సుఖదుఃఖాదిభోగమే లేకుండ వలసివచ్చును. మరియు నన్యదృష్టము నన్యము స్మరించుట యనుపపన్నము గాన స్మృతియు ననుపపన్న మగును. మరియు **"యోఽహమద్రాక్షం సోఽహం స్పృశామి"** మొదలగు ప్రత్యభిజ్ఞయు నమవు పడదు. కాన ప్రత్యభిజ్ఞావశమున ధర్మము వేరైనను ధర్మియొక్కటిగనే ప్రత్యభిజ్ఞాన మగుచున్నది గాన వస్తుసామాన్యము నిర్ధర్మికమగు ధర్మమాత్రము గాదు. కాన వివిధ ధర్మానుగతమగు వస్తువు ధర్మి యని యంగీకరింపవలయును. (చూ. 1.32)

అవ॥ ఇట్లు ధర్మిస్వరూపమును నిరూపించి యిక నొక ధర్మికి ననేక పరిణామములు గలుగుటకు గారణము నెరింగించుచున్నారు.

## సూ॥ క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః॥ 15

క్రమాన్యత్వం, పరిణామాన్యత్వే హేతుః॥

పరిణామాన్యత్వే=వేర్వేరు పరిణామములు గలుగుటలో, క్రమాన్యత్వం,=

క్రమము భిన్నముగా నుండుట, హేతుః=కారణము.

సాధారణముగ నొకధర్మికి నొక పరిణామ ముండవలసి యుండగా ననేక పరిణామములు గలుగుటకు గ్రమభేదము గారణమగు చున్నది. తొలుత మృత్తికకు, చూర్ణరూపమును, తదనంతరము పిండాకారమునను, దానిపై ఘటరూపమునను, అది పగిలిన తరువాత కపాలరూపమునను, అదియు చిట్లిన తరువాత చిరుపెంకులరూపమునను, అవియు నుగ్గయినచో కణరూపమునను పరిణామములు గలుగుచున్నవి. ఒక ధర్మమునకు దరువాత గలుగు ధర్మము తొలుతటి ధర్మమునకు గ్రమమనబడును. కాగా మృత్తికకు గలిగిన చూర్ణ, పిండ, ఘట, కపాల, కణాదిరూపమగు పరిణామపరంపర క్రమయుక్తముగ గనంబడుచున్నది. ఇందు పిండమునందుండు చూర్ణా నంతర్యము, ఘటమునందలి పిండానంతర్యము, కపాలమునందలి ఘటానంతర్యము, కపాలికయందలి కపాలానంతర్యము, కణమునందలి కపాలికా నంతర్యము పరస్పర భిన్నములు. ఇట్టి ఆనంతర్య (క్రమ) భేదమే పరిమాణ భేదమునకు కారణము. ఇందు జూపబడిన చూర్ణపిండ ఘటాది రూపక్రమ మంతయు ధర్మపరిణామక్రమము, ఘటమున కనాగతావస్థనుండి వర్తమానావస్థ గలుగుటయు, వర్తమానావస్థ నుండి యతీతావస్థ గలుగుటయు లక్షణపరిణామక్రమము.

అతీతభావమునకు దరువాత మరియొక పరిణామము సంభవింపదు గాన, నతీతమున కేక్రమమును లేదు. కాన ననాగత వర్తమాన లక్షణములకు రెండింటికే క్రమము నెరుగవలయును.

మరియు నూతన ఘటమునందు క్షణపరంపరా క్రమమువలన ప్రాచీనత్వము తేటపడును గాన నయ్యది యవస్థా పరిణామక్రమము. ధర్మలక్షణపరిణామము లనవరతమును గలుగక నెప్పుడో యొక యప్పుడు గలుగుచుండును. మరి యీ యవస్థా పరిణామము ప్రతిక్షణమునందును గలుగుచు స్థూలముగా ప్రకటపడుచుండును. కాన నీ మూడవదియగు నవస్థా పరిణామము ధర్మలక్షణ పరిణామములకన్న విలక్షణమైనది.

పై జెప్పిన ధర్మ, లక్షణావస్థా పరిణామక్రమములు మూడును ధర్మధర్ములకు భేదము నంగీకరించి వేర్వేరుగ నిరూపింపబడెను. అనగా ధర్మధర్మిభావ మంతయు సాపేక్షికమే గాని వాస్తవమైనది గాదు. ఏలనన మృత్తికారూపధర్మికి ముప్విధములగు పరిణామములు చెప్పబడెను గదా! ఆ మృత్తికారూపధర్మియు గంధతన్మాత్రకు ధర్మమే గాన గంధతన్మాత్రయు మృత్తికను బట్టి ధర్మి యగును గదా! ఆ గంధతన్మాత్రయు నహంకార జన్యముగాన నహంకారమునకు ధర్మమేగదా! ఇట్లే యహంకారము సయితము మహత్తత్త్వమునకు ధర్మమే యగును. కాన ధర్మి యనిన తద్గతములగు ధర్మములను బట్టి యట్లు వ్యవహరింపబడునే గాని యది యింకొక దానికి ధర్మము కాగూడదను నియమము లేదు. అట్లే యొకటి ధర్మమన్న నింకొక దానికి నది ధర్మి గాగూడదను నియమము లే దు. కాన ధర్మ ధర్మిభావము సాపేక్షికమే గాని నియతమైనది గాదు.

ఇట్లు చెప్పుటచే ప్రధానమే (మూలప్రకృతియే) ముఖ్యధర్మి, ఆ ధర్మియందే ధర్మము లన్నిటికి నభేదారోపము చేసినచో ధర్మము లన్నియు మూలప్రకృతియే యగును. కాన గ్రమమనునది యొకే విధమున దోచును. అనగా ధర్మి పరిణామక్రమ మొక్కటియే యథార్థముగ నంగీకరింపబడును.

బాహ్యావస్తువుల యందనేక ధర్మపరిణామము లుండు విధమున చిత్తమున సయితము ధర్మపరిణామము లనేకములు గలవు. చిత్తమునకు పరిదృష్ట (ప్రత్యక్షరూప) ధర్మములనియు, నపరిదృష్ట(పరోక్షరూప) ధర్మము లనియు నిరు తెరగుల ధర్మములు గలవు. ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతి రాగ ద్వేషాది వృత్తులు చిత్తమునకు బ్రత్యక్ష ధర్మములు. నిరోధాది ధర్మములు పరోక్షధర్మములు. నిరోధాదు లేడును శాస్త్రానుమానముల మూలముననే యెరుకపడును గాని, తమంతట ప్రత్యక్షము గావు.

**నిరోధధర్మ సంస్కారాః పరిణామోఽథ జీవనమ్।**
**చేష్టాశక్తిశ్చ చిత్తస్య ధర్మా దర్శనవర్జితాః॥**

అని వ్యాసభగవానులు తెలిపిరి. అనగా- 1.నిరోధము, 2.ధర్మము, 3.సంస్కారము, 4.పరిణామము, 5. జీవనము, 6.చేష్ట, 7.శక్తి - యను నీ చిత్తధర్మము లేడును పరోక్షములు అని భావము.

మరియు చిత్తవృత్తులలో నిరోధరూప చిత్తవృత్తియే యసంప్రజ్ఞాతావస్థ, అది కేవలము యోగశాస్త్రముచే నెరుకపడును గాన, నది యాగమ (శాస్త్ర) గమ్యము, కాన పరోక్షము. పుణ్యాపాపరూప చిత్తధర్మములును ఆగమ గమ్యములును, లేక సుఖదుఃఖాద్యనుభ వానుమేయములు నగుటచే పరోక్షములే. సంస్కారము స్మృతిచే ననుమితి జేయదగినది గాన పరోక్షమే. జీవనము సయితము శ్వాసప్రశ్వాసాను మేయము మాత్రమే. ఇట్లే చిత్తపరిణామము సయితము పరోక్షము గాన నను మేయమే. చిత్తచేష్టయు జ్ఞానహేతు తత్తదింద్రియ సంయోగముచే ననుమేయము మాత్రమే. చిత్తమున కార్యము లగు రాగాదుల సూక్ష్మావస్థా రూపశక్తియు స్థూలకార్య జ్ఞానముచే ననుమేయమే. కాన నీయేడును పరోక్షములు, లేక యపరిదృష్టములు.

అవ॥ ఇక నీపాదము ముగియువరకును ధారణాది నిష్ఠుడగు యోగికి స్వాభిలషితార్థ సాక్షాత్కారార్థము సంయమమునకు విషయములను, సంయమసిద్ధిని సూచించు విభూతులను వివరింతురు. అందు దొలుదొలుత బూర్వోక్త పరిణామత్రయ విషయమున సంయమము ననుష్ఠించుటచే గలుగు సిద్ధుల నెరింగించుచున్నారు.

## సూ॥ పరిణామత్రయసంయమా దతీతానాగతజ్ఞానమ్॥ 16

పరిణామత్రయ సంయమాత్- అతీతానాగతజ్ఞానమ్॥

పరిణామత్రయ సంయమాత్ - పరిణామత్రయ = ధర్మ, లక్షణావస్థారూపములగు మూడు పరిణామములయందు, సంయమాత్ =

ధారణాధ్యాన సమాధుల నొనర్చుటవలన, అతీతానాగత జ్ఞానమ్ = భూతభవిష్యద్వస్తువుల సాక్షాత్కారము గలుగును.

ధర్మపరిణామమునందును, లక్షణపరిణామమునందును, అవస్థా పరిణామము నందును; ధారణయు, ధ్యానమును, సమాధియు, నొనర్చుట వలన తొలుత ధర్మలక్షణావస్థా పరిణామ సాక్షాత్కారము గలుగును. తదనంతర మాపరిణామములయం దనుగతమగు నతీతానాగత ధర్మములు సాక్షాత్కరించును గాన పరంపరా సంబంధముచే పరిణామత్రయ సంయమము అతీతానాగత పదార్థ సాక్షాత్కార సాధన మగును.

మరియు నీ ధర్మియం దీధర్మ మీలక్షణ మీయవస్థయు ననాగత స్థితిని దాటి వర్తమానస్థితికి వచ్చి తన వ్యాపారమును జేసి యతీతస్థితి నొందుచున్నదని తలచుట యను విక్షేపములు గలుగక నిశ్చలమగు సంయమము నొనర్చునేని చిత్తము శుద్ధసత్త్వ ప్రకాశరూప మైనదిగావునను, అవిద్యాది రూపవిక్షేపము లేనందున సర్వార్థ గ్రహణ సామర్థ్య మపహృతము గాలేదు గావునను నివృత్తమలమగు నద్దము సర్వార్థ గ్రహణ సమర్థమగు తెరగున చిత్తము సయిత మతీతానాగతములను సయితము గ్రహించునని భావము.

అవ॥ పై సంయమునకే సిద్ధ్యంతరమును నిరూపించుచున్నారు.

**సూ॥ శబ్దార్థప్రత్యయానా మితరేతరాధ్యాసా త్సంకరస్తత్ప్రవిభాగసంయమాత్సర్వభూత రుతజ్ఞానమ్॥ 17**

శబ్దార్థప్రత్యయానాం, ఇతరేతరాధ్యాసాత్, సంకరః, తత్ప్రవిభాగ సంయమాత్, సర్వభూతరుతజ్ఞానమ్॥

శబ్దార్థ ప్రత్యయానాం=పదము, తదభిధేయమైన యర్థము, తద్విషయమగు జ్ఞానము ననువాటికి, ఇతరేతరాధ్యాసాత్=పరస్పరాభేద నిశ్చయమువలన, సంకరః=పరస్పరసాంకర్యము గలుగును. తత్ప్రవిభాగ సంయమాత్, తత్ప్రవిభాగ=

ఆశబ్దార్థజ్ఞానముల విభాగ విషయమున, సంయమాత్=ధారణా ధ్యానసమాధుల వలన, సర్వభూతరుతజ్ఞానం= సకలప్రాణిభాషా పరిజ్ఞానము గలుగును.

శబ్దమును, తదభిధేయమగు నర్థమును, దద్విషయకమగు జ్ఞానమును, విభిన్నములయ్యు నొండొంటితో నభిన్నములుగ నెంచబడు నేని ''యయ్యది శబ్దము, యియ్యది యర్థము, యియ్యది జ్ఞాన'' మను విభాగము లేకుండబోవును గాన సాంకర్యము గలుగును. అట్లుగాక శబ్దార్థజ్ఞాన ప్రవిభాగ విషయమున సంయమ మబ్బెనేని సకల ప్రాణుల సంభాషణముల నెరుగు సామర్థ్య మబ్బును.

**అష్టౌ స్థానాని వర్ణానా మురః కంఠశ్శిరస్తథా।**
**జిహ్వామూలం చ దన్తాశ్చ నాసికోష్ఠే చ తాలు చ॥**

అన్నటుల నురః కంఠ శిరో జిహ్వామూల దంత నాసికోష్ఠ తాలువులను నష్టస్థానములు గల పంచాశత్ వర్ణములను వ్యక్తీకరించుటయే వాగింద్రియమునకు ప్రయోజనము. శ్రోత్రేంద్రియము, ధ్వనిపరిణామ మును మాత్రము విషయీకరించును. వాచకపద మన్ననో వర్ణములను బ్రత్యేకముగ గ్రహించిన యంతట నేకత్వబుద్ధిచే నేర్పడునది. పలు వర్ణములొకే సమయమున నుత్పన్నములుగావు గాన, క్రమోచ్చరితములగు వర్ణముల కొండొంటి యనుగతి అనుగ్రహము లేకుండిన నవి స్ఫోటమును వ్యంజింపజాలక యూరక యావిర్భవించి యడగిపోవును. కాన నొక్కొక్క వర్ణము పద మనబడదు. యథార్థముగ నొక్కొక్క వర్ణము సయితము సర్వార్థాభిధాన శక్తియుక్తమే. గోగణ గవయ గంధాది పదములయందలి గకారమాయా పదార్థములను (పదస్ఫోటముల) వ్యంజింప జేయుచు పదాత్మక మగును. కాని గకారము స్ఫోత్తరమున నున్న ఓకార సహకారముననే గోరూపార్థమును వ్యంజింపజాలును. అట్లే గకారము స్ఫోత్తరవర్తి అకార, తదుత్తర ణకార, తదుత్తరాకార సహకారముననే సంఘ రూపార్థమును వ్యంజింపజాలును. కాన నొక్కొకవర్ణమును సహకారి వర్ణాంతర ప్రతిసంబంధియై నానార్థములను వ్యంజింపజేయుచు నానా రూపముల నొందిన విధమున భాసించును. ఇట్లేక

జాతీయములగు వర్ణములు పూర్వోత్తర స్థితివిశేషార్థమున వ్యవస్థితము లగును. అనగా 'జరా''రాజా' యను పదముల రెండింటను 'జ'యను నక్షరమును 'రా'యను నక్షరమును మాత్రమే యుండియున్నను జకార పూర్వకత్వము వలన 'రా'కారము వృద్ధత్వ రూపార్థమును దెలుపును. అట్లే 'రా'కారోత్తరకత్వమువలన 'జ'కారము సయితము వృద్ధత్వమును బోధించును. 'రా'కారపూర్వకత్వమువలన 'జ' కారమును, 'జ' కారపరకత్వము వలన 'రా ' కారమును ప్రభ్వాదిరూపార్థమును బోధించును. కాన పూర్వోత్తర వర్ణ సంబంధమువలన వర్ణము అర్థవిశేషమున వ్యవస్థిత మగును. కాన బహువర్ణములు స్వక్రమానుగుణముగ నర్థసంకేత యుతములై యుండును.

ఇట్లు సర్వాభిధానశక్తి సంపన్నములగు గ కారము, ఓ కారము విసర్జనీయములు (గౌః) గంగడోలు మొదలగునవి గల వ్యక్తివిశేషమును ద్యోతింపజేయును. ధ్వనినిమిత్తకమగు క్రమ ముపసంహృతము గాగా స్థూల బుద్ధికి నర్థమునందు సంకేతము గలవి వలె గోచరించు వర్ణముల కేక బుద్ధినిర్భాసమే వాచ్యార్థమునకు వాచకమగు పదమని సంకేతింపబడును. కావుననే యేకబుద్ధి విషయముగాన నేకమై, యేక ప్రయత్నాక్షిప్తమై, నిరంశమై, యుగపదుత్పద్యమాన మైనది గాన (స్ఫోటాఖ్య) పదము, అనేక బుద్ధి నిర్గ్రాహ్యమై, యనేక ప్రయత్నోత్పాదనీయమై, సాంశమై, క్రమోత్పద్య మానమగు వర్ణసంఘమునకన్న భిన్నమై, బుద్ధిమాత్ర గ్రాహ్యమై, పూర్వవర్ణానుభవజనిత సంస్కార సహితాంత్యవర్ణ ప్రత్యయ సంస్కారముచే నభివ్యంజితమై, పరునకెరింగింప దలచుటచే వక్తలచే నభిహితములై, శ్రోతలచే శ్రూయమాణములగు వర్ణములచేతనే, యనాదివాగ్వ్యవహార వాసనాను విద్ధమగు లోకబుద్ధిచేతను, పరమార్థముగ వృద్ధసంవాదముచేతను ప్రతీయ మాన మగును.

అట్టి పదమునకు నీవిధమగు నిన్నివర్ణముల కలయిక యీ యొక్క యర్థమునకు వాచక మగునను సంకేత బుద్ధివశమున ప్రవిభాగమును యోగి గడింపవలయును. సంకేతమనగా - పదపదార్థములకు పరస్పరాధ్యాసరూప

నైనది. అది. ''ఈశబ్ద మీయర్థమే, ఈ యర్థ మీశబ్దమే'' యను నారోపితా భేదము గలది. ఇట్లు శబ్దార్థముల కభేదాధ్యాస రూపసంకేతము గలదు. కావుననే ''ఓమిత్యేకాక్షరం బ్రహ్మ'' యని యోంకారరూప శబ్దమున కును బ్రహ్మరూప పదార్థమునకును నభేదము పొసగును. ''అస్మాత్పదాద యమర్థో బోద్ధవ్య ఇతీశ్వరేచ్ఛావిషయత్వం శక్తిః'' యను మత మప్రామాణికము. ఏలనన, నీలక్షణము లక్షణావృత్తి యందు సయిత మతి వ్యాప్త మగును. మరియు నీశ్వరుని నెరుగని, లేక యంగీరింపని వారికి సయితము శబ్దార్థ జ్ఞానము గలుగుచున్నది గదా!

ఇట్లితరేతరాధ్యాసరూపము సంకేతబుద్ధివశమున శబ్దము, అర్థము జ్ఞానము నను మూడు నితరేతరాధ్యస్తములై సంకీర్ణము లగును. కంఠతాల్వాది సంయోగవశమున నుత్పన్నమై శ్రోత్రేంద్రియగ్రాహ్య గోశబ్దమునకు ''గౌః'' అనియే యుచ్చారణము గలుగుచున్నది, సాస్నాదిమద్గోరూపవ్యక్తియు ''గౌః'' అనియే చెప్పబడును, గోవిషయక జ్ఞానము సయితము ''గౌః'' అనియే కలుగును. కాన శబ్దార్థ జ్ఞానములు వేర్వేరయ్యు పరస్పర సంకీర్ణములై తోచును. ఈ విషయము ప్రథమపాదము నలుబది రెండవసూత్రపు వివరణమున వివరముగ దెలుపబడినది.

ఇట్లు పరస్పర సంకీర్ణములుగ భాసించు శబ్దార్థ జ్ఞానముల విభాగము నెరింగిన యాతడే సర్వజ్ఞుడు.

ఎదుటివానికి స్వవివక్షితార్థమును బోధించుటకొరకు శబ్దములు ప్రయోగింపబడునేగాని, కేవలశబ్ద బోధనముకొఱకుగాని, పదార్థ బోధనము నకై గాని యట్లు ప్రయోగింపబడవు, కాన శబ్దములకు వాక్యార్థ మునందే తాత్పర్యముగాన శబ్దము లన్నింటికిని వాక్యార్థమే యభిధేయము. క్రియాకారక సంబంధబోధక పదప్రయోగ స్థలమున వాక్యార్థము భాసించు విధమున నొక్కొక్క పదమును ప్రయోగించిన అచట సయిత మప్రయుక్త మయ్యు నావశ్యకమగు పదాంతరముతోడ నేకీకృతమైన ప్రయుక్తపదము

వలననే యర్థమభివ్యక్త మగును గాని కేవల పదమువలన నర్థమభిహితము గాదు. అన్వితాభిధానరీతిగ తత్తన్మాత్రమగు శబ్దమునకు సామర్థ్యము లేదు. పై నిరూపించిన విధమున పదైకదేశములగు నొక్కొక్క వర్ణములకు సర్వపదార్థ ప్రతిపాదన సామర్థ్యముండు విధమున వాక్యైకదేశమగు నొక్కొకపదము సయితము సర్వవాక్యార్థమును ప్రతిపాదింపజాలి యుండును కాన సర్వపద ములయందును వాక్యశక్తి యున్నది. చూడుడు- 'వృక్షము' అని యొక్క పదమును మాత్రము ప్రయోగించినను 'ఉన్నది' యని తోచి తీరును. అధ్యాహృతమగు 'నున్నది' యను పదముతోడ గూడి వృక్షపదము వాక్యార్థబోధకమగు ను గాన వాక్యైకదేశమగు వృక్షపద మొక్కటియే వాక్యార్థమును బోధించును. పదార్థము లన్నియు సత్తాహీనములు గావు గాన ''వృక్షము'' అని యన్నంతనే పదార్థనియత మగు నునికి (సత్త) తోచి తీరును.

కావుననే శబ్దవృత్తిరహస్యాభిజ్ఞులు, **''యత్రాన్యత్ క్రియాపదం నాస్తి తత్రాస్తిర్భవంతీ పరోఽప్రయుజ్యమానోఽప్యస్తి ''**యని నియమించిరి. అనగా నే క్రియాపదమును ప్రయోగింపని యెడల, లద్రూపమగు 'అస' ధాతువు (వర్తమానసత్తార్థకము ) ప్రయోగించినట్లే యని నియమించిరి. మరియు కారక హీనమగు క్రి య యుండదు గాన ''వండుచున్నది'' మొదలగు క్రియాపదమును మాత్రము ప్రయోగించినచో కర్తృకర్మ కరణాది కారకము లవశ్య మాక్షేపింపబడును. అయినను చైత్రుడని కర్తృకారకమును, తండులములనని కర్మకారకమును, అగ్నితోనని కరణకారకమును, బ్రయో గించుట నియమార్థము మాత్రమే. అనగా సర్వకర్తలు ప్రాప్తించు చుండగా చైత్రుడు మాత్రమే యిచట కర్తయనియు, వ్రాచ్యము లగు సకల పదార్థములును కర్మలుగా నన్వయించుచుండగా తండులములు మాత్రమే యనియు, సకల తేజస్సులు కరణములుగా నన్వయించుచుండగా వహ్నిచేత మాత్రమే అనియు నియమించుటకు తత్తత్కారకములు ప్రయోగింపబడెను.

మరియు గొన్నియెడల వాక్యార్థమును బోధింపవలసియున్నను

కేవలపద ప్రయోగము స్పష్టముగా జేయబడుచున్నది. చూడుడు. ''వేదమును జదువుచున్నా''డని వాక్యార్థమును బోధింప ''శ్రోత్రియుడు'' అను పదమును, జీవములను ధరించి యున్నా డనవలసిన చోట ''జీవించుచున్నా''డను పదమును ప్రయోగింతుము. ఇట్లే పదార్థము వాక్యముచే నభివ్యక్తపరపబడును. కావుననే క్రియాకారకాది పదమున కర్థము వివరింపవలసి వచ్చునేని ప్రకృతి ప్రత్యయాది విభాగపూర్వకముగ వాక్యముచేతనే వివరింపబడును. అట్లు వివరింపకున్నచో ''ఘటో భవతి'' ''భవతి భిక్షాం దేహి'' యను వాక్యములలో ''భవతి '' యను పదము విషయమునను, ''అశ్వస్త్వమ్'' ''అశ్వో'' ''యాతి'' అను వాక్యములలో ''అశ్వః'' అను పదమునకున్ను ''అజాపయః పిబ'' ''అజాపయః శత్రూన్'' అను వాక్యములలో ''అజాపయః'' యను పదమునకున్ను, నామపదముగా నన్వయించునపుడును, క్రియాపదముగా నన్వయించు నపుడును రూపసామ్య ముండుటచే నిది నామవాచక మనియు, నిది యాఖ్యాత ( క్రియాపద ) మనియు నెరుకపడుటలేదు. కాన నీపదము క్రియ యనియు, నీపదము కారకమనియు వాక్యముచే వివరణము చేయవలయును.

అనగా ''ఘటో భవతి'' యను వాక్యమునకు 'ఘటమున్నది' యను నర్థముగాన తద్వాక్యములో గలిపి ప్రయోగించుటచే నా ''భవతి'' పదమున 'కున్నది' యను నర్థమును, ఆఖ్యాత రూపత్వము నిస్సందేహముగ నెరుకపరుపబడెను. అట్లే ''భవతి భిక్షాం దేహి'' యను వాక్యమునకు నోపూజ్యురాలా! నీవు భిక్షను బెట్టుము' అని యర్థము గాన నీ ''భవతి'' పదము భవతీశబ్ద సంబుద్ధిరూపము గాన నామవాచకమని వాక్య సంఘటనముచే తేటపరుపబడెను. ''అశ్వః'' అను పదమును గురించియు, ''అశ్వస్త్వమ్'' అను వాక్యమునకు 'నీవు నడచితివి' ను నర్థము గాన నావాక్యఘటితమగు ''అశ్వః'' అను పదమునకు 'నడచితి'వను నర్థమనియు నిది, యాఖ్యాతమనియు నిశ్చిత మగును. అట్లే ''అశ్వో యాతి'' యను వాక్యమునకు 'గుఱ్ఱము పోవుచున్నది' యను నర్థము గాన నిందలి ''యశ్వ''

అను పదము నామవాచక మనియు, దానికి 'గుఱ్ఱ'మను నర్థమనియు నిర్ణీతమగును, ''అజాపయః'' యను పదము విషయమున నయితమర్థ సందేహము గలుగుచుండగా ''అజాపయః పిబ '' యని ప్రయోగించినచో నీవాక్యమునకు ''మేకపాలు త్రావుము'' అను నర్థముగాన నిందలి ''అజాపయః'' అను పదము నామవాచకమనియు, 'మేకపాల'ని దాని కర్థమనియు స్పష్టమగును. అట్లే ''అజాపయశ్శత్రూన్'' అని ప్రయోగింప బడినచో ''శత్రువులను బరిభవించితివి'' యను నర్థము గాన నిందలి ''అజాపయః'' యను పదమాఖ్యాతమనియు 'బరిభవించితివ'ని దాని యర్థమనియు నేర్పడును.

కాగా నిట్లు శబ్దార్థజ్ఞానములకు పరస్పర సాంకర్య మేర్పడును. కాన యోగి వానిని విభజించి యేర్పరచుకొనవలయును. అది యెట్లనిన - శ్వేతతే ప్రాసాదః'' ''శ్వేతః ప్రాసాదః'' అను రెండు వాక్యములకున్ను ''మేడ తెల్లనిది'' యనియే యర్థమైనను తొలుతటి వాక్యమునందలి శ్వేతపదము సాధ్యరూపమగు క్రియను దెల్పును. రెండవ వాక్యమునందలి శ్వేతపదము సిద్ధరూపమగు కారకమును దెలుపును, ఈ వాక్యములయందు ''శ్వేతతే, శ్వేతః'' అని శబ్దములు భిన్నములుగనే యుండినను శ్వేతగుణమాత్రక మగు నర్థమొక్కటిగనే గోచరించును. మరియు '' ఆ యీ ప్రాసాదము శ్వేతము'' అను నభేద ప్రత్యభిజ్ఞానమువలన శ్వేతాకార ప్రత్యయము సయితము గలుగును.

యథార్థముగా శ్వేతరూపార్థము శ్వేతశబ్దమునకును, శ్వేతజ్ఞానము నకును నాలంబనమై నవ, పురాణాది స్వావస్థలచే విక్రియమాణమై ప్రాసాదాదులయందే యుండును గావునను, శ్వేతశబ్దముండు నాకాశమున గాని, శ్వేతజ్ఞానాధారమగు బుద్ధియందు గాని యుండదుగాన, శబ్దసహ చారియు నర్థసహచారియు గాదు. ఇట్లే శ్వేతశబ్దము సయితము స్వావస్థలచే విక్రియమాణమై యర్థజ్ఞానములకు సహచరము గాదు. ఆవిధముననే జ్ఞానముగూడ స్వావస్థలచే విక్రియమాణ మగుచు శబ్దార్థములకు సహచరము

గాదు. కాన శబ్దము వేఱు. అర్థమువేరు, జ్ఞానమువేరు - అను ప్రవిభాగము గలుగవలయును. ఇట్టి శబ్దార్థజ్ఞాన విషయమున సాధకునకు సంయమ మబ్బెనేని సర్వప్రాణులభాషల నెరుంగు సామర్థ్యము తనంతటనే లభించును. అనగా మనుష్యవిషయమున శబ్దార్థజ్ఞాన ప్రవిభాగ విషయమున సాక్షాత్కార పర్యంతముగు సంయమమును సాధించెనేని యోగజధర్మ మచింత్యశక్తి యుక్తముగాను, స్వసదృశ ఫలము నిచ్చుట ధర్మములకు స్వభావము గావునను, సకల భూతవాక్కును తదర్థమును తద్జ్ఞానమును యోగికి గోచరించును.

అవ॥ ఇంక సంస్కార సంయమమునకు ప్రయోజనమును దెలుపు చున్నారు.

## సూ॥ సంస్కార సాక్షాత్కరణాత్ పూర్వజాతిజ్ఞానమ్॥ 18

సంస్కార సాక్షాత్కరణాత్, పూర్వజాతిజ్ఞానమ్॥

సంస్కార సాక్షాత్కరణాత్ = సంస్కారవిషయకమగు సంయమమువలన (సంస్కారములను సాక్షాత్కరించినచో), పూర్వజాతిజ్ఞానమ్ = పూర్వజాతు తెరుకపడును.

సంస్కారములను సంయమవశమున సాధకుడు సాక్షాత్కరించెనేని యింతకు ముందటి తనజన్మము లన్నియు గోచరించును. వాసనా రూపములనియు, ధర్మాధర్మ రూపములనియు సంస్కారములు రెండు విధములు. ఇందు తొలుతటి వగు వాసనారూప సంస్కారములు ప్రత్యక్షాది ప్రమాణజన్యము లగునేని స్మృతికి గారణము లగును. అవిద్యాది సంస్కారము లవిద్యాదిక్లేశములకు గారణము లగును. కావున వాసనా రూపసంస్కారములు స్మృతిక్లేశహేతువులు, ధర్మాధర్మరూప సంస్కారములు జాత్యాయుర్భోగ రూపములగు విపాకములకు హేతువులగును. ఈ సంస్కారము లన్నియు పూర్వజన్మములయందు దమతమ కారణములచే నిష్పన్నములై పరిణామము, చేష్ట, నిరోధము, శక్తి, జీవనము మొదలగు ధర్మము లప్రత్యక్షములై

యుండు విధమున చిత్తమున నణగియుండును. ఇట్టి సంస్కారముల విషయమున సంయమమును గడించెనేని సంస్కార సాక్షాత్కారము లభించును. మరియు నా సంస్కారములు దేశకాల నిమిత్తముల యనుభవము లేక సంభవింపవు గావున సంస్కారములతోడ నాయాదేశములు, నాయా కాలములు, నాయా నిమిత్తములు సయితము గోచరించును. కాన సంస్కార సాక్షాత్కారము గలిగిన యోగికి పూర్వజన్మ సాక్షాత్కా రము గలుగును.

మరియు సంస్కారములయందు సంయమమును గడించి పరుల సంస్కారములను సాక్షాత్కరించుకొనెనేని, యా యోగి పరుల పూర్వ జన్మములను గూడ సాక్షాత్కరించును. ఈ విషయమున నొక కథ యున్నది. జైగీషవ్యుడను నొక యోగిసత్త ముడుండెను. అతడు సంస్కార సాక్షాత్కారము గలవాడు గాన నతనికి పది మహాకల్పముల యందలి తనజన్మ పరిణామక్రమమును దెలిసికొనుశక్తితోడ వివేకజ్ఞాన ముదయించెను. ఇట్లుండగా ఆవట్యుడను నొక యుత్తమయోగి లింగశరీరమాత్ర విహారియయ్యు జైగీష వ్యుని బరీక్షించు తలంపున స్వేచ్ఛాగృహీతదేహుడై వచ్చి, ''యోమునిసత్తమా! భవ్యుడవు గాన ననభిభూత బుద్ధిసత్త్వుడవై పది మహాకల్పములయందు దేవతిర్యగాదియోనులను, గర్భనరకాది దుఃఖములను సాక్షాత్కరించితివి. ఇట్లు సాక్షాత్కరించుచు దేవమనుష్యాది యోనుల యందు మరల మరల నుద్భవించుచుంటిరి గదా! ఈ సంసారమున సుఖదుఃఖములలో నేయది యధికముగ నుపలబ్ధ మయ్యెను'' అని ప్రశ్నించెను. అందులకు జైగీషవ్యుడు బదులు పలికెను. ''ఈ పది మహా కల్పముల యందునను రజస్తమోమాలిన్య శూన్యమై యతిరస్కృత బుద్ధిసత్త్వము గల నేను నరకతిర్యగ్భవమగు దుఃఖము నెరిగి దేవమనుష్యాది యోనులయందు బుట్టుచు ననుభవించిన దంతయు దుఃఖమే యని నిశ్చయింతును''.

ఆవట్యుడు ''జైగీషవ్యమునీంద్రా! ఆయుష్మంతుడవగు నీకు యోగబలము వలన గలిగిన ప్రధానవశిత్వము అనగా ప్రకృతిని లోబరచు

కొనుట యుత్తమోత్తమమగు సంతోషసుఖమై యుండగా దానిని సయితము దుఃఖములలో జేర్చితిరేల?

జైగీషవ్యుడు- ఋషీంద్రా! ప్రధానవశిత్వమను సంతోష సుఖము విషయసుఖములకన్న నుత్తమ మగునే గాని కైవల్యమునుబట్టి విచారించితి మేని యిదియు దుఃఖమే, సంతోష మనునది బుద్ధిసత్త్వపు ధర్మము. ఇందు సత్త్వగుణ మధికముగ నుండినను రజస్తమ స్సంబంధ ముండియే తీరును. కాన సంతోషము సయితము త్రిగుణాత్మకమే కాన సంతోష సుఖరూప జ్ఞానము సయితము హేయములలో గణింపబడును.

సంతోషము బుద్ధిధర్మము గాన సుఖరూపము గాకున్నను సూ॥"**సంతోషాదనుత్తమ స్సుఖలాభః**" అను సూత్రముచే సంతోష మనుత్తమ సుఖమునకు గారణముగా జెప్పిన దానికిది భావము. దుఃఖ రూపమగు తృష్ణాతంతువు పురుషుని బంధించును. అట్టి తృష్ణాతంతువు సంతోషముచే నశించును. తృష్ణాదుఃఖ పరంపర నశించుటచే చిత్తము పీడారహితమై ప్రసన్న మగును. ఈ విధముగ తృష్ణానివృత్తిద్వారమున సర్వానుకూలము, నిర్బాధమునగు సంతోష సుఖ ముత్తమోత్తమముగ నగును. కాని, వాస్తవముగ సంతోషము సుఖరూపము గాదు. కైవల్యము మాత్రమే యుత్తమోత్తమ సుఖము గాన తక్కిన దంతయు దుఃఖరూపమే.

అవ॥ ఇక ప్రత్యయ సంయమమునకు ప్రయోజనము దెలుపబడు చున్నది.

## సూ॥ ప్రత్యయస్య పరచిత్తజ్ఞానమ్॥ 19

ప్రత్యయస్య, పరచిత్తజ్ఞానమ్॥

ప్రత్యయస్య = పరచిత్తవిషయక మగు, సాక్షాత్కారణాత్ = (పూర్వ సూత్రము నుండి యనువృత్తము) సంయమము వలన, పరచిత్తజ్ఞానం = ఇతరులచిత్తము నెరుగు శక్తి యేర్పడును.

ఇతరుల చిత్తమున సంయమము నొనర్చుటచే నితరుల చిత్తమును సాక్షాత్కరించు శక్తి యబ్బును. ఇచట ప్రత్యయ పదమునకు చిత్తమని మాత్రమే యర్థమగు చున్నను పరచిత్తజ్ఞాన రూప ఫలానుగుణముగా నితరుల చిత్తమని యర్థము చెప్పబడినది. కొందరు వ్యాఖ్యాతలు మాత్రము రాగాదియుక్తమగు తన చిత్తవృత్తి యందు సంయమము వలననే యట్టి చిత్తము వలననే పరచిత్తముల యశేష విశేషములును జ్ఞాతము లగునని యభిప్రాయపడిరి.

అవ॥ సంస్కార సాక్షాత్కారమువలె పరచిత్తసాక్షాత్కారము సావలంబనము కాదని తెలుపుచున్నారు.

## సూ॥ న చ తత్సాలంబనం తస్యావిషయీభూతత్వాత్॥20

పద॥ న, చ, తత్, సాలంబనం, తస్య, అవిషయీభూతత్వాత్॥

అర్థము॥ తస్య = ఆపరచిత్తసాక్షాత్కారమునకు, అవిషయీ భూతత్వాత్ = రాగాదులు విషయము కాకుండుటవలన, తత్ = ఆపరచిత్తసాక్షాత్కారము, సాలంబనం = రాగాది విషయాలంబన సహిత మగునది, న చ = కాదు.

ఈ పరచిత్త జ్ఞానములో రాగాదులు విషయములు గావు. కాన నీ పరచిత్త సాక్షాత్కారము నిరవలంబనమేగాని సావలంబనము గాదు. చిత్తసంయమము గలిగిన యోగి యీ పురుషుని చిత్తము రాగయుక్తము లేక ద్వేషయుక్తమని యింతమాత్ర మెరుగునే గాని, యేతద్విషయములో రాగయుక్తమై యున్నదనియు, నేతద్విషయమున ద్వేషము గలిగి యున్నదని కాని విశేషము నెరుగడు కాన పరచిత్తమున కాలంబనమై, వారి రాగద్వేషముల కాలంబన భూతమగు పదార్థమును యోగిచిత్తము విషయీకరింపదు. కాన నితరుల చిత్తము మాత్రము యోగిచిత్తమున కాలంబన మగును. ఒకవేళ విషయవిశిష్టమగు పరచిత్తముననే సంయమము చేసెనేని, యట్టి సంయమమువలన పరచిత్త ఆలంబన విషయజ్ఞానముగూడ యోగికి గలుగుట దుర్లభము గాదు.

అవ॥ మరియొకసిద్ధి నెరింగించుచున్నారు.

**సూ॥ కాయరూపసంయమాత్తద్గ్రాహ్యశక్తిస్తంభే చక్షుః ప్రకాశాసంయోగేఽన్తర్ధానమ్॥ 21**

పద॥ కాయరూపసంయమాత్, తద్గ్రాహ్యశక్తిస్తంభే, చక్షుఃప్రకాశాసంయోగే, అన్తర్ధానమ్॥

అర్థము॥ కాయరూపసంయమాత్, కాయ = తన శరీరముయొక్క, రూప = రూపవిషయమున, సంయమాత్ = సంయమను జేయుటవలన, తద్గ్రాహ్యశక్తి స్తంభే, తత్ = ఆరూపముయొక్క, గ్రాహ్యశక్తి = గ్రహణ యోగ్యమగు శక్తియొక్క స్తంభే = నిరోధించుట గలుగగా, చక్షుఃప్రకాశసంప్రయోగే, చక్షుఃప్రకాశ = ఇతరుల చాక్షుషతేజములోడ, అసంప్రయోగే = తన శరీరమునకు సన్నికర్షము కలుగ కుండగా, అన్తర్ధానమ్ = (యోగికి) అంతర్ధానము అనగా నితరులకంటి కగుపడకుండు శక్తి సిద్ధించును.

సాధకుడు తన శరీరరూపమునందు సంయమమును సాధించెనేని చక్షుర్గ్రాహ్యగుణమగు రూపమునందలి చక్షుర్గ్రాహ్యత్వ రూపశక్తి యడ్డు పరుపబడును. కాన, రూపచక్షుః ప్రకాశసన్నికర్షము గలుగదు గాన, నితరులకు తన రూపము గోచరము గాదు. కాన యోగి యితరులకంటి కగుపడ కుండును. అనగా పాంచభౌతికమగు నీ దేహము రూపవంతము గాన చాక్షుష జ్ఞానమునకు విషయ మగుచున్నది. అనగా రూపద్వారముననే యీ శరీరము నేత్రజన్య ప్రత్యక్షములో గోచరించుచున్నది. సాధకుడు తన కాయరూప విషయమున సంయమము ననుష్ఠించెనేని రూపము నందింతకు ముందున్న గ్రాహ్యశక్తి యరికట్టబడును. కాగా నితర చక్షూరూప సన్నికర్షము గలుగదు. కావున యోగి యితరుల యెదుట నుండియు వారి కంటికగు పడకుండును. ఇందు జెప్పిన కాయరూప సంయమమును, చక్షుఃప్రకాశాసంప్రయోగము నుపలక్షణములు. కాన రూపవిషయక సంయమమువలన సాధకుడు పరులకంటికి గోచరముగాని విధమున, శబ్దవిషయక సంయమమువలన

సాధకుని శబ్దము పరుల శ్రవణములకు గోచరము గాకుండును. ఇట్లే స్పర్శరస గంధములకుగూడ నంతర్ధాన మేర్పడునని యూహింపవలయును.

అవ॥ మరియొక సిద్ధి నెరిగించుచున్నారు.

## సూ॥ సోపక్రమం నిరుపక్రమం చ కర్మ తత్సంయమా వా॥ 22

పద॥సోపక్రమం, నిరుపక్రమం, చ, కర్మ, తత్సంయమాత్, అపరాన్త జ్ఞానం, అరిష్టేభ్యః, వా॥

అర్థము॥ సోపక్రమం=సోపక్రమమును (ప్రారబ్ధమును), నిరుపక్రమం, చ=నిరుపక్రమము (ఆగామి)నను, కర్మ=ద్వివిధకర్మ యేది గలదో, తత్సం యమాత్= అట్టి యిరుతెరగులగు కర్మముల విషయమున సంయమము వలన, అపరాన్త జ్ఞానం=శరీరావసాన (మరణ) జ్ఞానము గలుగును, అరిష్టేభ్యో వా = మరణసూచకములగు నరిష్టముల ద్వారమునగాని, అపరాన్తజ్ఞానం = మరణజ్ఞానము గలుగును.

ఆయుర్విపాకము గల కర్మ సోపక్రమ మనియు, నిరుపక్రమ మనియు నిరుతెరగులు.

సోపక్రమకర్మ యనగా-ఫలము నిచ్చుటకు దొరకొని చాలవరకు ఫలమునొసగి యింకను కొలదిఫలము నీదగియున్న కర్మము.

నిరుపక్రమ మనగా-వర్తమాన కాలమున ఫలదానమున కుపక్రమింపక యుత్తర కాలమున ఫలమునీబోవు కర్మము.

అనగా తడిసిన పుట్టము ఆరబరుచబడినదియై యల్పకాలముననే యారిపోవు విధమున శీఘ్రముగ ఫలప్రదమగు కర్మము సోపక్రమము, ఆతడి పుట్టమే ముడువబడినదై చాల కాలమునకు గాని యారని యనువున విలంబఫలప్రదమగు కర్మ నిరుపక్రమము.

మరియు నట్లే యగ్ని, యెండిన కసవుపొదలో తగుల్పబడి గాలిచే

నలుదిశల రగుల్కొలుపబడి వెన్వెంటనే కాల్చివేయు విధమున శీఘ్రఫలదము సోపక్రమము; ఆయగ్నియే పచ్చిగడ్డియందు తత్సూక్ష్మావయవముల యందుంపబడి క్రమక్రమముగ చాలసేపటికి కాల్చు తెరగున విలంబిత ఫల మగునది నిరుపక్రమము. కాగా నిట్లేకభవికము నాయుష్కరము నగు కర్మ, సోపక్రమ నిరుపక్రమ భేదములచే ద్వివిధము, ఇట్టి ద్వివిధకర్మయందును సంయమ మబ్బెనేని సాధకునికి మరణజ్ఞానము గలుగును, అనగా నీదేశమున నీకాలమున నీ తెరగున శరీరపాతము గలుగునని యెరుకపడును.

మరియు నరిష్టజ్ఞానమువలన సయితము యోగికి మరణనిశ్చయము గలుగును, ''అరివత్ త్రాసయన్తి'' అను వ్యుత్పత్తిచే శత్రువువలె బెదరించు నవియై సన్నిహితమరణ సూచకములగు చిహ్నము లరిష్టము లనబడును. ఆ యరిష్టములు ఆధ్యాత్మికములు, నాధిభౌతికములు, నాధిదైవికములు నని ముత్తెరగుల నుండును.

వానిలో నాధ్యాత్మికారిష్ట మనగా రెండు చెవులను మూసికొనినచో, కోష్ఠ గతవాయుధ్వనిని వినకుండుటయు, గన్నులు మూసికొనిన నగ్నికణ తుల్యమగు నంతర్జ్యోతిని వీక్షింపకుండుటయు నీ మొదలగునవి.

ఆధిభౌతికారిష్టము లనగా-యమభటులను జూచుటయు, గతించిన పితరులను నాకస్మికముగా జూచుట మొదలగునవి.

ఆధిదైవికారిష్టము లనగా-ఆకస్మికముగా స్వర్గమునుగాని, సిద్ధులనుగాని చూచుటయు, నంతయు నున్న తెరగునకన్న విపరీతముగా గమనించుట మొదలగునవి. ఇట్టి యరిష్టలక్షణములచేత సయితము దేహపాత మాసన్న మయినట్లెరుకపడును.

ఇచట నరిష్టలక్షణములు (మరణ సూచకము లనుట) ప్రసంగ వశమున మాత్రము చెప్పబడెనేగాని వేరుగాదు. యథార్థముగ సమాధిసిద్ధులను దెలుపు నీప్రకరణమున నీ అరిష్టములను దెలుపవలసిన పనియే లేదు. అయినను మరణసూచకములగు అరిష్టములు సయితము సఘ్యాధ్యవ

ధానార్థము యోగులకు తప్పక యెరుగదగినవని తెలుపుటకు గూడ నీ యరిష్టప్రస్తావన పొసగును.

అవ॥ సిద్ధ్యంతరము నెరింగించుచున్నారు.

## సూ॥ మైత్ర్యాదిషు బలాని॥ 23

మైత్ర్యాదిషు, బలాని॥

మైత్ర్యాదిషు = మైత్రీ, కరుణా, ముదితలను మూడుభావనల విషయమున (సంయమము చేయుటచే ) బలాని = మైత్ర్యాది బలము లబ్బును.

మైత్రి యనియు, కరుణ యనియు, ముదిత యనియు, భావనలు మూడు. అందు సుఖవంతులగు ప్రాణుల విషయుమున మైత్రిని నిరంతరప్రవాహ రూపసంయమ నామక దృఢాభ్యాసము నొనర్చిన సాధకునకు మైత్రీభావనాబల మేర్పడును. అనగా సర్వప్రాణులును ఇతనిపై మిత్రభావము నొందుదురు. పైవిధముననే దుఃఖితుల విషయమున కరుణాభావనయందు సంయమము నలవరించుకొనిన సాధకునకు కరుణాభావనాబల మేర్పడును. అనగా దుఃఖితజనుల దుఃఖమును నివర్తింపజేయు సామర్థ్య మేర్పడును. ఆ తీరుననే పుణ్యశీలుర యందు ముదితాభావనా సంయమము నలవరచుకొనిన యోగికి ముదితాభావనయందు బలమేర్పడును, అనగా తటస్థభావ మేర్పడును, లేదా చింతాయుక్తులగు దీనమానవుల నానందపెట్టు సామర్థ్య మితని కలవడును.

ఇచ్చట భావన యనగా సమాధి యనియే యర్థము. సమాధి శబ్దముచే ధ్యానధారణలకు సయిత మితరతంత్రములయందు గ్రహణము వివక్షింప బడెను. ఈ మూడును సంయమ మనబడును. ఇట్లు మైత్ర్యాది సంయమము వలన మైత్ర్యాదిబలములు సఫలము లగును.

పూర్వపాదమున నుపేక్షారూపమగు నాల్గవభావనను గూడ నిరూపించి యున్నను, పాపిజనుల విషయమున జేయబడు నుపేక్షారూప చిత్తవృత్తి

మైత్ర్యాదిత్యాగ రూపమగునే గాని యే మాత్రమును భావనా రూపము గాదు. కావున నౌదాసీన్యరూపమై యభావరూపమగు నాయుపేక్షయందు సమాధి (భావన) లేదు, కావున నుపేక్షయందు సంయమము లేదుగాన, నుపేక్షా బలప్రాప్తిని గురించి ఇచట దెలుపబడలేదు. కేవలము మైత్ర్యాది త్రయమునకే బలములు దెలుపబడియెను.

అవ॥మరియు నింకొకసిద్ధిని దెలుపుచున్నారు.

## సూ॥ బలేషు హస్తిబలాదీని॥ 24

బలేషు, హస్తిబలాదీని.

బలేషు = (హస్త్యాది)బలములవిషయమున (సంయమము నొనర్చిన), హస్తిబలాదీని = ఏనుగు బలము మొదలగునవి యబ్బును.

ఏనుగు బలమునందు సంయమము నొనర్చుటవలన నేనుగు బలము సిద్ధించును. గరుత్మంతుని బలమునందు సంయమము వలన గరుత్మంతుని బలము లభించును. వాయుబలమునందు సంయమము వలన వాయుబలము గల్గును. ఏబలము విషయమున సంయమము చేసిన నాబలము లబ్ధమయి తీరును.

అవ॥ ఇంక నాధిభౌతికసిద్ధి నెరింగించుచున్నారు.

## సూ॥ ప్రవృత్త్యాలోకన్యాసాత్సూక్ష్మవ్యవహిత విప్రకృష్టజ్ఞానమ్॥ 25

ప్రవృత్త్యాలోకన్యాసాత్, సూక్ష్మవ్యవహితవిప్రకృష్టజ్ఞానమ్॥

ప్రవృత్త్యాలోకన్యాసాత్, ప్రవృత్తి = జ్యోతిష్మతీప్రవృత్తియొక్క, ఆలోక = సాత్త్విక ప్రకాశమును, న్యాసాత్ = సంయమముద్వారా యుంచుట వలన, సూక్ష్మవ్యవహిత విప్రకృష్టజ్ఞానమ్ = సూక్ష్మవస్తు జ్ఞానమును, వ్యవహిత పదార్థజ్ఞానమును, విప్రకృష్టపదార్థ జ్ఞానమును గలుగును.

ప్రథమపాదమున 36వ సూత్రమున జ్యోతిష్మతీ నామకమగు మానసిక ప్రవృత్తి నిరూపింపబడెను. అట్టి జ్యోతిష్మతీ నామక ప్రవృత్తియొక్క సాత్త్విక ప్రకాశమును పరమాణుప్రకృత్యాది సూక్ష్మపదార్థములయందు సంయమ మూలముగ బ్రసరింపజేయుచో, సూక్ష్మవస్తుజ్ఞానము గలుగును. అట్లే యాజ్యోతిష్మతీ సాత్త్విక ప్రకాశమును (పృథివీవ్యవహిత) నిధ్యాదివ్యవహిత వస్తువులయందు బ్రసరింపజేయుచో నావ్యవహిత వస్తువులు సయిత మెదుటనున్న వానివలె గనబడును. ఈ విధముననే యాజ్యోతిష్మతీ ప్రకాశమును దూరస్థపదార్థమునందు బ్రసరింప జేయుచో నాదూరస్థ వస్తువు సయితము సమీపస్థ వస్తువువలె గోచరించును.

అవ॥ ఇంక నాధిదైవిక సిద్ధుల నెరింగించుచున్నారు.

## సూ॥ భువనజ్ఞానం సూర్యే సంయమాత్॥ 26

భువన జ్ఞానం, సూర్యే, సంయమాత్॥

సూర్యే = సూర్యునివిషయమున, సంయమాత్ = సంయమమువలన, భువనజ్ఞానం = సకలలోకవిషయక జ్ఞానము గలుగును.

సూర్యుని విషయమున సంయమము నొనర్చుచో సమస్తలోకముల విషయజ్ఞానము గలుగును. భువనము లనగా భూరాది సప్తలోకములును, అవీచ్యాదిసప్తమహా నరకములును, మహాతలాది సప్తపాతాళములును నని యర్థము. భువనక్రమవిన్యాస మీవిధముగ నుండెను. లోకము లేడు. అందు అవీచియను నరకము మొదలుకొని మేరుపృష్ఠమువరకు నుండు లోకము భూలోకసంజ్ఞితము. మేరుపృష్ఠము మొదలుకొని ధ్రువనక్షత్రమువరకును గ్రహనక్షత్ర తారావిచిత్రమగు లోకమంతరిక్ష లోకము. మరియు నీయంత రిక్షలోకముపై నైదువిధములగు స్వర్గలోకము గలదు. ఆస్వర్గమే మహేంద్ర లోకమనబడు తృతీయలోకము. స్వర్గముపై బ్రాజాపత్యలోకము గలదు. దీనికే మహర్లోకమని నామాంతరము. మహర్లోకముపై జలలోకము, దానిపై దపోలోకము, దానిపై సత్యలోకమును గలవు. ఇందు గడపటి జనలోక

తపోలోక సత్యలోకములు మూడును బ్రహ్మలోకము లనబడును. ఇందులకు సంగ్రహశ్లోకము:-

**బ్రాహ్మస్త్రిభూమికో లోకః ప్రాజాపత్యస్తతో మహాన్।**
**మహేంద్రశ్చ స్వరిత్యుక్తో దివి తారా భువి ప్రజా॥**

అనగా- సత్యలోక, తపోలోక, జనలోకములను ముప్విధములగు భూమికలు గల బ్రాహ్మలోకము, దానిక్రింద మహర్లోక మనబడు ప్రాజాపత్యలోకమును, దాని క్రింద మహేంద్రలోక మనబడు స్వర్లోకమును, దానియడుగున ద్యోలోకము, లేక తారాలోకము లేక భువర్లోకము అనబడు నంతరిక్షలోకమును, దాని యడుగున బ్రజాలోక మనబడు భూలోకమును వ్యుత్క్రమముగ గలవని తాత్పర్యము. ఇట్లు భూలోకమునకు పైనుండు లోకము లారును, భూలోక మొక్కటియు గలసి యేడు లోకము లయ్యెను.

ఈ భూలోకముననే సప్తవిధములగు నరకలోకము లున్నవి. ఇందన్నిటికన్న నడుగున 'నవీచి' యను నరకము గలదు. దానిపై 'మహాకాల' నామక నరకము గలదు. అయ్యది కంకర గులకరాళ్ల మయమై ఘన (దట్ట)మై యుండును. దానిపై 'నంబరీష' మను మహానరకము గలదు. ఇది జలపూరితమై యుండును. దానిపై రౌరవనరకము గలదు. ఇయ్యది నిప్పులతో నిండియుండును. దానిపై 'మహారౌరవ' మను నరక ముండును. ఇయ్యది వాయుపూరితమై యుండును. దీనిపై 'కాలసూత్ర' మను నరకము గలదు. ఇందాకాశ (అవకాశ)ము ప్రచురముగ నుండును. దీనిపై 'నంధతామిస్ర' నరకము గలదు. ఇది చీకటిచే నావృతమై యుండును. స్వకృతములగు పాపకర్మములకు దగిన దుఃఖఫలము ననుభవింపవలసిన పురుషులు మాత్రమే యీలోకములయందు కష్టతరమును, దీర్ఘము నగు నాయువుతో బుట్టుదురు.

ఈ నరకములకు బైన మహాతలము, రసాతలము, అతలము, సుతలము, వితలము, తలాతలము, పాతాళమునను సప్తపాతాళములు గలవు.

ఇట్లు క్రిందనుండి గుణించినచో నీ భూలోక మెనిమిదవది యగును. ఈ భూలోకమునే 'వసుమతి' యందురు. ఇందు సప్తద్వీపములు గలవు.

సుప్రతిష్ఠిత సన్నివేశము గలిగి లోకాలోక పర్వతావృతమగు భూమండల మంతయు బ్రహ్మాండమున నిమిడియున్నది. నూరుకోట్ల యోజనముల విస్తీర్ణము గలిగి సప్తావరణములు గల యీ బ్రహ్మాండము సయితము మూల ప్రకృతిలో నొకానొక సూక్ష్మావయవము మాత్రమే. ఆకాశమున మిణుగురుపురువు మెరయు చాడ్పున విస్తృతమగు ప్రకృతిలో నొకమూల నీ బ్రహ్మాండము సయితము సూక్ష్మతరముగ దోచును.

విదేహులు ప్రకృతిలయులు నను యోగులు మోక్షపదతుల్యమై భవప్రత్యయ నామకమగు నసంప్రజ్ఞాత సమాధియందు నిలిచి యుందురు. కావున, వార లేలోకమున నివసించువారలలోను బరిగణింపబడరైరి. భువనవిన్యాస మంతయు యోగియగువాడు సూర్యద్వార మనబడు సుషుమ్నా నాడియందు సంయమము నొనర్చి సాక్షాత్కరింప వచ్చును. మరియు సుషుమ్నేతరములగు యోగోపాయోపదిష్టములయందు సంయమము నొనర్చియు సర్వభువన జ్ఞానము గలుగువరకు నభ్యసింప వచ్చును.

అవ॥ సిద్ధ్యంతరమును దెలుపుచున్నారు.

## సూ॥ చన్ద్రే తారావ్యూహజ్ఞానమ్॥ 27

చంద్రే, తారావ్యూహజ్ఞానమ్॥

చంద్రే=చంద్రునియందు సంయమము వలన, తారావ్యూహ జ్ఞానమ్-తారా=నక్షత్రాది జ్యోతిస్సులయొక్క, వ్యూహ=విశిష్ట సన్నివేశము యొక్క, జ్ఞానమ్=జ్ఞానము గలుగును.

చంద్రునియందు సంయమము లభించెనేని తారావ్యూహజ్ఞానము అనగా నీతార యీస్థానమున నీవిధమున నున్నదను విధమున తారాది జ్యోతిస్సుల విశిష్ట సన్నివేశ విషయక మగు జ్ఞానము లభించును. ఇచట

చంద్రునియందనగా చంద్రద్వారమునందలి యర్థము, చంద్రద్వారమనగా ''తాలుమూలే చంద్రమాః'' అను వచనానుసారముగ తాలుమూలమున సంయమముచే తారాసన్నివేశ మెరుకపడును. సూర్యప్రకాశముచే హతతేజస్కములగు తారలు సూర్యసంయమమువలన నెరుకపడవని, తారావ్యూహ జ్ఞానమున కుపాయాంతరము చెప్పబడియెను.

అవ॥ సిద్ధ్యంతరమును దెలుపుచున్నారు.

## సూ॥ధ్రువే తద్గతిజ్ఞానమ్॥ 28

ధ్రువే, తద్గతిజ్ఞానమ్॥

ధ్రువే = ధ్రువజ్యోతిస్సునందు సంయమమువలన, తద్గతిజ్ఞానమ్ = ఆ తారకల గమన విషయకమగు జ్ఞాన మబ్బును.

తారావ్యూహ జ్ఞానానంతరము నిశ్చలమును, జ్యోతిఃప్రధానము నగు ధ్రువజ్యోతిస్సునందు సంయమము నొనర్చినచో దారకలొక్కొకటి యొక్క నియతకాలికము నియతదేశికమునైన గమనము గోచరించును. అనగా నీతార, లేక యీగ్రహము, లేక ఈ నక్షత్ర మింతకాలమున కీ రాశిలో నీయంశము నీకళ నధిగమించు నను విశేషజ్ఞాన ముత్పన్న మగును. కాగా ధ్రువ సంయమమునకు కాలజ్ఞానము ఫలమని సపిండితార్థము. ఇట్లే సూర్యాదుల యందు సంయమమువలన సూర్యాదిగమన సాక్షాత్కారము గలుగును.

అవ॥ ఇంతవరకు బాహ్యసిద్ధులను బ్రతిపాదించి యిక నాంతరంగిక సిద్ధులను బ్రతిపాదించుచున్నారు.

## సూ॥ నాభిచక్రే కాయవ్యూహజ్ఞానమ్॥ 29

నాభిచక్రే, కాయవ్యూహజ్ఞానమ్॥

నాభిచక్రే=నాభిచక్రమున సంయమమువలన, కాయవ్యూహ జ్ఞానమ్- కాయ=శరీరస్థితములగు, వ్యూహ=ధాత్వాది సన్నివేశముయొక్క, జ్ఞానమ్= ...నము గలుగును.

శరీరము నడుమ నాభిసంజ్ఞకమై షోడశాకారమగు చక్రము కదళీ కందమువలె నాభియం దుత్పన్న మగును. దానినుండి శాఖాపల్లవాదులవలె శిరఃపాదాద్యవయవమును క్రిందను బైనను బుట్టియుండును. ఇట్టి నాభిచక్రమునందు సంయమమువలన వాతపిత్తశ్లేష్మములు మూడును దోషము లనియు, త్వగ్రక్తమాంస స్నాయ్వస్థిమజ్జాశుక్రములు ఏడును ధాతువులనియు, నిందు శుక్రధాతువు సర్వాభ్యంతర ధాతువనియు, దానికి వెలుపల మజ్జాధాతు వావరించి యుండుననియు, మజ్జకు వెలుపల నస్థిధాతువును, అస్థుల బయట స్నాయువులు, స్నాయువులపై మాంసము, మాంసముపై రక్తము, రక్తముపై త్వగ్ధాతువు గలిగియుండు నను విన్యాసము విదిత మగును. మరియు విశిష్టరసమల ధాతునాడ్యాదుల సన్నివేశము తెలియును. నాభిచక్రము శరీరమధ్యమునుండి సర్వతఃప్రసృతము లగు నాడ్యాదులకు మూల మైనది గాన నీ చక్రమున నవధానము గడించిన వానికి సమగ్రశరీర సన్నివేశమున ఎరుక వొడమును.

అవ॥సిద్ధ్యంతరమును దెలుపుచున్నారు.

## సూ॥ కంఠకూపే క్షుత్పిపాసానివృత్తిః॥ 30

కంఠకూపే, క్షుత్పిపాసానివృత్తిః॥

కంఠకూపే=కంఠకూపమునందు సంయమమువలన, క్షుత్పిపాసానివృత్తిః= ఆకలిదప్పులు దీరును.

జిహ్వకు నధోభాగమున తంత్వాకారమగు నాడి గలదు. దాని క్రింద కంఠమను ప్రదేశము గలదు. ఆ కంఠమునకు సమీపాధోభాగమున గుంటగనుండు ప్రదేశము కంఠకూప మనబడును. ప్రాణాదు లీకంఠ కూపమును స్పృశించునపుడు క్షుత్పిపాసాదు లుదయించు చుండును. అట్టి కంఠకూపమున సంయమమువలన ప్రాణాది స్పర్శనివృత్తి మూలమున యోగిని క్షుత్పిపాసలు బాధింపవు. కంఠమున నుండవలె నుండు ఘంటికకు క్రిందటి స్రోతస్సుచే కంఠకూపము ధరింపబడినట్లు భావించినను

క్షుత్పిపాసానివృత్తి గలుగునని కొందరియభిప్రాయము.

అవ॥ మరియును సిద్ధి నెరింగించుచున్నారు.

## సూ॥ కూర్మనాడ్యాం స్థైర్యమ్॥ 31

కూర్మనాడ్యాం, స్థైర్యమ్॥

కూర్మనాడ్యాం=కూర్మనాడియందు సంయమమువలన, స్థైర్యమ్=స్థిరత యేర్పడును.

కంఠకూపమునకు గ్రింద వక్షమున క్లోమపుప్పుసముల నడుమ గూర్మాకారమగు నాడియున్నది. ఈ నాడి చుట్టజుట్టుకొనిన సర్పమువలె నుండును. కాన కూర్మాకారమును దగియున్నది. కూర్మనాడి యనగా హృదయపుండరీక మనబడు నాడీచక్రము. దానియందు కృతసంయముడగు యోగి సర్పము నుడుమునువలె స్థిరచిత్తవృత్తిని బొందును. లేదా సర్పముగాని యుడుము గాని పుట్టనో, మరేదేని యాలంబనమును యాశ్రయించినచో, నెట్లు తప్పింపరాని వగునో, యా విధమున గాన స్థైర్యము లభించిన దాననెవ్వని కిని గదలింప రాకుండు ననియు కొందరి యాశయము

అవ॥ మరియొక సిద్ధి నెరుకపరచుచున్నారు.

## సూ॥ మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్॥ 32

మూర్ధజ్యోతిషి, సిద్ధదర్శనమ్॥

మూర్ధజ్యోతిషి - మూర్ధ=శిరస్సునందలి, జ్యోతిషి= జ్యోతిస్సునందు సంయమముచే, సిద్ధదర్శనమ్=సిద్ధపురుషుల దర్శనము సిద్ధించును.

తలపుఱ్ఱెల నడుమ బ్రహ్మరంధ్రమను ఛిద్రమున ప్రకాశాధారమై సుషుమ్నానాడి యుండును. అదియే యిచట మూర్ధజ్యోతి యని చెప్పబడియెను. **"శతం చైకా చ హృదయస్య నాడ్యః, తాసాం మూర్ధాన మభినిస్సృతైకా"** యన్నట్లు నూరు నొక్క హృదయనాడులలో సుషుమ్న యను

నాడిమాత్రము మూర్ధద్వారమగు బ్రహ్మరంధ్రమున బయలుపడును. అది ప్రభాస్వరమైన జ్యోతిస్సు, గృహమధ్యమున నున్న మణిసంబంధమగు ప్రకాశము సర్వప్రదేశములకు వ్యాపించు విధమున, హృదయస్థిత మగు సాత్త్వికప్రకాశము సయితము వ్యాపించినదై బ్రహ్మరంధ్రమునందు కేంద్రీక రించును. అట్టి సుషుమ్నాగ్రమునందు సంయమము చేయుటచే, నితర ప్రాణుల కగుపడక భూమ్యాకాశముల నడుమ సంచరించు సిద్ధులు అను దివ్యులు గనిపింతురు.

అవ॥ సర్వజ్ఞతాసిద్ధికి నుపాయము నెరుకపరచుచున్నారు.

## సూ॥ ప్రాతిభాద్వా సర్వమ్॥ 33

ప్రాతిభాత్, వా, సర్వమ్॥

ప్రాతిభాత్ వా=ప్రాతిభమను జ్ఞానముచే నైనను, సర్వమ్= అంతయు (నెరుంగును.)

నిమిత్తము లేకయే మనోమాత్రజన్యమై యథార్థరూపముగ తటాలున గలుగు జ్ఞానము ప్రతిభ యనబడును. అట్టి ప్రతిభయందు సంయమము వలన వివేకఖ్యాతికన్న మున్న ప్రాతిభజ్ఞాన ముత్పన్న మగును. ఇది ప్రసంఖ్యాన సాన్నిధ్యమున జేర్చి సంసార తరణోపాయ మగును గాన దీనిని తారక మందురు. సూర్యు డుదయించుటకు ముందు నరుణప్రభ సూర్యోదయ సూచక మగు తెరగున ప్రసంఖ్యాన ముద్భవించుటకు ముందు ప్రాతిభజ్ఞాన ముత్పన్నమై యవశ్యంభావియగు ప్రసంఖ్యానమును సూచించును. ఈ ప్రాతిభజ్ఞాన మతీతానాగత సూక్ష్మవ్యవహితాది పదార్థముల నన్నింటిని విషయీకరింపజాలును గాన, ప్రాతిభజ్ఞానవంతుడగు యోగి సంయమాంతరాపేక్ష లేక యే సర్వపదార్థముల నెరుగజాలును.

అవ॥ మరియును సిద్ధ్యంతరమును దెలుపుచున్నారు.

## సూ॥ హృదయే చిత్తసంవిత్॥ 34

హృదయే, చిత్తసంవిత్॥

హృదయే= హృదయమున సంయమము చేయుటచే, చిత్తసంవిత్= స్వపరచిత్త సాక్షాత్కారము గలుగును.

ఆత్మనిలయమైన శరీరప్రదేశవిశేషమున నధోముఖమై సరంధ్రమైన సూక్ష్మ పుండరీకాకారమగు బ్రహ్మభవనము గలదు. అదియే హృదయము. అందు విజ్ఞానవృత్తికమగు నంతఃకరణము బ్రహ్మకు సింహాసనమువలె నుండును. కాన బ్రహ్మభవనసదృశమగు హృదయపుండరీకమున సంయమము నొనర్చినచో స్వచిత్తపరచిత్త జ్ఞానము గలుగును. అనగా స్వచిత్తగతములగు సర్వవాసనలును, పరచిత్తగతములగు రాగాదులును బాగుగ నెరుకపడును.

అవ॥ చిత్తసంవిదనంతరము క్రమముగా నాత్మసాక్షాత్కారమును నిరూపించుచున్నారు.

**సూ॥ సత్త్వపురుషయో రత్యన్తాసంకీర్ణయోః**
**ప్రత్యయావిశేషో భోగః పరార్థత్వాత్**
**స్వార్థ సంయమాత్ పురుషజ్ఞానమ్॥ 35**

సత్త్వపురుషయోః, అత్యన్తాసంకీర్ణయోః, ప్రత్యయావిశేషః, భోగః, పరార్థత్వాత్, స్వార్థసంయమాత్, పురుషజ్ఞానమ్.

అత్యన్తాసంకీర్ణయోః= మిగుల విరుద్ధములగు ధర్మములు గలిగి వేర్వేరైన, సత్త్వపురుషయోః= బుద్ధిసత్త్వమునకును, పురుషునకును, ప్రత్యయావిశేషః= అభేదరూప మగుభావము, భోగః= భోగము అనబడును. పరార్థత్వాత్= బుద్ధి సత్త్వము పరార్థ(పురుషునికొరకైనది) మైనదగుటవలన, స్వార్థసంయమాత్, స్వార్థ= స్వార్థమగు పురుషప్రత్యయము నందు, సంయమాత్ = సంయమమువలన, పురుషజ్ఞానమ్ = ఆత్మజ్ఞానము గలుగును.

బుద్ధిసత్త్వము (బుద్ధిరూపముగా బరిణమించిన సత్త్వగుణము)

ప్రకాశశీలమై తనతో సమానములుగ నున్న రజస్తమములను లోబరచుకొని సత్త్వ (ప్రకృతి) పురుషవివేక రూపమున బరిణమించును. అట్లు పరిణామ శీలము గాన మలినమగు నాబుద్ధిసత్త్వము సయితము చిన్మాత్ర రూపుడును కూటస్థుడు గాన శుద్ధుడు నగు పురుషునికన్న భిన్నమగుచుండగా రజస్తమఃప్రాచుర్యము గల బుద్ధిసత్త్వము పురుషుని కన్న నత్యంతభిన్న మనుట సువిదితము. ఇట్లు అత్యంతభిన్నములగు సత్త్వపురుషులకు ప్రత్యయా విశేషము అనగా బుద్ధిధర్మములగు శాంతిఘోరమూఢావస్థలను, బుద్ధి ప్రతిబింబితుడగు చేతనుని యందధ్యారోపించుటయే. ఇదియే పురుష నిష్ఠమగుభోగము. ఇదియే వృత్తి సారూప్యము. ఈ విషయము ప్రథమ పాదమున నాల్గవ సూత్రమున దద్వివరణమునందును దెలుపబడెను.

బుద్ధిచే నివేదితవిషయు డగుటచే శాంతాదిబుద్ధిధర్మములు పురుష నిష్ఠములుగా వ్యవహరింపబడును. కావున బుద్ధిధర్మమగు భోగ ప్రత్యయము (వృత్తి) పరార్థము అనగా పురుషునికొరకే యగును. కాన దృశ్యమని చెప్పబడుచున్నది. బుద్ధిసత్త్వమున నీనిరూపించిన పరార్థ ప్రత్యయమునకన్న భిన్నమగు స్వార్థప్రత్యయ మొకటి గలదు. అది భోగవిలక్షమై చితి (పురుష స్వరూప) మాత్రాలంబనమైన పురుష సంబంధమగు ప్రత్యయము. (వృత్తి)ఇట్టి స్వార్థమగు పౌరుషేయ ప్రత్యయమునందు ననగా పరిత్యక్తాహం కారము గల బుద్ధి సత్త్వమున ప్రతిఫలించిన పురుషుని విషయమగు వృత్తియందు సంయమము గలిగిన పురుషవిషయకజ్ఞాన ముత్పన్న మగును.

ఈ పురుషజ్ఞానము బుద్ధిసత్త్వమునకు గలుగదు. అది జడము గాన దానికట్టి శక్తిలేదు. పురుషున కాజ్ఞానము గలుగునన్న నాజ్ఞానమున కర్మయు గర్తయు దానే కావలసి వచ్చును. కాన నిది విరుద్ధము అని శంకింప బనిలేదు. బుద్ధిసత్త్వ ధర్మమగు పురుషాకారవృత్తిచే పురుషుడు చూడబడడు. కాని పురుషుడే బుద్ధిలో ప్రతిబింబించిన స్వాకారాలంబన మగు వృత్తిని దర్శించును. అనగా స్వప్రతిబింబిత ఘటాకార బుద్ధిదర్శనమే పురుషునకు ఘటదర్శనమని చెప్పబడు విధమున, స్వప్రతిబింబితస్వాకార బుద్ధివృత్తిదర్శనమే పురుషునకు

పురుషజ్ఞానము. ఇట్లు పురుషుడే పురుషజ్ఞాత యగును గాని మరియే యితరసాధనములు నీపురుషజ్ఞాన విషయమున లేవు. ఈ విషయమే **"విజ్ఞాతారమరే! కేన విజానీయాత్"** అను శ్రుతిచే తెలుపబడెను. అనగా ఓమైత్రేయీ! అన్నియు నెరుంగునట్టి పురుషుని దేనిచే నెరుంగవచ్చును? అనగా స్వభిన్నమగు నే సాధనముచేతను దెలియశక్యము గాదనుట.

అవ॥ పై పురుషజ్ఞానమునకు ఫలము నెరింగించుచున్నారు.

## సూ॥ తతఃప్రాతిభశ్రావణవేదనాఽఽదర్శా - స్వాదవార్తా జాయన్తే॥ 36

తతః, ప్రాతిభశ్రావణవేదనాఽఽదర్శాస్వాదవార్తాః, జాయన్తే,

తతః= ఆ స్వార్థసంయమముచే, ప్రాతిభశ్రావణవేదనాఽఽ దర్శాస్వాద వార్తాః=ప్రాతిభము, శ్రావణము, ఆదర్శము, ఆస్వాదము, వార్త యనబడు సిద్ధిషట్కము, జాయన్తే=కలుగును.

పైపురుషజ్ఞానమువలన ప్రాతిభసిద్ధియు, శ్రావణసిద్ధియు, వేదన సిద్ధియు, ఆదర్శసిద్ధియు, ఆస్వాదసిద్ధియు వార్తాసిద్ధియు, ననునారు సిద్ధులు వాటంతట అవియే లభించును.

(1)ఇందు ప్రాతిభమనగా-నతీతానాగత సూక్ష్మవ్యవహిత పదార్థము లను దెలిసికొనజాలు మానసికశక్తి విశేషము. (2)శ్రావణ మనగా - దేవభోగయోగ్యమగు సూక్ష్మశబ్దమును గ్రహించుటకు దగిన శ్రోత్రేంద్రియ శక్తివిశేషము. (3)వేదన మనగా -దేవభోగార్హమై సూక్ష్మమగు స్పర్శమును గ్రహించు త్వగింద్రియ శక్తివిశేషము. (4)ఆదర్శమనగా- దివ్యమై సూక్ష్మమగు రూపమును గ్రహించు చక్షురింద్రియ శక్తివిశేషము. (5)ఆస్వాద మనగా - దేవానుభవ యోగ్యమై సూక్ష్మమగు రసమును గమనింపగల రసనేంద్రియ సంజాతమగు శక్తివిశేషము (6) వార్త యనగా - దేవభోగానుగుణమై సూక్ష్మమైన గంధవిశేషము నెరుంగుటకు దగిన ఘ్రాణేంద్రియ నిష్ఠమగు

సామర్థ్యవిశేషము.

కొందరు సూక్ష్మవ్యవహితాది పదార్థముల నెరుంగజాలు మనస్సునే ప్రాతిభమనియు, దివ్యశబ్దమును గ్రహింపజాలు శ్రోత్రేంద్రియమునే శ్రావణమనియు, దివ్యస్పర్శ వేదియగు త్వగింద్రియమునే వేదనమనియు, దివ్యరూపదర్శన సమర్థమగు చక్షురింద్రియమునే యాదర్శమనియు, దివ్యరసజ్ఞానపటువగు రసనేంద్రియమునే యాస్వాదమనియు, దివ్యగంధ విజ్ఞానశీలమగు ఘ్రాణేంద్రియమునే వార్తయనియు వ్యవహరింతురు. ఇందు ప్రాతిభముచే సూక్ష్మవ్యవహితాది వస్తుపరిజ్ఞానమును, శ్రావణసిద్ధిచే దివ్యశబ్ద శ్రవణమును, వేదనముచే దివ్యస్పర్శానుభవమును, ఆదర్శముచే దివ్యరూపానుభవమును, ఆస్వాదసిద్ధిచే దివ్యరసజ్ఞానమును, వార్తాసిద్ధిచే దివ్యగంధ జ్ఞానమును లభించును.

అవ॥ స్వార్థసంయమమున బ్రవృత్తుడగు సాధకు డీ సిద్ధులు తమంత లభించినంతటనే కృతార్థుడ నైతినని తలంపక వీనిని విఘ్నములుగా నెంచి యాత్మసాక్షాత్కార పర్యంతము సంయమమును విడనాడరాదని తెలుపు చున్నారు.

## సూ॥ తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః॥ 37

తే, సమాధౌ, ఉపసర్గాః, వ్యుత్థానే, సిద్ధయః॥

తే=ఆ ప్రాతిభాదు లారును, సమాధౌ=ఆత్మసాక్షాత్కార జనకమగు సమాధియందు, ఉపసర్గాః=విఘ్నము లగును, వ్యుత్థానే= బహిర్ముఖావస్థలో, సిద్ధయః= పురుషార్థములుగా జెప్పబడును.

ప్రాతిభాదులారును పురుషుని యందేకాగ్రత నుంచుటకు ప్రతిబంధ కము లగును గాన, సమాధిదార్ఢ్యమును జెరచునవి. సమాహితచిత్తు నకంతరాయములే యగును. దరిద్రుడగు వానికి నల్పధనము దొరికిన నదియే మహాభాగ్యమని తలచి తాను గృతార్థు డయితినని యెంచి వాడు సంపాదన ప్రయత్నము మానువిధమున, విక్షిప్తమగు చిత్తమునకు పూర్వోక్త

ప్రాతిభాదిసిద్ధులు గలిగినచో, నవియే పరమపురుషార్థమని యెంచి సామాన్య సాధకులు సమాధిని జాలింతురు. కాని యసంప్రజ్ఞాతసమాధి నిష్ఠుడగు యోగి యీ తుచ్ఛసిద్ధులచే కృతార్థుడనని తలచి సమాధిని జాలించిన బరమపురుషార్థమగు నాత్మసాక్షాత్కారము గలుగకపోవును. కాన నివి విఘ్నములని తలచి యీ సిద్ధులయందు దోషదృష్టితో నిరాకరించి యాత్మసాక్షాత్కారమునకై స్వార్థసంయమమును కొనసాగించుచునే యుండును. వీనిని సిద్ధులనుట బహిర్ముఖావస్థను బట్టియే కాని యథార్థముగ నివి యాత్మసాక్షాత్కారమున కంతరాయములు మాత్రమే. కాన వీనియందు ఆస చెందరాదు.

అవ॥ ఇంతవరకును జ్ఞానాది రూపములగు సిద్ధులను నుడివి యిక క్రియాదిరూపసిద్ధుల నెరింగింపబోవుచున్నారు.

## సూ॥ బంధకారణశైథిల్యాత్ప్రచారసంవేదనాచ్చ చిత్తస్య పరశరీరావేశః॥ 38

బంధకారణశైథిల్యాత్, ప్రచారసంవేదనాత్, చ, చిత్తస్య, పరశరీరావేశః॥

బంధకారణశైథిల్యాత్- బంధకారణ=చిత్తబంధమునకు గారణము లగు ధర్మాధర్మములయొక్క, శైథిల్యాత్=సడలుటవలన, ప్రచారసంవేదనాత్ చ, ప్రచార=చిత్తసంచారముయొక్క, సంవేదనాత్ చ = యెరుగుటవలనను, చిత్తస్య = చిత్తమునకు, పరశరీరావేశః= అన్యుల శరీరములో ప్రవేశము గలుగును.

చంచలస్వభావము గలిగి యొకయెడను నిలువని మనసునకు ధర్మాధర్మముల (పుణ్యాపాపముల)వశమున నొకశరీరమున స్థిరనివాసము గలుగుటయే చిత్తబంధ మనబడును. ఆ చిత్తబంధమునకు గారణము లైన పుణ్యాపాప రూపకర్మలు బంధకారణములు. ఈ పుణ్యాపాప జనితమగు నదృష్టము సంయమమువలన శిథిల మగును. ఇదియే బంధకారణ శైథిల్యము.

మరియు చిత్తప్రచార మనగా-చిత్తము హృదయప్రదేశమునుండి యింద్రియముల మూలమున విషయముల కభిముఖముగ ప్రసరించుట. దానిని తెలిసికొనుటయే చిత్తప్రచార సంవేదన మనబడును. అనగా ఇది చిత్తవహమగు నాడి, దీనిచే జిత్తము ప్రసరించుచున్నది. ఈ నాడి రస ప్రాణవహాదులకన్న విలక్షణ మైనది యని యీ విధముగ చిత్తగమనాగమన మార్గరూపములగు నాడులను సంయమముచే నెరుంగుటయే చిత్తప్రచార సంవేదనము.

కర్మబంధక్షయముచే నిర్బంధ రహితమగు తన చిత్తమును ప్రచార సంవేదనవశమున యోగి తన దేహమునుండి తొలగించి యన్య దేహమున బ్రవేశింపజేయ జాలును. అట్లితర శరీరమున బ్రవేశించిన చిత్తము ననుసరించి యింద్రియము లన్నియు మధకరరాజము (గండుతేనెటీగ లేక రాణియీగ)ననుసరించి యది యెగిరిన దాము నెగురుచు, నది వ్రాలిన దామును వ్రాలుచుండు తేనెటీగల వడువున ననువర్తించును.

అనగా చిత్తము చంచల మగునది గాన నొకచోట స్థిరముగా నుండ జాలదు. మరియు నాత్మయు వ్యాపకముగాన నన్నియెడల నుండి తీరును. వీనిరెండింటికి నొక దేహమునందు స్థిరముగ నెల్లపుడు నుండుట యసంభవమే యైనను వీని రెండింటికిని గల భోక్తృభోగ్యభావమను సంబంధముచే స్థిరత యేర్పడుచున్నది. ఆ స్థైర్యమునకు పుణ్యాపాపములు మూలము. కావుననే పుణ్యాపాపములు బంధమూలము లనిరి. ఇట్టి బంధ కారణములగు పుణ్యాపాపములను యోగి సంయమముచే సడలించునేని పుణ్యాదుల బంధనసామర్థ్యము సడలిపోయి, చిత్తము నొక శరీరముననే నిలుపు ప్రతిబంధము లేకపోవుటచే చిత్తము స్వతంత్రప్రచారశీల మగుచు సర్వశరీరముల యందును గమనాగమనములు చేయజాలియుండును. ఆత్మయు బంధకారణమగు నదృష్టము లేకుండుటచే సర్వశరీరముల యందును స్వేచ్ఛాప్రచారవంత మగును. కాని యోగి యీనాడి'చిత్త వహాయనియు నీనాడీద్వారమున జిత్తము ప్రసరించి 'తిరిగి రాజాలును'నియు

నెరుగునంతవరకును బరశరీరమున బ్రవేశము సంభవము గాదు. కాని నాడీసంయమము మూలమున చిత్తగమనాగమానానుకూలమగు నాడుల పరిజ్ఞానము యోగికి లభించినంతట గండుతేనెటీగను సన్నని తేనెటీగ లనువర్తించినయట్లు చిత్తము ప్రవేశించిన శరీరమున సకలేంద్రియములును బ్రవేశించి, వానివాని కార్యముల నెరవేర్చును. కాన బంధకారణపుణ్యాది నాశము నొనర్చి చిత్తప్రచారము నెరింగిననే యోగిచిత్తము పరకాయ ప్రవేశసమర్థ మగును.

అవ॥ మరియొక సిద్ధి నెరింగించుచున్నారు.

## సూ॥ ఉదానజయాజ్జలపంకకంటకాదిష్వసంగ ఉత్క్రాంతిశ్చ ॥ 39

ఉదానజయాత్, జలపంకకంటకాదిషు, అసంగః, ఉత్క్రాంతిః, చ॥

ఉదానజయాత్=ఉదానమును జయించుటవలన, జలపంక కంటకాదిషు-జల=నీరు. పంక=బురద, కంటక=ముళ్ళు, ఆదిషు =మొదలగు వానియందు, అసంగః=సంబంధము లేకుండుటయు, ఉత్క్రాంతిః చ = ఊర్ధ్వగమనమున్ను సిద్ధించును.

ఉదానమును సమాధిమూలమున జయించెనేని యతడు జలమున మునుగడు, బురదలో దిగబడడు, అతనికి ముళ్లు గ్రుచ్చుకొనవు, మరియు నతడు ప్రాణప్రయాణ సమయమున నుత్తరమార్గము (అర్చిరాది మార్గము)గుండ నూర్ధ్వ గమనము జేయంజాలును.

ఉముకయందలి జ్వాలవలె సమస్తేంద్రియ సంబంధమై యొకేపరి ఉత్థితమగు వృత్తి జీవన మనబడును. ఈ జీవనవృత్తికి క్రియాభేదముచే ప్రాణాది నామములచే నైదు భేదములు గలవు. అందు

ముఖనాసికముల ద్వారమున గమనము చేయుచు నాసికాగ్రము నుండి హృదయపర్యంతము నుండు జీవనవృత్తివిశేషము **'వాయుప్రణయనాత్**

ప్రాణః'' అను వ్యుత్పిత్తిచే ప్రాణ మనబడును.

అన్నజలాదులవలన గలిగిన రసమును ఆయా స్థానములయందు దగిన రీతిగ బొందించు నట్టిదై హృదయము నుండి నాభిపర్యంతము వ్యాపించి యుండు జీవనవృత్తివిశేషము ''సమం(సమంతాత్) నయనాత్ సమానః'' అను వ్యుత్పత్తిచే సమానవృత్తి యనబడును.

మరియు మూత్రపురీషగర్భాదులను వెలువరింపజాలి నాభి మొదలు కొని పాదతలము (అంగుష్ఠము) వరకునుండు జీవనవృత్తివిశేషము ''అపనయనాత్ అపానః'' అను వ్యుత్పత్త్యనుగుణముగ నపానవృత్తి యన బడును.

మరియు రసాదులను కంఠమునుండి పైకి చేర్చునదియై నాసికాగ్ర భాగమునుండి శిరః పర్యంతము వ్యాపించియుండు జీవనవృత్తి విశేషము ''ఉన్నయనాదుదానః'' అను నవయవార్థముచొప్పున నుదానవృత్తి యనబడును.

సర్వశరీరమునందును వ్యాపించియుండు జీవనవృత్తి''వ్యాప్య నయనాత్ వ్యానః'' అను యోగము చొప్పున వ్యానవృత్తి యనబడును.

ఈ పంచవృత్తులలోను ప్రాణవృత్తి ప్రధానమైనది. ప్రాణము బయలువెడలిన తక్కిన వృత్తు లన్నియు దానివెంటనంటి బయలుదేరును. ఈ వృత్తు లన్నియు గలసి ప్రాణపద వాచ్యము లగుననియు, కేవలవాయు వికారములు ప్రాణములు కావనియు సాంఖ్యయోగ మతముల సిద్ధాంతము.

ఈ పంచజీవనవృత్తుల నడుమ నుదానవృత్తిని సంయమద్వారమున లోబరచుకొనుచో యోగికి జలాదులవలన ప్రతిబంధము గలుగదు. ఇంతయేగాక ప్రాణోత్క్రాంతియు భీష్మునకువలె స్వేచ్ఛాధీనమై యర్చిరాది మార్గమున నూర్ధ్వగమనము గలుగును. కాన నాయర్చిరాది గతి యుదాన జయముననే గలుగును. కాన యోగి ముఖ్యముగ నుదానజయమును గడింపవలయును.

అవ॥ వృత్త్యంతర జయమునకు ఫలమును జెప్పుచున్నారు.

## సూ॥ సమానజయాజ్జ్వలనమ్॥ 40

సమానజయాత్, జ్వలనమ్॥

సమానజయాత్ = సమానానామకప్రాణమును జయించుటవలన, జ్వలనమ్= దీప్తి గలుగును.

సంయమమూలమున నుదాననామకమగు జీవనవృత్తిని లోబరచుకొనినచో నాయోగిశరీరమున నగ్నియందువలె దీప్తి గలుగును. సమానమను ప్రాణము జఠరాగ్నిని నాల్గువైపుల జుట్టుకొని యున్నది. కాన నాచ్ఛాదితమగు జఠరాగ్ని మందతేజము గలదియై బహిఃప్రకాశము గలది గాజాలకుండును. సమాధిమూలమున నావరకమగు సమానవృత్తిని స్వాధీన మొనర్చుకొనినచో నాయగ్ని నిరావరణమై ప్రదీప్త మగును. కాన నాయోగిశరీరము దీప్త్యుత్తేజితమై యగ్ని వెలగిన చందమున దీప్తిమంతముగ గానవచ్చును.

అవ॥ సిద్ధ్యంతరమును దెలుపుచున్నారు.

## సూ॥ శ్రోత్రాకాశయోస్సంబంధసంయమాత్ దివ్యం శ్రోత్రమ్॥ 41

శ్రోత్రాకాశయోః, సంబంధసంయమాత్, దివ్యం, శ్రోత్రమ్॥

శ్రోత్రాకాశయోః=శ్రోత్రేంద్రియమునకు నాకాశమునకు (గల), సంబంధసంయమాత్= దేశదేశిభావ (ఆధారాధేయభావ) రూపమగు సంబంధమున, సంయమమువలన, దివ్యం=దివ్యమగు, శ్రోత్రమ్= శ్రోత్రేంద్రియము గలుగును.

అహంకారమునకు గార్యమై శబ్దమును గ్రహించు నింద్రియము శ్రోత్రము. శబ్దతన్మాత్రాకార్యమై సర్వశబ్దాశ్రయ మగునది యాకాశము. ఈ యాకాశము సర్వశ్రోత్రములకు సర్వశబ్దములకును సయిత మాశ్రయ మగును. ఈ విషయమున బంచశిఖాచార్యులును **"తుల్య దేశశ్రవణానా మేకదేశ**

**శ్రుతిత్వం సర్వేషాం భవతి''** యనిరి, అనగా తుల్యాధారములగు శ్రవణేంద్రియములు గలవారు గాన పురుషుల కేకజాతీయమగు శబ్దశ్రుతి గలుగుచున్నది యని భావము. అనగా శ్రవణేంద్రియములకు నన్నిటికిని కర్ణశుష్కుల్యవచ్ఛిన్నావకాశరూప మగు నాకాశమే యాధార మనియు, కావుననే పృథివ్యాదిశబ్దముల నెరుగవలసి యున్నప్పుడు శ్రోత్రేంద్రియమున (కర్ణరంధ్రవర్తియగు శ్రోత్రము) స్వాశ్రయమగు నాకాశగతసాధారణ శబ్దము నపేక్షించును. కాన నేకజాతీయమగు శబ్దశ్రవణము గలుగుచున్నది. కాన నాకాశము శ్రోత్రాధిష్ఠానమును శబ్దగుణకము నగును. ఈ యేకశ్రుతిత్వమును ననావరణమును నాకాశలింగసాధకమని యెరుక పరుపబడియెను, ఇట్లే యమూర్తమగు నాకాశమునకు ననావరణము ప్రతీతమగుటవలన విభూతత్వము సయితము సిద్ధించును.

శ్రోత్రేంద్రియము శబ్దగ్రహణరూపక్రియచే సాధింపబడును. క్రియ సామాన్యము కరణముచేతనే సాధింపబడవలయును గదా! చెవిటివాడు శ్రోత్రేంద్రియరూప కరణహీనుడు గాన శబ్దమును వినజాలడు. బధిరుడు కాని యాతడు కరణసహితుడు గాన శబ్దమును వినును. కాన శ్రోత్రమే శబ్దమును గ్రహించుటకు గారణము.

ఇట్లు శ్రోత్రాకాశములకు గల యాధారాధేయ భావమున సంయమము వలన యోగియొక్క శ్రోత్రేంద్రియము దివ్యమగును, అనగా నతని శ్రోత్రేంద్రియము శబ్దతన్మాత్రరూపమగు సూక్ష్మశబ్దమును గ్రహించు సామర్థ్యము గలది యగును. ఈ పాదమున ముప్పదియారవ సూత్రమున కీసూత్రార్థము పునరుక్తము గాదు. అందు స్వార్థసంయమమువలన లేక పురుషజ్ఞానము వలన శ్రావణశక్తి యుపచిత మగునని చెప్పబడెను. ఇందన్ననో శ్రవణాది సంబంధ సంయమమువలన శ్రావణాదులు కలుగునని కారణభేదము నిరూపింపబడినది గాన పునరుక్తి గాదు.

అవ॥ మరియొక విధమగు సిద్ధి నెరుక పరచుచున్నారు.

## సూ॥కాయాకాశయోస్సంబంధసంయ మా ల్లఘుతూలసమాపత్తేశ్చ ఆకాశగమనమ్॥ 42

కాయాకాశయోః, సంబంధసంయమాత్, లఘుతూలసమాపత్తేః,చ ఆకాశగమనమ్,

కాయాకాశయోః=శరీరమునకు నాకాశమునకు గల, సంబంధ సంయ మాత్= సంబంధమున సంయమ మొనర్చుటవలనున్ను, లఘుతూల సమాపత్తేశ్చ. లఘు= తేలిక (సూక్ష్మ) పదార్థమగు, తూల = దూది (మొదలగుదాని) యందు, సమాపత్తేఃచ = తన్మయీభావమువలననుగూడ. ఆకాశగమనమ్ = ఆకాశమున నడచు శక్తి యబ్బును.

పాంచభౌతికమగు శరీరముండు చోటుల నెల్ల నాకాశముండి తీరును. ఏలనన, నవకాశములేక శరీరస్థితి యసంభవము. అవకాశము నిచ్చుట యాకాశధర్మము. కాగ పైవిధమున శరీరముండు చోటున నెల్ల యాకాశ ముండి తీరునను వ్యాప్యవ్యాపక భావము కాయాకాశ సంబంధము. ఆ సంబంధమునందు సంయమము జేయు సాధకు డాసంబంధమును జయించి లోబఱచుకొనియేని, చులకన యగు దూది మొదలగు పరమాణ్వంతము లగు సూక్ష్మపదార్థముల యందు తన్మయీభావరూప తత్స్థతదంజనత్వమును బొందియేని, కాయాకాశములకు గల సంబంధమును లోబఱచుకొని మిక్కిలి లఘుత్వము నొందును. ఇటు లత్యంత లఘుత్వమును గడించినందున నీటిపై కాళ్ళతో నడువజాలును. ఇంతయేల? సాలీటిదారము పైనను నడువ గలిగినంతయేగాక సూర్యకిరణములలో సూక్ష్మరూపమున బ్రవేశించి యా కిరణములలో విహరించును. కాన నితనికి నిచ్చవచ్చిన ట్లాకాశమున విహరించు సామర్థ్య మబ్బును.

ఈసూత్రమున దెలిపిన రెండు సంయమముల ననుష్ఠించుటచే సూర్యకిరణములలో గలసి యాకాశమున స్వేచ్ఛాసంచారము చేయజాలినంత చులకనగను, సూక్ష్మముగను గూడ నగును.

పరకాయ ప్రవేశమునకును క్లేశకర్మవిపాక నాశనముకును గారణమగు సంయమాంతరము నెఱింగించుచున్నారు.

## సూ॥ బహిరకల్పితా వృత్తిర్మహావిదేహా తతః ప్రకాశావరణక్షయః ॥ 43

బహిః, అకల్పితా, వృత్తిః, మహావిదేహా, తతః, ప్రకాశావరణ క్షయః॥

బహిః = శరీరమునకు వెలుపలగా, అకల్పితా = కల్పింపబడనిదైన, వృత్తిః = చిత్తవృత్తి, మహావిదేహా = మహావిదేహ నామకమగు ధారణ. తతః = ఆ మహావిదేహ మను ధారణవలన, ప్రకాశావరణక్షయః - ప్రకాశ = ప్రకాశరూపమగు బుద్ధిని, ఆవరణ = కప్పునట్టి క్లేశాదికములకు, క్షయః = నాశము గలుగును.

శరీరమునకన్న వెలుపలి యేదేని విషయమునందు మనోవృత్తి ప్రసరించుట విదేహనామకమగు ధారణ. ఈ ధారణ కల్పిత మనియు నకల్పిత మనియు రెండు విధములు. మనస్సు శరీరమునందుండియే వృత్తిద్వారా శరీరబహిర్భూతదేశమున ప్రచారము సలుపుట కల్పిత విదేహధారణ యనబడును, అట్లుగాక శరీరసహాయము లేకయే స్వతంత్రమగు మనస్సునకు బహిఃప్రచారము గలుగు నేని యది యకల్పిత విదేహధారణ యనఁబడును.

పామరజనుల చిత్తము సయితము శరీరమునుండియే బాహ్య ప్రదేశమున ప్రచారము గలదిగ నగుచున్నను వారిచిత్త మింద్రియ సన్నికర్షము మూలముననే బాహ్యవిషయములపై బ్రసరించును గాని స్వతంత్రముగ బ్రసరింపజాలదు. యోగుల చిత్తమన్ననో యింద్రియ సన్నికర్షము లేకయే వృత్తిద్వారమున బాహ్యవిషయములను బ్రాప్తించును.

పై కల్పితాకల్పితధారణలలో కల్పిత (సాధారణ)విదేహధారణ సాధనముగా నుండి, యకల్పిత (మహా) విదేహధారణను సాధించుము. ఈ యకల్పిత విదేహధారణ గలిగెనేని యోగి చిత్తప్రచారమూలమున పరకీయ కాయముల బ్రవేశించి యథేష్టముగ వ్యవహరించును. ఇంతియేగాక యీ

ధారణ ప్రకాశాత్మకమగు బుద్ధి సత్త్వము నావరించి రజస్తమో మూలకమై యుండు క్లేశకర్మవిపాకముల మూడింటిని నిర్మూలించును.

అవ॥ ఇంతవరకు జ్ఞానక్రియారూపసిద్ధులను దెలిపి యిక తమ శాస్త్రమున ముఖ్యములగు గ్రహీతృగ్రహణ గ్రాహ్యముల విషయమున సంయమమునకు ఫలముల నెఱింగింపబోవుచు, గ్రహీతృగ్రహణ నిరూపక మగు గ్రాహ్యవిషయమున సంయమమునకు ఫలము నెఱింగించు చున్నారు.

## సూ॥ స్థూలస్వరూపసూక్ష్మాన్వయార్థవత్త్వ సంయమాత్ భూతజయః ॥ 44

స్థూలస్వరూపసూక్ష్మాన్వయార్థవత్త్వసంయమాత్, భూత జయః॥

స్థూలస్వరూపసూక్ష్మాన్వయార్థవత్త్వసంయమాత్ = స్థూలము స్వరూపము, సూక్ష్మము, అన్వయము, అర్థవత్త్వము నను (పంచభూతముల) పంచావస్థలయందు సంయమమువలన, భూతజయః = భూతజయమను సిద్ధి గలుగును.

పృథివ్యాది పంచభూతముల స్థూలాది ధర్మపంచకమునందు సంయమమువలన పంచభూతములును లోబడును.

పరిదృశ్యమానమగు భూతముల విశిష్టాకారను స్థూల మనబడును. పంచభూతకార్యము స్వరూప మనబడును. తన్మాత్రలు సూక్ష్మ మనబడును. ప్రకాశప్రవృత్తిస్థితి రూపగుణము లన్వయ లనబడును. ఈ గుణముల యందలి భోగాపవర్గ సంపాదన సామర్థ్య మర్థవత్త్వ మనబడును.

ఇందు పార్థివాప్యతైజస వాయవీయాకాశీయములగు శబ్దస్పర్శ రూప రసగంధములు వ్యుత్క్రమముగా విశేషగుణము లనబడును. మఱియు షడ్జగాంధారాదులు, శీతోష్ణాదులు, నీలపీతాదులు, కషాయ మధురాదులు, సుగంధదుర్గంధాదులును, నానారూపప్రయోజనములచే నొండొకటి భేదించునుగాన విశేషములే, పైవిశేషగుణములైదును పృథివియందు గలవు.

గంధము తప్ప నాల్గును నీటియందును, గంధరసములు దప్ప తక్కిన మూడుమాత్రము తేజస్సునను, గంధరసరూపములు దప్ప తక్కిన రెండు మాత్రము వాయువునందును, శబ్దాముమాత్ర మాకాశమున నుండును. ఈ శబ్దాది విశేషగుణములు సహకారాది ధర్మములతో గలసి స్థూలములని పరిభాషితము లయ్యెను.

**ఆకారో గౌరవం రౌక్ష్యం వరణం స్థైర్యమేవ చ।**
**వృత్తిశ్ఛేదః క్షమా కార్శ్యం కాఠిన్యం సర్వభోగ్యతా॥**

అవయవసంస్థానము, గురుత్వము, రూక్షత్వము, ఆచ్ఛాదనము, స్థిరత్వము, సర్వభూతాధారత్వము, విదారణము, సహనము, కృశత్వము, కఠినత్వము, సర్వభోగ్యార్హత్వమునను పదునొకొండు పృథివి ధర్మములు.

**స్నేహస్సౌక్ష్మ్యం ప్రభా శౌక్ల్యం మార్దవం గౌరవం చ యత్।**
**శైత్యం రక్షా పవిత్రత్వం సన్ధానం చౌదకా గుణాః॥**

స్నేహము, సూక్ష్మత్వము, ప్రభ, శుక్లత్వము, మృదుత్వము, గురుత్వము, శీతలత్వము, ( ఆవరణాదులచే ) రక్షకత్వము, పవిత్రత్వము, సంధానము నను నీ పదియు నుదకగుణములు.

**ఊర్ధ్వభాక్ పావకం దగ్ధృ పాచకం లఘు భాస్వరమ్।**
**ప్రధ్వంస్యోజస్వి వై తేజః పూర్వేభ్యో భిన్నలక్షణమ్॥**

ఊర్ధ్వగమనము, పవిత్రత్వము, కాల్చుట, యుడికించుట, లఘుత్వము, భాస్వరత్వము, ప్రధ్వంసనము, బలము నను నీ యెనిమిది విలక్షణములగు తేజోగుణములు.

**తిర్యగ్యానం పవిత్రత్వమాక్షేపో నోదనం బలమ్।**
**చల మచ్ఛాయతా రౌక్ష్యం వాయోర్ధర్మాః పృథగ్విధాః॥**

అడ్డముగా ప్రసరించుటయు, పవిత్రత్వము, పడవేయుట, త్రోయుట, బలము, చాంచల్యము, ఛాయాహీనత్వము, రూక్షత్వము నను నీ

యెనిమిదియు విలక్షణములగు వాయుధర్మములు.

**సర్వతోగతిరవ్యూ హో ऽ విష్టంభశ్చేతి చ త్రయః ।**
**ఆకాశధర్మా వ్యాఖ్యాతాః పూర్వధర్మవిలక్షణాః ॥**

విభుత్వము (వ్యాపకత్వము), విభాగకరణము, అవకాశము నను మూడును విలక్షణములగు నాకాశధర్మములు.

ఇట్లు పృథివ్యాదులలో నుండు శబ్దాది విశేషము లన్నియు భూతముల స్థూలరూపము, ఇది భూతముల ప్రథమరూపము.

స్వస్వసామాన్యధర్మము పంచభూతముల రెండవ స్వరూపముగ నెఱుగ వలయును. అనగా సాంసిద్ధిక; కాఠిన్యము, పృథివీ స్వరూపము స్నేహము జలమునకు స్వరూపము. ఉష్ణత్వము వహ్ని స్వరూపము, వహనశీలత్వము వాయువుస్వరూపము. సర్వదేశవ్యాప్తి యాకాశమునకు స్వరూపము.

ఈ కాఠిన్యాదులే స్వస్వసామాన్యములని చెప్పబడును, ఇట్టి సామాన్య ధర్మములు గల పృథివ్యాదులకు భేదమును నిరూపించునవి శబ్దాది గుణములు. కాన వానికి విశేషగుణములను వ్యవహారము గలిగెను.

కాననే **"ఏకజాతిసమన్వితానా మేషాం ధర్మమాత్రవ్యావృత్తిః"** అని పంచశిఖాచార్యులు చెప్పిరి. అనగా సాంసిద్ధిక కాఠిన్యాది ప్రతినియత, ధర్మవంతము లయిన యీ పృథివ్యాదులకు సజాతీయముల నుండి మధురాది ధర్మములచే మాత్రము భేదమెఱుకపడునని భావము. అనగా కాఠిన్యాది ధర్మములే పృథివ్యాదులకు జలాదుల కన్న భేదమును సూచించు ధర్మము లైనను పార్థివపదార్థములలో నన్యోన్యభేదమును గాని, యిట్లే జలాదులలో నవాంతర భేదములను గాని కాఠిన్యస్నేహాదులు దెలుపజాలవు. పార్థివమగు వేపచెట్టునకును, నిమ్మ చెట్టునకునుగల భేదమును కాఠిన్యమను పార్థివధర్మము నిరూపింపజాలదు. వృక్షములు రెండును కఠినములుగనే యున్నందున కాఠిన్యము భేదసాధకము గాదు. కాని వేపచెట్టునందు చేదును,

నిమ్మచెట్టునందు పులుపు నుండుటచే తిక్తామ్లములు వీనికి పరస్పర భేదమును నిరూపింపజాలును. కాననే పృథివీసామాన్యమున కుండు ధర్మము మూర్తత్వము అనగా సాంసిద్ధిక కాఠిన్యము. తద్విశేష ధర్మములు మధురాదులు. ఇట్లే జలాదుల ధర్మము లూహించునది.

వైశేషికమతమువారు సామాన్యవిశేషధర్మముల కాశ్రయ మగునది ద్రవ్యమని చెప్పుదురు. కాని సాంఖ్యయోగమతములో సముదాయ సముదాయవంతములకును, ధర్మధర్ములకును భేదములేదు గాన, సామాన్యవిశేషధర్మ సముదాయమే వీరి (సాంఖ్యయోగ) మతమునఁ ద్రవ్యమని వ్యవహరింపబడును.

కాని సముదాయము ప్రత్యస్తమిత భేదావయవానుగత మనియు, శబ్దోపాత్త భేదావయవానుగత మనియు రెండు విధములు. ఇందు ప్రత్యస్తమిత భేదావయవానుగత సముదాయ మనగా అవాంతర భేదమును బోధించు శబ్దములచే భేదము బోధింపబడని యవయవముల యందనుగతమగు ద్రవ్యము. దీనికి శరీరము, వృక్షము, యూథము, వనము మొదలగునవి యుదాహరణములు. ఇందు శరీరాదు లన్నియు బహ్వవయవ సమూహ రూపము లైనను కరచరణాదులను గాని, శాఖాపత్రాదులను గాని, మేషవృషభాదులను గాని, వృక్షవిశేషములను గాని, ప్రతిపాదించు శబ్దములు ప్రయోగింపబడకున్నను అట్టి యవయవముల యందన్నిటి యందను గత మగు వ్యక్తి తోచుచున్నది గాన నివి ద్రవ్యములు.

అవాంతర విభాగబోధకము లగు శబ్దములచే బ్రతిపాదింపఁబడిన యవయవములయం దనుగతమగు సముదాయము, శబ్దోపాత్త భేదావయవానుగత సముదాయ మనబడును. ''ఉభయే దేవ మనుష్యాః'' అనునది యిందుల కుదాహరణము. అనఁగా ''దేవతలు మనుష్యులు నుభయులును'' అని దీనికర్థము. ఇది దేవమనుష్య సముదాయము. ఈ సమూహమున రెండవ యవములు గలవు, కాన 'నుభయే' యని ప్రయోగింపబడెను. ఆ యవయవము లెవ్వియను శంక గలుగగా నందొకటి దేవతలు. రెండవది

మనుష్యులు నని తెలుపుటకు 'దేవమనుష్యాః' యని వివరింపఁబడెను. కాన నీ సముదాయము శబ్దోపాత్త భేదావయవానుగతము.

మఱియు నీ సముదాయము భేదవివక్షితము, నభేదవివక్షితము నని యిఱుతెఱంగు లగును. ''ఆమ్రాణాం వనం'' మామిడిచెట్లతోపు ''బ్రాహ్మణానాం సంఘం'' బ్రాహ్మణుల సంఘము అని ప్రయోగించినచో ఆమ్ర బ్రాహ్మణ శబ్దములకు షష్ఠీవిభక్తియున్నది గాన నవయవ భూతములగు నామ్రములును, బ్రాహ్మణులును వేఱుగను, నవయవి యగు వనము, సంఘమును వేఱుగను భాసించును. యథార్థముగ నామ్రవృక్షములకన్న వేఱుగ వనమను నదియు, బ్రాహ్మణులకన్న భిన్నముగ సంఘమను నదియు లేదు. అయినను భేదవివక్షచే నిట్లు ప్రయోగింపబడినది గాన నిది భేదవివక్షిత సముదాయము.

అట్లుగాక ''ఆమ్రవనం'' ''బ్రాహ్మణసంఘః'' అని ప్రయోగించి నచో నవయవావయవుల కభేదమును వివక్షించుటవలన ''ఆమ్రాశ్చ తే వనం చ,'' యనియు ''బ్రాహ్మణాశ్చ తే సంఘశ్చ'' యనియు కర్మధారయము నంగీకరించుటచే నామ్రరూపమగు వనము, బ్రాహ్మణ రూపమగు సంఘము నను నర్థము లభించును. ఇయ్యది యభేద వివక్షిత సముదాయము.

ఈ సముదాయమును యుతసిద్ధావయవము, నయుత సిద్ధావయవము ననియు రెండువిధముల విభజింపవచ్చును.

యుతసిద్ధావయవ సముదాయ మనగా-వేర్వేరుగ నున్న యవయవములు గల సముదాయము. ఇందుకు వనము సంఘము నుదాహరణములు. వనమున కవయవము లగు వృక్షములు వేర్వేరుగ గోచరించును. అట్లే సంఘములోని మనుజులు, లేక పశువులు, లేక పక్షులు మొదలగునవి వేర్వేరుగ గోచరించును.

అయుత సిద్ధావయవ సముదాయ మనగా - పృథక్ప్రతీతములు గాని యవయవములు గల సముదాయము. శరీరము, వృక్షము. పరమాణువు,

నిందు కుదాహరణములు. ఈ శరీరాదులయందు నవయవములు నిడదీయ వీలుగాక కలసియే యుండును. కావున నయుత సిద్ధములు, పరమాణువులు సయితము పంచచతురాది తన్మాత్రా సమూహములే యని వీరి సిద్ధాంతము కాగా నిట్టి యయుత సిద్ధావయవానుగత మగు సమూహ మయుత సిద్ధావయవ సముదాయ మని చెప్పబడును.

ఈ యయుత సిద్ధావయవ భేదానుగతమగు సమూహమే పతంజలి మతమునందు ద్రవ్యమని వ్యవహరింపబడును. ఇంతవరకును భూతముల రెండవరూపమగు స్వరూపము నిరూపింపబడెను.

భూతములకు కారణములగు పంచతన్మాత్రలు భూతముల సూక్ష్మరూపము ఇదియే. భూతముల మూడవరూపము. తన్మాత్రయనునది భూత చరమావయవ మగు పరమాణువు. మఱియు నా తన్మాత్రయు మూర్త్యాది శబ్దాదిసామాన్య విశేషాత్మకమై యయుత సిద్ధావయవ భేదాను గతమగు సముదాయము. ఇట్టి తన్మాత్రభూతముల సూక్ష్మమను తృతీయ రూపము.

సర్వకార్యములయందు ననుగతమగు ఖ్యాతి (ప్రకాశ) క్రియా (ప్రవృత్తి) స్థితిశీలమగు ముప్విధములగు సత్త్వాది గుణములును కార్యరూపమగు స్వాత్మక పదార్థమునం దన్వయించినవి, గాన నన్వయమను భూతముల చతుర్థస్వరూపము గుణముల యందలి భోగాపవర్గరూప పురుషార్థ సంపాదన సామర్థ్యము అర్థవత్త్వమని చెప్పంబడును. ఇది భూతముల యర్థవత్త్వమను పంచమస్వరూపము. భోగాపవర్గరూప పురుషార్థ సంపాదన సామర్థ్యము గుణములయందు సాక్షాత్తుగనే గలదు. శబ్దాది తన్మాత్రలును, పృథివ్యాది భూతములును, గోఘటాది భౌతికములును, తాము స్వయముగ పురుషార్థ సంపాదనమును జేయ జాలక స్వగతగుణముల ద్వారా తత్సంపాదనము నొనర్చును గాన నవియు పరంపరాసంబంధముచే పురుషార్థ సాధకములు. కాగా నన్నియు పురుషార్థసాధకము లగును గాన నర్థవంతములే.

ఇట్లు పంచరూపములు గల పంచభూతముల యందును సంయమము నొనర్చుటచే నిఖిలరూపముల సమ్యగ్జ్ఞానమును భూతముల వశీకారమును లభించును. ఇందు దొలుత స్థూలరూపమున సంయమమును, దత్సిద్ధి యబ్బిన యనంతరము స్వరూపమునను. తదనంతరము సూక్ష్మ రూపమునను, దాని యనంతర మన్వయరూపమునను, కడపట యర్థ వత్త్వమునను సంయమముచేసి, యిట్లు తొలుత భూతస్వరూపములను జయించినచో భూతములు తమంతట తామే లోబడును. ఇట్లు భూతము లను జయించినచో దూడల ననుసరించు నావులవలె భూతప్రకృతులు (స్వభావములు) సాధకుని సంకల్పానుసారముగ మెలగును.

అవ॥ భూతజయమునకు ఫలమును దెలుపుచున్నారు.

**సూ॥తతో౽ణిమాదిప్రాదుర్భావః కాయసంప త్తద్ధర్మానభిఘాతశ్చ ॥ 45**

తతః, అణిమాదిప్రాదుర్భావః, కాయసంపత్, తద్ధర్మానభిఘాతః, చ ॥

తతః = ఆ భూతజయమువలన, అణిమాదిప్రాదుర్భావః = అణి మాద్యష్టసిద్ధులు గలుగుటయు: కాయసంపత్ = దేహసంపదయు, తద్ధర్మానభి ఘాతః చ - తత్ = ఆ భూతములయొక్క. ధర్మ = ధర్మములచే, అనభిఘాతః చ= ప్రతిబంధము లేకుండుటయు నేర్పడును.

పైన ప్రతిపాదించిన భూతజయ సంకల్పానువిధాయిత్వము వలన నణిమయు, లఘిమయు, మహిమయు, ప్రాప్తియు, ప్రాకామ్యము, వశిత్వము, ఈశత్వము, యతకామావసాయిత్వము నను నెనిమిది సిద్ధులు గలుగును.

ఇందణిమ యను సిద్ధిచే సాధకుఁడు స్థూలుడై యుండియు నణుపరిమాణవంతు డగును.

లఘిమ యను సిద్ధిచే సాధకుడు బరువై యుండియు దూదిపింజ వలె

ఆకాశమున సంచరించును.

మహిమ యను సిద్ధిచే సాధకు డల్పపరిమాణ వంతుఁడయ్యు నాగగనాది పరిమాణవంతుడుగ నగును.

ప్రాప్తియను సిద్ధి లభించెనేని సాధకుడు భూమిమీదనుండియు నంగుళ్యగ్రముచే జంద్రునిగూడ స్పృశింపజాలును. అనగా నిట్టివానికి నన్ని పదార్థములును సన్నిహితము లగును.

ప్రాకామ్య మనగా సంకల్పమునకు నిరోధము లేకుండుట, ఇట్టి ప్రాకామ్యము సిద్ధించిన యతడు తాను సంకల్పించెనేని నీటిలో మనము మునిగి తేలుచున్నటుల భూమిలో మునిగి తేలగలడు. ప్రాకామ్యవంతుని రూపము భూతముల స్వరూప మూర్త్యాదులచే నిరోధింపబడదు గాన నీ సాధకున కెచ్చటను బ్రతిరోధ ముండదు.

వశిత్వ మనగా పృథివ్యాది భూతములను ఘటాదిభౌతికములను దనయ ధీనమునం దుంచుకొనుట, ఇట్టి వశిత్వము సిద్ధించిన యోగికి భూత భౌతికములు దమస్వభావము సయితము విడనాడబడియుండునే గాని యీయోగి భూతభౌతికములకు లొంగఁడు.

ఈశత్వమనగా భూతభౌతికముల యుత్పత్తిస్థితినాశముల నొనర్పుశక్తి విశేషమే యీశత్వము.

సత్యసంకల్పత్వమే యతకామావసాయిత్వమను సిద్ధి. ఈ యత కామావసాయిత్వము సిద్ధించిన యాతడు తాను సంకల్పించినటుల భూతముల స్వభావమును మార్పగలడు. అతఁడు తలంచెనేని విషమును దినిపించియు మరణింపకుండ జేయగలఁడు. ఇట్టి సామర్థ్యముగల వాడైనను అతడు పదార్థముల శక్తులను మార్పజాలునే గాని, పదార్థములను మార్పజాలడు. అనగా చంద్రుని సూర్యునిగాను, సూర్యునిచంద్రునిగాను, విషము నమృతముగాను, అమృతమును విషముగను - ఈ విధముగ బదార్థములను మార్పజాలడు. కాని విషము నందలి ప్రాణహరణశక్తిని

నివర్తింపజేసి యందు జీవనశక్తి నాపాదింపజాలును.

ఈ సిద్ధుని కన్న పూర్వమున నుండియు యతకామావసాయియు, నిత్యసిద్ధుడగు భగవంతుని సంకల్పము భూతముల విషయమున నొక విధమున నుండగా, నీ నవీన సాధకుని సంకల్పము తద్విరుద్ధముగ నుండినను పదార్థములు మాఱజాలవు. పదార్థగత స్వభావము లన్ననో జాతిదేశ కాలావస్థాభేదముచే నియతస్వభావములు గావు, కాన నవి మాత్రము యోగీచ్ఛానుగుణముగ మాఱు ననుట యుక్తమే.

ఇవియే యష్టైశ్వర్యములు. భూతజయమున కీయైశ్వర్యాష్టక మొక, ఫలము.

మఱియు కాయసంపదయు నింకొక ఫలము. కాయసంపద యనునది రాబోవు సూత్రముచే నెఱుకపడును.

ఇట్లే తద్ధర్మానభిఘాతము సయితము భూతజయమునకు ప్రయోజనమే. తద్ధర్మానభిఘాత మనగా పృథివ్యాదులు స్వకాఠిన్యాది ధర్మములచే యోగి శరీరక్రియను నిరోధింప కుండుట. కాన పృథివి తనమూర్తిచే యోగిశరీరక్రియ నడ్డగింప జాలదు. కాగా యోగి బండలో సయితము దూఱగలడు. అట్లే స్నిగ్ధమగు జలములు సయితము యోగిని తడుప జాలవు. వేడిమిగల నిప్పు సయితము కాల్పదు. సహనశీలమగు గాడ్పు సయిత మతని గదలింప జాలదు. అత డనావృతమగు నాకాశమున సయిత మావృతశరీరుడై సిద్ధులకు సయిత మగపడకుండును. ఇది తద్ధర్మానభిఘాతము, తద్ధర్మానభిఘాత మనగా నాయోగి కాయమునకు ధర్మములగు రూపాదుల కెందును నిరోధము లేకుండుట యని కొందఱు వ్యాఖ్యానించిరి.

అవ॥ కాయసంపదను వివరించుచున్నారు.

**సూ॥ రూపలావణ్యబలవజ్రసంహననత్వాని**
**కాయసంపత్ ॥ 46**

రూపలావణ్యబలవజ్రసంహననత్వాని, కాయసంపత్ .

రూపలావణ్యబలవజ్రసంహననత్వాని - రూప = మనోహరరూపమును, లావణ్య = కాంతి విశేషమును, బల = అతిశయ బలమును, వజ్రసంహననత్వాని= వజ్రసమానముగ దృఢములగు నంగములు గలిగి యుండుటయు, కాయసంపత్= కాయసంపద యనబడును.

అతిమనోహరమై దర్శనీయమై ముత్తెములలోని తళుకు వలె తళతళమను కాంతివిశేషము గలిగి వజ్రమువలె దృఢతరమగు నవయవ సన్నివేశము గలిగి యుండుట. కాయసంపద యనబడును. పూర్వ సూత్రము నందలి సిద్ధిత్రయమునందు నాద్యంతసిద్ధిద్వయమును ప్రసిద్ధమైనది యగుటచే వివరింపక విడచి కాయసంపద్రూపసిద్ధిని మాత్రము సూత్రకారు డీ సూత్రమున వివరించెను.

అవ॥ ఇట్లు ఫలసహితమగు భూతజయమున కుపాయము నెఱింగించి యిక నింద్రియజయమున కుపాయమును దెలుపుచున్నారు.

**సూ॥ గ్రహణస్వరూపాస్మితాऽన్వయార్థవత్త్వ-**
**సంయమాదింద్రియజయః ॥ 47**

గ్రహణస్వరూపాస్మితాऽన్వయార్థవత్త్వసంయమాత్, ఇంద్రియ జయః॥

గ్ర హ ణ స్వ రూ పా స్మి తా ఽ న్వ యా ర్థ వత్త్వ సంయమాత్= గ్రహణము, స్వరూపము, అస్మిత, యన్వయము, అర్థవత్త్వము - నను నైదు రూపములయందు సంయమము వలన , ఇంద్రియ జయః = ఇంద్రియజయ మబ్బును.

గ్రహణము, స్వరూపము, అస్మిత, యన్వయము, అర్థవత్త్వము- నను నింద్రియముల యైదు రూపములయందు సంయమమువలన యోగికి నింద్రియములు వశము లగును.

ఇందు సామాన్యవిశేషరూపమగు శబ్దాది గ్రాహ్యవిషయమున విషయాకారమున నింద్రియముల పరిణామరూపమగు వృత్తిగ్రహణ

మనబడును. సామాన్యమనగా ననుగతధర్మము. దానినే తార్కికులు జాతి యందురు. విశేషమనగా ధర్మి, కొందఱు సామాన్యమును మాత్ర మింద్రియ గ్రాహ్యముగ నొప్పుకొందురు. కాని విశేషము నింద్రియ గ్రాహ్యముగా నొప్పు కొనరు. కాని విశేషము మనోగ్రాహ్యమని వారందురు. ఆ మతము సరిగాదు. ఇంద్రియవృత్తి సామాన్యమును మాత్రమే గ్రహించుననుట సరిగాదు. విశేష (ధర్మి) విషయమున నింద్రియముల వృత్తి నంగీకరింపమేని యింద్రియము లచే నగృహీతమగు నీ విశేషము మనసుచే నెట్లు నిశ్చయింపబడును? బాహ్యేంద్రియాధీనమై మాత్రమే మనసు బాహ్య విషయములయం దనువ్యవసాయము గలది యగును, గాని స్వతంత్రముగ గాజాలదు. కాన నింద్రియవృత్తి సామాన్యవిశేష రూప విషయాత్మక మైనదిగనే యుండును. కాగా నీ గ్రహణ మనునది యింద్రియముల తొలుతటి రూపము.

ప్రకాశరూపమగు మహత్తత్త్వపు బరిణామమైన యయుత సిద్ధావయవరూప సాత్త్వికాహంకారమున గార్యరూపమున ననుగతమై సామాన్య విశేష సమూహరూపమగు ద్రవ్యమే యింద్రియముల స్వరూపము. కాగా సాత్త్వికాహంకారమునకు గార్యమై ప్రకాశస్వరూపమగు ద్రవ్యమే యింద్రియ మనబడును. ఇయ్యది యింద్రియముల స్వరూపమను రెండవ రూపము.

ఇంద్రియములకు గారణమగు నస్మితానామకాహంకారము ఇంద్రియ ముల తృతీయరూపము. తన్మాత్రలను సామాన్యమునకు, భూతములు విశేషము లయిన విధమున, నహంకారమను సామాన్యమునకు (గార్యములు గాన) చక్షురాదీంద్రియములు విశేషములు. కాన నింద్రియముల యందన్ని టను గారణరూపమున ననుగతమగు నస్మిత (అహంకారము) ఇంద్రియ ముల దృతీయరూపము.

వ్యవసాయరూపమగు మనస్తత్త్వపు టాకారముచే బరిణమించిన ప్రకాశక్రియా స్థితిశీలము లగు సత్త్వాదిగుణములు ఇంద్రియముల యన్వయమను చతుర్థరూపము. అహంకారమును, ఇంద్రియములును, గుణముల పరిణామములే గాన నాగుణములు జ్ఞాన చేష్టాసంస్కారరూపమున

నింద్రియముల యందన్వయించును గాన గుణము నింద్రియముల యన్వయమను చతుర్థరూపమని చెప్పబడియెను.

మఱియు నా యింద్రియములకు బ్రకృతులగు గుణముల యందను గతమైన పురుషునకు భోగాపవర్గ సంపాదనము చేయు సామర్థ్యమే యర్థవత్త్వ మను నింద్రియముల యైదవరూపము.

ఇట్టి యింద్రియరూప పంచకమునందును, పూర్వపూర్వ క్రమముగా సంయమముచే జయము గడించినచో యోగికి నింద్రియ జయము గలిగి యింద్రియములు వశము లగును.

అవ॥ ఇంక నింద్రియజయమునకు ఫలము నెఱింగించుచున్నారు.

## సూ॥ తతో మనోజవిత్వం వికరణభావః ప్రధానజయశ్చ ॥ 48

తతః, మనోజవిత్వం, వికరణభావః, ప్రధానజయః, చ.

తతః= ఆ యింద్రియజయము వలన, మనోజవిత్వం = మనోవేగమును, వికరణభావః = వికరణ భావమును, ప్రధానజయః చ = ప్రకృతిజయమును గలుగును.

అయ్యింద్రియ వశీకార మబ్బెనేని మనోజవిత్వమును, వికరణ భావమును, ప్రధానజయము నను మూడుఫలములు గలుగును. ఇందు మనోజవిత్వమనగా - మనస్సువలె శీఘ్రముగ గమనముజేయు శక్తి, వికరణ భావమనగా - శరీరసంబంధము లేకయే యింద్రియములకు నభీప్సితదేశకాల విషయముల యందు వృత్తిలాభము, అనగా నేదేశమున, నేకాలమున, నేవిషయమునం దభిలాష వొడమునో, యాదేశాదులయందు శరీరముతో బనిలేకయే యింద్రియములకు వృత్తి గలుగును. అనగా కాశిలో గూర్చొని రామేశ్వరములోని వారలను జూడజాలును. వర్తమానకాలమున నుండియు భూతభవిష్యత్తులను బ్రత్యక్షము జేసికొనును. ఇది వికరణ భావము.

ప్రధానజయ మనగా - (ప్రకృతి వికారములను) సమస్తకార్య కారణములను లోబఱచుకొనుట - ఈ మూడు సిద్ధులును యోగమతమున మధుప్రతీకములని వ్యవహరింపబడును. ఈ సిద్ధులింద్రియ పంచకపు రూప పంచకమును జయించుటచే లభించును. తేనెతెట్టెలోని తేనె నేవైపున నేమాత్రము జుఱ్ఱినను మధురతరముగ నుండువిధమున, నీసిద్ధులలో నేయది లభించినను మహానంద మబ్బును గాన నాపేరు సార్థకము.

అవ॥ జ్ఞానక్రియారూపైశ్వర్య హేతువులగు నీ సంయమములు నేరుగను, పరంపరగను, స్వసిద్ధిజనితశ్రద్ధామూలమున వివేకఖ్యాతికే సాధనము లగుటవలన నా వివేకఖ్యాతికి నవాంతర ఫలమును దెలుపుచున్నారు.

## సూ॥ సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య సర్వభావాధిష్ఠాతృత్వం సర్వజ్ఞాతృత్వం చ ॥ 49

సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య, సర్వభావాధిష్ఠాతృత్వం, సర్వజ్ఞాతృత్వం, చ ॥

సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య = ప్రకృతిపురుషవివే కనిష్ఠమగు చిత్తము గల యోగికి, సర్వభావాధిష్ఠాతృత్వం = సమస్తవస్తువుల ఆధిపత్యమును, సర్వజ్ఞాతృత్వం చ = సకల వస్తువిషయక యాథార్థ్యజ్ఞానము(శ్రీ)యును లభించును.

రజస్తమోరూప మలముచే నావరింపబడిన చిత్తము వశము గాదు గాన, మైత్ర్యాదిభావనల నభ్యసించుటచే నా చిత్తమునకు స్వచ్ఛమై, స్థిరమై, యేకాగ్రతాప్రవాహరూప మగు పరవైశారద్యము గలుగును.

ఇట్లు పరవైశారద్యముచే నతిసూక్ష్మ వస్తుప్రతిబింబాది గ్రహణ సామర్థ్యము లభించినందున పరమాణువు మొదలు పరమమహత్తువఱకు వశ్యమగుట యను పరవశీకారసంజ్ఞ యందుండుచు, సత్త్వపురుషవివేక ఖ్యాతిమాత్ర రూపప్రతిష్ఠితు డగు యోగికి సర్వపదార్థస్వామిత్వము లభించును. అనగా, జడరూపముగను బ్రకాశరూపముగ నున్న గుణమయము

లగు నన్నిపదార్థములును తమకు ప్రభువగు క్షేత్రజ్ఞునికి భోగ్యములుగ, నుపస్థితము లగును. కాన నట్టియోగి, స్వామి యనియు, సేవకులవలె నిఖిలభూతభౌతికములు నతని సంకల్పానుసారముగ ప్రవర్తించునుగాన నన్నియు నతని సొత్తు లనియు వ్యవహరింపబడును. ఈ విషయమున శ్రుతియు **''స యది పితృలోక కామః సంకల్పాదేవాస్య పితరః సముపతిష్ఠంతి''** యనుచున్నది. అనగా నాయోగి పితృలోకమును దర్శింప నెంచెనేని యాతని సంకల్ప మాత్రమున పితృదేవ లతని వద్దకు వత్తురు అని భావము.

శాంతోదితావ్యపదేశ్య ధర్మవంతము లయి, యతీతానాగత వర్తమాన రూపమున బరిణమించిన గుణత్రయము విషయమునఁ గ్రమముగ గాక తటాలున నేకకాలమున గలుగు వివేకజన్యజ్ఞానము సర్వజ్ఞాతృత్వమనబడును. అనగా నేకకాలముననే సకలపదార్థముల యథార్థసాక్షాత్కార మతనికి గలుగును. కాన నా యోగి సర్వజ్ఞుఁడని చెప్పబడును.

ఈ సర్వభావాధిష్ఠాతృత్వము సర్వజ్ఞాతృత్వము ననువానిచే యోగికి శోకము నశించును గాన నీరెంటికిని యోగశాస్త్రమున ''విశోకసిద్ధి'' యని పేరు. ఈ విశోకసిద్ధి యుక్తుడగు యోగి సర్వజ్ఞుడును, క్షీణావిద్యాది సర్వక్లేశ బంధనుడును జీవన్ముక్తుడు నయి విహరించును.

అవ॥ వివేకఖ్యాతిరూప సంయమమునకు బరవైరాగ్యద్వారమున గైవల్యరూపముఖ్యతమసిద్ధిని దెలుపుచున్నారు.

## సూ॥ తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యమ్ ॥ 50

తద్వైరాగ్యాత్, అపి, దోషబీజక్షయే, కైవల్యమ్ ॥

తద్వైరాగ్యాత్ = ఆ వివేకఖ్యాతి విషయకమగు వైరాగ్యమువలన, దోష బీజక్షయే - దోష = రాగాదిదోషములకు, బీజ = మూలకారణమగు నవిద్యాదుల యొక్క, క్షయే = నాశము గలుగగా, కైవల్యం అపి = స్వరూపప్రతిష్ఠారూప మగు కైవల్యముగూడ లభించును.

వివేకఖ్యాతి నిష్ఠడుగ నుండగనే క్లేశకర్మ క్షయము గలిగినందున, యోగి యిట్లు విచారించును. ఈ వివేకజ్ఞానము బుద్ధిరూప సత్త్వపు ధర్మము. బుద్ధి యనునది యాత్మగాదు గదా! కాన బుద్ధియు త్యాజ్యకొటిలో చేరినదే. అపరిణామియు, శుద్ధుడునగు పురుషు డీబుద్ధిసత్త్వమునకన్న భిన్నుడు.

ఇట్టి తలంపతనికి గలిగిన వెంటనే యతఁడు వివేకఖ్యాతి యందు సయితము విరక్తి జెందును. ఇట్లు పరవైరాగ్యము గల యోగి చిత్తమున నింతకు ముందున్న క్లేశబీజములు, వేగిన వడ్లు మొలక లెత్తజాలని చందమున నిరుపయుక్తములై మనస్సుతోడగూడి నశించి పోవును. ఇట్లు క్లేశ బీజము లుపశమింపగా నాధ్యాత్మికాది భౌతికాధిదైవికము లనఁబడు త్రివిధతాపముల నాతఁడనుభవింపడు. కాగా భోగాభావమే పురుషార్థము. దుఃఖాభావము పరంపరగా పురుషార్థమని చెప్పబడును. కొందఱు దుఃఖనివృత్తియే పురుషార్థ మనియు చెప్పుదురు.

అపుడు కర్మక్లేశ విపాకరూపమున జిత్తమున నున్న గుణములకు బ్రతిప్రసవము గలుగగా ననగా సమాప్తపురుషార్థములు గాన చరితార్థములై యాగుణములు మనస్సు తోడ గలిసియే స్వకారణమున లీనములు గాగా పురుషున కత్యంత గుణవియోగరూప మను కైవల్యము గలుగును. అనగా బొత్తుగా గుణములతో సంబంధము లేక పురుషుఁడు దాను కేవల ముండును. అట్టిస్థితిలో పురుషుడు స్వరూపప్రతిష్ఠిత మగు చితిశక్తిరూపముగ నుండునేగాని యాతనికి బరిణామ మేమాత్రమును గలుగదు.

ఈ సూత్రమున 'అపి' శబ్దము భిన్నక్రమముగ కైవల్యశబ్దము తోడ నన్వయింపబడియెను గాన, వివేకఖ్యాతికి సర్వజ్ఞత్వాది ఫలములే గాక వివేకఖ్యాతివిషయమున వైరాగ్యముచే నసంప్రజ్ఞాత సమాధి గలుగును. కైవల్యమను ముఖ్యమగు ఫలమును గలదని తెలుపబడియెను.

అవ॥ ఇంక ముముక్షువులకు గలుగు విఘ్నములకు నివారణోపాయములను దెలుపుచున్నారు.

## సూ॥ స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణం పునరనిష్టప్రసంగాత్ ॥ 51

స్థాన్యుపనిమంత్రణే, సంగస్మయాకరణం, పునః, అనిష్ట ప్రసంగాత్.

పునః = మఱల, అనిష్టప్రసంగాత్ = అనిష్టమగు సంసారాదికము ప్రాప్తించును గాన, స్థాన్యుపనిమంత్రణే - స్థాని = స్వర్గాది లోకపాలకులయొక్క, ఉపనిమంత్రణే = సత్కార పూర్వక ప్రార్థనయందు, సంగస్మయాకరణం - సంగ = ప్రీతియు, స్మయః= దేవతలు తన్నాహ్వానించిరని కృతార్థతా బుద్ధియు, అకరణం = చేయరాదు.

తన యోగసాధనమాహాత్మ్య మానింద్రాది లోకపాలకులు తన్నుఁ బ్రీతిపూర్వకముగ దమ లోకముల కాహ్వానించినను వారి యాహ్వానమునందు బ్రీతి యుంచరాదు. వారిచే బ్రార్థితుడ నైతిని గాన కృతకృత్యుడ నైతినని తలంపరాదు. అట్లు చేసెనేని మరల నాతడు సంసారాద్యనిష్టముల ననుభవించును.

1. ప్రథమ కల్పికుడు, 2. మధుభూమికుడు, 3. ప్రజ్ఞా జ్యోతియు, 4. అతిక్రాంతభావనీయుడునని యోగులు నాల్గువిధముల నుందురు.

1. ఇందు నభ్యాసియై ప్రవృత్తమాత్రమై యింకను నిష్పన్నము గాని జ్ఞానము గలిగి సంయమతత్పరుఁడు గాన పరచిత్తజ్ఞానాదుల కున్ముఖమగు చిత్తజ్ఞానము గల యాతడు ప్రథమ కల్పికుడు.

2. సమాధిద్వారా ఋతంభరా ప్రజ్ఞను గడించి, భూతేంద్రియముల జయింప దలచుచుండు నాతడు మధుభూమికుడను రెండవ కక్ష్యకు చేరిన యోగి.

3. సమాధ్యభ్యాసవశముననే భూతములను ఇంద్రియములను జయించి, ఇంతవఱకు గడించిన నిర్వితర్కాది యోగములయందు గృతరక్షాబంధనుడై స్థిరపడి యింక గడింపవలసిన విశోకాదిసిద్ధుల విషయమున యత్నించుచుండు నాతడు ప్రజ్ఞాజ్యోతి యను మూడవ కక్ష్యకు

చెందిన యోగి.

4. ఏ యోగికి నసంప్రజ్ఞాతసమాధి మూలమున చిత్తవిలయము మాత్రము కావలసి యున్నదో, మఱి యేమియు కర్తవ్యము లేదో యాత డతిక్రాంత భావనీయుడు, ఇతడు నాల్గవయోగి. ఉత్తమోత్తముడు. ఇతనికి నేడు విధములగు ప్రాంతభూమిప్రజ్ఞలును లభించును. ఈ ప్రజ్ఞలను గుఱించి రెండవపాదమున నిరువది యేడవ సూత్ర వివరణమును జూడనగును.

ఈ నాల్గువిధములగు యోగులలో యోగమున బ్రవృత్తమాత్రుడే కాన ప్రథమకల్పికునకు దేవేంద్రకృతప్రార్థనయే యసంభవము. మూడవవాడగు భూతేంద్రియజయియు స్వయముగనే యణిమాద్యష్టైశ్వర్యములు గలవాడు గాన, నాతని దేవేంద్రాదులు నాశ కొలుపజాలరు. అట్లే అతిక్రాంతభావ నీయుడను చతుర్థయోగియు పరవైరాగ్యశీలుడు గాన నేఱిని లెక్క-సేయడు. కాన బరిశేష న్యాయమున ఋతంభరాప్రజ్ఞగల ద్వితీయయోగికే దేవేంద్రాది లోకపాలక కృతమగు సత్కారపూర్వక ప్రార్థనము గలుగుట సంభవము. ఇతనికి నైశ్వర్యములు గాని పరవైరాగ్యము గాని, సిద్ధింపనందున నీతని దేవేంద్రాదులు ప్రలోభింప వచ్చును. కాగా మధుమతీభూమికను సాక్షాత్క-రించుచు బ్రహ్మనిష్ఠుడై, స్థిరుడైయున్న యోగిచిత్తశుద్ధిని బరీక్షింప నెంచి దేవతలు వీని దరిఁజేరి దివ్యాప్సరఃప్రముఖములగు భోగ్యములను జూపి యో ''యోగిసత్తమా! యిచట నుండుము. ఇచట గ్రీడింపుము. ఈ భోగమింపైనది. ఈ పడుచు సొగసైనది. ఈ రసాయనము గొనుము. ఇది జరామృత్యువులను బాఱద్రోలును. ఇది యాకసమున దిరుగు విమానము. ఇవి కల్పవృక్షములు, ఇది పవిత్రమగు మందాకిని. వీరు సిద్ధులగు మహర్షులు. వీరుత్తమురాండ్రు, ననుకూలలు నగు నప్సరసలు. మా కనులును చెవులును దివ్యములు. మా దేహము వజ్రసదృశము. ఆయుష్మంతుడవగు నీ గుణముల మూలమున నివి యన్నియు నీకు లభించినవి. కాన నక్షయము, నజరము నయి దేవతలకు బ్రియమగు నీయమరస్థానమగు స్వర్గమునకు రమ్మ.'' అని ప్రార్థించుచుండు సమయమున నా యోగి వారి మాటలు నమ్మి యా

భోగములయందు సంగ మొనర్పరాదు.

అంతేగాక సంగమునందలి దోషములను దలంపవలయును. అనగా - ''నీ ఘోరసంసార రూపమగు నిప్పుకణికలపై నడచుచు జన్మమరణ రూపాంధకారమున మఱల మఱల ద్రిమ్మరుచున్న నాకెట్లెట్లో క్లేశతిమిరవినాశకమగు యోగప్రదీపము లభించినది. ఆ యోగప్రదీపమునకు దృష్ణామూలములగు విషయవాయువులు ప్రతిపక్షము లైనవి. యోగజ్ఞాన రూపమగు ప్రకాశమును గడించిన నేనెట్లు విషయము లను నెండమావులచే మోసగింపబడి మఱల నా మండుచుండు సంసారదావానలమున బడుదును'' అని వితర్కించి, ''స్వప్నసదృశములై నీచజనప్రార్థనీయములైన, విషయము లారా! మీకు మేలగు, దొలగి చను'' డని విషయసంగమును దిగనడచి దృఢమనస్కుడై సమాధియందు ప్రవర్తింప వలయును.

ఇట్లే విషయములపై దోషదృష్టితో వాని నాశింపకుండుటయేగాక, తానింతవాడ నైతిని గదా, దేవతలు సయితము నన్ను ప్రార్థించుచున్నారు గదా, యను గర్వమును సయితము వహింపరాదు. ఇట్లహంకారము గలిగెనేని తాను గృతకృత్యుడ నైతినని యెంచి, మృత్యువు తన జుట్టు పట్టుకొని యున్నటుల భావించి సమాధిసిద్ధియందు ద్వరపడక సమాధినుండి యుపరమింప వచ్చును. అట్టి సమాధివిరామ సమయమున రంధ్రాన్వేషియు మహాయత్న నివర్తనీయము నగు ప్రమాద మవకాశము గలదియై యేర్పడి క్లేశముల నతిశయింపజేయును. దానివలన యోగికి ననిష్టములు ప్రాప్తించును. అనగా యోగభ్రష్టుడై యాతడనేక కష్టముల ననుభవించును.

ఇట్లు గాక సంగమును, స్మయ (అహంకార)ము నొనర్పని యోగికి సంయమద్వారమున లభించిన పరచిత్తజ్ఞానాది భావితార్థము దృఢతర మగును. వివేకఖ్యాతివశమున గలిగిన విశోకాది భావనీయార్థము లతనికి నున్ముఖము లగును.

కాన యోగి యగు నాతడు సంగము, గర్వము నను వానిని విడనాడి,

యనవరతమును యోగానుష్ఠాన తత్పరు డగునేని పరవైరాగ్యముగుండ నసంప్రజ్ఞాత సమాధి లభించినందున విశోకుడై యోగసీమ యగు జీవన్ముక్తిని బొందును.

అవ॥ వివేకజ్ఞానమున కుపాయాంతరము నెఱింగించుచున్నారు.

**సూ॥ క్షణతత్క్రమయోః సంయమా ద్వివేకజం జ్ఞానమ్ ॥ 52**

క్షణతత్క్రమయోః, సంయమాత్, వివేకజం, జ్ఞానమ్।

క్షణతత్క్రమయోః - క్షణ = క్షణవిషయమునను, తత్క్రమయోః = ఆక్షణపు క్రమము విషయమునను, సంయమాత్ = సంయమమువలన, వివేకజం = వివేకజన్యమగు, జ్ఞానమ్ = జ్ఞానము గలుగును.

మట్టిపెళ్ళ మొదలగు దానిని విభజించుచు, నావిభక్తములగు నవయవములను మఱల విభజించుచు వత్తుమేని తొలుతటి దానిలోని యవయవములకును, వానిలోని యవయవములకు నల్పత్వమున తారతమ్య మేర్పడును. ఈ యల్పత్వమునకు పరమాణువే యవధి. ఇంతకన్న నల్పమగు నవయవము దాని యందింకొకటి లేదు. అట్లే కాలమును విభజించుచు వత్తుమేని పరమాపకర్ష పర్యంతము నతి సూక్ష్మమును నిర్విభాగము నగు కాలము క్షణ మనబడును. లేదా పరమాణువు కదలి పూర్వదేశమును విడచి పరమాణు వంతదూరమున గల యుత్తరదేశమున జేరుటకు బట్టుకాలము 'క్షణమ'ని వ్యవహరింపఁ బడును. కొందఱు పరమాణువు పూర్వదేశమును విడచుకాలము క్షణమనియు, నట్లే యుత్తరదేశమును జేరుటకుఁ బటు కాలము సయితము క్షణమనియు నభిప్రాయపడిరి. వైశేషికు లంగీకరించిన పరమాణువులను యోగమతము వారు నంగీకరించిరి గాని, వానిని గుణములనియు, నంతఃకరణాకాశ హేతువులగు గుణములు దప్ప తక్కిన గుణము లణుపరిమాణములనియు నంగీకరింతురు. కాని వానియందు పృథివీత్వాది వ్యంజకగంధాదుల నంగీకరింపరు గాన, పరమాణువులందు పార్థి

వత్వాదిక ముండదని మాత్రము యోగమత సిద్ధాంతము.

అట్టి పరమసూక్ష్మ కాలావయవములను క్షణముల యుత్తరోత్తర భావరూపముచే నవస్థానమను, క్షణప్రవాహమునకు నైరంతర్య రూప మగు నవిచ్ఛేదము క్రమ మనబడును. ఇట్టి క్రమము కల్పితమే గాని వాస్తవమైనది గాదు. ఒక కాలమున నొకచోట నుండని విలక్షణముల కేకత్ర సమాహార మసంభవము గాన క్షణసమాహారరూపమగు క్రమము వాస్తవమైనది గాదు. కావుననే క్షణతత్క్రమములకు సయితము వాస్తవత్వము లేదు. కాన ఘటికా, ముహూర్త, ప్రహర, దివ, రాత్రి, రూపమగు కాలము బుద్ధికల్పిత సమాహారరూపమే గాని వాస్తవము గాదు. అనఁగా - ఘటికాహోరాత్రాది కాలము వస్తుతః లేనిది యయ్యు, బుద్ధికల్పితమై శబ్దమాత్రముచే బ్రతీత మగుచు (వికల్పవృత్తికి విషయమై) విమర్శనాహీనులగు లౌకికులకు మాత్రము వాస్తవముగ గోచరించును.

యథార్థముగ క్షణ వ్యతిరిక్తమగు ఘటికాదికాలము సంభవింపదు గావున, కాలపువాస్తవ స్వరూపము నెఱింగిన యోగులు క్షణమునే ముఖ్య కాలముగా దలంతురు. అనగా క్షణనిరంతరత్వ రూపమైన క్రమమున కాశ్రయమైన క్షణము మాత్రమే వాస్తవమైనది. క్రమమనగా పూర్వక్షణమునకు నుత్తరక్షణము వ్యవహితముగ నుండుట. దానినే కాలవేత్తలు కాలమని చెప్పు దురు. అట్టి క్రమము రెండు క్షణముల కేకకాలమున నుండుట యను సమా హారముచే నేర్పడును. కాని రెండు క్షణము లేకకాలమున నుండవు. కాన వానికి సమాహారము లేదు. వర్తమానకాలమున క్షణమొక్కటియే యుండును. కాని పూర్వోత్తర క్షణము లుండవు గదా! కాన సమాహారము లేదు.

యోగమతమున వర్తమానక్షణ మొక్కటియే యర్థక్రియాకారి యగును గాన, నదియే సకలవ్యవహారములకు నాశ్రయ మగును. చిన్న పెద్దక్రొత్తప్రాత మొదలగు పరిణామముల కాధారములగు పూర్వోత్తర క్షణము లన్నియు, సామాన్యాకారమున క్షణపర్యాయమగు కాలత్వ రూపమున వర్తమానక్షణమునందే యనుగతములై యున్నవి యని వీరంగీకరింతురు.

కాన లోకమంతయు నొకక్షణముననే పరిణామము ననుభవించును. కాన నీపదార్థము లన్నియు నేకైకక్షణ ప్రవృద్ధము లగుచుండును.

ఇట్టి క్షణమునందును, దత్క్రమమునందు, నుభయమునందును సంయమమువలన క్షణతత్క్రమసాక్షాత్కారమును, దానిచే వివేకజ్ఞానము నుద్భవిల్లును.

అవ॥ వివేకఖ్యాతికి కైవల్యమే పరమప్రయోజన మైనను దానికన్న స్థూలమగు నవాంతరప్రయోజనము నిందెఱింగించుచున్నారు.

**సూ॥ జాతిలక్షణదేశైరన్యతానవచ్ఛేదాత్తుల్యయో స్తతః ప్రతిపత్తిః ॥ 53**

జాతిలక్షణదేశైః, అన్యతానవచ్ఛేదాత్, తుల్యయోః, తతః, ప్రతిపత్తిః॥

జాతిలక్షణదేశైః = జాతియు, లక్షణము, దేశము ననువానిచేత, అన్యతానవచ్ఛేదాత్ = భేదనిశ్చయము గలుగకపోగా, తుల్యయోః = సమానములగు పదార్థములకు, ప్రతిపత్తిః = భేదజ్ఞానము, తతః = ఆ వివేకజ్ఞానమువలననే గలుగును.

సామాన్యముగ జాతియు, లక్షణమును, దేశమును వస్తువుల పరస్పరభేదమును బోధించును. అనగా దేశమును లక్షణమును సమానముగ నుండుటచే తుల్యత్వ ముండెనేని యపుడు జాతిభేదము వస్తుభేదమును నిరూపించును. ధేనువునకును బడబ (అడుగుఱ్ఱము) కును దేశలక్షణములచే భేదమేర్పడనిచో ధేనుత్వబడబాత్వ రూప జాతులిది ధేనువనియు, నిది బడబ యనియు భేదమును దెలుపును. కొన్నియెడల జాతియు దేశమును భేదబోధకములు గాని పట్టున, కాలాక్షి యగు గోవు, స్వస్తిమతి యగు గోవు అను రీతిగ నల్లనికన్నులు గలిగియుండుటయు, శిరమున స్వస్తికాకారమగు మచ్చగలిగి యుండుట యను లక్షణము భేదమును తెలుపును. మరికొన్ని యెడల రెండామలకములకు ( ఉసిరిక కాయలకు) జాతియు లక్షణమును

సమానముగా నుండిన అప్పుడు ఇది ముందటిది, ఇది వెనుకటిది యని దేశము వానికి భేదమును బోధించును. ఇటు లొక్కచో జాతియు, నొక్కచో లక్షణమును, మఱియొకచో దేశమును, పదార్థముల భేదమును బోధించును.

కాని యేస్థలమున జాతి లక్షణ దేశముల భేదము లేదో యట్టిచోట వస్తువుల పరస్పరభేదము వివేకజ్ఞానమువలన గలుగును.

ఉదా - తుల్యజాతియు దుల్యలక్షణములు గల రెండామలకములలో నొకటి పూర్వదేశము, నింకొకటి యుత్తరమున నుండె ననుకొందము. యోగి యన్యకార్యవ్యగ్రుడయి యున్నతఱి నాతని జ్ఞానమును బరీక్షింపనెంచి యొకడు ఆ యామలకముల నిటు నటు మార్చె ననుకొందము. అట్టితఱి యా రెండామలకములకును జాతియు లక్షణము దేశమును సయితము తుల్యములుగ నున్నవి గాన, లౌకికులకు వానిభేదము బోధపడదు. కాని యసందిగ్ధమగు తత్త్వజ్ఞానము గల యోగికి వాని భేదమెరుకపడును. ఆ భేద జ్ఞానమునకు వివేకజ్ఞానమే కారణము.

పూర్వామలక ముండిన క్షణముతో గూడిన దేశ ముత్తరామలక ముండిన క్షణముతో గూడిన ప్రదేశమునకన్న భిన్నమైనది - అని యిట్లు దేశభేదమును, దన్మూలమున క్షణభేదమును సాధింపబడగా స్వదేశ స్వలక్షణములచే నా యామలకములును భిన్నము లైనవని తేటపడును. భిన్నదేశక్షణానుభవము వాని పరస్పరభేద జ్ఞానమునకు ముఖ్యహేతువు.

ఈ యామలక దృష్టాంతముచే సమానజాతిలక్షణదేశములు గల్గి పరమ సూక్ష్మములగు పరమాణువుల విషయమునగూడ భేదము యోగీశ్వరునకు గోచరించును. అనగా పూర్వపరమాణుయుక్త దేశసంబంధ క్షణమును సాక్షాత్కరించినచో, నుత్తర పరమాణువునకు పూర్వదేశసంబంధ మనుపపన్నము గాన నుత్తరపరమాణుయుక్త దేశసంబంధిక్షణము వేరుగా నుండును గాన నా పరమాణువులు రెండింటను యోగీశ్వరునకు భేదజ్ఞాన మేర్పడును.

ముక్తాత్మల యందన్నిటియందును జాతిలక్షణ దేశములు తుల్యము లుగా నుండును గాన, నన్యోన్యవిభాజక ధర్మమేదియు లేదు గాన, భేదబోధకమగు విశేషమను నొకపదార్థమును తప్పక యంగీకరింప వలయును. తుల్యన్యాయమున నావిశేషమే పరమాణువులయందు సయితము భేదబోధక మగునని కణాదమతానుయాయులగు తార్కికులు పలుకుదురు. ఇట్లు విశేష పదార్థము నొకదాని నంగీకరించిరి. కావుననే వారికి వైశేషికులని సయితము ప్రసిద్ధి గలిగెను.

కాని వారిమతమున సయితము దేశలక్షణభేదమును, మూర్తివ్యవధి జాతిభేదమును, వస్తువుల పరస్పరభేదమునకు గారణముగ నంగీకరింప బడినది. యోగమతమున కన్న వైశేషికులు మూర్తివ్యవధులను రెండు భేదకములను హెచ్చుగా నంగీకరించిరి. మూర్తి యనగా నవయవసన్నివేశము. వ్యవధి యనగా వ్యవధానము లేక, యెడము.

ఇట్లంగీకరించిరి గాన వారును నిత్యద్రవ్యములయందును జాత్యాదు లుండును గావునను, బద్ధావస్థలోని మూర్త్యాదులే ముక్తుల విషయమున యోగులచే గ్రహింపబడును. కావునను యథార్థముగ విశేషపదార్థము నంగీకరింపబనిలేదు. జాత్యాదిభేదము వలన పదార్థముల పరస్పర భేద మెఱుకపడుట సాధారణము. క్షణభేదముచే భేదమెఱుక పడుట కేవలము యోగులకు మాత్రమే యని యంగీకరించిన నేమియు విరోధము గనుపింపదు. మఱియు నెచట జాత్యాదులు లేవో యచట జనులకు భేదజ్ఞానము గలుగదు. కాననే వార్షగణ్యాచార్యుడు **"మూర్తివ్యవధి జాతి భేదాభావాన్నాస్తి మూలపృథక్త్వమ్"** అనిరి. అనగా మూలప్రకృతియందు మూర్తి, వ్యవధి, జాతిభేదములు లేవు గాన, మూలప్రకృతియందు భేదము తెలియబడదని భావము. ద్వితీయ పాదమున 22వ సూత్రవివరణమున వివేకవంతుని దృష్టిలో నీ ప్రకృతి నశించినట్లు తోచినను పామరజనుల దృష్టిలో నశించని యట్లే యుండును అని చెప్పియుంటిమి. అట్టి నష్టప్రధానమున కును అనష్టప్రధానమునకును, భేదము జాత్యాదులచే దెలియబడక

శాస్త్రీయజ్ఞానముచేత మాత్రమే యెఱుకపడును.

మూర్తివ్యవధి జాతులకన్న భిన్నముగ మూలములగు నిత్య ద్రవ్యముల యందు పృథక్త్వసాధకమగు విశేషపదార్థము లేదు అని వార్షగణ్యాచార్యుని సూత్రమును గొందఱు వ్యాఖ్యానించిరి. కాగా నిత్యద్రవ్యములయందు సయితము మూర్త్యాదులు గలవు. వానివలననే వాని పరస్పరభేదము సాధింపబడుచుండఁగా మూర్త్యాదుల కన్న వేఱుగ నెవ్వరంగీకరింపని విశేషపదార్థము నంగీకరింప బనిలేదని వారి యభిప్రాయము.

కాగా, నేయే విషయములయందు లౌకిక హేతువులచే భేదమెఱుక పడదో, యాయా విషయములయందు వివేకజ్ఞానముచే మాత్రము భేదము తెలియునని భావము.

అవ॥ ఇంక వివేకజ్ఞానమునకు లక్షణమును నుడువుచున్నారు.

**సూ॥ తారకం సర్వవిషయం సర్వథావిషయ-**
**మక్రమం చేతి వివేకజం జ్ఞానమ్॥ 54**

తారకం, సర్వవిషయం, సర్వథావిషయం, అక్రమం, చ, ఇతి, వివేకజం, జ్ఞానమ్॥

తారకం = సంసారమునుండి తరింపజేయునట్టియు, సర్వవిషయం= పదార్థసామాన్యమును విషయీకరించునట్టియు, సర్వథావిషయం = అన్నివిధముల నన్నిటిని విషయీకరించునట్టియు, అక్రమం చ = క్రమము నపేక్షింపకయే తటాలున నొకేతూరి గలుగు నదియు, ఇతి = అను లక్షణము గలది, వివేకజం = ప్రకృతిపురుష వివేకజన్యమగు, జ్ఞానమ్ = జ్ఞానము.

వివేకజన్యజ్ఞానము సంసారసాగరమునుండి తరింపజేయునది గాన తారక మనబడుచు, నుపదేశాపేక్ష లేకయే స్వప్రతిభోత్థిత మగును. మఱియు నతీతానాగత వర్తమాన సూక్ష్మ స్థూల వ్యవహిత విప్రకృష్ట పదార్థముల నన్నిటిని విలంబము లేక యేకక్షణముననే వివరముగ గ్రహించును.

ఈ వివేక జన్యజ్ఞానమే పరిపూర్ణజ్ఞాన మనబడును. యోగ ప్రదీప మనబడు సంప్రజ్ఞాతయోగము దీనిలోని యొకభాగము మాత్రమే. (3-51) సూత్రమున దెలిపిన ఋతంభరప్రజ్ఞుడను ద్వితీయయోగికి గలుగు మధుమతీ నామక భూమికను ఋతంభర ప్రజ్ఞ మొదలుకొని యేడు విధములగు ప్రాంతభూమిప్రజ్ఞయు సంప్రజ్ఞాత (2-27)సమాధి సమాప్తి పర్యంతమును యోగప్రదీప మనంబడును. విష్ణుపురాణము నందు:-

**అంధం తమ ఇవాజ్ఞానం దీపవచ్చేంద్రియోద్భవమ్।**
**యథా సూర్యస్తథా జ్ఞానం యద్విప్రకర్షే వివేకజమ్॥**

అని చెప్పబడెను. అనగా - అజ్ఞానము చీకటివంటిది. ఇంద్రియ జన్యజ్ఞానము దీపము వంటిది. వివేకజన్యజ్ఞానము సూర్యునివంటిది అనిభావము.

ఇట్లు వివేకజ్ఞాన ముదయించినచో యోగి కర్తవ్యశూన్యుడై బ్రహ్మ నిష్ఠుడై జీవన్ముక్తు డగును.

అవ॥ ఇట్లు పారంపరికముగ కైవల్యమునకు హేతువులగు సంయమములను దెలిపి యాప్రకరణమును ముగించి కైవల్యమునకు సాక్షాత్సాధనమును దెలపుచున్నారు.

## సూ॥ సత్త్వపురుషయో శ్శుద్ధిసామ్యే కైవల్యమితి ॥ 55

ఇతి పాతంజలే సాంఖ్యప్రవచనే యోగశాస్త్రే విభూతిపాద స్తృతీయః

సత్త్వపురుషయోః, శుద్ధిసామ్యే, కైవల్యం, ఇతి ॥

సత్త్వపురుషయోః = బుద్ధికిని పురుషునకును, శుద్ధిసామ్యే = శుద్ధియొక్క తుల్యత్వము గలిగెనేని, కైవల్యం = కైవల్య మబ్బును.

బుద్ధిసత్త్వమునకు వివేకఖ్యాతి యుదయించుటవలన పురుషునితో సమానమగు నైర్మల్య మొదవును. అట్టి బుద్ధినైర్మల్యము సిద్ధించెనేని

సిద్ధ్యంతరాపేక్ష లేకయే కైవల్యము లభించును.

అనగా- బుద్ధిసత్త్వము, రజస్తమో రూపములగు మలములను బోఁగొట్టుకొని, కేవలవివేకఖ్యాతి మాత్రమున దత్పరమై దగ్ధ క్లేశబీజవంత మగును. అట్టియెడ బుద్ధినైర్మల్యము పురుషుని నైర్మల్యమువలె నుండును.

అవివేకావస్థలో నుపాధికల్పితమై పురుషుని యందున్నటుల గోచ రించుచు యథార్థముగ బుద్ధిధర్మమగు భోగ మాబుద్ధినైర్మల్య కాలమున బురుషుని యందున్నటుల గోచరింపకుండును గాన నదియే పురుషుని శుద్ధి. ఇట్లు పురుషునకును బుద్ధికి నొకేవిధమగు శుద్ధి యొదవుటయే శుద్ధి సామ్యము. ఇట్టి స్థితి యేర్పడేనేని ఈశ్వరునకుగాని, మునీశ్వరునకు గాని, వివేకజజ్ఞానవంతునకు గాని, యట్టి జ్ఞాన ముత్పన్నము గానివానికిఁగాని కైవల్యము లభించును.

అనగా పూర్వోక్త సంయమముల మూలమున నైశ్వర్యములను గడించినను గడింపకున్నను, వివేకజ్ఞాన ముండినను లేకున్నను, శుద్ధి సామ్య ముండినంతనే కైవల్య మబ్బును. కాన నైశ్వర్యములతో బనిలేదు.

వివేకజ్ఞానరూపమగు నగ్నిచే నవిద్యాది క్లేశబీజములు దగ్ధములు గాగా జ్ఞానానంతరము కైవల్యవిషయమున బనిలేదు. కాని యీ పాదమున ననేకైశ్వర్యములును, అలౌకికజ్ఞానరూప సిద్ధులును, దెలుపుట కేవల మంతః కరణశుద్ధి, విశ్వాసోత్పాదన మూలమున కైవల్యమున నుపయోగించు ననియే గాని యైశ్వర్యాదులు కైవల్యసాధనము లనిగాదు.

జ్ఞానమువలన నజ్ఞానము తొలగును. అజ్ఞానము నశించిన రాగాది క్లేశజాతము లడంగును. క్లేశములు లేకున్న కర్మలును విపాకములును నశించును. ఇట్టి స్థితిలో సమాప్తాధికారములగు గుణములు దృశ్యములుగను, భోగ్యములుగను పరిణతములై పురుషునిఁ జేరవు.

కాగా జ్ఞానప్రాదుర్భావము వలన నవిద్య నశించి గుణముల యధికారము సమాప్త మగుటయే పురుషునకు గైవల్యము. ఇట్టి కైవల్య స్థితిలో

పురుషుడు స్వరూపమాత్రజ్యోతియై యమలుడై కేవలుడై యుండును. కాగా ప్రకృతిపురుషులకు శుద్ధిసామ్యమే కైవల్యమునకు ముఖ్యకారణముగాని యితరములు గావు.

సంగ్రహ శ్లోకము :-

**అత్రాంతరంగాణ్యంగాని పరిణామాః ప్రపంచితాః ।**

**కజమ్॥**

అనగా నీ విభూతిపాదమున యోగమున కంతరంగములగు నంగములును, చిత్తపరిణామములును, సంయమవిశేషముల వలన గలుగు సిద్ధివిశేషములును వానిలో వివేకజన్యజ్ఞానమును నిరూపింపబడెను అని భావము.

ఇట్లు పతంజలిమహర్షి ప్రణీతమగు, సాంఖ్యప్రవచనరూప

యోగ శాస్త్రమునందలి విభూతిపాద మను మూడవపాదము ముగిసినది.

ఇట్లు తిరుమలై కండ్యూరు తిరువేంగడాచార్యవిరచితమగు

పాతంజలయోగదర్శన 'భాష్యార్థప్రకాశిక' యను నాంధ్రవివరణమున

మూడవది యగు విభూతిపాదము ముగిసెను.

శ్రీ హయగ్రీవాయనమః

# పాతంజల యోగదర్శనము

## ౪ కైవల్యపాదము

అవ॥ ప్రథమపాదమున యోగము, ద్వితీయపాదమున యోగ సాధనములును, తృతీయపాదమున విభూతులును బ్రధానముగా నిరూపించి ప్రసంగవశమున నితరవిషయములను గూడ బ్రతిపాదించిరి గాన నిక సమాధి జన్య కైవల్యమును నిరూపించుట యుక్తమై యున్నను కైవల్యమునకు యోగ్య మగు చిత్తమును, పరలోకమును క్షణికవిజ్ఞానాతిరిక్తమై స్థిరమగు నాత్మను, ప్రసంఖ్యాన పరాకాష్ఠను, వివరింపక యెఱుక పరుప శక్యము గాదు గాన నీవిషయము లన్నియు నీ పాదమున నిరూపించవలసినదే.

అందు దొలుత నైదు విధములగు సిద్ధచిత్తములయందు గైవల్య యోగ్యమగు చిత్తమును నిరూపింప దలచి తొలుదొలుత పంచవిధములగు సిద్ధులను నిరూపించుచున్నారు.

### సూ॥ జన్మౌషధిమంత్రతపస్సమాధిజాస్సిద్ధయః ॥ 1

జన్మౌషధిమంత్రతపస్సమాధిజాః, సిద్ధయః ॥

జన్మౌషధిమంత్రతపస్సమాధిజాః = జన్మమువలనను, ఓషధుల వలనను, మంత్రము వలనను, తపమువలనను, సమాధివలనను గలిగిన, సిద్ధయః = ఐదువిధములగు సిద్ధులు గలవు.

జన్మనిమిత్తక సిద్ధులనియు, నోషధినిమిత్తక సిద్ధులనియు, మంత్ర నిమిత్తక సిద్ధులనియు, తపోనిమిత్తక సిద్ధులనియు, సమాధి నిమిత్తక సిద్ధు లనియు - సిద్ధు లైదు విధములు. కొన్ని సిద్ధులు జన్మమాత్రమున సిద్ధిం చును. పక్ష్యాదుల కాకాశగమనాదులు జన్మమాత్ర సిద్ధములు. కపిలాదులకు జన్మించిన యంతనే జ్ఞానాదులు సిద్ధించెను. కావున నవియు జన్మజ సిద్ధులు. జన్మజసిద్ధిని దేహాంతరితసిద్ధి యని భాష్యకారు లనిరి. కావున నిహలోకము

లోని కర్మమూలమున దేవాది దేహాంతరమున గలుగు సిద్ధి జన్మజసిద్ధి యగును. అనగా మనుష్యుడుగా నున్నప్పుడు చేసిన పుణ్యవశము వలన నాదేహముతో సిద్ధి గలుగక పోయినను దేవాదిశరీరము లభించినంతటనే యణిమాదిసిద్ధులు గలుగునేని యవి జన్మజసిద్ధులని వారి భావము.

ఓషధిజన్యములగు సిద్ధులు పాదరసము, లోహగుగ్గులు లోనగు రసాయనద్రవ్యములను సేవించుటచే నజరామరత్వము గలుగును. ఏదేని యొక కారణమున నసురభవనమును బొందిన మనుజు డచటనుండు రసాయనభూతములగు నోషధిద్రవ్యముల నుపయోగించుటచే జరామరణ వర్జితు డగునని భాష్యకారులు వివరించిరి. అసుర భవనముల యందనుట ప్రాయికాభిప్రాయమునగాన స్వభవనమున సయితము రసాయనౌషధులను సేవించుటచే జరామరణజయమును గడింపవచ్చును. ఇచటనే రసాయనమును సేవించి జరాదివర్జితుడగు మాండవ్యమహర్షి యుదాహరణము.

మంత్రజసిద్ధులనగా - మంత్రజప జన్యములగు నాకాశగమనాణిమాది సిద్ధులు. అట్టి సిద్ధి గలవారు నారదాదులు. తపోజన్యసిద్ధియనగా- సంకల్పసిద్ధి, సంకల్పసిద్ధుఁడు కామరూపము గలిగిన యెచటికి దా బో దలంచిన నచటికి బోవజాలియుండును. ఇది విశ్వామిత్రాదులకు ఉండెను.

విభూతిపాదమున వివరించిన సిద్ధు లన్నియు సమాధిజన్య సిద్ధులు. ఇట్లు సిద్ధులు పంచవిధములు గాన నీ సిద్ధులను గడించిన సిద్ధులు సయితమ్మైదు తెఱంగుల నుందురని యెఱుగ వలయును.

అవ॥ ఓషధ్యాదిసాధనజన్యములగు నాల్గు సిద్ధులయందును పూర్వజాతీయ దేహేంద్రియములు మాఱి, యలౌకిక దేహేంద్రియము లాసిద్ధపురుషులకు గలుగునని యొప్పి తీఱవలయును. అట్లు నూతన దేహేంద్రియము లేర్పడుటలో కారణమేమి? యను శంకకు సమాధానము దెలుపుచున్నారు.

**సూ॥ జాత్యంతరపరిణామః ప్రకృత్యాపూరాత్॥ 2**

జాత్యంతరపరిణామః, ప్రకృత్యాపూరాత్ ॥.

ఈ సూత్రములోనికి భాష్యకారుడు ''తత్ర, కాయేంద్రియాణాం, అన్యజాతీయ పరిణతానాం,'' అను మూడు పదముల నధ్యాహరించెను. తత్ర = ఆ సిద్ధులలో, అన్యజాతీయ పరిణతానాం =మనుష్యాదన్య జాతిరూపమున బరిణమించిన, కాయేంద్రియాణాం = దేహేంద్రియములయొక్క, జాత్యంతర పరిణామః= పూర్వభిన్న దేవాదిజాతి రూపమున బరిణమించుట, ప్రకృత్యాపూరాత్ - ప్రకృతి = దేహమునకు బ్రకృతియగు భూతములయొక్కయు, నింద్రియములకు బ్రకృతియగు నస్మితయొక్కయు, ఆపూరాత్ = అవయవాను ప్రవేశమువలన గలుగును.

ఓషధిమన్త్ర తపస్సమాధులను సాధనముల ననుష్ఠించుటచే బూర్వము మనుష్యాది జాతిరూపమున బరిణమించి యున్న దేహేంద్రియములు, తమ యునికిని మాని నూతనమగు దేవాదిజాతి రూపమున పరిణామమును జెందిన దేహేంద్రియము లగుట ప్రకృత్యాపూరమువలననే.

శరీరకారణభూతములగు పంచభూతములను, ఇంద్రియములకు గారణమగు నహంకారమును, నూతన స్వచ్ఛస్వావయవ ప్రవేశముద్వారా తమ తమ వికారములను గ్రహించుటయే ప్రకృత్యాపూరణ మనబడును. ఇట్టి ప్రకృత్యాపూరణము సయిత మందఱకును గలుగవలసి యున్నను బూర్వోక్తౌషధి మంత్రాది జన్యధర్మరూప నిమిత్త సాపేక్షమైన ప్రకృత్యను గ్రహమే జాతిపరిణామము నొనర్పజాలును గాన సాధారణులకు జాతి పరిణతి గలుగదు.

మఱియు మహిమాది సిద్ధిరూప పరిణామము గలుగుచో ప్రకృతి యొక్క నూతనావయవప్రవేశము గలుగుననియు, నణిమాది పరిణామ మేర్పడుచో నచట ప్రకృత్యవయవము లవగతము లగుననియు నెఱుంగ వలయును. ఈ విధముననే వామనమూర్తిశరీర మొక్కత్రుటిలో త్రిభువన వ్యాపిత్వరూప పరిణామము నొందుటయు, శ్రీకృష్ణుని శరీరపు విశ్వ రూపత్వ పరిణామమును, బాలశరీరమునకే కౌమార యౌవనాది రూపమున

బరిణామమును, ఒక మఱ్ఱివిత్తు మహావృక్షాది రూపమున బరిణమించుటయు నిట్టివన్నియు ప్రకృత్యాపూరణమువలన నేర్పడెనని తెలియవలెను.

అవ॥ ఈ ప్రకృత్యాపూరము ప్రకృతికి స్వాభావికధర్మమా? ధర్మాది నిమిత్తసాపేక్షముగాన నైమిత్తికమా? యను శంకను దొలగించుచున్నారు.

## సూ॥ నిమిత్తమప్రయోజకం ప్రకృతీనాం వరణభేదస్తు తతః క్షేత్రికవత్ ॥ 3

నిమిత్తం, అప్రయోజకం, ప్రకృతీనాం, వరణభేదః, తు, తతః, క్షేత్రికవత్॥

నిమిత్తం = మంత్రాదిజన్య ధర్మాది నిమిత్తము, ప్రకృతీనాం = ప్రకృతులకు, అప్రయోజకం = ప్రయోజనము లేనిది, తు = అయితే, తతః = ఆ ధర్మాది నిమిత్తమువలన, క్షేత్రికవత్ = రైతుచేనువలె, వరణభేదః = ప్రతిబంధకపు నివృత్తి మాత్రము గలుగును.

ఓషధిమంత్రాదులవలన గలిగిన ధర్మాదినిమిత్తము ప్రకృతులకు బ్రయోజనకారి గాదు. లోకమున సహజముగా కారణము కార్యమునకు బ్రయోజకమగును గాని, కార్యము కారణమునకు బ్రయోజకము గాదు. ఇచట ధర్మాదికము ప్రకృతికి కార్యము గాన కారణమగు ప్రకృతికి బ్రయోజకము గాదు. కాగా క్షేత్రికుడు (రైతు) నీరు నిండియున్న యొక మడినుండి సమమైగాని, లోతైగాని యున్న యింకొక మడికి నీరును పాఱింపదలచి యానీరునకున్న యడ్డుకట్టను దొలగించునే గాని ఆనీటిని చేతితో లాగికొని రాడు. అయినను ప్రతిబంధము భగ్నమైనంతనే జలములు తమంతటనే యన్యకేదారమును దడుపుచందమున, ధర్మము సయితము ప్రకృతులకు ప్రతిబంధకమగు నధర్మమును భంజించును, ఆప్రతిబంధకము భగ్నమయినతోడనే ప్రకృతులు తమతమ వికారముల (కార్యముల)పై యవయవానుప్రవేశ మూలమున తమ యనుగ్రహమును

జూపును. ఇంతియే గాని ధర్మాదిక మేదియు ప్రకృత్యాపూరణమున బ్రయోజకము గాదు.

కాగా నాపూర మనునది ప్రకృతుల స్వభావమే గాన ధర్మాదికము ప్రతిబంధక నివర్తనమూలము నందు నిమిత్త మగుచుండును. క్షేత్రికవత్తను దృష్టాంతముచే నిట్లు సయితము చెప్పవచ్చును.

కృషీవలుడు వరిమడి లోని వరిపైరు మొదళ్లకు జలద్రవమును గాని భూమిసంబంధమగు సారమును గాని యెక్కించుటకు సమర్థుడు గాడు. కాని పైరుమొక్కల చుట్టునున్న పిల్లిపెసర, యడవిగోధుమ, చామమొదలగు కలుపుమొక్కలను పెఱికివైచి జలభూసార గ్రహణములు పైరున బ్రవేశించు టకు గల ప్రతిబంధకమును మాత్రము దొలగింపగలడు. ఇట్లు కలుపు మొక్కలు తీసివేసినంతటనే జలభూసారములు తమంత దాముగనే పైరు మొక్కల మొదళ్ళకు జేరును. ఇట్లే ధర్మము సయితము ప్రకృతికి బ్రతిబంధక మగు నధర్మమును నివర్తింప జేయుటలో మాత్ర ముపయోగ పడును. శుద్ధ్యశుద్ధుల కత్యంత నిరోధము గలదు. కాన ధర్మ మధర్మమును నివారిం చును. ప్రతిబంధకము తొలగినంతనే ప్రకృతి స్వయముగనే తన యవయవము లపై ననుగ్రహమును జూపును. కాని యిందు ధర్మమునకు హేతుత్వము లేదు.

ఇట్లేకజన్మముననే జాతిపరిణామము నొందినందులకు నందీశ్వరాదు లుదాహరణము. నంది యను మనుష్యుడొక జన్మముననే దేవజాతి నొంది నందీశ్వరు డనబడెను.

తుల్యన్యాయమున ధర్మము ప్రకృత్యాపూరమున నిమిత్తమైన, విధమున నధర్మముగూడ నిమిత్త మగును. కాని యెచట నికృష్టయోని నుండి యుత్తమయోనిరూప శుద్ధపరిణామము గలుగునో యచట ధర్మ మధర్మ నివారణ ద్వారమున నిమిత్త మయ్యెననియు, నెచట ఉత్తమయోనినుండి నికృష్టయోనిరూపమగు నశుద్ధపరిణామము గలుగునో యచట నధర్మము ధర్మమును నిరాకరించుట మూలమున నిమిత్త మయ్యెననియు దెలియ

వలయును. మఱియు సత్త్వగుణ బహుళమగు శరీరేంద్రియముల పరిణామములో ధర్మము నిమిత్త మనియు రజస్తమోగుణ బహుళమగు దేహేంద్రియముల పరిణామములో నధర్మము నిమిత్త మనియు నెఱుంగునది. ఇందు శుద్ధపరిణామమునకు నహుషాజగర ముదాహరణము. నహుషుడు దేవేంద్రుడయ్యు నధర్మ వశమున నజగర మయ్యెను.

అవ॥ యోగి యనేక శరీరములతో వ్యవహరింపదలచి, యనేక శరీరములను ధరించు సమయమునం దాశరీరములం దన్నిట నొకేచిత్త ముండునా! లేక యొక్కొ శరీరమున నొకొక్క చిత్తముండునా యను శంకకు సమాధానము నెఱింగించుచున్నారు.

## సూ॥ నిర్మాణచిత్తాన్యస్మితామాత్రాత్ ॥ 4

నిర్మాణచిత్తాని, అస్మితామాత్రాత్ ॥

అస్మితామాత్రాత్ = అహంకారరూపమగు నుపాదాన కారణమును మాత్రము గ్రహించి, నిర్మాణచిత్తాని = నిర్మాణ చిత్తములను యోగి సృజించును.

అస్మితామాత్రమను మూలకారణమునుండి యోగిచ్చచే నిప్పునుండి రవ్వలవలె యుగపజ్జాతము లయిన నిర్మాణచిత్తములు యోగిధృతములగు బహుకాయముల యందొక్కటొక్కటిగ జేరును గాన నొక్కొక్క శరీరమున నొక్కొక చిత్త ముండును. కావుననే భిన్న శరీరగత భిన్నచిత్తములచే యోగులకు విరుద్ధ నానాకార్య కారిత్వము సరిపడును.

**ఏకస్తు ప్రభుశక్త్యా వై బహుధా భవతీశ్వరః ।**
**భూత్వా యస్మాత్తు బహుధా భవత్యేకః పునస్తతః ॥**

**తస్మాచ్చ మనసో భేదా జాయంతే చైత ఏవ హి ।**
**ఏకధా తద్ద్విధా చైవ త్రిధా చ బహుధా పునః ॥**

**యోగీశ్వర శ్శరీరాణి కరోతి వికరోతి చ ।**
**ప్రాప్నుయాద్విషయాన్ కైశ్చిత్ కైశ్చిదుగ్రం తపశ్చరేత్ ॥**

సంహరేచ్చ పునస్తాని సూర్యో రశ్మిగణానివ ॥

అని పురాణముల యందెఱింగింపబడెను.

ఒక యోగీశ్వరుడే తన యోగశక్తిచే ననేకదేహములను ధరించును. మఱల సంకల్పించెనేని యొక్కడే యగును. కావుననే యాతని సంకల్ప వశమున జిత్తములు గూడ నొకటిగ, రెండుగను, మూడుగను, బహురూప ములుగను జనించును. ఆ యోగీశ్వరుడు బహుశరీరములను సృష్టించుకొని కొన్నిటితో విషయోపభోగ మొనర్చును. మఱి కొన్నిటితో నుగ్రతప మొనర్చును, కొసకు వాని నన్నింటిని సూర్యుడు దన కిరణముల నుపసంహ రించుకొన్న విధమున నుపసంహరించుకొనును అని దీని భావము.

అవ॥ పైవిధమున ననేకచిత్తము లుండునని యంగీకరించుచో నొక్కొక చిత్తపు టభిప్రాయము వేర్వేరుగా నుండుటచే నేకాభిప్రాయము చొప్పున వ్యవహారము గుదురదు, కాన విలక్షణమగు నొకే చిత్త మన్ని శరీరములయందును గలదని యంగీకరించిన మేలు గదా యను నాశంకకు సమాధానమును దెలుపుచున్నారు.

## సూ॥ ప్రవృత్తిభేదే ప్రయోజకం చిత్తమేక మనేకేషామ్ ॥ 5

ప్రవృత్తిభేదే, ప్రయోజకం, చిత్తం, ఏకం, అనేకేషామ్.

అనేకేషాం = అనేకములగు చిత్తములయొక్క, ప్రవృత్తి భేదే = భిన్నభిన్న ప్రవృత్తులయందు, ఏకం = ఒకటియగును, చిత్తం = చిత్తమే, ప్రయోజకం = ప్రవర్తకమగును.

బహుచిత్తములకు నేకచిత్తాభిప్రాయానుగుణముగ బ్రవర్తించుట యుక్తము గాదు, గాన యోగి తన పూర్వచిత్తమునే నిర్మితచిత్తముల కన్నిటికిని నియామకముగా నేర్పఱచును. కాగా మన శరీరమునందు చిత్తము చక్షుఃపాదాదులయందు బ్రసరించి వానిని వానికార్యములయందు బ్రవర్తింప జేయు విధమున, యోగి ముఖ్యచిత్తము సయితము నిర్మాణ చిత్తముల

యందన్నింటియందు బ్రసరించుచు వానిని బ్రవర్తింప జేయుచుండును. కాన ముఖ్యచిత్తాధిష్ఠితములగు భిన్ననిర్మాణ చిత్తములకు బ్రవృత్తిభేదము గలుగుట వింతగాదు. కావున నానాచిత్తముల నంగీకరించుట యుచితమే. దీనికి బ్రమాణము పూర్వసూత్ర వివరణమున దెలుపబడెను.

అవ॥ ఇట్లు బ్రాసంగిక విషయములను ముగించిపై నిరూపించిన పంచవిధసిద్ధులలో గైవల్యోపయోగియగు సిద్ధిని నిశ్చయించుచున్నారు.

## సూ॥ తత్ర ధ్యానజమనాశయమ్ ॥ 6

తత్ర, ధ్యానజం, అనాశయమ్॥

తత్ర = ఆయ్యైదువిధములగు సిద్ధచిత్తములలో, ధ్యానజం = ధ్యానజన్య సిద్ధచిత్తము, అనాశయం = కర్మక్లేశవాసనారహిత మైనది.

ఈ పాదమున దొలుతటి సూత్రమున జెప్పబడిన య్యైదు విధములగు సిద్ధులచే సంస్కరింపబడిన చిత్తము సయితము పంచప్రకార మగును. ఇందు సమాధిజన్యసిద్ధి గల యోగిచిత్తము ధ్యానచిత్త మనబడును. అట్టి సమాధి జసిద్ధచిత్తముననే కర్మజవాసనలును క్లేశజన్యము లగు వాసనలు నుండవు. కాన నదియే కైవల్యమున కర్హమైనది. ఇతర సిద్ధుల చిత్తములు రాగాది హేతువు లను కర్మక్లేశవాసనావాసితములై పుణ్యపాప సంబంధము గలిగి కైవల్యా నర్హము లగును. యోగిచిత్తము క్షీణక్లేశము గాన వాసనారహితము. ఇతరుల చిత్తముల కన్నచో కర్మాశయము గలదు.

అవ॥ యోగికి పుణ్యపాపాది సంబంధము లేకుండుటకును, ఇతరులకు తత్సంబంధ ముండుటకును గారణము నెఱింగించుచున్నారు.

## సూ॥ కర్మాశుక్లకృష్ణం యోగినస్త్రివిధమితరేషామ్॥ 7

కర్మ, అశుక్లకృష్ణం, యోగినః, త్రివిధం, ఇతరేషామ్॥

యోగినః = యోగియొక్క, కర్మ = పుణ్యపాపరూప కర్మము, అశుక్లకృష్ణం=

అశుక్లమును అకృష్ణమును అగును. ఇతరేషామ్ = యోగికంటె భిన్నులయొక్క, కర్మ= కర్మము, త్రివిధం = శుక్లము, కృష్ణము, శుక్లకృష్ణము నని మూడు విధము లుగ నుండును.

కర్మలు కృష్ణమనియు, శుక్లకృష్ణములనియు, శుక్లములనియు అశుక్లకృష్ణము లనియు నాల్గు విధములుగ నుండును, ఇందు తమోమూలకమై దుఃఖఫలప్రదమగు బ్రహ్మహత్యాదికర్మ కృష్ణ కర్మ యనబడును. ఈ కృష్ణకర్మ దురాత్ములకు సంభవించును. మఱియు రజోమూలకమై దుఃఖ మిశ్రిత సుఖము నిచ్చునవియై వ్రీహి యవ ఘృత పశు వనితాది బాహ్య సాధనములచే సాధింపదగిన యజ్ఞాది కర్మలు పశువధాదులవలన పరపీడా మూలమున పాపజనకములును, బ్రాహ్మణోద్దేశ్యక దక్షిణాదులచే పరాను గ్రహముచే పుణ్య జనకములు నగును. కాన శుక్లకృష్ణకర్మలు, మఱియు సత్త్వమూలకములై సుఖమాత్రప్రదములై మనోమాత్రసాధ్యములగు తపస్స్వాధ్యాయ ధ్యానాది కర్మలు పరపీడా కర్మలు గావు గావునను, పుణ్యమాత్ర జనకములు గావునను శుక్లకర్మలనియు చెప్పబడును. గుణమూలకమునుగాక సుఖదుఃఖరూప ఫలరహితమైన సంప్రజ్ఞాత సమాధ్యాదికర్మలు పాప జనకములును బుణ్య జనకములును గావు గావున నశుక్లాకృష్ణ కర్మలనబడును.

కాగా క్షీణక్లేశులై చరమదేహవంతులును, ఫలేచ్ఛారహితులు నగు యోగుల కర్మలు శుక్లములును, కృష్ణములును గావు గాన నశుక్లాకృష్ణములు. ఫలసంన్యాసము చేయుదురు గాన శుక్లము గాకయు, నుపాదానకారమగు పాపమునుజేయరు గాన కృష్ణము గాకయు నుండు యోగికర్మ యశుక్లా కృష్ణము. ఈ యశుక్లాకృష్ణకర్మ దప్ప తక్కిన తొలుతటి మువ్విధములగు కర్మలు మాత్రమే యితర ప్రాణులకు సంభవించును.

కాగా యోగిచిత్తమే కైవల్యమునకు యోగ్యమైనది గాని ఇతరుల చిత్తము లట్టివి గావు.

అవ॥ ఆ కర్మకు ఫలము నెఱుకపఱచుచున్నారు.

## సూ॥ తతస్తద్విపాకానుగుణానా మేవాభివ్యక్తిర్వాసనానామ్॥ 8

తతః, తద్విపాకానుగుణానాం, ఏవ, అభివ్యక్తిః, వాసనానామ్॥

తతః = ఆమూడువిధములగు కర్మలచే, తద్విపాకానుగుణానాం ఏవ = తద్విపాక = ఆ కర్మఫలములకు, అనుగుణానాం ఏవ = తగినట్టియే, వాసనానాం = వాసనలకు, అభివ్యక్తిః = ప్రకాశభావము గలుగును.

పాపము, పాపపుణ్యము, పుణ్యమును పూర్వోక్త త్రివిధ కర్మలచే దివ్యనారకాది జన్మములును ఫలములు గలుగును. అట్టి ఫలముల కనుగుణము గనే యాయా కర్మములచే నా యా వాసన లభివ్యంజితము లగును. దేవయోని యందు బుట్టింపజాలు కర్మము ఫలోన్ముఖ మయ్యేనేని యది నరక తిర్మగ్జన్మనుష్య భోగవాసనలకు నిమిత్తము గాదు. మఱి యది దేవభోగోప యోగియైన వాసనలను మాత్రమే వ్యంజింప జేయును. ఇట్లంగీకరింపమేని మనుష్యజన్మాంతర ముష్ట్ర జన్మము గలుగుచో నందు పూర్వమనుష్యవాసనలే యుద్బుద్ధము లయ్యెనని యెంచితిమేని యా యొంటెకు కంటకములను దినుటలో బ్రవృత్తి గలుగక పోవలసివచ్చును. కాననే యుష్ట్రయోనిప్రాపకమగు ఫలోన్ముఖకర్మ ముష్ట్రయోని భోగమున కుపయుక్తమగు వాసనలను మాత్ర మభివ్యంజిత మొనర్చునని తప్పక యంగీకరింపవలయును.

కాగా ఫలోన్ముఖమగు నేకర్మ యేజన్మమును గలిగించునో, యా జాతి సంబంధమగు వాసనలనే యది యభివ్యంజింపజేయును. ఇట్లే నరక తిర్యగ్జన్మనుష్యుల విషయమునకు విచారింపవలయును. ఇవి స్మృతి మాత్ర ఫలకములగు వాసనల, జాత్యాయుర్భోగ ఫలకములగు వాసనల గూర్చి 2-13 సూత్ర వివరణము విస్తారముగా గననగును

అవ॥ శునకమార్జారాదిజన్మలు మనుష్యజన్మముచే వ్యవహితము లయ్యెనేని మనుష్యునకు రాబోవు శునకాది జన్మముల యందును అవ్యవహిత పూర్వవర్తియగు మనుష్యజన్మవాసనలే యుద్బుద్ధములు గావలయును గాని, వ్యవహితములగు శునకాదిజన్మవాసన లుద్బుద్ధము లగుట యసంభవము.

సామాన్యముగ మనకు నిన్నటి విషయము తటాలున జ్ఞప్తికి వచ్చును గాని బహుదినవ్యవహితమగు విషయము స్మరణకు రాదు గదా యను శంకకు సమాధానము నిచ్చుచున్నారు.

## సూ॥ జాతిదేశకాలవ్యవహితానామప్యానన్తర్యం స్మృతిసంస్కారయో రేకరూపత్వాత్॥ 9

జాతిదేశకాలవ్యవహితానాం, అపి, ఆనన్తర్యం, స్మృతి సంస్కారయోః, ఏకరూపత్వాత్॥

జాతిదేశకాలవ్యవహితానాం అపి = జాతిచేతను దేశముచేతను కాలముచేతను వ్యవహితము లైనను, వాసనానాం = (పూర్వ సూత్రమునుండి యనువృత్తము) వాసనలకు, స్మృతిసంస్కారయోః = స్మృతికిని సంస్కారమునకును, ఏకరూపత్వాత్= సమానరూపము గలిగియుండట వలన, ఆనన్తర్యం = వ్యవధానము లేకుండుట (సంగత మగును)

మార్జాల జన్మమును గలిగింపవలసిన కర్మము ఫల దానోన్ముఖ మయ్యేనేని మార్జాలజన్మసంస్కారము లవ్యవహితపూర్వ భావులై యుండ వలయునను నియమము లేదు. ఆ కర్మాశయము జన్మశతములచే వ్యవధాన మున్నను, యోజనశతవ్యవధాన మున్నను, కల్పశతవ్యవధాన మున్నను స్వవ్యంజికాభివ్యంజిత పూర్వానుభూత మార్జాలవిపాకక్రియారూపము లగు వాసనలను గ్రహించి వెన్వెంటనే యభివ్యక్త మగును. అనగా మార్జాల జన్మవాసనలు గలిగి యనేక జన్మలు గడచియున్నను మార్జాలజన్మ ప్రాపకకర్మ యా వాసనల నభివ్యంజింప జేయుచునే మార్జాలజన్మమును గలిగించును. మార్జాలజన్మవాసనలు వ్యవహితములే యైనను ఒకేవిధమగు కర్మ లావాసనల కును, మార్జాల జన్మమునకును కారణము లగును గాన ఫలతః కారణ ద్వారమున వాని కానంతర్యము సరిపడును. మఱియు ననుభవ ముండు తీఱునసే సంస్కారమును, (వాసన) సంస్కారముండు తీఱునసే స్మృతి యును గలుగుట యనుభవసిద్ధముగాన స్మృతియు సంస్కారము

నొకేరూపమున నుండును గానను, అనుభవానుసారముగా గలుగు సంస్కారములు కర్మ వాసనానురూపములుగాను, ఫలోన్ముఖీకర్మవాసనాను సారముగనే స్మృతియు గలుగును.

కాన జాతిదేశకాలాది వ్యవహితములగు సంస్కారముల నుండియు తద్రూపమగు స్మృతియు, నాస్మృతివలన మఱల సంస్కారములును, గలుగుచుండుట వలన నీస్మృతిసంస్కారములు కర్మాశయవిపాక రూపమగు వృత్తిలాభరూప నిమిత్తమువలన వ్యంజితము లగును.

అనగా నొకప్రాణి, మనుష్యజన్మము తరువాత మార్జాల జన్మము నెత్తినచో నవ్యవహిత పూర్వవృత్తియగు మనుష్యవాసనలే యభివ్యక్తములు గావలసియున్నను, మనుష్యవాసనాభివ్యంజకములగు కర్మలు అచట లేనందున నవి యభివ్యక్తములు గావు. మార్జాల వాసనాభివ్యంజకకర్మము లున్నందున వ్యవహితము లైనవైనను మార్జాలవాసనలే యభివ్యక్తము లగును.

కాగా వ్యవహితములగు వాసనలకును నిమిత్తనైమిత్తిక భావ ముండుటచే నానంతర్యము సరిపడును.

అవ॥ పూర్వపూర్వతర జన్మము లుండినచో పూర్వపూర్వతర జన్మాభిసంస్కృతములగు వాసనలభివ్యక్తము లగుననుట పొసగును. పద్మాది సంకోచవికాసముల తీఱున జాతమాత్రునకు గలుగు హర్షశోకములు స్వాభావికములని యంగీకరింతుమేని పూర్వజన్మ మప్రమాణము గదా! యను లోకాయతికుని కుతర్కమునకు సమాధానము నుడువుచున్నారు.

## సూ॥ తాసామనాదిత్వం చాశిషో నిత్యత్వాత్॥ 10

తాసాం, అనాదిత్వం, చ, ఆశిషః, నిత్యత్వాత్॥

ఆశిషః = ఆశీర్వాదమునకు, నిత్యత్వాత్ = నిత్యత్వమువలన, తాసాం చ = ఆ వాసనలకును, అనాదిత్వం = నిత్యత్వము.

సకలప్రాణులకును 'నా యొక్క యభావము గలుగకుండు గాక, నే

నెల్లపుడు నుందును గాక' యను కోరిక యుదయించి యుండును గాన వాసనలును నిత్యములే. శిశువు జనియించినంతనే మరణదుఃఖము ననుభవింపక యున్నను, ద్వేషానుషక్త మగుదుఃఖమును దలచుకొనుట కారణముగా మరణభయము గలుగుట మనము గమనించుచున్నాము. పూర్వమున నాప్రాణికి మరణదుఃఖ మనుభూతము గాదేని మరణ విషయమున నట్టి ద్వేషభీతులు గలుగ గారణమే మున్నది? (చూ. సూ.2-9) అది స్వభావసిద్ధమగు భయమని యందుమేని యది యెల్లపుడు నుండ వలయును. ఖడ్గాదిదర్శన నిమిత్తమువలన మాత్రము గలుగునదిగా నుండ రాదు. కాగా వారొసగిన కమలదృష్టాంతమును సరియైనది గాదు. కమలసంకోచ వికాసములు సయితము సూర్యకిరణాస్పర్శాస్పర్శ రూపనిమిత్త జన్యము గాన స్వాభావికములు గావు.

జీవుని చిత్తమనాద్యనేక జన్మవాసనలచే వాసితమై యున్నను ఫలోన్ముఖ మగు కర్మమే నిమిత్తభూతమై తదనుగుణమగు కొన్ని వాసనలను మాత్రమే యభివ్యంజింపజేసి పురుషుని భోగమున కుపయోగించును.

ఇట్లు వివిధవాసనల కాశ్రయమగు చిత్తము మహత్పరిమాణము గలది గాన విభువని మీమాంసకు లందురు. అణుపరిమాణము గలది గాన యణువని నైయాయికు లందురు. ఘటములో నుంచిన దీపము ఘట పరిమాణమున దన కాంతిని సంకోచింప జేసికొని, ప్రాసాదమున నుంచినచో ప్రాసాదమంతటను తన కాంతిని వికసింపజేయు విధమున, సంకోచ వికాసశీల మగు చిత్తము తత్తచ్ఛరీరమాత్రమగు నని కొందఱు సాంఖ్యాచార్యులు నుడువుదురు.

చిత్తము విభువే. దాని వృత్తి మాత్రము సంకోచవికాసములు గలిగి యుండునని యాచార్యుని మతము.

ఈ స్థలమున వ్యాఖ్యాతలు వారి వారి పాండిత్యము కొలదియు సిద్ధాంతవిషయమున భేదభావములు జూపియున్నారు. చిత్తము పరిణామ

శీలమను మతము సాంఖ్యైకదేశమత మనియు, నచట ''అపరే'' యను పదమును ప్రయోగించి యున్నందున నది సిద్ధాంతము గాదనియు చిత్తవృత్తిమాత్రమే సంకోచవికాసములు గలదను గడపటి మతమున ''ఆచార్యాః '' యనుపదము వాడబడినందున నదియే పతంజలిమతమని కొందఱును, స్వయంభువు మతమని మఱి కొందఱును దలచిరి. కాగా నిదియే సిద్ధాంత మనియు చాలమంది యభిప్రాయపడిరి.

కాని చిత్తము విభువనుట సాంఖ్యమతసమ్మతము గాదు. ప్రకృతి పురుషాతిరిక్త మగునవి యన్నియు నీ మతమున పరిచ్ఛిన్నము గావున మనస్సును విభువుగా వారంగీకరింపరు. మఱియు సాంఖ్యదర్శనమునఁ దొలుతటి యధ్యాయమున (సూ-124) **''హేతుమదనిత్యమవ్యాపి సక్రియ మనేకమాశ్రితం లింగం''** అను సూత్రమున కపిల మహర్షి మహత్తత్త్వాది నిఖిలకార్యములును అవ్యాపకములని చెప్పెను. మఱి ''మనస్సు నిత్యేంద్రియము గాన శ్రోత్రమువలె విభువు'' అను ప్రాభాకరుని యను మానము సయితము **''ఏతస్మాత్ప్రజాయన్తే మనస్సర్వేంద్రియాణి చ''** యను శ్రుతిచే నసంగతమని తెలియవలయును.

మనస్సు సర్వేంద్రియము లును పరమాత్మవలన జనించు చున్నవని శ్రుతి తాత్పర్యముండగా, 'నిత్యేంద్రియముగాన'నను హేతువును 'శ్రోత్రేంద్రియమువలె' నను నుదాహరణమును దుష్టములు గావున నా యమమానము వ్యర్థము. కావుననే **''న వ్యాపకత్వం మనసః కరణత్వాదింద్రియత్వాద్వా (5-69). సక్రియత్వాద్గత శ్రుతేః (5-70)''** అని సాంఖ్యదర్శనమున కరణముగావునను, ఇంద్రియముగావునను మనస్సునకు వ్యాపకత్వము లేదు. క్రియావంతము గావునను, దీనికి పరలోకగమనము శ్రుతమగుచున్నది గావునను ఇది విభువు గాదు - అని విభుత్వమును నిరాకరించి **''సనిర్భాగత్వం తద్యోగాద్ఘటవత్ (5-71)** అను సూత్రముచే నేకకాలమున శ్రోత్రాద్యనేకేంద్రియములతో గూడునదిగావున నీ చిత్తము నిరవయవమగు నణువు గాదు. మరి యిది ఘటమువలె సావయవముగ నుండునని యణురూపత్వమును నిరాకరించి

పరిశేషన్యాయమున మధ్యమపరిణామవంతముగ నంగీకరించిరి.

కాగా సంకోచవికాసశీలమగు నీ చిత్తము మధ్యమపరిణామ వంత మగును. కాని చిత్తము తన సంకోచవికాసములందును, శుభా శుభవాసనలను బయలుపరచుటయందును, ధర్మాది నిమిత్తముల నపేక్షించియే యుండును. కాని స్వతంత్రము గాజాలదు. కాన సంకోచ వికాసములు కొన్ని వేళలయందే యుండును గాని యనవరతము నుండవు.

ఆధర్మాదినిమిత్తములును బాహ్యములనియు, నాభ్యంతరము లనియు నిఱుదెఱగుల నుండును. ఇందు శరీరేంద్రియధనాది సాధ్యములగు నమస్కార స్తుతిదానాభిభవాదులు బాహ్యధర్మాదికము లనబడును. చిత్తమాత్ర సాధ్యము లైన శ్రద్ధామైత్రీకరుణాదు లధ్యాత్మిక ధర్మాదికములు.

కావుననే **'యే చైతే మైత్ర్యాదయో ధ్యాయినాం విహారాస్తే బాహ్యసాధన నిరనుగ్రహాత్మానః ప్రకృష్టం ధర్మమభినిర్వర్తయన్తి'** అని పంచశిఖాచార్యు లనిరి. అనగా ధ్యానశీలురకు నీ మైత్ర్యాదులు బాహ్య సాధనాపేక్ష యావంతయు లేని సులభవ్యాపారములై శ్రేష్ఠతమమగు శుక్లధర్మమును గలిగించునని దాని భావము.

ఈబాహ్యాధ్యాత్మిక ధర్మములు రెండింటిలో బాహ్యధర్మమున కన్న నాధ్యాత్మికధర్మమే మిక్కిలి బలమైనది. జ్ఞానవైరాగ్యరూప మానసిక ధర్మముల కన్న బ్రబలమగు బాహ్యధర్మ మెందును గనబడదు. కాన నాధ్యాత్మిక ధర్మమే యుత్తమ మైనది. మానసిక శక్తివిరహితమగు కేవల శరీరకర్మచే దండకారణ్యమును పాడుపరచుటకు గాని, సముద్రము నాపోశన మొనర్చుటకు గాని, యెవడుత్సహించును? నాధ్యాత్మికబలమే యన్నిబలముల కన్నప్రబలము.

అవ॥ వాసనలనాదు లగునేని వానికి నాశము గలుగరాదు. అనాదులును నశించునందుమేని పురుషునకును గూడ వినాశము గలుగవలయును గదా! యను శంకకు సమాధానము నొసంగుచున్నారు.

## సూ॥ హేతుఫలాశ్రయాలంబనైః సంగృహీతత్వా దేషామభావే తదభావః॥ 11

హేతుఫలాశ్రయాలంబనైః, సంగృహీతత్వాత్, ఏషాం, అభావే, తదభావః ॥

హేతుఫలాశ్రయాలంబనైః = హేతువులచేతను, ఫలములచేతను, ఆశ్రయముచేతను, ఆలంబనము (విషయము)లచేతను, సంగృహీతత్వాత్ = (వాసనలు) సంగ్రహింప బడినవి గాన, ఏషాం = ఈ హేత్వాదులకు, అభావే = నాశము గలుగగా, తదభావః = ఆ వాసనలకు నభావము గలుగును.

ధర్మాది హేతువులచేతను, సుఖాది ఫలములచేతను, మనోరూపమగు నాశ్రయముచేతను, శబ్దాదివిషయములచేతను వాసనలు సంగృహీతములై యభివ్యంజితములగును. విదేహముక్తి సమయమున నా హేత్వాదులు విచ్ఛిన్న ములు గాగా వాసనలు గూడ నశించును. అనగా వివేకఖ్యాతిచే వాసనాభివ్యం జకములగు నవిద్యాదులు నశింపగా వాసనలు తమంత దామే యడగిపోవును.

అవిద్య యను దండముచే ద్రిప్పబడుచున్న యారాకులు గల సంసార చక్రము, వాసనలకు హేతువుగా నెఱుగవలయును. ధర్మమువలన సుఖమును, అధర్మమువలన దుఃఖమును, తొలుత గలుగును. ఆ సుఖమువలన సుఖసాధన ములయందు రాగమును, ఆ దుఃఖమువలన దుఃఖసాధనములపై ద్వేషమును, ఆ రాగద్వేషములచే బ్రయత్నము గలుగును. ఆ ప్రయత్నముచే మనో వాక్కాయ కర్మలచే పరుల కుపకారమునేని యపకారము నేని చేయును. దానిచే మఱల ధర్మాధర్మములు, సుఖదుఃఖములు, రాగద్వేషములు నను నారాకులు గల సంసారచక్రము పరిభ్రమించుచుండును. ఈ సంసార చక్రము సయితము స్వయముగా దిరుగజాలదు. కుమ్మరిసారెకు దండప్రేరణ మపేక్షితమగు విధమున నిది అవిద్యచే ద్రిప్పంబడుచుండును. సర్వక్లేశ మూలమగు నది వాసనలకును హేతువు.

మఱియు నే పురుషార్థము నుద్దేశించి ధర్మాదికము లనుష్ఠింప బడెనో, యా ధర్మాదికమే ఉపాసనలకు సయితము ఫలమగును. కర్మవాసన లన్యోన్య

సహకారము గలవి గాన నిది_సరిపడును. సత్కార్యవాదము ననుసరించి ధర్మాదికము సయితము ముత్పన్నము గాదు. కాని వర్తమానావస్థ నొందును. అట్లు వర్తమానావస్థ నొందిన ధర్మాదికము వాసనలకు ఫలముగ నగును. సాధికారమగు మనస్సు వాసనల కాశ్రయ మగును. వివేకఖ్యాతి రహితమై పురుషార్థములు గల మనస్సు సాధికార మనబడును. అట్లుగాక వివేకఖ్యాతి యుదయించి యవస్థితాధికారమైన మనస్సున వాసన లుండజాలవు. వివేకఖ్యాతియుక్త మగు చిత్తము వాసనల కాధారము గాదు. ఎదుటబడినంతనే యే వస్తు వేవాసనను వ్యంజింపజేయునో, యా వస్తు వావాసనకు నాలంబన మగును. అవి కాంతాసంస్కారాదులు.

ఇట్లు సర్వవాసనలును హేతుఫలాశ్రయాలంబనములచే సంగృహీతము లైనవిగాన నివి లేనిచో వాసనలును లేనివగును. కాఁగా ననాదియగు ప్రాగభావము నకు ధ్వంస ముండువిధమున ననాదులగు వాసనలు సయితము విదేహముక్తి సమయమున హేత్వాద్యభివ్యంజకములు బొత్తుగా నశింపగా దామును నశించునుట యుక్తమే.

అవ॥ ఇంతకు ముందు లేనిది గలుగదు. అట్లే యుండునదియు నశింపదు అను యోగసిద్ధాంతము రీతిననాదినిత్యములగు వాసనలకు నివృత్తి యెట్లు పొసగునను శంకను నిరాకరించుచున్నారు.

## సూ॥ అతీతానాగతం స్వరూపతోఽస్త్యధ్వ భేదాద్ధర్మాణామ్॥ 12

అతీతానాగతం, స్వరూపతః, అస్తి, అధ్వభేదాత్, ధర్మాణామ్॥

ధర్మాణామ్ = అతీతానాగత వర్తమానాది ధర్మములకు, అధ్వభేదాత్ = కాలభేదమువలన, అతీతానాగతం = భూతవస్తువును, భవిష్యద్వస్తువును, స్వరూపతః = తనరూపముతో, అస్తి = ఉండితీఱినది.

అతీతానాగత వర్తమానతా రూపధర్మము లొకేకాలమున నుండునన్నచో

విరోధము గలుగునుగాని, మేము చెప్పినటుల ఘటము విద్యమానమై వర్తమానతా రూపధర్మము గలది యగునపుడు, వర్తమానతా రూపధర్మము వర్తమానకాలీనమును, అతీతతా రూపధర్మము అతీతకాలీనము, అనాగతతా రూపధర్మము భవిష్యత్కాలీనమును నగునని యంగీకరించినచో నతీతానాగత వర్తమానతారూప త్రివిధధర్మములకును భిన్నకాలీనత్వము గలుగును గాన పరస్పరవిరోధము గలుగదు.

ఇకముందు ప్రకాశము గాబోవునది యనాగతము. ఇంతకు ముందే యనుభూత మయినది యతీతము. స్వవ్యాపారోపారూఢమై యిక నభివ్యక్త మగుచు నుండునది వర్తమానము. ఇట్లు ముత్త్రివిధములగు నీవస్తువులును యోగిప్రత్యక్షవిషయ మగుననుట యోగసిద్ధాంతము, ఇదంతీతానాగత వస్తువులు స్వరూపముతో నుండవని యంగీకరించినచో విషయము లేక తద్విషయక జ్ఞాన ముదయింపదు గాన యోగికి గలుగవలసిన త్రైకాలికపదార్థ విషయక యోగజప్రత్యక్షమునకు భంగము వాటిల్లును కాన నతీతానాగతము లగు వస్తువులు సయితము స్వరూపముతో నుండి తీఱునని యంగీకరింప వలయును.

మఱియు ననాగతవస్తువు నంగీకరింపమేని స్వర్గాపవర్గములకు సాధనమగు కర్మలవలన గలుగబోవు స్వర్గాపవర్గరూపమగు ఫలము సయితము నిరుపాఖ్యము (అసత్తు) అగును. కాన స్వర్గాద్యుద్దేశముచే నిపుణులగు పురుషు లాచరించు కర్మాదిసాధనము లసంగతములు గావలసివచ్చును. కర్మాది సాధనము లింతకు మున్నతీతావస్థలో నున్న స్వర్గాదిఫలములను వర్తమానము లుగా జేయ సమర్థము లగునే గాని లేనివానిని బుట్టింప సమర్థములు గావు. అసత్తునకు పుట్టుక యోగమతమునసే లేదు.

దండచక్రాదులు నపూర్వమగు ఘటము నుత్పాదింపవు. అవ్యక్తా (సూక్ష్మ) వస్థతో స్వకారణమృత్తిక యందణగియున్న ఘటాది నైమిత్తికమును వర్తమానావస్థలో గలదానినిగా నొనర్చును. కాని వర్తమానావస్థ గల దండ చక్రాదులే కార్యమును సూక్ష్మావస్థలోనుండి వ్యక్తావస్థలోనికిదే సమర్థములై

యుండును గాని యతీతాద్యవస్థ గల నిమిత్తములు నైమిత్తికముల నభివ్యంజింపజాలవు. కాగా నొక్కొక పదార్థము అనేక ధర్మస్వభావమై యుండును. కాలభేదముచే నాపదార్థమునందలి ధర్మములు భిన్న భిన్నములుగ నగును.

వర్తమానవస్తువు అభివ్యక్తివిశేషము నొంది గృహ్యమాణ స్వరూపము తోడ నుండువిధమున నతీతానాగతము లభివ్యక్తములు గావు. అందనాగతము భవిష్యద్వ్యక్తిక స్వరూపమునను, అతీతము అనుభూత వ్యక్తిక స్వరూపము నను నభివ్యక్తమగును గాన వర్తమాన కాలముననే పదార్థస్వరూపము స్పష్టముగా గోచరించును.

కాని యేకావస్థాకాలముననే తక్కిన రెండవస్థలును ధర్మియం దనుప్రవిష్టములై యుండుటవలన మూడవస్థలు నుండినవియే కలుగును గాని లేనివానికి యుత్పత్తి సంభవింపదు.

అనగా ఘటరూపధర్మియందు వర్తమానతా రూపధర్మము గోచరిం చిన సమయముననే యతీత, యనాగతత యను ధర్మిద్వయము గూడ ఘటమునం దనభివ్యక్తమై యుండునవి. అట్లే యనాగతావస్థ ప్రకట మగు పట్టున తక్కిన రెండు ధర్మములును సూక్ష్మరూపమున నందే యణగి యున్నవి. అట్లే యతీతావస్థలో సయితము తక్కినవాని యునికి యెఱుంగు నది.

ఇట్లు కాలభేదముచే ధర్మములకు వ్యవస్థ ప్రతిపాదింపబడినది. కాన నతీతానాగత వస్తువులు సయితము స్వరూపసిద్ధములే గాని యత్యంత శూన్యము గావు.

కాగా పూర్వసూత్రమున బ్రతిపాదించిన వాసనానివృత్తి వాసనల యత్యంతాభావము గాదు. అది కేవలము వాసనల యతీతావస్థ యని యెఱుంగవలయును. కాగా వాసనలకు నివృత్తి యనగా నతీతావస్థ యభివ్యక్త మగుటయే.

అవ॥ ఏకరూపమగు మూలప్రకృతినుండి విచిత్రవివిధ ప్రపంచ మెట్లు గలుగునను శంకకు సమాధానము తెలుపుచున్నారు.

## సూ॥ తే వ్యక్తసూక్ష్మా గుణాత్మానః ॥ 13

తే, వ్యక్తసూక్ష్మా, గుణాత్మానః ॥

వ్యక్తసూక్ష్మాః, వ్యక్త = వర్తమానరూపములును, సూక్ష్మాః = అతీతానాగత రూపములు నగు, తే = ఆ ధర్మము లన్నియు, గుణాత్మానః = త్రిగుణస్వరూపము లైనవి.

మువ్విధములగు ధర్మములలో వర్తమానములు వ్యక్తస్వరూపములును అతీతానాగతములు సూక్ష్మరూపములు నగును. పృథివ్యాది భూతపంచకము పంచతన్మాత్రస్వరూపము, పంచతన్మాత్రలు నేకాదశేంద్రియములను అహంకారస్వరూపము. అహంకారము మహత్తత్త్వరూపము. కొనకు మహత్తత్త్వము ప్రధానస్వరూపము. ఆ ప్రధానము గుణత్రయరూపము. ఇట్లు సాక్షాత్తుగను, పరంపరగను సకల ప్రపంచమును త్రిగుణస్వరూపమై యుండును. కాన నీ ప్రపంచము సత్త్వాదిగుణముల సన్నివేశవిశేషమే గాని వేఱు గాదు.

ఈ విషయమున షష్టిపదార్థప్రతిపాదక సాంఖ్యశాస్త్ర ప్రణేత యగు వార్ష గణ్యాచార్యు లిట్లు చెప్పిరి.

**గుణానాం పరమం రూపం న దృష్టిపథమృచ్ఛతి।**
**యత్తు దృష్టిపథం ప్రాప్తం తన్మాయేవ సుతుచ్ఛకమ్ ॥**

అనగా గుణముల పరమవాస్తవరూపము ప్రధానమే. అది యతీంద్రియము గాన గంటికి గానబడదు. మఱియు ననేక చిత్ర విచిత్రముగ గనబడుచున్న యీ ప్రపంచ మంతయు గారడివలె శూన్యమైనదియ గాని వాస్తవము గాదు. యథార్థముగా నీ ప్రపంచ మంతయు గుణత్రయాత్మకమే. అనాదివిచిత్ర వాసనాసమన్విత విచిత్ర త్రిగుణరూపమగు ప్రపంచమునకు

విచిత్రరూపము గలుగుట సమంజసమే యని భావము.

అవ॥ పదార్థము లన్నియు గుణపరిణామ రూపములు గాన యథార్థమున గుణస్వరూపములే యంటిమేని పరస్పర విరుద్ధములగు త్రిగుణములకు పృథివీజలాద్యేక రూపపరిణామ మెట్లు గలుగును? మఱియు నొక శబ్దమనియు, నొక యింద్రియ మనియు వ్యవహారమెట్లు సంగతమగు నను శంకను నిరాకరించుచున్నారు.

## సూ॥ పరిణామైకత్వాద్వస్తుతత్త్వమ్ ॥ 14

పరిణామైకత్వాత్, వస్తుతత్త్వమ్ ॥

పరిణామైకత్వాత్ = గుణము లనేకములైనను వాని పరిణామ మొకేవిధమున నుండుటవలన, వస్తుతత్త్వమ్ - వస్తు = తన్మాత్ర భూత భౌతికాది వస్తువులకు గూడ, తత్త్వమ్ = అట్టి యేకత్వము (వ్యవహృత మగును).

లవణసముద్రమున ద్రోయబడిన గవాశ్వమహిష మాతంగాదులు పరస్పర విజాతీయములయ్యు నేకజాతీయ లవణరూప పరిణామమును బొందు విధమునను; పరస్పరభిన్నములగు నూనెయు, వత్తియు, నగ్నియు గలసి యొక ప్రదీపరూప పరిణామము నొందు విధమునను త్రిగుణములు విజాతీయము లైనను వానికిని, పంచతన్మాత్ర రూపమునను, భూతరూపము నను, భౌతికరూపమునను, ఏకజాతీయ పరిణామము గలుగుచున్నది.

ప్రఖ్యా క్రియా స్థితి శీలములైన త్రిగుణములకు గ్రహణ రూపమును సత్త్వప్రధానమునగు కరణరూపమున గలిగిన పరిణామమే శ్రోత్రేంద్రియము. జ్ఞానేంద్రియము లన్నిటి పరిణామము నిట్టిదే. ఇట్లే గ్రాహ్యరూపమున తమః ప్రధానమగు పరిణామమే శబ్దాదివిషయ పరిణామము. కర్మాత్మకమగు త్రిగుణములకు రజోగుణప్రధాన పరిణతియే వాగాది కర్మేంద్రియములు, కఠినతా ధర్మప్రధానములగు పంచతన్మాత్రల సూక్ష్మపరిణామమే పృథివీ పరమాణువు. వాని స్థూలపరిణామమే స్థూలపృథివి, గోవు వృక్షము పర్వతము మొదలగు నవియు. స్నేహధర్మ ప్రధానములగు గంధభిన్న తన్మాత్ర

చతుష్టయపు సూక్ష్మపరిణామము సూక్ష్మజలము. వానిస్థూల పరిణామము జలము. ఉష్ణతాధర్మప్రధాన శబ్దస్పర్శరూప తన్మాత్రల సూక్ష్మస్థూల పరిణామములే సూక్ష్మస్థూలాగ్నులు. వహనరూపధర్మ ప్రధానశబ్ద రూపతన్మాత్రలు రెండింటి స్థూలసూక్ష్మ పరిణామములే స్థూల సూక్ష్మ వాయువులు. అవకాశ దానరూపమగు ధర్మముగల శబ్దతన్మాత్రయొక్క స్థూలసూక్ష్మపరిణామములే స్థూలసూక్ష్మాకాశములు. (చూ. 1-44)

కాగా నీవిధమున ననేకముల కేకవిధ పరిణామమును, నొక్కదానికే పలువిధములగు పరిణామములు గలుగుటయు యుక్తమే.

యోగాచారమతము వారగు విజ్ఞానవాదు లిట్లందురు. బాహ్య జడపదార్థమంతయు స్వప్రకాశము గాదు, కాన తాను బ్రకాశించుట కొఱకు విజ్ఞానము నపేక్షించును. కావుననే విజ్ఞానకాలముననే పదార్థములు గోచరించుటయు, విజ్ఞానము లేని కాలమున గోచరింప కుండుటయుం బొసగును. మృత్తిక యుండిననే ఘటముండుచు, మృత్తిక లేని కాలమున ఘటము లేందున మృత్తికాతిరిక్త ఘటరూప పదార్థము లేదని యంగీకరించు తీఱున, విజ్ఞానకాలముననే గోచరించి తదతిరిక్త సమయమున గోచరింపని పదార్థములు విజ్ఞానభిన్నములు గావు. కాన విజ్ఞానాతిరిక్త బాహ్యతత్త్వ మేదియు లేదు. విజ్ఞానమును విడచి బాహ్యపదార్థములు గోచరింపవు. కాని బాహ్యపదార్థములు లేకున్నను స్వప్నాదులలో విజ్ఞాన ముండును గావునను, విజ్ఞానమొక్కటియే తత్త్వము. కాన జ్ఞానపరి కల్పితమగు ఘటపటాదివస్తు జాతము స్వప్న పరికల్పిత విషయములవలె నసత్యములే గాని సత్యములు గావని వారిమతము.

కాని సన్నికర్షాదివశమున నుపస్థితమగు నీవస్తుజాతమును అప్రమాణ మగు వికల్పజ్ఞానబలముచే నవలంబించు నా వైజ్ఞానికుల మతము ప్రమాణము గాదు.

విజ్ఞానమాత్రమే తత్త్వమని యంగీకరింతుమేని ''ఇది ఘటము''

''ఇది పటము'' అని ఇదంతారూపమున గలుగు బాహ్యప్రవృత్తి గలుగ వీలులేదు. విజ్ఞానము లోపలనుండునదిగాన ''నేను ఘటము'' అను నాంతర ప్రతీతి గలుగవచ్చునే గాని ''ఇది ఘట''మను బాహ్యప్రతీతి గలుగరాదు .

ఆభ్యంతరమున వాస్తవరూపమున జ్ఞేయమగు విజ్ఞానరూప తత్త్వమే బాహ్యపదార్థమువలె ప్రతీత మగునని సమాధానము చెప్ప జూచినను అదియు సరిపడదు. బాహ్యపదార్థ మొక్కటి యంగీకరించి యున్నచో బాహ్య పదార్థము వలెనని పైజెప్పిన యుపమానము సంగత మగునే గాని. బాహ్యపదార్థమునే యొప్పని వారి మతమున నా యుపమానము ''వంధ్యాపుత్రునివలె రాజకుమారుడు సుందరు'' డన్నచోటి యుపమానము వలె నసంగతమగును. ఆ వాక్యమునకు సంగతత్వము గల్పింప బ్రయత్నించుచో బాహ్యపదార్థము సిద్ధించి తీఱును.

నీలాదివిషయమునకును, నీలజ్ఞానమునకును సహోపలంభ నియమ ముండుటవలన ననగా చంద్రుడొకడే యను జ్ఞానముండు కాలముననే ద్విచంద్రజ్ఞానము గలిగినను రెండవచంద్రుడు మొదటి చంద్రునికన్న భిన్నుడుగ నెన్నబడని విధమున జ్ఞానకాలముననే నీలాదివిషయములు భాసించుటవలన నీలాదులు జ్ఞానరూపములే గాని జ్ఞానభిన్నములు గావని విజ్ఞానవాదు లందురు.

కాని సహోపలంభ ముండిన మాత్రమున నారెంటికి నభేద ముండ వలయునను నియమము లేదు. చక్షురింద్రియ గ్రాహ్యమగు ఘటాది రూపము ప్రభాసంగతము అనగా ప్రకాశకాలమున నుండినది కాన ఘటాది రూపము ప్రభాసహోపలబ్ధము అయినను ఘటరూపము వేఱుగను తత్ప్రకాశకమగు నాలోకము వేఱుగ నెంచబడుచున్నది. కాన జ్ఞానకాలమున నీలాదివిషయము భాసించినను నీలాదివిషయమును జ్ఞానమున కన్న భిన్నముగనే యెన్నదగును. అనగా ప్రభాఘట రూపస్థలమున నుపాయో పేయభావమును పురస్కరించుకొని సహోపలంభ మేర్పడుచున్నది గాని యభేదమును బురస్కరించికొని కాదు. కాన సహోపలంభ మాత్రమున నీల,

నీలజ్ఞానముల కభేదము చెప్పరాదు, మఱియు స్వప్నకాలిక జ్ఞానమువలె జాగ్రత్కాలిక జ్ఞానమును నిర్విషయమని యనుట తగదు. స్వప్నజ్ఞానము లోని విషయము జాగ్రదవస్థలో బాధితమగును గాన దానిని నిర్విషయమన జెల్లును గాని జాగ్రత్కాలీన జ్ఞానమబాధితమై యుండగా దీనిని నిర్విషయ మని యనుట యెట్లు పొసగును?

కాన విజ్ఞానవాదము ప్రమాణము గాదు.

అవ॥ యుక్త్యంతరములచే విజ్ఞానవాదమును నిరాకరించుచున్నారు.

## సూ॥ వస్తుసామ్యే చిత్తభేదాత్ తయోర్విభక్తః పన్థాః ॥ 15

వస్తుసామ్యే, చిత్తభేదాత్, తయోః, విభక్తః, పంథాః॥

వస్తుసామ్యే = వస్తువున కేకత్వమునందును, చిత్తభేదాత్ = జ్ఞానము లనేకము లగుటవలన, తయోః = ఆ జ్ఞానమునకును, జ్ఞేయవస్తువునకును, విభక్తః = భిన్నమైన, పంథాః = మార్గము (గలుగుచున్నది)

అనేక చిత్తములకు విషయీభూతమై యొకేవస్తు వుండె నేని యా వస్తువు తన్ను విషయీకరించు, నేచిత్తముచేతను కల్పిత మనబడదు. మఱియు తన్ను విషయీకరించు సర్వచిత్తములచేతను గల్పింపబడె ననరాదు. ఆవస్తువు స్వరూపప్రతిష్ఠిత మైనదని మాత్రమే యెంచవలయును. చిత్తములు భిన్నములు గాన ''లోకో భిన్నరుచిః'' యను న్యాయానుసారము నొక స్త్రీరూపవస్తువును దీసికొందుమేని దానిచే తత్పతికి గృహస్థధర్మ నిమిత్తమువలన సుఖజ్ఞానము గలుగును. తత్సపత్నికి నధర్మనిమిత్తమువలన దుఃఖజ్ఞానము గలుగును. కాముకునకు నజ్ఞానవశమున మోహజ్ఞానము గలుగును. ఉదాసీనునకు దత్త్వజ్ఞాన వశమున సుఖదుఃఖమోహాభిన్న కేవల సామాన్య (తటస్థ) జ్ఞాన ముదయించును. ఇట్టి జ్ఞాన ముదయించిన తరువాత మీరు చూచిన కాంతను నేను జూచుచున్నానను తలంపు గలుగును. ఈస్త్రీమొదలగు వస్తువెవ్వని చిత్తముచేతను గల్పింపబడదు. అట్లొకని చిత్తముచే బరికల్పింపబడె నంటిమేని యా కాల్పకునికే యది ప్రతీతము

గావలయును గాని యితరున కావిషయము గోచరము గాగూడదు. స్వప్నమున నన్నన్నో స్వచిత్తకల్పితములగు పదార్థములు స్వజ్ఞాన మాత్ర విషము లగునేగాని యన్యపురుష జ్ఞానమునకు విషయములు గావు గదా! కాన గ్రాహ్యమగు పదార్థపు పద్ధతివేఱు. గ్రహణమగు జ్ఞానపు దారివేఱు. ఈ రెంటికి నావంతయు సాంకర్యము లేదు.

సాంఖ్యసిద్ధాంతము నన్నన్నో వస్తుసామాన్యము త్రిగుణాత్మక మనియు, నాత్రిగుణములు చలనశీలములనియు నంగీకరించుటచే ధర్మాది నిమిత్తా పేక్షమైన వస్తువు చిత్తముచే విషయీకరింపబడు చుండును. ధర్మాదికము స్వానురూపమగు జ్ఞానము గలుగుటలో కారణ మగుచుండును.

అనగా రజోగుణసహిత సత్త్వగుణము ధర్మసాపేక్షమై పతికి దన స్త్రీవిషయమున సుఖజ్ఞానమును గలిగించును. రజోగుణ సహితమగు తమోగుణము ధర్మసాపేక్షమై సపత్నికి తన సపత్నివిషయమున దుఃఖజ్ఞాన మును పుట్టించును. కేవలతమోగుణ మజ్ఞానసాపేక్షమై కాముకునకు దన కామినియందు మోహజ్ఞానమును గలిగించును. శుద్ధసత్త్వగుణము తత్త్వజ్ఞాన సాపేక్షమై యుదాసీనునకు సకల వస్తువులయందును సామాన్య జ్ఞానము నుద్భవింపజేయును.

ఇట్లొకే వస్తువు ధర్మాదినిమిత్త భేదమువలన సత్త్వాదిగుణముల నావిర్భవింపజేయుట మూలమున ననేకజ్ఞానములను గలిగించును.

అవ॥ వైజ్ఞానికులలో గొందఱగు దృష్టిసృష్టివాదు లిట్లందురు- పూర్వయుక్తులచే పదార్థము, జ్ఞానమును భిన్నములని సిద్ధించినను **'అర్థః జ్ఞానసహభూరేవ భోగ్యత్వాత్, సుఖరాగద్వేషాదివత్'**, అను ననుమానముచే సకలపదార్థములును జ్ఞానసమానకాలమున జ్ఞానగోచరము లగుచుండుట వలన సుఖరాగద్వేషాదులవలె జ్ఞానకాల మాత్రసత్తా (స్థితి) వంతములే తద్విషయక జ్ఞానకాలములో నా పదార్థములు లేవు. అనగా నెవని కేవస్తువు విషయమున జ్ఞానము గలిగెనో, యాతని దృష్టిలోనే యావస్తు వున్నట్లగును.

కాని యితరుల కావస్తువు లేనిదే, ఆ జ్ఞాతకు సయితము తద్విషయక జ్ఞానముచున్నంతవఱకే యావస్తువు గాని, జ్ఞానమతీత మైనచో నాతని దృష్ట్యను సారము గూడ నావస్తువును లేదు. కాగా జ్ఞానపూర్వోత్తరక్షణము లందు సయితము పదార్థము లేకుండును. వీరి మతమును నిరాకరించుచున్నారు.

## సూ॥ న చైకచిత్తతన్త్రం వస్తు తదప్రామాణికం తదా కిం స్యాత్॥ 16

న, చ, ఏకచిత్తతన్త్రం, వస్తు, తత్, అప్రామాణికం, తదా, కిం, స్యాత్ ॥

వస్తు = బాహ్యవస్తువు, ఏకచిత్తతన్త్రం = ఏదేనొక చిత్తమున కధీనమగు సత్త గలదిగా, న చ = కాదు, తత్ + అప్రమాణికం = ఆచిత్తముచే ప్రమాణీక (విషయీక)రింపబడని వస్తువు, తదా = జ్ఞానమునకు విషయముగాని సమయమున, కిం స్యాత్ = ఏమి యగును.

వస్తువుయొక్క సత్త (స్థితి) జ్ఞానమాత్రాధీన మనియు, జ్ఞానోత్తరక్షణమున వస్తువు లేదని, యంగీకరించినచో ఘటమును విషయీకరించు చిత్తము (జ్ఞానవృత్తి) ఘటమునుండి నివృత్తమై, తదితర వస్తువునందు దేనియందేని వ్యగ్రము (ఆసక్తము) గానయినను, వివేక విషయమై నిరుద్ధమైనను, వస్తుస్వరూపము చిత్తమునకు విషయము గాదు గాన, నాఘట రూపవస్తు వేమగును? వారి మతములో నది నష్టమైనదనియే చెప్పవలయును. వ్యగ్రనిరుద్ధచిత్తములకు నావస్తువుతో సంబంధమే లేకపోగా నన్యచిత్తములకు విషయము గాకపోగా, నెవనిచేతను గ్రహింపబడని స్వభావము గల యాఘటము వారి మతములో నప్రామాణికమే యగును.

ఇట్టి ఘటము మఱికొంత కాలమునకు మఱియొకని చిత్తమునకు విషయ మయ్యెనేని మఱల నుత్పన్నమయ్యె ననవలసి యుండును. నశించినది యెట్లుదయించును? కారణము లేకయే కార్యముదయించుట యసంగతము గదా! జ్ఞానమే దానికి కారణమని చెప్పినచో నాశాకల్పితమగు లడ్డువునకును, యథార్థమగు లడ్డువునకు రసవీర్యవిపాకాదులు సమానములు గావలసి

వచ్చును. అనగా కనబడు ఘటము జ్ఞానకల్పిత మంటిమేని యాశాకల్పిత లడ్డుకము గూడ హృప్తి పుష్ట్యాదులను గలుగజేయవలసి యుండును. కాన నిది యసంగతము.

మఱియు వస్తుసత్త జ్ఞానాధీనమని యంగీకరించినచో ఘటపు ముందు భాగమే యింద్రియ సన్నికర్షద్వారా చిత్తమునకు విషయ మగును? కాన జ్ఞాతమగు నాపురోభాగమే యథార్థమగును గాని యనుపస్థితము లగు ఘటపు మధ్యపృష్ఠభాగములు చిత్తవిషయములు గావు. కాన నవి లేనివై గ్రహింప బడ కుండవలయును. మఱియు వారి మతమున కనుపడని ఘటపృష్ఠోదర భాగము లసత్తులు గాన వ్యాపకాభావమువలన వ్యాప్యమగు పూర్వభాగము గన బడుచున్నను పూర్వభాగపుటభావము నొప్పి తీఱవలయును. వ్యాపకా భావముచే వ్యాప్యాభావము సర్వసమ్మతము గదా!

కాగా వారి మతమున ఘటరూపవస్తువునకే యభావాపత్తి గలుగును గాన జ్ఞానాధీన విషయసత్తావాదము మిక్కిలి యసంగతము.

కాన బాహ్యపదార్థము సర్వపురుషసాధారణమును, స్వతంత్రము నగునే గాని జ్ఞానపరతంత్రము గాదు. మఱియు నొక్కొకరి చిత్తములు స్వతంత్రముగ నావిషయములతో సంబంధించును, ఆ చిత్తమునకును విషయములకు గలుగు సంబంధముచే నేర్పడు నుపలబ్ధి (విషయజ్ఞాన) యే పురుషునకు భోగ మనబడును.

16వ సూత్రము ప్రక్షిప్తమని కొందఱనిరి. కాని భాష్యమును, దానికి సయితము వ్యాఖ్యానము లుండుటవలనను, సందర్భశుద్ధి యుండుట వలనను వివరింపబడెను.

అవ॥ బాహ్యపదార్థము స్వతంత్రమని యంగీకరించిన నది జడ స్వభావము గాన నొక వేళను, జ్ఞాతము గాకుండవలయును. దానికి ప్రకాశస్వభావము నంగీకరించితిమేని యెప్పుడును జ్ఞాతము గావలయును గదా అను నాశంకకు సమాధానము నిచ్చుచున్నారు.

## సూ॥ తదుపరాగాపేక్షిత్వాచ్చిత్తస్య వస్తు జ్ఞాతాజ్ఞాతమ్॥ 17

తదుపరాగాపేక్షిత్వాత్, చిత్తస్య, వస్తు, జ్ఞాతాజ్ఞాతమ్॥

చిత్తస్య = చిత్తము, తదుపరాగాపేక్షిత్వాత్ - తత్ = ఆ విషయముయొక్క, ఉపరాగ = ఇంద్రియసన్నికర్షమూలప్రతిబింబనమును, అపేక్షిత్వాత్ = అపేక్షించి యుండుటవలన, వస్తు = బాహ్యపదార్థము, జ్ఞాతాజ్ఞాతమ్ = ఒకపుడు జ్ఞాతము గాను, మఱియొకపు డజ్ఞాతముగా నుండును.

ఏ సమయమున విషయమునకు ఇంద్రియసన్నికర్షద్వారా చిత్తముతో సంబంధము గలుగునో, యపు డావిషయము జ్ఞాతమగును. ఇంద్రియ సన్నికర్షద్వారా చిత్తసంబంధము గలుగనియపు డావిషయము గోచరింపదు. అయస్కాంతమణి తుల్యములగు విషయములు లోహతుల్య మగు చిత్తము నింద్రియసన్నికర్ష మూలమున తమతో సంబంధించు ఘట్లాకర్షించి యా చిత్తమును స్వసమానాకారముగ నుపరంజనము చేయును. కాగా నే విషయముచే జిత్త ముపరక్త మయ్యెనో యావిషయమే జ్ఞాత మగును. అట్లుపరంజింపజేయని విషయము జ్ఞాతము గాకుండును. ఇట్లు విషయాకారమున బరిణమించుట, యొకవేళ బరిణమించ కుండుటయు చిత్తమునకు గలదు గాన చిత్తము పరిణామ యుక్తమగును. (చూ.2-20)

అవ ॥ ఇంతవఱకును చిత్తమునకన్న వేఱగు బాహ్యపదార్థము గలదని స్థాపించి చిత్తము పరిణామి యని నిరూపించిరి. ఇక నపరిణామిత్వ రూప హేతువుచే నాత్మకు చిత్తాతిరిక్తత్వమును దెలుపుట కుపక్రమించు చున్నారు.

## సూ॥ సదా జ్ఞాతాశ్చిత్తవృత్తయస్తత్ప్రభోః పురుషస్యాపరిణామిత్వాత్॥ 18

సదా, జ్ఞాతాః, చిత్తవృత్తయః, తత్ప్రభోః, పురుషస్య, అపరిణామిత్వాత్ ॥

(యస్య, తు, తత్, ఏవ, చిత్తం, విషయ, స్తస్య యను నేడు పదములను -

ఈసూత్రములోనికి నధ్యాహరించిరి.) యస్య తు = ఏ చేతనునకైతే, తత్ = ఆ విషయాకారమైన, చిత్తం ఏవ = చిత్తమే, విషయః = విషయమగునో, తస్య = ఆ, తత్ప్రభోః = ఆ చిత్తమునకు స్వామియగు, పురుషస్య = పురుషుడు, అపరిణామిత్వాత్ = పరిణామములేని వాడగుటచే, సదా = సర్వకాలమునను, చిత్తవృత్తయః = చిత్త వ్యాపారములు, జ్ఞాతాః = జ్ఞాతము లగును.

చిత్తమున కధిష్ఠాతయగు పురుషుడు పరిణామరహితుడు గావునను, విషయాకారమున బరిణతమగు చిత్తమును విషయీకరించు నా చేతనునకు చిత్తవృత్తులు సర్వకాలములయందును జ్ఞాతము లగుచుండును. అనగా చిత్తమువలె చిత్తాధిష్ఠాత యగు పురుషుఁడును పరిణామసహితు డగుచో స్వవిషయములగు చిత్తవృత్తులు శబ్దాది విషయములవలె నొకవేళ జ్ఞాతములును మఱియొక వేళ నజ్ఞాతములు గావలసివచ్చును. మనోవృత్తులు సర్వకాలమునను పురుషున కెఱుక పడుచున్నవి గాననే యాత డపరిణామి, ఇందులకు వ్యతిరేక దృష్టాంతము చక్షురాదికము, చక్షురాదికము పరిణామి గాన సదా జ్ఞానము లేని దగుచున్నది.

అవ॥ అగ్ని తన్ను తానే ప్రకాశింపజేసికొనుచు పరప్రకాశకమగు విధమున చిత్తము సయితము (స్వాభాసము) స్వప్రకాశకమును (విషయాభాసము) విషయప్రకాశకము నగుచుండగా చిత్తాతిరిక్తమగు నాత్మ నేల యంగీకరింప వలయు నను నాస్తికుల మతమును నిరాకరించు చున్నారు.

## సూ॥ న తత్స్వాభాసం దృశ్యత్వాత్॥ 19

న, తత్, స్వాభాసం, దృశ్యత్వాత్॥

తత్ = ఆచిత్తము, దృశ్యత్వాత్ = దృశ్యము గాన, స్వాభాసం = తనంతటతాను ప్రకాశించునది, న = కాదు.

చిత్తేతరేంద్రియములు శబ్దాదివిషయములును దృశ్యము లగుటచే స్వప్రకాశములుగాని విధమున, చిత్తము సయితము దృశ్యమే గాన స్వప్రకాశము గాదు, సాక్షిభాస్యము మాత్రమే. స్వప్రకాశత్వమును సాధించుటకు నగ్నిని

దృష్టాంతము చెప్పుటయు సరిగాదు. ఏలనన అగ్ని యితరాగ్నిచే ప్రకాశింప జేయబడకున్నను, విజ్ఞానముచే బ్రకాశింప జేయబడును. కాన బరప్రకాశ్యమే గాని స్వప్రకాశము గాదు.

గంతవ్యస్థలము, గంతవ్యుడు భిన్నులే యైనను వాని సన్నిధానముననే గమనరూపక్రియ దృశ్యమానమగు విధమున, భిన్నములగు ప్రకాశ్య ప్రకాశకముల సాన్నిధ్యముననే ప్రకాశము సయితము గోచరమగును. కాని ప్రకాశ్యప్రకాశములకు నభేదము గల స్థలమున గోచరింపదు, అగ్నికి స్వస్వరూపముతో సంయోగము లేదు. ప్రకాశ క్రియలో సూర్యాదికులు (ప్రకాశకులు) కర్తలుగా నుండగా, ఘటాదికము (ప్రకాశ్యము) కర్మగా నుండ వలయును. ఇంతేగాని కర్తృత్వ కర్మత్వము లొక వస్తువునకే సంభవింపవు.

మఱియు చిత్తము స్వాభాసమనగా చిత్తము స్వప్రకాశమని యర్థము చెప్పుటకు వీలులేక పోయినను, చిత్తమితరముచే నగ్రాహ్యమని యర్థమును జెప్పవచ్చును. ఆకాశము స్వాత్మప్రతిష్ఠితమను స్థలమున నాకాశ మితరములగు నేవస్తువు నాశ్రయింపదని యర్థము చెప్పువిధమున, చిత్తము స్వాభాస మనుటకు చిత్త మితరాగ్రాహ్యమని యర్థము చెప్పవచ్చును.

ఇట్లు చెప్పినచో బ్రాణులకు గలుగు వివిధప్రవృత్తులు సంగతములు గాక పోవును. ప్రాణులందఱును తమతమ చిత్తవృత్తుల నెఱిగియే " నేను క్రుద్ధుడను, నేను భీతుడను, దీనిపై నాకు బ్రీతి, దీనిపై నాకు గ్రోధము" అని వ్యవహరించుచున్నారు. పైనాస్తికులమతము రీతిని చిత్తమితర గ్రాహ్యము గాకున్నచో పైవ్యవహారము లసంగతము లగునుగదా! కాన వృత్తివిశిష్ట చిత్తము పురుషునిచే గ్రహింపబడునని యంగీకరించియే తీఱవలయును.

అవ॥ ఇంతవఱకు నితరముల రీతిగ ఆస్తికమతమున చిత్తమునకు జెప్పబడు స్వపరప్రకాశత్వములను దూషించి యిక నాస్తిక మతరీతిగనే వానిని దూషించుచున్నారు.

**సూ॥ఏకసమయే చోభయానవధారణమ్‌। 20**

ఏకసమయే, చ, ఉభయానవధారణమ్ ॥

ఏకసమయే చ = ఒకే కాలమున, ఉభయానవధారణమ్ = విషయమును, తన్ను రెండింటిని గ్రహించుట యసంభవము.

నాస్తికమతమున చిత్తము క్షణికముగాన నొకేక్షణమున జిత్తము విషయమును, తన్నును గ్రహించుట పొసఁగదు. ఇతరమతములందు దొలుతటి క్షణమున బదార్థ ముత్పన్న మగు ననియు, మరుక్షణమున నాపదార్థము క్రియావంత మగుననియు, మూడవ క్షణమున నదియే యేదియో నొక కార్యమును జేయుటలో కర్తృరూప కారకముగా నగుననియు నంగీకరింతురు. కాని నాస్తికు లట్లుగాక యొకక్షణమున వస్తువున కుత్పత్తి గలుగును. అదియే క్రియ, అదియే కారకము, ద్వితీయక్షణముననే యా వస్తువు నశించును అని యంగీకరింతురు. కాన వారి మతమున చిత్తము విషయమును, తనస్వరూపమును గ్రహింపజాలదు 'అనగా చిత్తము ఘటమును విషయీకరించిన వ్యాపారముతోడనే, తన స్వరూపమును విషయీకరించునేని యేకవ్యాపారముచే భిన్నరూప కార్యములు గలుగును. కాన నది యసంగతము. కాన నింకొక వ్యాపారమును స్వీకరింపవలయును. అట్లయినచో నుత్పత్త్యతిరిక్తమగు వ్యాపారము నొప్పుకొనని నాస్తిక సిద్ధాంతము భగ్నమగును. కాగా నొకక్షణమున విషయమును తన స్వరూపమును చిత్తము గ్రహించుట యసంగతము. మఱియు **''శబ్దబుద్ధి కర్మణాం విరమ్య వ్యాపారాభావః''** అను న్యాయము చొప్పున నొకచిత్తవృత్తికి రెండు విషయము లను గ్రహించు సామర్థ్య ముండదని సర్వమత సమ్మతము.

అవ॥ స్వాభాసమనగా స్వసంతాన భాస్యత్వమని యర్థము చెప్పి, చిత్తము ద్వితీయక్షణముననే నష్టమైన నుత్తరోత్త రక్షణములలో నుత్పన్న మగు చిత్తములచే గ్రహింపబడును గాన చిత్తమగ్రాహ్యము గాదు. స్వగ్రాహ్యమే యగును అనుటయు పొసగదని నిరాకరించుచున్నారు.

**సూ॥ చిత్తాన్తరదృశ్యే బుద్ధిబుద్ధే రతిప్రసంగః స్మృతిసంకరశ్చ ॥ 21**

చిత్తాన్తరదృశ్యే, బుద్ధిబుద్ధేః, అతిప్రసంగః, స్మృతిసంకరః, చ॥

చిత్తాన్తరదృశ్యే - చిత్తాన్తర = అన్యచిత్తములచేత, దృశ్యే = గ్రాహ్యత్వము నందు, బుద్ధిబుద్ధేః = ఆ చిత్తగ్రాహకమగు చిత్తమునకు, అతిప్రసంగః = అనవస్థా రూపదోషమున్ను, స్మృతిసంకరః చ = స్మరణములకు బరస్పర సాంకర్యమును గలుగును.

ప్రథమచిత్తము తన్నాశోత్తరక్షణమున నుత్పన్నమగు ద్వితీయ చిత్తముచే గ్రహింపబడునని యంగీకరించుచో ప్రథమచిత్త గ్రాహకమగు నాద్వితీయబుద్ధి దేనిచే గ్రహింపబడును? తృతీయబుద్ధిచే గ్రహింప బడునన వలయును. తృతీయబుద్ధి దేనిచే గ్రహింపఁ బడునన చతుర్థబుద్ధిచే గ్రహింప బడు ననవలయును. ఇట్లు పైపై జిత్తములను గల్పింపవలసి యుండుటచే ననంతపదార్థకల్పనా రూపమగు ననవస్థాదోషము సంభవించును. మఱియు నిట్లంగీకరించుటచే విషయానుభవకాలముననే ఘటజ్ఞానము, దీని విషయమున ఘటజ్ఞాన జ్ఞానము, తద్విషయమున ఘటజ్ఞాన జ్ఞానజ్ఞానము ననురీతిగ జ్ఞానధారా ప్రవాహము నంగీకరింపవలసి వచ్చును. ఇంతేగాక విషయస్మరణ కాలముననను అనుభవాకారముననే స్మృతి గలుగవలసి యుండుటవలన నా యనంతజ్ఞాన పరంపరకు స్మరణము గలుగు ననవలసి వచ్చును. ఇట్లు కాగా ఘటమును నేదెలిసికొంటిని యని యొక స్మరణము గలుగవలసినచోట నది గలుగక ''ఘటము నేనెఱింగితిని'' ''ఘటజ్ఞానము నేనెఱింగితిని'' '' ఘటజ్ఞాన జ్ఞానము నే నెఱింగితిని'' యీ మొదలగు విధమున ననంతాకారములుగ స్మృతులకు సాంకర్యము గలుగును. దీనిచే నేకస్మృతి నిశ్చయము కలుగకపోవును.

కాగా చిత్తమునకన్న భిన్నమై సర్వానుభవసిద్ధుడై బుద్ధి సాక్షియగు పురుషుని లేడని నిరాకరించు వైనాశికులచే సర్వసిద్ధాంతమును దలక్రిందులు చేయఁబడినది కాన నది ప్రమాణము గాదు.

వారు ''నేనునేన''ను రూపముగల యావల విజ్ఞానపు ప్రవాహమును విజ్ఞానస్కంధమనియు, సుఖాద్యనుభవమును, వేదనాస్కంధమనియు,

''నేను తెల్లనివాడను, నేను బ్రాహ్మణుడను'' ఈ మొదలగు వికల్పజ్ఞానమును సంజ్ఞాస్కంధమనియు, విషయ సహితేంద్రియములు రూపస్కంధ మనియు, రాగద్వేషమోహధర్మాధర్మములు సంస్కారస్కంధమనియు సంకేతము లుంచుకొని యిందు మలినములగు స్కంధము లన్నిటిని త్యజించి విజ్ఞానాకారప్రవాహ మగుటయే ముక్తియందురు.

వీరు విజ్ఞానవాదులనియు, శూన్యవాదులనియు స్థూలముగ నిఱు దెఱంగు లగుదురు. ఇందు విజ్ఞానవాదులు క్షణికవిజ్ఞానరూపమగు చిత్త మాత్రము నాత్మతత్త్వముగ నంగీకరించి, సాంసారిక మలిన పంచ స్కంధములను త్యజించి, ముక్తమై శుద్ధమగు పంచస్కంధముల ననుభవించు తత్త్వవిశేషమే యాత్మతత్త్వ మనిరి. కాని యిట్లంగీకరించు టయు వారి క్షణికవాదమునకు విరుద్ధము, తొలుత నాత్మను క్షణికముగ నంగీకరించి ముక్తికాలమున దానిని విశుద్ధప్రవాహవంతముగను, స్థిరముగను సమ్మతించిరి. ముక్తికాలమున గూడ నాత్మ క్షణిక మన్నచో నుత్పత్తినాశశీలమై యాత్మ యనిత్యము గావలసి వచ్చును. ఆత్మ స్థిరమైనది గానిచో మలినపంచ స్కంధములను ద్యజించుటయు, శుద్ధపంచస్కంధము లను గ్రహించుటయు పొసగదు. మఱియు నీలపీతాది మలిన పంచస్కంధములను వదలునది, బద్ధచిత్తము. తదనంతరము శుద్ధస్కంధ పంచకమును బరిగ్రహించి విశుద్ధ ప్రవాహశీలమగు ముక్తి చిత్తము వేఱుగఁ గావలసివచ్చును. కాన వారి మతము న్యాయవిరుద్ధము.

శూన్యవాదులు శూన్యమునే పరమతత్త్వమని నమ్మి పంచస్కంధముల విషయమున మహానిర్వేదరూపమగు వైరాగ్యము కొరకును, పున ర్జన్మాభావరూప శాంతికొరకును, జీవన్ముక్తుడగు గురువు నొద్ద చేరి, బ్రహ్మచర్యము నభ్యసించి తత్త్వమును సాక్షాత్కరింతుమని మహాప్రతిజ్ఞను జేయుచు అహంశబ్దార్థమగు సత్త్వపుసత్తను దొలగ ద్రోయుదురు. అనగా వారి మతమున నేదియు లేదు. కాన భోక్తయు, మోక్షమును బ్రహ్మచర్యాది సాధనముల సత్తను స్వీకరించుటయు నయుక్తము, కాన వారిమతము

సయుతము న్యాయమైనది గాదు.

కాన జిత్తమునకు నధిష్ఠాతయు, ద్రష్టయు, భోక్తయు, స్థితుడు నగు పురుషుని నిరూపించు సాంఖ్యయోగాది (వైదిక) మతములే ప్రబల ప్రమాణము గలది.

అవ॥ చిత్తము స్వాభాసముగాక, యన్యచిత్తగ్రాహ్యమును గాక, యాత్మమాత్ర గ్రాహ్యమని యన్నచో నాత్మ చిత్తసంగము గలిగియే చిత్త ప్రకాశకము గావలయును. కాగా నసంగుడగు పురుషునకు గర్తృత్వ భోక్తృత్వము లెట్లు పొసగునను శంక గలుగగా సమాధానము జెప్పుచున్నారు.

## సూ॥చితేరప్రతిసంక్రమాయాస్తదాకారాపత్తౌ స్వబుద్ధిసంవేదనమ్॥ 22

చితేః, అప్రతిసంక్రమాయాః, తదాకారాపత్తౌ, స్వబుద్ధిసంవేదనమ్ ॥

అప్రతిసంక్రమాయాః = ఇంద్రియములవలె విషయముల యందు బ్రచారములేని, చితేః = చేతనపురుషునకు, తదాకారాపత్తౌ, తత్ = తాను ప్రతిబింబించిన యా చిత్తము యొక్క, ఆకార = ఆకారమువంటి యాకారము (నకు) ఆపత్తౌ = ప్రాప్తించిన యనంతరము, స్వబుద్ధిసంవేదనం, స్వ = తనకు విషయమగు, బుద్ధి = బుద్ధియొక్క, సంవేదనం = జ్ఞానము గలుగును.

భోక్తృశక్తి సంజ్ఞుడగు పురుషుడు పరిణామరహితుడు గాన నేవిషయముతోడను సంబద్ధుడు గాడు, కాన నప్రతిసంక్రముడు అనగా నిర్లిప్తుడు. అయినను విషయాకారమున బరిణమించిన బుద్ధియందు బ్రతిబింబించినందున తదాకారము గలిగి యాబుద్ధి ననుసరించు వాడగును. చైతన్యప్రతిబింబమును, బుద్ధివృత్తి ననుకరించువాడు మాత్ర మగుటచే బుద్ధివృత్తికంటె భిన్నుడయ్యు చేతనుడు జ్ఞానవృత్తి యని వ్యవహరింప బడునేగాని యథార్థముగ చేతనుడు జ్ఞాతగాడు. లేక చేతనుని ప్రతిబింబమున కాధారమగును గాన చిత్తమునకు చేతనాకారము గలుగుటయే 'తదాకారాపత్తి'

యనబడును. ఈ తదాకారాపత్తిచే నింతకు మున్న చిత్తమునందున్న దర్శనకర్తృత్వమును చేతనువియం దున్నటుల భావించి చేతనుడు 'ద్రష్ట'యని వ్యవహరింపఁ బడునే గాని యథార్థముగ చేతనుడు ద్రష్ట గాడు.

నిర్మలజలమున బ్రతిబింబించిన చంద్రుడు క్రియారహితు డయ్యు స్వప్రతిబింబాధార జలచలనముచే, తాను చలించునట్లు తోచు తెఱగున చిత్తప్రతిబింబితుడగు చేతనుడు వ్యాపారరహితుఁడయ్యు స్వప్రతిబింబాధార మగు చిత్తమునందలి క్రియలను, విషయసంగమును, తనవి వలె తోపింప జేయునుగాని యది వాస్తవము గాదు.

ఆ చిత్తము ప్రాప్తచైతన్య బింబస్వరూపము గలదియై ఘటాది విషయాకార పరిణతమను విధమున చిదాకారముగ బరిణమించినదియై తన్ను దృశ్యముగను, చేతనుని ద్రష్టనుగ నొనర్చును. పై విధమున చిత్తమునకు చేతనునకు నభిన్నాకారమున భావము గలుగును, కాననే.

**న పాతాలం న చ వివరం గిరీణాం**
**నై వాంధకారం కుక్షయో నో దధీనామ్ ।**
**గుహా యస్యాం నిహితం బ్రహ్మ శాశ్వతం**
**బుద్ధివృత్తిమవిశిష్టాం కవయో వేదయన్తే॥**

అని శ్రుతి ప్రతిపాదించుచున్నది. అనగా **"గుహాహితం గహ్వరేష్ఠం పురాణం"** ఇత్యాది శ్రుతులలో నాత్మగుహయందు గహ్వరము నందున్నటుల జెప్పబడియున్నది. ఆ గుహాగహ్వరములు పాతాళము గాదు, పర్వత వివరములు గావు. అంధకారమును గాదు, సముద్ర మధ్యమును గాదు, విశుద్ధ స్వరూపుడగు పురుషుని ప్రతిబింబాక్రాంతమై ప్రతిబింబరూపమున బరిణతమై చిద్రూపావిశిష్టమగు బుద్ధివృత్తియే బ్రహ్మగుహ యని పరమ యోగులు తలతురు అని భావము.

అవ॥ ఇట్లు చిత్తమునకు చేతనునితో నభేదమున్నటువలె నేర్పడగా నింక చిత్తమునకు సర్వార్థకత్వమును బ్రతిపాదించుచున్నారు.

## సూ॥ ద్రష్టృదృశ్యోపరక్తం చిత్తం సర్వార్థమ్॥ 23

ద్రష్టృదృశ్యోపరక్తం, చిత్తం, సర్వార్థమ్ ॥

ద్రష్టృదృశ్యోపరక్తం - ద్రష్టృ = ద్రష్టయగు పురుషుని తోడను, దృశ్య = దృశ్యమగు విషయముతోడను, ఉపరక్తం = సంబద్ధమగు, చిత్తం = చిత్తము, సర్వార్థం = సకల రూపములు గలది యగును.

చిత్తము మంతవ్యమగు దృశ్యవిషయములచే ప్రతిబింబరూప సంబంధము గలిగియుండుటయేగాక విషయి యగు చేతనుని ఛాయ సయితము చిత్తమున బ్రతిబింబించుటచేఁ జిత్తము ద్రష్టృ దృశ్యసంబంధము గలది యగును. కాననే ''ఘటమహం జానామి'' ఘటమును నేనెఱుంగుచున్నాను అను ప్రత్యక్షరూపజ్ఞానమున ఘట రూపవిషయమును, నేనను విషయియును, నుపస్థితము లగుచున్నవి, గాన చిత్తమచేతన విషయరూపమునను, చేతనుఁడగు విషయిరూపమునను, నుపరక్త మగును గాన విషయ విషయి నిర్భాసమై స్ఫటికమణివలె నానారూపముల నొందును. అనగా స్ఫటికమణి యొక్కటియె దనకు నిరువైపులున్న యెఱ్ఱని నల్లని పూవుల ప్రతిబింబములచే నెఱ్ఱనయు నల్లనయునై దన స్వచ్ఛధవళకాంతి యొకటి గాగా మువ్వన్నెలు గలిగినదగు విధమున జిత్తము సయితము విషయచేతనుల ప్రతిబింబముచేతను, దనరూపముచేతను, గ్రాహ్యగ్రహీతృ గ్రహణరూపమున త్రిప్రకారమై తోచును. కాన చిత్తము సర్వార్థమని చెప్పబడెను.

ఇట్లు సర్వార్థమగు చిత్తపు యథార్థరూపమును దెలియజాలక చిత్తపుటాత్మసారూప్యముచే భ్రాంతులైన కొందఱు (వైనాశికుల) చిత్తమే యాత్మయని యందురు. మఱికొందఱు (యోగాచారులు) ఈ బాహ్యప్రపంచ మంతయు జిత్తమాత్రమే గాని చిత్తాతిరిక్తమగు గవాది ఘటాది బాహ్యవస్తురూపమై కారణజన్యమగు లోకము లేదందురు. కాననేవారు

**''అభిన్నోఽపి హి బుద్ధ్యాఽఽత్మా విపర్యాసితదర్శనైః ।**
**గ్రాహ్యగ్రాహకసంవిత్తి భేదవానివ లక్ష్యతే ।।''** యనిరి.

అనగా బుద్ధ్యభిన్యమగు నీ లోకము భ్రాంతివశమున గ్రాహ్యగ్రాహక గ్రహణ భేదములచే జూడబడుచున్నది యని భావము. చిత్తమునకు సర్వాకారవత్త్వము నంగీకరించుటకన్న క్షీరమునకు దధ్యాదిపరిణామముల వలెఁ జిత్తమునకు సయితమనాది వాసనావశమున ననంత పరిణామము లంగీకరించిన జాలును గదా! యని వారి భావము.

ఆస్తికులగువా రా నాస్తికుల నుపేక్షింపక దయతో చిత్తమునకు నాత్మకు గల భేదమును వారికి బోధింపవలయును. వారూరక చిత్తము నాత్మగా నెంచక చిత్తమునకు బైన వివరించిన విధమున ద్రష్టృదృశ్యాకారమున భావము గలదు గాన నదియే భ్రాంతికారణము గాగా భ్రమపడిరి. భ్రాంతికారణమున్న సమయమున భ్రాంతిపడుట సమంజసమే. కాన నా భ్రాంతికారణమును వివరించి వారి భ్రాంతిని దొలఁగింపవలయును.

అనగా పూర్వోక్తయుక్తులచే జిత్తాతిరిక్తమగు నాత్మయున్న దని వారికి నచ్చ జెప్పి, యాయాత్మసాక్షాత్కారమున కష్టాంగయోగ మూలమున సమాధిపై వారికి విశ్వాసపూర్వక ప్రవృత్తి నుదయింప జేసి సమాధికాలమున గలుగు నవికల్పప్రజ్ఞలో బ్రతిబింబితమగు వస్తువు భిన్నము, ప్రతిబింబాధారమగు ప్రజ్ఞ వేఱు. ప్రతిబింబిత వస్తుయుక్తమగు ప్రజ్ఞను దెలిసికొను పురుషుడు వేఱు, అతడు చిత్తమాత్రుడు గాడు. చిత్తమాత్రమే యని చెప్పుచో జిత్తము బాహ్య వస్తువుల నెఱుగు విధమున దన్ను సయితము తానెఱుగవలసి యుండును. అనగా చిత్తము స్వాభాస మనవలసివచ్చును. చిత్తము స్వాభాసమన వీలుగాదని యింతకు ముందే నిరూపించడమైనది.

కాన బ్రజ్ఞలో ప్రతిబింబితమగు నర్థము నెఱుగు నతడొక డుండ వలయును. అతడే పురుషుడు, ఆత్మ.

ఇట్లు వివేకమూలమున గ్రహీతృగ్రహణగ్రాహ్యములు విజాతీయములని విభజించిన సాంఖ్యయోగ తత్త్వవేత్తలే సమ్యగ్దర్శనులు. వారే యాత్మసాక్షాత్కారము నొనర్చుకొనిరి గాని భ్రాంతివిశిష్టుల కాత్మవివేకము

గలుగదు.

ఇచట గొందఱు - ''ద్రష్టయగు బురుషుడు, చిత్తము తత్సన్నిధాన మున దద్రూపమును బొందినదివలెనై గృహీతవిషయాకారమున బరిణత మగునేని సర్వార్థగ్రహణసమర్థ మగును. నిర్మలమగు స్ఫటికదర్పణాదు లన్నియు ప్రతిబింబగ్రహణ సమర్థ మగువిధమున రజస్తమోభిభూతము గాని చిత్తసత్త్వ మొక్కటియే శుద్ధముగ నుండును. కాన చిచ్ఛాయాగ్రహణ సమర్థ మగును. కాని రజస్తమస్సులు సమర్థములు గావు. అట్టి చిత్తసత్త్వము తిరస్కృత రజస్తమో రూపమై తానే ప్రధానమై నిశ్చల ప్రదీపశిఖాకారమున నేకాకారమున బరిణతమై చిచ్ఛాయాగ్రహణ సమర్థమై మోక్షము గలుగువఱకు నేకాకారముగ నుండును. అయస్కాంత సాన్నిధ్యమున నినుమునకు చలనము గలుగు తెఱగున చిద్రూపుఁడగు పురుషుని సన్నిధానమువలన బుద్ధిసత్త్వము నకు సయితము అభివ్యంగ్య చైతన్య మభివ్యక్త మగుచున్నది.

కావుననే యీశాస్త్రమున నిత్యోదిత చిచ్ఛక్తి యనియు, నభివ్యంగ్య చిచ్ఛక్తి యనియు జిచ్ఛక్తు లిరు దెఱంగులు. నిత్యోదితచిచ్ఛక్తి యనగా బురుషుడు. అట్టి పురుషుని సాన్నిధ్యముచేత నభివ్యక్తమైన యభివ్యంగ్య చైతన్యము గల బుద్ధిసత్త్వమభివ్యంగ్యచిచ్ఛక్తి యనబడును. ఈ యభివ్యంగ్య చిచ్ఛక్తి పురుషున కత్యంత సన్నిహిత మైనది గాన నంతరంగమై పురుషునకు భోగ్యమై యున్నది. శాంతబ్రహ్మవాదులగు సాంఖ్యులు దీనినే పురుషునకు నధిష్ఠేయమై కర్మాను రూపముగ సుఖదుఃఖభోక్త యగునని చెప్పుదురు. ఒక్క గుణమే ప్రధానమై యుండి తదన్యగుణములతో నొక్కటియు నుద్రేకింపక యుండిన నిట్లు గుణత్రయమును బ్రతిక్షణమునను బరిణామవంతమై సుఖదుఃఖ మోహాత్మకమున నిర్మలము నగును, దాన కర్మానుగుణముగ శుద్ధమగు సత్త్వమునందు రజఃప్రముఖములు స్వాకారమును బ్రతిబింబింప జేయుట వలన సుఖాదులు స్వసంవేద్యము లగును.

అట్లు శుద్ధమగు బుద్ధిసత్త్వమే యొకవైపున పురుష ప్రతిబింబము సంక్రమించియుండగా, మఱియొకవైపున గృహీతవిషయాకారమున నుపగత

మైన స్వాకారము గలదియై, చేతన ప్రతిబింబ సంబంధమువలన చైతన్యా విష్టమైనదివలె దోచును. తాను చైతన్యము లేనిదియే యైనను సుఖదుఃఖాది భోగము ననుభవించుచున్నది. ఆ భోగమే యత్యంతసన్నిధానము గల పురుషునకును బుద్ధిసత్త్వమునకు భేదవివేకము లేని కారణమున నిజముగ భోక్త గాకున్నను పురుషుఁడే భుజించు విధమున దోచును, గాన పురుషుడే భోక్తయని కొందఱందురు.

ఈ యభిప్రాయము మనసున నుంచుకొనియే యొక వింధ్యవాసి **"సత్త్వతప్యత్వమేవ పురుషతప్యత్వమ్"** అనెను. అనగా సత్త్వపు భోగమే పురుషుని భోగమని, భావము. ప్రతిబింబ మనగా ప్రతిబింబించిన వస్తు స్వభావము వంటి స్వభావము గనబడుట యని నిర్వచించుటవలన బుద్ధి సత్త్వమున బ్రతిబింబించిన పురుషుని చైతన్యస్వభావ సదృశమగు చైతన్యము బుద్ధిసత్త్వమునందు భాసించునని యేర్పడినది.

ముఖము దర్పణమున బ్రతిబింబించిన వడువున నిర్మలమును నియతపరిమాణమునగు వస్తువు నిర్మలవస్తువున బ్రతిబింబించుట సుప్రసిద్ధము. కాని యత్యంత నిర్మలుడును వ్యాపకుడును పరిణామియు నగు పురుషునకు దనకన్న నత్యంతానిర్మలమగు బుద్ధిసత్త్వమున బ్రతిబింబించుట పొసగదని శంకింపరాదు. సత్త్వమునందలి యభివ్యంగ్యచిచ్ఛక్తికి బురుష సాన్నిధ్యమువలన నభివ్యక్తియే ప్రతిబింబనమని చెప్పబడును. పురుషుని యందున్న చిచ్ఛాయ వంటిదిగనే యాయభివ్యంగ్యచిచ్ఛక్తి యావిర్భవించును. అత్యంత నిర్మలుడగు పురుషుడు నిర్మలముగాని బుద్ధిసత్త్వమున నెట్లు ప్రతిబింబించునను పై శంక యసంగతము. నిర్మలవస్తు వనిర్మలవస్తువులో బ్రతిబింబింప రాదను నియమము లేదు. - అపకృష్టనైర్మల్యము గల జలాదుల యందు సూర్యాది నిర్మలులు ప్రతి బింబించుట గనుచున్నాము గదా! వ్యాపకమగు నాకాశము సయితమద్దమున బ్రతిఫలించుటవలన నపరిచ్ఛిన్న మగు నాత్మకు ప్రతిబింబము లేదనుట తగదు. కాన బ్రతిబింబించుట యుకమే.

సాత్త్వికపరిణామ రూపమగు బుద్ధిసత్త్వమున పురుషసన్నిధాన వశమున నభివ్యంగ్య చిచ్ఛక్తియందు బాహ్యవస్తువులు సంక్రమించును. కాన పురుషునకు సుఖదుఃఖాదిభోగ మనుట పొసఁగదు. చిత్తసత్త్వ మనఁగా ప్రకృతి పరిణామమే గదా! ఆ ప్రకృతికి నీ పరిణామమేల గలిగెను? పురుషునకు సుఖదుఃఖా ద్యర్థాను భవము గలిగించుటకై యీ పరిణామ మేర్పడె ననరాదు. పురుషార్థ కర్తవ్యత ప్రకృతికి లేదు. అనగా నేను పురుషార్థమును నెరవేర్తునను సంకల్పము జడమగు ప్రకృతి కెక్కడిది. అట్టి సంకల్పము ప్రకృతికి నున్నదన్న చోనది జడమెట్లు లగును అన్నచో సమాధానము - మహదాది భూతాంతమగు ననులోమ పరిణామము నందును, భూతాదులకు స్వస్వకారణములయందు లయించుట యను ప్రతిలోమ పరిణామమునందును సహజమగు రెండు శక్తులున్నవి. అవియే పురుషార్థకర్తవ్యత యని చెప్పబడును. ఆశక్తి యచేతనమైనను బ్రకృతికి సహజమే, ఇందు బ్రకృతికి మహత్తు మొదలుకొని భూతమువఱకు బహిర్ముఖము గాననగు పరిణామ మనులోమ పరిణామము. మఱల స్వస్వకారణానుప్రవేశద్వారమున నస్మితాంతమగు పరిణామము ప్రతిలోమము.

ఇట్లు పురుషుని భోగము పరిసమాప్త మగు దనుక నుండి సహజశక్తిద్వయమును క్షయించుటవలన కృతార్థమై ప్రకృతి యిక మఱల బరిణామము నారంభింపదు. ఇట్టి పురుషార్థ కర్తవ్యత జడప్రకృతికి సయిత ముండుట యయుక్తము గాదు. జడములయ్యు దేహేంద్రియాదులు పురుషసన్నిధాన ప్రాప్త చైతన్యములై పురుషార్థ సంపాదనము చేయుచుండుట మన కనుభవ సిద్ధమేగదా!

అట్లయినచో నిట్టి సహజశక్తియే ప్రకృతి కుండెనేని ముముక్షువులు మోక్షమునకై యేల ప్రయత్నింపవలయును? మోక్షయత్నమే యక్కర లేదన్న మోక్షోపాయ ప్రతిపాదక శాస్త్రములు వ్యర్థము లగును గదా అని శంకింపవలదు.

ప్రకృతికిని పురుషునకును గల భోగ్యభోక్తృరూపానాది సంబంధము

వలన దుఃఖానుభవము గలుగగా నీదుఃఖమునకు నివారణ మెట్లని చింత యొదవును. దానివలన దుఃఖనివృత్త్యుపాయముల నుపదేశించు శాస్త్రములు ప్రకృతికి గావలసియున్నవి. అట్లు దుఃఖ నివారణవ్యగ్ర మగుచు కర్మాను రూపమగు బుద్ధిసత్త్వము శాస్త్రోపదేశమునకు నర్హ మగును. ఇతరవేదాంతముల యందును, విద్యాస్వభావమే శాస్త్రములకు విషయముగ బ్రతిపాదిపబడి యున్నది. ఆ బుద్ధిసత్త్వము (అవిద్యాస్వభావము) మోక్షమునకై దానే యత్నించుచు శాస్త్రమును సహకారికారణముగా నుంచుకొని మోక్షరూప ఫలమును గలిగించును.

సర్వకార్యములును స్వసామగ్రి యున్ననే గలుగును గాన ప్రతిలోమ పరిణామద్వారమున గలిగింపవలసిన మోక్షమను కార్యమున కీవిధమగు సామగ్రియే ప్రమాణములచే నిశ్చయింపబడినది.

కాన విషయప్రతిబింబయుక్తమై యభివ్యక్త చిచ్ఛాయమైన బుద్ధిసత్త్వము విషయనిశ్చయద్వారమున లోకయాత్ర నంతటిని నెఱవేర్చును. అట్టి చిత్తమునే జూచి భ్రమించిన నాస్తికులు చిత్తము స్వప్రకాశ మనియుఁ జిత్తు చిత్తమాత్రమేగాని వేఱుగ లేదనియు ననుచున్నారు గాన వారికి నీ విషయము దెలియజెప్పవలయును'' - అని వివరించిరి.

అవ॥ చిత్తమునకన్న వేఱుగ నాత్మ నంగీకరించుటకు హేత్వంతర ములను దెలుపుచున్నారు.

## సూ॥ తదసంఖ్యేయవాసనాభిశ్చిత్రమపి పరార్థం సంహత్యకారిత్వాత్॥ 24

తత్, అసంఖ్యేయవాసనాభిః, చిత్రం, అపి, పరార్థం, సంహత్యకారిత్వాత్॥

తత్ = ఆ చిత్తము, అసంఖ్యేయవాసనాభిః,- అసంఖ్యేయ = గణింపశక్యము గాని, వాసనాభిః = వాసనలచే, చిత్రం అపి = శబలిత మయ్యును, సంహత్యకారిత్వాత్ = విషయేంద్రియ సంబంధము గలిగియే కార్యకర మగును గాన, పరార్థం = తనకన్నభిన్నుడగు పురుషుని కొఱకే ప్రవర్తించునది యగును.

లెక్కబెట్ట నలవిగాని యనేకవాసనలచే శబలితమై యుండునది గావునను, వాసనల కాశ్రయమే భోగాశ్రయ మగును గావునను, చిత్తమే భోక్తయని చెప్పదగి యున్నను, శయనాసనగృహాది జడపదార్థములు మిళితము లయియే పురుషునకు భోగసాధనములగు విధమున జిత్తము సయితము క్లేశకర్మవాసనలతోడను, విషయేంద్రియాదులతోడను, చేరియే కార్యకర మగుచుండటవలన చిత్తము పురుషుని భోగాపవర్గములకొఱకు బ్రవర్తించునే గాని, స్వార్థముకొఱకు ప్రవర్తింపదు. అనగా సుఖాకారమున నున్న చిత్తము తన భోగమునకుగాని, తత్త్వజ్ఞానాకారమున నున్న చిత్తము తన యపవర్గము కొఱకు గాని కాదు. అట్టి చిత్తములు రెండును పురుషుని భోగాపవర్గములకే సాధనము లగును.

కాగా ఇట్లు చిత్తనిర్వర్తితము లయిన భోగాపవర్గ రూపములగు ప్రయోజనములచే నర్థవంతుడైన యాతడే యసంహతుఁడును, పురుషుడు, నగు పురుషుడు. సంహత్యకార్య కారియగు నదియంతయు పరార్థ మగునే గాని స్వార్థము గాజాలదను యుక్తిచే బదార్థ మేదియు బరము గాదు. భోగాపవర్గ రూపమగు నర్థముచే నర్థవంతుడు పరుడని చెప్పుటచే నహంశబ్దవాచ్యములగు క్షణిక ప్రత్యయముల సాధారణ నామమాత్ర స్వరూపము పరము గాదు. నాస్తికులు స్వోత్తరోత్పన్న క్షణికచిత్తమునకు భోగము గలదని చెప్పుదురు గాని యదియు సంహత్యకారి యగుటచే పరార్థమే గాని స్వార్థము గాదు. ఆసంహత్య కారియగు పురుషుడు మాత్రమే పరుడు. అతని భోగాపవర్గములు సాధించుటకే చిత్తము వ్యాపృత మగుచున్నది.

సత్త్వరజస్తమములు చిత్తరూపమగు విలక్షణ పరిణామమును బొంది యేకముగా చేరినవి యైనవి గాన శయ్యాసనగృహాదులు పరులకే యుపయోగపడు విధమున బరులకే యుపయోగపడును. శయనాదులకు పరుడగు శరీర ప్రయోజన సాధకత్వము గలదు గాన, నా శరీరియు సంహత్యాకారియే గావున సంహత్యకారిత్వరూప హేతువు దుష్ట మనవలదు. చందనతరుసంఛన్నమగు పర్వతమున విలక్షణమగు ధూమముచే వహ్ని

యనుమిత మగుచు నితరవహ్ని విలక్షణమై చందనవనభవ వహ్నిగ ననుమిత మగువిధమున, విలక్షణమగు సత్త్వమునకు పరార్థత్వ మనుమితము గాగా భోక్తయు, సత్త్వాధిష్ఠాతయు, చిన్మాత్రరూపుడు, నసంగతుడు నగు పరుడు సిద్ధించును. అతనికి బరత్వ మనగా సర్వోత్కృష్టత్వము. అది యెట్లన తామసములగు విషయములకన్న శరీరము ప్రకాశరూపములగు నింద్రియ ముల కాధారభూత మైనది గాన నుత్తమము. దానికన్న నింద్రియము లుత్త మములు. వానికన్న బ్రకాశరూపమగు సత్త్వముత్కృష్టము. అట్టి సత్త్వమును బ్రకాశింప జేయుచు బ్రకాశ్యవిలక్షణుడై చిన్మాత్రుడగు పురుషునకు సంహ తత్వ మెక్కడిది? అతడును సంహతుడని యంగీకరించుచో ననవస్థారూప దోషము దుర్వారము.

కాన చిత్తము పరార్థము గాన చిత్తముకన్న భిన్నుడగు పురుష డొకడు గలడు.

అవ॥ ఇట్లాత్మను సాధించి యాత్మసాక్షాత్కారము జేసికొన నర్హులగు వారలకు వైలక్షణ్యము నెఱింగించుచున్నారు.

## సూ॥ విశేషదర్శిన ఆత్మభావభావనావినివృత్తిః ॥ 25

విశేషదర్శినః, ఆత్మభావభావనావినివృత్తిః ॥

విశేషదర్శినః - విశేష = చిత్తమునకన్న భేదమును, దర్శినః = ఆత్మయందు జూచువానికి, ఆత్మభావ భావనా వినివృత్తిః - ఆత్మభావ = ఆత్మసత్తావిషయకమగు, భావనా = విచారముయొక్క, వినివృత్తిః = నివారణము గలుగును.

అనగా చిత్తము వేఱనియు, నాత్మ వేఱనియు వివేకజ్ఞాన ముదయించె నేని యాత్మసత్తా విషయకమగు జిజ్ఞాస యంతరించును. ఆత్మసత్తా జిజ్ఞాస తొలుత గలిగి యుండిననే యుపదేశార్హు లగుదురు గాని యదిలేని నాస్తికు లుపదేశమునకు దగరు.

వర్షకాలమున గడ్డి మొలకెత్తుటవలన గాని బీజము లున్నవని

యూహించి నటుల, వైరాగ్యబోధకములగు సాంఖ్యయోగ వేదాంతాది మోక్ష మార్గములను వినుటచే నెవనికి గగుర్పాటును, గన్నీరు నొదవునో, యాతనియందు ఆత్మానాత్మ వివేకజ్ఞానమునకు బీజమై మోక్షసాధనమగు సుకృతము గలదని యూహింపబడును. దానిచే నాతని కాత్మభావభావన స్వభావసిద్ధమై యున్నదనియు దెలియును, వివేకజ్ఞాన బీజమును, మోక్షసాధనమునగు సుకృతము లేనివానికి నాత్మభావభావన యుదయింపదు. కాననే **''స్వభావం ముక్త్వా దోషాత్ యేషాం పూర్వపక్షే రుచిర్భవతి అరుచిశ్చ నిర్ణయే భవతి''** యని పెద్దలు చెప్పుదురు. అనగా, వివేకజ్ఞానజనక మగు పూర్వసుకృత విహీనులకు నాత్మభావమునందు గాక యాత్మ లేదను పూర్వపక్షమునందు దోషవశమువలన నభిరుచి గలుగును. అంతియు గాక సిద్ధాంతమగు నాత్మతత్త్వమునం దేవగింపు సయితము గలుగును. కాన వారి కాత్మభావభావన యుదయింపదు. కాన వారుపదేశార్హులు గారు అని భావము.

ఆత్మభావభావన యనగా పూర్వజన్మమున నే నెవ్వడను? నే నెట్లుంటిని? ఈ రూపమేమి? ఇది యెట్లు వచ్చినది? ఇక నెవ్వరుగ నగుదును? ఏల నట్లగుదును? ఇట్లాత్మవిషయమున గలుగు విచారము.

ఇట్టి విచారమాత్మానాత్మవివేకము గలవారికి నివర్తించును. ఈ నానారూపములగు భావన లన్నియు చిత్తపు విచిత్రపరిణామములే. అవిద్యా సంపర్కము లేకుండగా బురుషుడు చిత్తధర్మములచే స్పృశింపబడడు గావున జిత్తము వేఱనియు నాత్మ వేరనియు చిత్తాత్మవివేకముగల కుశలునకు జిత్తపరిణామములగు నాత్మభావభావన లంటవు. తమంతదామే తొలగి పోవును.

అవ॥ ఇంక వివేకశీలుని చిత్తపు స్వరూపము నెఱింగించు చున్నారు.

## సూ॥ తదా వివేకనిమ్నం కైవల్యప్రాగ్భారం చిత్తమ్। 26

తదా, వివేకనిమ్నం, కైవల్యప్రాగ్భారం, చిత్తమ్॥

తదా = వివేకజ్ఞాన ముద్భవించు నా సమయమున, చిత్తం = వివేకవంతుని చిత్తము, వివేకనిమ్నం = వివేకమను నిమ్నమార్గ ప్రవృత్తియై, కైవల్యప్రాగ్భారం = మోక్షపర్యంత గామి యగును.

వివేకజ్ఞాన ముదయించుటకు బూర్వము చిత్తనది యవివేకమును పల్లమునబడి పాఱుచు విషయోపభోగముల వఱకు జనుచుండెను, వివేక ముదయించినతోడనే యాచిత్తనదియే యా యాత్మానాత్మ వివేకమను పల్లమునబడి మోక్షపర్యంతము పాఱుచున్నది. (1-12)

అవ॥ యోగిచిత్తము వివేకనిష్ఠమే యగుచో వారి భిక్షాటనాదులు సంగతములు గావు గదా? యను సందేహమును దీర్చుచున్నారు.

## సూ॥ తచ్ఛిద్రేషు ప్రత్యయాన్తరాణి సంస్కారేభ్యః॥ 27

తచ్ఛిద్రేషు, ప్రత్యయాన్తరాణి, సంస్కారేభ్యః ॥

సంస్కారేభ్యః = పూర్వపు బహిర్ముఖావస్థలోని సంస్కారములవలన, తచ్ఛిద్రేషు - తత్ = ఆ వివేకనిష్ఠమగు చిత్తముయొక్క, ఛిద్రేషు= (అవివేకరూపము లగు) అవకాశములయందు, ప్రత్యయాన్తరాణి = ఇతరజ్ఞానములు సయితము (ఉత్పన్నము లగును.)

వివేకఖ్యాతికి బ్రవణ (ఉన్ముఖ)మైనదిగాన సత్త్వపురుష భేదఖ్యాతి మాత్రప్రవాహము గలదైయున్నను జిత్తమున నప్పటికి బహిర్ముఖావస్థలోని సంస్కారబీజములు పూర్తిగ క్షీణింపక క్షీణించు చుండును కాన నా క్షీయమాణములగు పూర్వసంస్కారములవలన నడుమ నడుమ వివేకజ్ఞానము శిథిల మగుచుండగా నాయవకాశమును బురస్కరించుకొని ''ఇది నేను, ఇది నాయది, దీని నెఱుంగుచున్నాను, దీని నే నెఱుంగను'' మొదలగు తలంపులలో నేదియేని తలంపు గలుగును. కాఁగా ననాదికాలము నుండియు ననువర్తించి యున్న వ్యుత్థాన సంస్కారములు ప్రబలములు గావునను, అప్పటి కింకను వివేకజ్ఞానము దుర్బలముగావునను జిత్తమున ననేక ప్రత్యయ (జ్ఞాన)ము లుదయించు చుండును.

కాన వివేకజ్ఞానదృఢీకరణమూలమున నా సంస్కారములను జేఱకుండ ద్రోలవలయును.

అవ॥ సంస్కారములను శక్తిహీనములుగ జేయుట కుపాయము నెఱింగించుచున్నారు.

## సూ॥ హానమేషాం క్లేశవదుక్తమ్॥ 28

హానం, ఏషాం, క్లేశవత్, ఉక్తమ్॥

ఏషాం = ఈవ్యుత్థానసంస్కారములకు, క్లేశవత్ = అవిద్యాది క్లేశములకువలె, హానం = నాశము (కార్యాక్షమత్వము), ఉక్తమ్ = పూర్వాచార్యులచే నెఱింగింపబడెను.

ప్రసంఖ్యాన (సంప్రజ్ఞాతసమాధి) రూపమగు నగ్నిచే స్థూల సూక్ష్మరూపములగు నవిద్యాదిక్లేశములు స్వస్వకార్య సంస్కారోత్పాదన సమర్థములు గావు. కాన దగ్ధబీజకల్పము లగునని (ద్వితీయపాదమున) **"ధ్యానహేయాస్తద్వృత్తయః," "తే ప్రతిప్రసవ హేయాస్సూక్ష్మాః"** అను సూత్రములచే బ్రతిపాదింపబడిన విధముననే వివేకజ్ఞానరూపమగు నా యగ్నిచేతనే దగ్ధబీజకల్పములగు పూర్వసంస్కారములు సయితము స్వకార్యమగు జ్ఞానముల నుత్పాదింప జాలవు.

కాగా నపరిపక్వవివేకము గల చిత్తముననే వ్యుత్థాన సంస్కారములు బాహ్యజ్ఞానముల నుత్పాదించును గాని పరిపక్వవివేకము గల చిత్తమున నవి వ్యర్థములై కార్యకరములు గాకపోవును.

అనగా దొలుత వివేకజ్ఞానము నభ్యసించి వివేకసంస్కారములను సంపాదించి వానిచే వ్యుత్థానసంస్కారములను నిరోధించి యా వ్యుత్థాన సంస్కారములను నిరోధసంస్కారములచే నశింపజేసి, యానిరోధ సంస్కారములను సంప్రజ్ఞాతసమాధిచే లయమొనర్ప వలయును, జ్ఞాన సంస్కారమలు చిత్తాధికారము పరిసమాప్త మగుటచే జిత్తముతోడనే లయించి

పోవునవి యెఱుంగునది.

కాన వివేకజ్ఞానోదయమాత్రమున దా కృతకృత్యుడ నైతినని యెంచక సాధకు డసంప్రజ్ఞాత సమాధిపర్యంతము యత్నింపవలయును.

అవ॥ వ్యుత్థానసంస్కారములను నిరోధించుటకు వివేకఖ్యాతి రూపమగు నుపాయమును గడచిన సూత్రముచే నుపపాదించి యిక నావివేకఖ్యాతిని సయితము నిరోధించుటకు నుపాయము నెఱింగించు చున్నారు.

## సూ॥ ప్రసంఖ్యానేఽప్యకుసీదస్య సర్వదా వివేకఖ్యాతేర్ధర్మమేఘస్సమాధిః ॥ 29

ప్రసంఖ్యానే, అపి, అకుసీదస్య, సర్వదా, వివేకఖ్యాతేః, ధర్మమేఘః, సమాధిః॥

ప్రసంఖ్యానే అపి = ఆవివేకజ్ఞానమందు సయితము, అకుసీదస్య = లాభము నపేక్షింపని వానికి, సర్వదా = నిరంతరముగ, వివేకఖ్యాతేః = వివేకజ్ఞాన ముండును గాన, ధర్మమేఘః = ధర్మమేఘ మనెడు, సమాధిః = సమాధి యబ్బును.

''కుసీదం వృద్ధిజీవికా'' యను నిఘంట్వనుసారముగ కుసీద మనగా నప్పుపెట్టి దానిపై వడ్డీ తీసికొనుచు జీవించుట యని ముఖ్యార్థముకాని యిచట గౌణముగ లాభములేక ప్రయోజనము నపేక్షించుట యని నిశ్చయింపబడినది. కాన వివేకఖ్యాతి లభించినంతనే దాని సహాయమున సర్వ భావాధిష్ఠాతృత్వాది సిద్ధులను (3-49) యోగి ప్రార్థించునేని యా యోగి 'కుసీదు' డనబడును. అట్లుగాక బ్రహ్మ నిష్ఠుడగు నే యోగి వివేకఖ్యాతి యుదయించినను దానివలన నెట్టి సిద్ధుల నపేక్షింపని యత డకుసీదుడన బడును, అట్టి యకుసీదునకు యోగమున కేమాత్రమును విఘ్నము గలుగదు' గాన వివేకఖ్యాతియే నిరంతరముగా నగును' సంస్కారబీజములు దగ్ధబీజ కల్పములై పోయినవిగావున నతని చిత్తమున నితరప్రత్యయములు గలుగవుగాన, నతని వివేకజ్ఞానమును నిరంతరమై యుండుట సమంజసమే. నైరంతర్య

మనగా వివేకప్రవాహమున ఛిద్రములు లేకుండుట. అట్టితఱి సాధకునకు ధర్మమేఘన సమాధి యబ్బును.

ఇట్టి దృఢాభ్యాస పరవైరాగ్య మూలమున బాహ్యసంస్కారములు క్షయింపఁగా అవిచ్ఛిన్న వివేకఖ్యాతి మాత్రరూపమున జిత్తముండుటయే ధర్మమేఘసమాధి.

**యథోదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి।**
**ఏవం ధర్మాన్ పృథక్పశ్యం స్తానేవానువిధావతి॥**

**యథోదకం శుద్ధే శుద్ధమాసిక్తం తాదృగేవ భవతి।**
**ఏవం మునేర్విజానత ఆత్మా భవతి గౌతమ!॥**

యని శ్రుతియు నొడువుచున్నది. అనగా - గౌతమా! పర్వతశిఖరమున గుఱిసిన వాన పర్వతశరీరము నందంతటను వ్యాపించు విధమునఁ బురుషునకన్న బుద్ధిధర్మములను వేఱుగ దెలిసికొని వాని ననుసరించును. అనగా బుద్ధియను (పర్వత) శిఖరమున వివేకమను వర్షముచేఁగలిగిన వివేకప్రవాహము బుద్ధిధర్మములను ముంచివైచు ననిభావము. మఱియు దేటనీట వర్షించిన తేటనీరు తానును తేటగనుండు విధమున వివేకవశమున యోగి యాత్మయు శుద్ధమగును అని భావము.

క్లేశకర్మవాసనలను నిశ్శేషముగ నున్మూలింపజాలు ధర్మములను గురియునది ధర్మమేఘసమాధి యనబడును.

**''అయం తు పరమో ధర్మో యద్యోగేనాత్మదర్శనమ్''** అని యాజ్ఞవల్క్యమహర్షి యన్నటుల యోగముచే నాత్మసాక్షాత్కారము చేసికొనుటయే ముఖ్యధర్మ మగును గాన, నట్టి యాత్మసాక్షాత్కృతిని వర్షించునది గాన దీనిని 'ధర్మమేఘసమాధి' యనవచ్చును. బ్రహ్మానందమును వర్షించునది గావునను 'ధర్మమేఘసమాధి' యందురు. దీనినే పరవైరాగ్యమని కొంద ఱందురు. ఇది సంప్రజ్ఞాత యోగపు పరాకాష్ఠ.

అవ॥ ఇఁక ధర్మమేఘసమాధికి ఫలము నెఱింగించుచున్నారు.

**సూ॥ తతః క్లేశకర్మనివృత్తిః ॥ 30**

తతః, క్లేశకర్మ, నివృత్తిః ॥

తతః = ఆధర్మమేఘసమాధివలన, క్లేశకర్మనివృత్తిః = క్లేశములు కర్మలు నివర్తించును.

ఈ ధర్మమేఘసమాధి యబ్బినేని యవిద్యాది క్లేశములు సమూలము లుగ నశించుటయే గాక, క్లేశమూలకములగు శుభాశుశ కర్మలు గూడ నిర్మూలితము లగును. క్లేశకర్మలు క్షయించినచో వివేకశీలుడగు యోగి జీవించి యుండియే ముక్తు డగును. జన్మమరణ కారణమగు విపర్యయ జ్ఞానము (అవివేకము) నశించినదిగాన నాతడు జన్మ మరణములు లేని దాన నిఖిలబంధముల నుండియు ముక్తు డగును.

విపర్యయజ్ఞానము క్షీణించిన అతడెవ్వడు నెచ్చటను మఱల జన్మించి యుండలేదు. ఈ విషయమును గౌతమమహర్షియు (తన న్యాయ సూత్రములయందు) **వీతరాగజన్మాదర్శనాత్** (3-1-25) అని రాగ రహితులకు జన్మము లేదనియు, రాగమే జన్మకారణ మనియు నుడివిరి.

ఈ జీవన్ముక్తత్వము, పంచశిఖాచార్యునిచే రెండవ (తరగతి) మోక్షముగ జెప్పబడెను. **'ద్వితీయో రాగక్షయాత్'** - అని పంచశిఖాచార్య సూత్రము, అనఁగా రాగక్షయమువలన గలుగు మోక్షము రెండవది యని భావము.

అవ॥ ధర్మమేఘసమాధినిష్ఠుడగు జీవన్ముక్తుని చిత్త మెటులుండు నదియు నెఱింగించుచున్నారు.

**సూ॥ తదా సర్వావరణమలాపేతస్య**
**జ్ఞానస్యానన్త్యాజ్జ్ఞేయమల్పమ్॥ 31**

తదా, సర్వావరణమలాపేతస్య, జ్ఞానస్య, ఆనన్త్యాత్, జ్ఞేయం, అల్పమ్ ॥

తదా = ఆ ధర్మమేఘసమాధి యబ్బినకాలమున, సర్వావరణ మలాపేతస్య - సర్వ = సకలమగు, ఆవరణమల = చిత్తనిష్ఠ సత్త్వగుణమును గప్పివేయు క్లేశకర్మరూపములగు నాచ్ఛాదనములనుండి, అపేతస్య = తొలగిన, జ్ఞానస్య = జ్ఞానమునకు (చిత్తసత్త్వమునకు) ఆనంత్యాత్ = పరిమితి లేకుండుట వలన, జ్ఞేయం = జ్ఞాతవ్యవిషయము, అల్పమ్ = కొద్దిపాటిది యగును.

క్లేశములు కర్మలు నను మలములు చిత్తము నావరించి యుండును. జీవన్ముక్తావస్థలో నా క్లేశకర్మము లను మలములు తొలగిపోయినంతనే చిత్తమపరిచ్ఛిన్నమై యుండును. కాన జ్ఞేయములగు బాహ్యవస్తువు లన్నియు పరిచ్ఛిన్నములై యల్పములుగ దోచును.

అనగా చిత్తము సత్త్వగుణ ప్రధానమైనది గావునను, సత్త్వము ప్రకాశ శీలముగావునను, సర్వపదార్థగ్రహణసమర్థమైనదిగ నుండవలసి యుండగా, నది తమోగుణముచే నావృతమై మూఢమై యే పదార్థమును గ్రహింపఁజాలని స్థితికి వచ్చును. కొన్ని యెడల గ్రియాశీలమగు రజోగుణముచే బ్రవర్తితమై యేదేని యొకకొన్ని పదార్థములను గ్రహించును. కాని తమోగుణావరణము పూర్తిగ దొలగని కారణమున నన్నిటిని గ్రహించు సామర్థ్యమును చిత్తమున కేర్పడదు. మఱియు తమోగుణ మావరించినచో నేమియు దెలియక యుండును.

కాన ఈ ధర్మమేఘసమాధి యుదయించుటకు ముందు చిత్త ప్రచార మల్పముగను, జ్ఞేయపదార్థము లనంతములుగను గోచరించును.

కాని ధర్మమేఘసమాధి యబ్బిన జీవన్ముక్తుని చిత్తము రజస్తమో మూలకములును క్లేశకర్మరూపములగు నావరణమలములు బొత్తుగా దొలగిపోగా, నపరిమితప్రకాశము గలది యగును గాన, దానికి విషయము గాని పదార్థమే యుండదు గాన జిత్తమాకాశము వలె విపులముగను విషయము మిణుగురుపుర్వులవలె సూక్ష్మములుగ గోచరించును.

సమాధివశమున క్లేశాదులు నశించినవి గాన, జీవన్ముక్తునకు బునర్జన్మము లేదను విషయమున నీ శ్లోకమును భాష్యకారు లుదాహరించిరి.

**అంధో మణి మవిధ్యత్తమనంగుళిరావయత్।**
**అగ్రీవస్తం ప్రత్యముంచత్తమజి హ్వోఽభ్యనందత్॥**

గ్రుడ్డివాఁడు రత్నమునకు రంధ్రము బొడువగా వ్రేళ్లులేని వాఁడు దానిని దారమునఁ గ్రుచ్చగా మెడ (గొంతు) లేనివాడు దానిని గట్టి కొనగా నాల్కలేని వాడతని జూచి కొనియాడెనని యీ నానుడికి భావము. అనగా దృష్ట్యాది సహకారములేక వేధనాది క్రియ లెంత యసంభూతములో క్లేశకర్మలు లేక జన్మము సయితమంత యసంభూతమని భావము.

అవ॥ ధర్మమేఘసమాధిచేఁ గ్లేశములు మొదలుగా గలవి నశించినను గుణము లటులనే యుండును గాన, నాగుణములు యోగి శరీరారంభకము లేల గావు? అను శంకను దొలగించుచున్నారు.

## సూ॥ తతః కృతార్థానాం పరిణామక్రమ సమాప్తిర్గుణానామ్॥ 32

తతః, కృతార్థానాం, పరిణామక్రమసమాప్తిః గుణానామ్ ॥

తతః = ఆ ధర్మమేఘసమాధి యుదయించుటవలన. కృతార్థానాం = సమాప్తకర్తవ్యములగు, గుణానామ్ = గుణములకు, పరిణామ క్రమసమాప్తిః - పరిణామక్రమ = ఏ క్రమమున కార్యోత్పాదన రూపపరిణామము గలిగెనో యా క్రమమునకు, సమాప్తిః = ముగింపు గలుగుచున్నది.

సత్వరజస్తమో గుణములకు భోగాపవర్గములే పరమఫలములు గాన నంతదనుక మాత్రమే యవి పరిణామశీలము లగుచుండును. పురుషునకు భోగాపవర్గరూప పురుషార్థముల నొడగూర్చెనేని కృతార్థములు అనగా సమాప్తాధికారము లగును. కాన వానికి నిక కార్యోత్పాదనాభిముఖ్యరూపమగు పరిణామము గలుగదు. గుణములయందు కార్యోత్పాదనాభిముఖ్యము

తొలుతటి పరిణామము. గుణవైషమ్యము తదనంతర పరిణామము. మహదాదులు పైపై ననంతములగు పరిణామములు ఇట్లు భోగము, లేక యపవర్గము పురుషునకు గల్గు పర్యంతము గుణములకు వరుసగా గలుగుచుండు మార్పు, భోగాపవర్గముల నుత్పాదించుటతో నిలిచిపోవును.

అనగా - తమతమ కార్యమును నెఱవేర్చిన యా గుణములు పరిణామక్రమసమాప్తి గలవియై, యటుమీద నొకక్షణము సయితము నిలిచి యుండజాలవు. వానితోబని తీఱిపోయినది గాన నిక నవి యుండవలసినది లేదు.

కాన వివేకజ్ఞానముయొక్క పరాకాష్ఠారూపమైన ధర్మమేఘసమాధి యుదయించినంతనే సమాప్తకర్తవ్యములగు గుణములు మఱల నాయోగికి శరీరము నారంభింపజాలవు.

కాని యిందొక్క విశేషము గలదు. ఈ గుణము లేపురుషునిఁ గూర్చి కృతకృత్యము లయ్యెనో యాతనిగూర్చియే పరిణామక్రమ హీనము లగును గాని, భోగాపవర్గ హీనులగు పురుషుల విషయమున పరిణామక్రమ సహితములే యగును. కాన నవి ధర్మమేఘసమాధి లభించినయోగి శరీరమునకు గారణములు గాకపోవునే గాని యా గుణములు తదితరులకు శరీరజనకములే యగును. కావుననే సాధన పాదమున **"కృతార్థం ప్రతినష్ట మప్యనష్టం తదన్యసాధారణత్వాత్॥** (2-22-సూ) అని చెప్పియుండిరి.

అవ॥ పై సూత్రమున బ్రస్తావింపబడిన పరిణామక్రమము నెఱింగించు చున్నారు.

## సూ॥ క్షణప్రతియోగీ పరిణామాపరాన్త-నిర్గ్రాహ్యః క్రమః ॥ 33

క్షణప్రతియోగీ, పరిణామాపరాన్తనిర్గ్రాహ్యః, క్రమః ॥

క్షణప్రతియోగీ = క్షణములకు సంబంధించినదియై, పరిణామాపరాన్త

నిర్గ్రాహ్యాః - పరిణామ = పరిణామముయొక్క, అపరాన్త = ముగింపుచేత, నిర్గ్రాహ్యాః = తెలిసికొనదగినది, క్రమః = పరిణామ క్రమ మనబడుచున్నది.

అవ్యవహితములగు ననేకక్షణముల నాశ్రయించిన పరిణామ పరంపరను పరిణామక్రమ మనవలయును. ఆ పరిణామ క్రమమును పరిణామ క్రమపు ముగింపుచే నెఱుగవలయును. జాగ్రత్తగ గాపాడిన వస్త్రమునకును కొనకు ప్రాతదనము తప్పదు. ఆ ప్రాతదనమే వస్త్ర పరిణామమునకు పరాంతమని యనబడును. ఆ పరిణామపు టపరాంతముచే వస్త్రమున గలిగిన పరిణామక్రమము తెలియుచున్నది. ఎట్లనగా వస్త్రమున గలిగిన ప్రశిథిలావయవత్వరూపమగు జీర్ణత్వము తటాలున నొక్కక్షణములో గలిగినదని యెవ్వరైన ననగలరా? అట్లనజాలరు. కాన దొలుత జీర్ణత్వము సూక్ష్మతమముగను, తదనంతరము సూక్ష్మ తరముగను, తదనంతరము సూక్ష్మముగను, దానిపై స్థూలముగ, నటుమీదట స్థూలతరముగను, తదుపరి స్థూలతమముగను గలిగెనని యంగీకరింతుము. కాగా జీర్ణతారూప పరిణామపు టపరాంతమే ( అవసానమే) పరిణామ క్రమమునకు బ్రమాణ మయ్యెను.

అట్లే గుణపరిణామక్రమపు విషయమున సయితము గుణపరిణామపు టపరాంతమే ప్రమాణము. అనగా గుణపరిణామము ముగియుటవలననే యాపరిణామమునకు సయితము క్రమము గలదని యెఱుకపడుచున్నదని భావము.

ఈక్రమము కేవల మనిత్యపదార్థములయందే యుండునను నిర్బంధము లేదు. నిత్యవస్తువులయందు సయిత మీక్రమము కనబడుచున్నది. అయితే యనిత్యవస్తువులు తామే యవసితము లగును. కాన క్రమము సాక్షాత్కృతము. నిత్యవస్తువులయందు దత్కార్యములగు వికారముల యవసానము ద్వారా క్రమ మనుమేయ మగును.

కూటస్థనిత్యత్వము, పరిణామి నిత్యత్వము నని నిత్యత్వము రెండు విధములు. ఇందు కూటస్థనిత్యత్వము పురుషునకు గలదు. పరిణామి

నిత్యత్వము గుణములకు గలదు. ఎయ్యది పరిణామము నొందుచున్నను దానికి స్వరూపవిఘాతము గలుగక యుండునో యది నిత్యవస్తువని సామాన్య లక్షణము. పురుషుడును, గుణములును స్వరూపవిఘాతము లేనివగుటచే నిత్యములే యగును. కాని పరిణామము నొందుట గుణములయందు గలదేగాని పురుషునందు లేనందున బై లక్షణము లక్ష్యములయం దంతట సమన్వయము గాదు. సమన్వయింప బ్రయత్నించినను క్లిష్టముగ నుండును. కాన ''నతీతావస్థాశూన్యత్వమే'' నిత్యమునకు లక్షణమని కొందఱు వ్యాఖ్యానించిరి. ఈ మతమున బురుషు డెన్నటికి నతీతుడు గాడు. కాన గూటస్థనిత్యున కతీతావస్థా శూన్యత్వము సమన్వయించెను. అట్లే గుణముల విషయమునగూడ ధర్మలక్షణావస్థలకే యుత్పత్తిలయము లుండుటచేతను; గుణముల కవి యేవియు లేని కారణమున, బరిణామినిత్యములగు గుణములయందు సయిత మతీతావస్థా శూన్యత్వ ముండును. కాన లక్షణము నిర్దుష్టమని వారి భావము.

ఇందు గుణధర్మములగు బుద్ధ్యాదులు వినాశశీలములు గాన వానియందలి పరిణామక్రమము వాని పరిణామాపరాంతము ( ముగింపు) చే లబ్ధపర్యవసాన మగును. అనగా బుద్ధ్యాదులు నాశశీలములు గాన నవి నశింపగనే వానియందలి పరిణామక్రమము సయితము నశించును. కాన బరిణామ క్రమము లబ్ధపర్యవసాన మగును. (అతీతావస్థ నొందిన దగును). కాని పరిణామవంత మయ్యు నిత్యమై గుణస్వరూపమగు ప్రధానమున గలుగు పరిణామక్రమ మలబ్ధపర్యవసాన మగును. అనగా ప్రధానము (గుణత్రయము) నిత్యము గాన నది నశింపదు. కాన దానియందలి క్రమము సయితము నశింపదు. కాన నది యలబ్ధపర్యవసాన ( అతీతావస్థారహిత) మగును. ఇట్లే బద్ధపురుషుల కొక యపుడు వివేక ముదయింప నందున పరిణామాధ్యాస యున్నను, కూటస్థ నిత్యులై స్వరూపమాత్రావస్థితులగు ముక్తపురుషుల యందును, స్వరూపాస్తిత్వము క్రమముచేతనే లభించుచున్నది.

అనగా - ముక్తపురుషు డింతకు మునుదుండెను. ఇపుడు నున్నాడు. ఇక

నుండగలడు - అను వ్యవహారమును సర్వకాలముల యందుండు యను నిత్యతయు నసంభవ మగును. కాన వారియందును క్షణక్రమము గోచరించుచునే యుండును. కాని ముక్తులకు నాశము లేదు. కాన వారియందు క్రమము సయిత మలబ్ధ పర్యవసానమై యున్నాడను క్రియాపదమును బట్టి యా శబ్దానుసారముగ కల్పింపబడినదియే గాని వాస్తవముగ బురుషునియందు గ్రమము లేదు.

ఇచ్చట గుణములయందున్న సృష్టిస్థితిప్రవాహరూపమగు సంసార రూపపరిణామమునకు గ్రమసమాప్తి యున్నదా? లేదా? ఉన్నదని యంగీకరించినచో బరిణామి నిత్యములగు గుణములకు గలుగు పరిణామ మలబ్ధ పర్యవసానమని యింతకుముందు దెలిపిన దానితో విరోధించును. అట్లుగాక క్రమసమాప్తి లేదని యన్నచో బూర్వ సూత్రమున ''పరిణామక్రమ సమాప్తిర్గుణానామ్'' అని గుణములయందలి పరిణామక్రమమునకు సమాప్తిని జెప్పుట యసంగతము గదా? యని శంక యుదయించుచున్నది.

కాన ఈ ప్రశ్నకు నొక్కమాటతో సమాప్తి యున్నదని గాని లేదని గాని చెప్పుట సాధ్యము గాదు.

ఏలన పుట్టినవాడెల్ల చచ్చునా యని యడిగినచో ''నగు''నని యొక్కమాటతో సమాధానము చెప్పవచ్చు. కాని చచ్చినవాడెల్ల బుట్టునా? యని యడిగినచో మాత్రమగునని గాని, కాదనికాని యొక్కమాటతో సమాధానము చెప్పవలనుపడదు. దీనిని విడదీసి సమాధానము చెప్పవల యును. అనగా ''సంజనితాత్మానాత్మవివేకుడై విషయతృష్ణా రహితుడైన కుశలుడు మరణించినను జనింపడు. అట్లుగాక వివేకరహితుడై యాశాపాశ బద్ధుడగు నకుశలుడు చచ్చినను దప్పక జనించితీరును'' అని యిట్లు వేర్వేరుగ సమాధాన మివ్వవలసినదే గాని యొకేవిధమున సమాధాన మివ్వ శక్యము గాదు. అట్లే మనుష్య జన్మము మంచిదా? కాదా? యను ప్రశ్నకు సయితము విషయవిభాగ పూర్వకముగ సమాధానము చెప్పవలసినదియ గాని యొకమాటలో సమాధానము చెప్పలేము. పశువులు మొదలగు వానినిబట్టి

చూచినచో మనుష్యజన్మమే మంచిది. కాని దేవతలను ఋషులను బట్టి విచారించితిమేని మనుష్యజన్మ తక్కువైనది యని సమాధానము చెప్పవలసి యుండును.

అట్టి సంసారరూపమగు గుణపరిణామమునకు క్రమసమాప్తి కలదా? లేదా? యను ప్రకృత ప్రశ్నసయితము విభాగపూర్వకముగ సమాధానము చెప్పదగినదేగాని తటాలున నొక్కమాటతో సమాధానమివ్వ వీలగునది గాదు. సంసారక్రమమునకు సమాప్తి యున్నదని యంటిమేని సంసార మనాది యనియు ననంతమనియు బోధించు **"న రూపమస్యేహ తథోపలభ్యతే, నాంతో న చాది ర్న చ సంప్రతిష్ఠా"** యను మొదలగు శాస్త్రములు బాధితము లగును. సంసారక్రమమునకు సమాప్తి లేదని యంటిమా యెవ్వనికిని మోక్షము గలుగదు గాన మోక్షప్రతిపాదక శాస్త్రము లన్నియు వ్యర్థములు గావలసివచ్చును.

కాన సంసారము నశించునని గాని, నశింపదని గాని యొక్కమాటలో తేల్చి చెప్పిన దోషము గలుగును. కాన ధర్మమేఘ సమాధి నిష్ఠుఁడగు యోగి యందు సంసారక్రమము సమాప్తమగు ననియు, అవివేకి పురుషునియందు నది ముగియక యుండుననియు విభజించి యుత్తరము నొసగవలయును. ముక్తపురుషుల దృష్టితో ప్రధానముయొక్క పరిణామ క్రమము సయితము సమాప్త మగునని యంగీకరించుచో, నొక్కొక జీవుడు ముక్తు డగుచు బోవుచుండగా గొనకు ప్రధానముయొక్క పరిణామక్రమమే నశించునుగదా! అట్లగుచో సంసారమునకు నాశమును ప్రధానమునకు ననిత్యత్వమును గలుగును గదా! యను శంక సమంజస మైనది గాదు.

అసంఖ్యాక పశు పక్షి క్రిమి కీట మశక యూకా లిక్షా సర్ప వృశ్చిక కృకలాస లతా గుల్మ వనస్పత్యోషధి వృక్షాది నానాభేదయుక్తము లయి యనంతములగు జీవులకు వివేకఖ్యాతి లభించుట యరుదు గానను, అనేక జన్మసాధ్యమగు తత్త్వజ్ఞానము పురుషమాత్రునకే సాధ్యముగా నుండుట వలనను, సర్వప్రాణులకు ముక్తి గలుగుటయు, నందువలన సంసారోచ్ఛేదము

గలుగుటయు నసంభవము. కాననే "**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే**" యను శ్రుతియు.

**అత ఏవ హి విద్వత్సు ముచ్యమానేషు సర్వదా।**
**బ్రహ్మాండజీవలోకానామనన్తత్వాదశూన్యతా॥**

యని స్మృతియు, సంసారపు టనంతత్వము నెఱింగించుచున్నవి. ఈ విషయమై శాస్త్రము లింతమాత్రమే చెప్పుచున్నవి.

అవ॥ గుణాధికారసమాప్తి మూలమున బరిణామసమాప్తి గలుగగా కైవల్యము గల్గునని చెప్పియుండిరి గదా! ఇక నా కైవల్య స్వరూపము నెఱింగించుచున్నారు.

## సూ॥ పురుషార్థశూన్యానాం గుణానాంప్రతిప్రసవః కైవల్యం స్వరూపప్రతిష్ఠా వా చితిశక్తిరితి ॥34

పురుషార్థశూన్యానాం, గుణానాం, ప్రతిప్రసవః, కైవల్యం, స్వరూపప్రతిష్ఠా, వా, చితిశక్తిః, ఇతి॥

పురుషార్థశూన్యానాం = సమాప్తాధికారములు గనుక పురుషార్థరహితములైన, గుణానాం = బుద్ధ్యాదిరూపమున బరిణమించిన గుణములకు, ప్రతిప్రసవః = స్వస్వకారణమున లయముమూలమున ప్రధానమున లయ మనునది, కైవల్యం = కైవల్యము, స్వరూపప్రతిష్ఠా - స్వరూప = తన శుద్ధరూపమునందు, ప్రతిష్ఠా = యునికి యను, చితిశక్తిః వా = చేతనశక్తి గాని, కైవల్యం = కైవల్యము, ఇతి = యోగ శాస్త్రము ముగిసెను.

పురుషునకు భోగాపవర్గరూప పురుషార్థములను సంపాదించి కృతార్థము లయినవి కావున నిక నేవిధమగు పురుషార్థమును లేక కార్యకారణ స్వరూపమగు గుణములు స్వకారణ లయమూలమున క్రమముగా క్రమముగా ప్రధానమున లయము జెందుటయే కైవల్యము. అనగా వ్యుత్థాన సంస్కార ములు, సమాధిసంస్కారములును, నిరోధ సంస్కారములును, స్వకారణ మగు మనస్సున లయించి మనస్సు స్వకారణమగు నహంకారమున లయించి

అహంకారము స్వకారణమగు బుద్ధియందు లయించి, యాబుద్ధి గుణ స్వరూపమగు ప్రధానమున లయించుట కైవల్య మనబడును.

బుద్ధిసత్త్వసంబంధ మపుడపుడు గలుగకుండుటవలన బురుషుడు నిరంతరమును కేవలము చితిశక్తిమాత్రుడుగ నుండుట స్వరూప ప్రతిష్ఠ యనబడును. స్వరూపప్రతిష్ఠ యనగా ఆత్మయొక్క వాస్తవ స్వరూపము. ఇట్టి స్వరూపప్రతిష్ఠయు కైవల్య మనబడును.

ఇట్లు కైవల్యమునకు రెండు లక్షణములు చెప్పబడియెను. ఇందు తొలుతటి కైవల్యము యథార్థముగ ప్రధానమునకే యైనను పురుషునియందు ఉపచరింపబడియెను. రెండవలక్షణము పురుషునకు స్వతస్సిద్ధము. ఈ విషయము సాంఖ్యకారికయం దిట్లు చెప్పబడెను.

**తస్మాన్నబధ్యతేద్ధా న ముచ్యతే నాపి సంసరతి పురుషః।**
**సంసరతి బధ్యతే ముచ్యతే చ నానాశ్రయా ప్రకృతిః ॥**

అనగా పురుషునకు బంధముగాని, మోక్షముగాని, సంసారము గాని లేవు. ఇవి యన్నియు ప్రకృతికి (ప్రధానమునకు) మాత్రమే గలవు అని దాని భావము.

ఇచట కొందఱు గుణములకు ప్రతిప్రసవమును, పురుషునకు స్వరూపప్రతిష్ఠయు నొకే సమయమున, గలుగును గాన నంశభేదమును బురస్కరించుకొని రెండు లక్షణములు సూత్రకారులు దెలిపినను గైవల్యము నకు మాత్ర మెట్టి భేదమును లేదు అని యందురు.

**సంగ్రహశ్లోకము :-**

**ముక్త్వార్థ చిత్తం పరలోకమే య**
**జ్ఞసిద్ధయో ధర్మఘనస్సమాధిః।**
**ద్వయీ చ ముక్తిః ప్రతిపాదితాఽస్మిన్**
**పాదే ప్రసంగాదపి చాన్యదుక్తమ్॥**

అనగా- మోక్షార్థమగు చిత్తము, పరలోకసిద్ధియు బాహ్యావిషయ సిద్ధియు, గుణభిన్నపురుషసిద్ధియు, ధర్మమేఘసమాధియు, జీవన్ముక్తి విదేహముక్తులను రెండు ముక్తులును, ప్రసంగ వశమున మఱికొన్ని విషయములు నీ పాదమునందు ప్రతిపాదింపబడెను.

గ్రంథప్రతిపాదితవిషయ సంగ్రహశ్లోకము :-

**నిదానం తాపానాముదిత మథ తాపాశ్చ కథితాః**
**సహాఙ్గైరష్టాభిర్ద్విహిత మిహ యోగద్వయమపి।**
**కృతో ముక్తేరధ్వా గుణపురుషభేదస్ఫుటతరో**
**వివి క్తం కైవల్యం పరిగలితతాపా చితిరసౌ॥**

అనగా నీ శాస్త్రమున తాపములకు హేతువును, దాపములును, అష్టాంగయుక్తమగు సంప్రజ్ఞాతాసంప్రజ్ఞాతయోగములు రెండును, మోక్షము నకు మార్గమగు ప్రకృతి పురుషవివేకమును, గుణసంబంధ రహితమును, పాపశూన్యము నగు చితికి ఆత్మకు స్వరూపస్థితి యను కైవల్యమును నిరూపింపబడెను.

**ఇతి పాతంజలే సాంఖ్యప్రవచనే యోగశాస్త్రే కైవల్యపాదశ్చతుర్థః॥**

ఇట్లు పతంజలిమహర్షి ప్రణీతమగు సాంఖ్యప్రవచనరూపమైన,

యోగ శాస్త్రమున నాల్గవదియగు కైవల్యపాదము ముగిసెను.

ఇట్లు తిరుమలై కండ్యూరు తిరువేంగడాచార్య విరచితమగు

పాతంజలయోగదర్శన 'భాష్యార్థప్రకాశిక' యను

నాంధ్ర వివరణమున నాల్గవది యగు

కైవల్యపాదము ముగిసినది.

**ఓం లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు**

*ఓం శాంతిః శాంతిః శాంతిః*

ఓం తత్ సత్ ఓమ్



# అకారాది సూత్రానుక్రమణిక

## ద



## ధ



## న



## ప



## బ



## భ

## మ



## య



## శ



## స

సూత్రానుక్రమణిక సంపూర్ణము
ఓమ్ తత్ సత్ ఓమ్.

ఓమ్

శ్రీ పరమాత్మనే నమః

పాతంజల యోగ దర్శనమ్

మూలసూత్రాణి

# ౧. సమాధిపాదః

1. అథ యోగానుశాసనమ్
2.
3. తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్ ॥
4. వృత్తిసారూప్యమితరత్ర ॥
5. వృత్తయః పంచతయ్యః క్లిష్టాక్లిష్టాః ॥
6. ప్రమాణవిపర్యయవికల్పనిద్రాస్మృతయః ॥
7. ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని ॥
8. విపర్యయో మిథ్యాజ్ఞానమతద్రూపప్రతిష్ఠమ్
9. శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః ॥
10. అభావప్రత్యయాలంబనావృత్తిర్నిద్రా ॥
11. అనుభూతవిషయాసం ప్రమోషః స్మృతిః ॥
12. అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః ॥
13. తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః ॥
14. స తు దీర్ఘకాలనైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః
15. దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్య వశీకార సంజ్ఞా వైరాగ్యమ్ ॥
16. తత్పరం పురుషఖ్యాతేర్గుణవైతృష్ణ్యమ్ ॥
17. వితర్కవిచారానందాస్మితారూపానుగమాత్ సంప్రజ్ఞాతః

18. విరామప్రత్యయాభ్యాసపూర్వః సంస్కారశేషోऽన్యః ॥
19. భవప్రత్యయో విదేహప్రకృతిలయానామ్ ॥
20. శ్రద్ధావీర్య స్మృతిసమాధిప్రజ్ఞాపూర్వక ఇతరేషామ్ ॥
21. తీవ్రసంవేగానామాసన్నః ॥
22. మృదుమధ్యాధిమాత్రత్వాత్తతోऽపి విశేషః ॥
23. ఈశ్వరప్రణిధానాద్వా ॥
24. క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః ॥
25. తత్ర నిరతిశయం సర్వజ్ఞబీజమ్ ॥
26. పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్ ॥
27. తస్య వాచకః ప్రణవః ॥
28. తజ్జపస్తదర్థభావనమ్ ॥
29. తతః ప్రత్యక్చేతనాధిగమోऽప్యన్తరాయాభావశ్చ ॥
30. వ్యాధిస్త్యానసంశయ ప్రమాదాలస్యావిరతిభ్రాన్తిదర్శనాలబ్ధ భూమికత్వానవస్థితత్వాని చిత్తవిక్షేపాస్తేऽన్తరాయాః ॥
31. దుఃఖదౌర్మనస్యాంగమేజయత్వశ్వాస ప్రశ్వాసా విక్షేపసహభువః ॥
32. తత్ప్రతిషేధార్థమేకతత్త్వాభ్యాసః
33. మైత్రీకరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాపుణ్య విషయాణాం భావనాతశ్చిత్త ప్రసాదనమ్ ॥
34. ప్రచ్ఛర్దనవిధారణాభ్యాం వా ప్రాణస్య ॥
35. విషయవతీ వా ప్రవృత్తి రుత్పన్నా మనసః స్థితినిబంధినీ ॥
36. విశోకా వా జ్యోతిష్మతీ ॥

37. వీతరాగవిషయం వా చిత్తమ్ ॥

38. స్వప్ననిద్రాజ్ఞానాలమ్బనం వా ॥

39. యథాఽభిమతధ్యానాద్వా ॥

40. పరమాణుపరమమహత్వాన్తోఽస్య వశీకారః ॥

41. క్షీణవృత్తేరభిజాతస్యేవ మణేర్గ్రహీతృ గ్రహణగ్రాహ్యేషు తత్స్థతదంజనతా సమాపత్తిః ॥

42. తత్ర శబ్దార్థజ్ఞానవికల్పైః సంకీర్ణా సవితర్కా సమాపత్తిః॥

43. స్మృతిపరిశుద్ధౌ స్వరూపశూన్యే వాఽర్థమాత్ర నిర్భాసా నిర్వితర్కా ॥

44. ఏతయైవ సవిచారా నిర్విచారా చ సూక్ష్మవిషయా వ్యాఖ్యాతా ॥

45. సూక్ష్మవిషయత్వం చాలింగపర్యవసానమ్ ॥

46. తా ఏవ సబీజః సమాధిః ॥

47. నిర్విచారవైశారద్యేఽధ్యాత్మ ప్రసాదః ॥

48. ఋతమ్భరా తత్ర ప్రజ్ఞా ॥

49. శ్రుతానుమానప్రజ్ఞాభ్యామన్యవిషయా విశేషార్థత్వాత్ ॥

50. తజ్జః సంస్కారోఽన్యసంస్కారప్రతిబన్ధీ ॥

51. తస్యాపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజః సమాధిః ॥

ఇతి శ్రీపాతంజలే యోగశాస్త్రే సమాధినిర్దేశో నామ ప్రథమః పాదః సమాప్తః.

## ౨ అథ సాధనపాదః

1. తపః స్వాధ్యాయేశ్వరప్రణిధానాని క్రియాయోగః ॥

2. సమాధిభావనార్థః క్లేశతనూకరణార్థశ్చ ॥

3. అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశాః పంచక్లేశాః ॥
4. అవిద్యా క్షేత్రముత్తరేషాం ప్రసుప్తతనువిచ్ఛి
న్నోదారాణామ్ ॥
5. అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖా
త్మఖ్యాతిరవిద్యా ॥
6. దృగ్దర్శనశక్త్యోరేకాత్మతే వాస్మితా ॥
7. సుఖానుశాయీ రాగః ॥
8. దుఃఖానుశాయీ ద్వేషః ॥
9. స్వరసవాహీ విదుషోఽపి తథారూఢోఽభినివేశః ॥
10. తే ప్రతిప్రసవహేయాః సూక్ష్మాః ॥
11. ధ్యానహేయాస్తద్వృత్తయః ॥
12. క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్టజన్మ వేదనీయః ॥
13. సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః ॥
14. తే హ్లాదపరితాపఫలాః పుణ్యాపుణ్య హేతుత్వాత్ ॥
15. పరిణామతాపసంస్కారదుఃఖైర్గుణవృత్తి విరోధాచ్చ
దుఃఖమేవ సర్వం వివేకినః ॥
16. హేయం దుఃఖమనాగతమ్ ॥
17. ద్రష్టృదృశ్యయోః సంయోగో హేయహేతుః ॥
18. ప్రకాశక్రియాస్థితిశీలం, భూతేన్ద్రియాత్మకం
భోగాపవర్గార్థం దృశ్యమ్ ॥
19. విశేషావిశేషలింగమాత్రాలింగాని గుణపర్వాణి ॥
20. ద్రష్టా దృశిమాత్రః శుద్ధోఽపి ప్రత్యయానుపశ్యః ॥

21. తదర్థ ఏవ దృశ్యస్యాత్మా ॥
22. కృతార్థం ప్రతి నష్టమప్యనష్టం తదన్య- సాధారణత్వాత్ ॥
23. స్వస్వామిశక్త్యోః స్వరూపోపలబ్ధిహేతుః సంయోగః ॥
24. తస్య హేతురవిద్యా ॥
25. తదభావాత్సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యమ్ ॥
26. వివేకఖ్యాతిరవిప్లవా హానోపాయః ॥
27. తస్య సప్తధా ప్రాన్తభూమిః ప్రజ్ఞా ॥
28. యోగాఙ్గానుష్ఠానాదశుద్ధి క్షయే జ్ఞాన దీప్తిరావివేకఖ్యాతేః ॥
29. యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధారణా
ధ్యాన సమాధయోఽష్టావఙ్గాని ॥
30. అహింసా సత్యమస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః ॥
31. జాతిదేశకాలసమయానవచ్ఛిన్నాః సార్వభౌమా
మహావ్రతమ్ ॥
32. శౌచసన్తోషతపఃస్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః
33. వితర్కబాధనే ప్రతిపక్షభావనమ్ ॥
34. వితర్కాహింసాదయః కృతకారితాను మోదితా లోభ
క్రోధమోహ పూర్వకా మృదుమధ్యాధిమాత్రా
దుఃఖాజ్ఞానానన్త ఫలా ఇతి ప్రతిపక్షభావనమ్ ॥
35. అహింసాప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః ॥
36. సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్ ॥
37. అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్ ॥
38. బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః ॥

39. అపరిగ్రహ స్థైర్యే జన్మకథన్తాసంబోధః ॥

40. శౌచాత్ స్వాఙ్గజుగుప్సా పరైరసంసర్గః ॥

41. సత్త్వశుద్ధి సౌమనస్యైకాగ్ర్యేన్ద్రియజ యాత్మ దర్శనయోగ్యత్వాని చ

42. సంతోషాదనుత్తమ సుఖలాభః ॥

43. కాయేంద్రియసిద్ధిరశుద్ధిక్షయాత్తపసః ॥

44. స్వాధ్యాయాదిష్టదేవతాసంప్రయోగః ॥

45. సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్ ॥

46. స్థిరసుఖ మాసనమ్ ॥

47. ప్రయత్న శైథిల్యానన్తసమాపత్తిభ్యామ్ ॥

48. తతో ద్వంద్వానభిఘాతః ॥

49. తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణాయామః

50. బాహ్యాభ్యన్తర స్తంభవృత్తిర్దేశకాలసంఖ్యాభిః పరిదృష్టో దీర్ఘసూక్ష్మః

51. బాహ్యాభ్యన్తరవిషయాక్షేపీ చతుర్థః ॥

52. తతః క్షీయతే ప్రకాశావరణమ్ ॥

53. ధారణాసు చ యోగ్యతా మనసః ॥

54. స్వవిషయాసంప్రయోగే చిత్తస్య స్వరూపానుకార ఇవేన్ద్రియాణాం ప్రత్యాహారః

55. తతః పరమావశ్యతేంద్రియాణామ్ ।

ఇతి శ్రీపాతంజలే యోగశాస్త్రే సాధననిర్దేశోనామ ద్వితీయః పాదః సమాప్తః.

# 3 అథ విభూతిపాదః

1. దేశబంధశ్చిత్తస్య ధారణా ॥
2. తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్ ॥
3. తదేవార్థమాత్రానిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః ॥
4. త్రయమేకత్ర సంయమః ॥
5. తజ్జయాత్ ప్రజ్ఞాఽఽలోకః ॥
6. తస్య భూమిషు వినియోగః ॥
7. త్రయమన్తరంగం పూర్వేభ్యః ॥
8. తదపి బహిరంగం నిర్బీజస్య ॥
9. వ్యుత్థాననిరోధసంస్కారయో రభిభవ ప్రాదుర్భావౌ నిరోధక్షణ చిత్తాన్వయో నిరోధపరిణామః ॥
10. తస్య ప్రశాన్తవాహితా సంస్కారాత్ ॥
11. సర్వార్థతైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధిపరిణామః ॥
12. తతః పునః శాన్తోదితౌ తుల్యప్రత్యయౌ చిత్తస్యైకాగ్రతాపరిణామః ॥
13. ఏతేన భూతేన్ద్రియేషు ధర్మలక్షణావస్థా పరిణామా వ్యాఖ్యాతాః ॥
14. శాన్తోదితావ్యపదేశ్య ధర్మానుపాతీ ధర్మీ ॥
15. క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః ॥
16. పరిణామత్రయసంయమాదతీతానాగత జ్ఞానమ్ ॥
17. శబ్దార్థప్రత్యయానామితరేతరాధ్యాసాత్ సంకరస్తత్ప్రవిభాగ

సంయమాత్ సర్వ భూతరుతజ్ఞానమ్ ॥

18. సంస్కారసాక్షాత్కరణాత్ పూర్వజాతిజ్ఞానమ్ ॥

19. ప్రత్యయస్య పరచిత్తజ్ఞానమ్ ॥

20. న చ తత్సాలంబనం తస్యావిషయీభూతత్వాత్ ॥

21. కాయరూపసంయమాత్ తద్గ్రాహ్య శక్తిస్తమ్భేచక్షుః
ప్రకాశాసంప్రయోగేఽ న్తర్ధానమ్ ॥

22. సోపక్రమం నిరుపక్రమం చ కర్మతత్సంయ మా

23. మైత్ర్యాదిషు బలాని ॥

24. బలేషు హస్తిబలాదీని ॥

25. ప్రవృత్త్యాలోకన్యాసాత్ సూక్ష్మవ్యవహిత విప్రకృష్టజ్ఞానమ్॥

26. భువనజ్ఞానం సూర్యే సంయమాత్ ॥

27. చంద్రే తారావ్యూహజ్ఞానమ్ ॥

28. ధ్రువే తద్గతిజ్ఞానమ్ ॥

29. నాభిచక్రే కాయవ్యూహజ్ఞానమ్ ॥

30. కంఠకూపే క్షుత్పిపాసానివృత్తిః ॥

31. కూర్మనాడ్యాం స్థైర్యమ్ ॥

32. మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్ ॥

33. ప్రాతిభాద్వా సర్వమ్ ॥

34. హృదయే చిత్తసంవిత్ ॥

35. సత్త్వపురుషయోరత్యన్తాసంకీర్ణయోః ప్రత్యయావిశేషో
భోగః పరార్థత్వాత్ స్వార్థసంయమాత్ పురుషజ్ఞానమ్ ।

36. తతః ప్రాతిభశ్రావణవేదనాఽఽ దర్శాస్వాద వార్తా జాయన్తే ॥

37. తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః ॥

38. బన్ధకారణశైథిల్యాత్ప్రచారసంవేదనాచ్చ చిత్తస్య పరశరీరావేశః ॥

39. ఉదానజయాజ్జలపఙ్క కంటకాదిష్వసఙ్గ ఉత్క్రాన్తిశ్చ ॥

40. సమానజయాజ్జ్వలనమ్ ॥

41. శ్రోత్రాకాశయోః సంబన్ధసంయమాద్దివ్యం శ్రోత్రమ్ ॥

42. కాయాకాశయోః సంబన్ధసంయమాల్లఘు తూలసమాపత్తేశ్చాకాశగమనమ్ ॥

43. బహిరకల్పితా వృత్తిర్మహావిదేహా తతః ప్రకాశావరణక్షయః ॥

44. స్థూలస్వరూపసూక్ష్మాన్వయార్థవత్త్వ సంయమాత్ భూతజయః ॥

45. తతోఽణిమాదిప్రాదుర్భావః కాయసంప త్తద్ధర్మానభిఘాతశ్చ ॥

46. రూపలావణ్యబలవజ్ర సంహననత్వాని కాయసమ్పత్ ॥

47. గ్రహణస్వరూపాస్మితాఽన్వయార్థవత్త్వ సంయమాదింద్రియజయః ॥

48. తతో మనోజవిత్వం వికరణభావః ప్రధానజయశ్చ ॥

49. సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య సర్వభావాధిష్ఠాతృత్వం సర్వజ్ఞాతృత్వం చ ॥

50.

51. స్థాన్యుపః

52. క్షణతత్క్రమయోః సంయమాద్వివేకజం జ్ఞానమ్ ॥

53. జాతిలక్షణదేశైరన్యతాఽనవచ్ఛేదాత్ తుల్యయోస్తతః
ప్రతిపత్తిః ॥

54. తారకం సర్వవిషయం సర్వథావిషయ మక్రమంచేతి
వివేకజం జ్ఞానమ్ ॥

55. సత్వ పురుషయోః శ్శుద్ధిసామ్యే కైవల్యమితి ॥

ఇతి శ్రీపాతంజలే యోగశాస్త్రే విభూతినిర్దేశో నామ తృతీయః పాదః సమాప్తః.

## ౪ అథ కైవల్యపాదః

1. జన్మౌషధిమన్త్రతపఃసమాధిజాః సిద్ధయః ॥
2. జాత్యన్తరపరిణామః ప్రకృత్యాపూరాత్ ॥
3. నిమిత్తమప్రయోజకం ప్రకృతీనాం వరణభేదస్తు తతః
క్షేత్రికవత్ ॥
4. నిర్మాణచిత్తాన్యస్మితామాత్రాత్ ॥
5. ప్రవృత్తిభేదే ప్రయోజకం చిత్తమేకమనేకేషామ్ ॥
6. తత్ర ధ్యానజమనాశయమ్ ॥
7. కర్మాశుక్లాకృష్ణం యోగినస్త్రివిధమితరేషామ్ ॥
8. తతస్తద్విపాకానుగుణానామేవాభివ్యక్తిర్వాసనానామ్ ॥
9. జాతిదేశకాలవ్యవహితానామప్యానన్తర్యం
స్మృతిసంస్కారయోరేకరూపత్వాత్ ॥
10. తాసామనాదిత్వం చాశిషో నిత్యత్వాత్ ॥

11. హేతుఫలాశ్రయాలమ్బనైః సంగృహీతత్వాదేషామభావే తదభావః ॥

12. అతీతానాగతం స్వరూపతోఽస్త్యధ్వభేదాత్ ధర్మాణామ్ ॥

13. తే వ్యక్తసూక్ష్మా గుణాత్మానః ॥

14. పరిణామైకత్వాత్ వస్తుతత్త్వమ్ ॥

15. వస్తుసామ్యే చిత్తభేదాత్తయోర్విభక్తః పన్థాః ॥

16. న చైకచిత్తతన్త్రం వస్తు తదప్రమాణికం తదా కిం స్యాత్ ॥

17. తదుపరాగాపేక్షిత్వాత్ చిత్తస్య వస్తు జ్ఞాతాజ్ఞాతమ్ ॥

18. సదా జ్ఞాతాశ్చిత్తవృత్తయః తత్ప్రభోః పురుషస్యాపరిణామిత్వాత్ ॥

19. న తత్ స్వాభాసం దృశ్యత్వాత్ ॥

20. ఏకసమయే చోభయానవధారణమ్ ॥

21. చిత్తాన్తరదృశ్యే బుద్ధిబుద్ధేరతిప్రసంగః స్మృతిసంకరశ్చ ॥

22. చితేరప్రతిసంక్రమాయాస్తదాకారాపత్తౌ స్వబుద్ధిసంవేదనమ్ ॥

23. ద్రష్టృదృశ్యోపరక్తం చిత్తం సర్వార్థమ్ ॥

24. తదసంఖ్యేయవాసనాభిశ్చిత్రమపి పరార్థం సంహత్యకారిత్వాత్ ॥

25. విశేషదర్శిన ఆత్మభావభావనావినివృత్తిః ॥

26. తదా వివేకనిమ్నం కైవల్యప్రాగ్భారం చిత్తమ్ ॥

27. తచ్ఛిద్రేషు ప్రత్యయాన్తరాణి సంస్కారేభ్యః ॥

28. హానమేషాం క్లేశవదుక్తమ్ ॥

29. ప్రసంఖ్యానేఽప్యకుసీదస్య సర్వదా వివేకఖ్యాతే
ర్ధర్మమేఘ స్సమాధిః

30. తతః క్లేశకర్మనివృత్తిః ॥

31. తదా సర్వావరణమలాపేతస్య జ్ఞానస్యానన్త్యాత్
జ్ఞేయమల్పమ్

32. తతః కృతార్థానాం పరిణామక్రమసమాప్తి ర్గుణానామ్ ॥

33. క్షణప్రతియోగీ పరిణామాపరాన్త నిర్గ్రాహ్యః క్రమః ॥

34. పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతిప్రసవః కైవల్యం
స్వరూపప్రతిష్ఠా వా చితిశక్తిరితి

ఇతి శ్రీపాతంజలే యోగశాస్త్రే కైవల్యనిరూపణం నామ చతుర్థః పాదః సమాప్తః।

ఓం లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు.

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

